
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2040100073405

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రకృతివైద్యతత్వము

ఇంగ్లీషులో

డా॥ హెన్రి లిండ్లహార్ యం డి రచించిరి

అనువాదము

మృత్తింటి ఆంజనేయులుగారు

★

ప్రకాశకులు

ప్రకృతి కార్యాలయ ట్రస్టు

బెజవాడ

1950



[వెల రు 5 లు

Printed at the Andhra Grandhalaya Press, Vijayavada

# పీఠిక

ఈ ప్రకృతివైద్యతత్త్వము The Philosophy of Natural Theraupetics అను గ్రంథమునకు అనువాదము ఈ ఉద్గ్రంథము ఆంగ్లమున డా॥ హెన్రీ లిండ్లహారు యం డి గారు రచియించిరి వీరు అలోపతీ వైద్యమున గల యం డి ఉత్తమ పరీక్షలయందు కృతార్థులైరి కేవలము పుస్తకపరిచయమేగాక విశేషానుభవమును గడించిరి ఆ వైద్యమున కొన్ని సుగుణము లున్నను అందుగల దోసగులు వీరికి తృప్తిని కలిగించనందున ప్రకృతివైద్యమును శాస్త్రీయముగా అభ్యసించి విశేషానుభవమును గడించి పదునెనిమిది సంవత్సరములు చికాగోనగరమున ఆరోగ్యసదనమును నడిపి మానవసేవను చేసినారు ఆ యనుభవ ఫలితమే యీగ్రంథము

అలోపతీవైద్యమునందు ప్రావీణ్యమును సంపాదించి మనశ్శాంతి కలుగక ప్రకృతివైద్యమును అభ్యసించిన పాశ్చాత్యులు చాలామంది గలరు వీ రందరిలోను డా॥ లిండ్లహార్ అద్వితీయుడు సిద్ధహస్తుడు రాజకీయములందెట్లనో వైద్య ప్రపంచమునందును వీరు అతివాదులలో మితవాది మిత వాదులలో అతివాది అలోపతివైద్యమునకును ప్రకృతివైద్యమునకును సిద్ధాంత భాగములో ఎచ్చటెచ్చట అనుకూలముగలదో యెచ్చటెచ్చట ప్రతికూలముగలదో చికిత్సాభాగమునం దెచ్చట వైరుధ్యము గలదో సోదాహరణముగా చూపించినారు ప్రకృతి వైద్యమునకును హోమియోపతి వైద్యమునకును గల సామరస్యమును పరామర్శించినారు

అసంబద్ధముగానున్న వైద్యశాస్త్రమును ఎంతశాస్త్ర సమ్మతముగా చెప్పినది గ్రంథమును చదివిన మా చదువరులే గ్రహింతురుగాక

గ్రంథమునందు ఎచ్చట "నేను" "నా" వచ్చినను డాక్టరు లిండ్లహార్ అనే గ్రహించవలెను

గ్రంథముద్రణకు అగువ్యయమును భరించిన ప్రకృతి కార్యాలయ ట్రస్టువారికిని ముద్రించిన ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ వారికిని నా ధన్యవాదాలు

కార్తీక పూర్ణిమ
5-11-1949

ముత్తింటి ఆంజనేయులు

# ప్రకృతి వైద్యతత్వము

## అధ్యాయములు

# ప్రకృతి వైద్యతత్వము

## విషయసూచిక

## ౧౧ ఔషధములు శస్త్రచికిత్సలు అనర్థకములు
పేజీ 137_156

మందు వైద్యములోని వివిధమందులు - నివారణ వృత్తాంతములు - డాక్టరు సెన్ అభిప్రాయము - విటమినులుతినడంవల్ల ప్రాణములుపుట్టుచున్న వి- తరుణరోగాలను తొక్కిపెడితే కాలికరోగాలవుతవి - కనీనికనుచూస్తే యేమి తెలుస్తుంది?

## ౧౨ ఆరోగ్య శాస్త్రములు పేజీలు 157_178

మందువైద్యమువారి చికిత్సాప్రక్రియలు-ప్రకృతివైద్యమువాని చికిత్సా ప్రక్రియలు- విలియమ్ ఆస్లరు అభిప్రాయము-జంతువిభజన మాక్ ఈలెస్ అభిప్రాయము - ప్రేగులలోని ఆయువుపట్టు క్రిమికలోని జబ్బులకు కారణమేమిటి? తెల్లగొట్టెయెందుకు అగుగు- ఈరోగములకు ప్రకృతి వైద్యము వారి చికిత్సా ప్రక్రియలు - ఇదివరకే ఫుఁదుపడితే యేమిచేయవలెను? శస్త్రచికిత్సవలనకలుగుగుణములు హానిమఁ అభిప్రాయము - రోగనివారణ వృత్తాంతము - మందులతో అణచిపెట్టితే కలిగే ఫలితాలు

## ౧౩ టీకాలు పేజీలు 178_210

అవతారిక-మశూచిక ప్రభావము-బిస్మార్క్ తాఖీదు-జర్మను ప్రభుత్వ తాఖీదులు జన్నరు అభిప్రాయము అనుభూయలు-హావనాలోని యెల్లో ఫీవరు సాదృశ్యము టీకా రస ఫలితములు-క్రొవెలు పండితుని అభిప్రాయము-శోలుగ కోవు దుష్ఫలితము - వింతవిషయము - టీకాలవలననే మశూచికము నిలచియున్నది - టీకాలవలన కలుగుప్రతిఫలము - కనీనికా నిదానము - మూర్ఛలకు కారణము - టీకలవలన సర్పివచ్చింది - టీకాలవలన మేదోమజ్జాగతజ్వరము వచ్చింది - జాబు - సా అనుభవము

## ౧౪ క్రిమిమందు పేజీలు 210_224

స్వరూపము-అణచిపెట్టితే కలుగుఫలితాలు - డాక్టరు లాంగరహాస్త్వే అభిప్రాయము - కాలికరోగములకు మూలము - కనీనికలో కనబడు గుర్తులు- వృత్తాంతములు జర్మనీలోని ప్రకృతివైద్యము-అమెరికాలోని ప్రకృతివైద్యము- నివారణ వృత్తాంతము- హెచ్ వైట్ ఉత్తరము

తయారుచేయు పద్ధతి- ప్రకృతి సూత్రములకును హోమోపతీవైద్యమునకునుగ
సంబంధము- కణముల ధర్మములు లక్షణములు- మందుల పరిమాణము- మోతా
దుల పరిమాణము- ప్రకృతివైద్య చికిత్సా పద్ధతులతోను రోగములు నయము
కావు- అంతరవయవములు బాగుపడనంతగా చెడిపోవును

## ౨౮ సహజాహారము పేజీలు 359_361

ఆహారమునకును రసరక్తములకును గలసంబంధము - పాలు సహజాహార
మగుట ఆహారముయొక్క ప్రాధాన్యము - మందువైద్యుల మూఢభావము-
మాంసాహారము వలన కలుగుచున్న అనర్థములు-

## ౨౯ ఉపవాసము పేజీలు 361_368

ఉపవాసము వలన కల్గు నష్టములు ధాతుశక్తితగ్గును- బలహీనులఉపవా
సముంచరాదు- గురాలోచన పరులకు ఉపవాసము అవసరము- రోగస్వభావ
మును తత్వమునుబట్టి ఉపవసించవలెను- తీవ్రరోగములలో అందరూ ఉపవ
సించవలెను. జీర్ణావయవములకు పని కల్పించరాదు- మనసును నిర్మలముగా
నుంచవలెను- కొన్నిరోగములు- ఆమ్లములు తయారగును క్షారములు అవసరము
అన్నిరోగములకు ఆమ్లములే కారణము స్వాస్థ్యసంకటములు కలుగు కాలము-
ఒకకేసుచరిత్ర- ఉపవాసమువలన ప్రాణభయములేదు- దైహిక అలవాట్లను
విధిగా మానవలెను- అప్పుడే మానసిక నైతిక శక్తులవృద్ధిచేసికొని నందు వలన
ఉపయోగము కలుగును

## ౩౦ ధాతుశక్తి వృద్ధిచేసికొనుట పేజీలు 368_380

ధాతుశక్తివ్యయమును తగ్గించుట- మందులగుణములు- తగని కాలిక
రోగము స్వభావము- స్వాస్థ్యసంకటములు- విశ్వశక్తికిని ధాతుశక్తికిని గల సం
బంధము- స్థూలశరీరము- సూక్ష్మశరీరము- ఆహారపానీయముల ఆవశ్యకత- ఆహార
మునకును ధాతుశక్తికిని గలసంబంధము- ప్రాణశక్తిమహిమ- వ్యష్టి చికిత్సలు-
వాటి ఉపయోగములు- ఆహారము ఎక్కువైనందువలన కలుగు నష్టములు
దేహమునకును గడియారమునకును గల పోలిక - దేహములోని[illegible]- దేహ
ములో తయారగు ఆమ్లములు - పానీయముల వలన కలుగు ఫలితములు - దేహ
ములోని [illegible] వ్యాయామముగుట - నిత్యము [illegible] - నిద్రవలన కలుగు
[illegible] పానీయములవలన కలుగు ఉద్రేకములు నీరసములు- వీటిఫలితము- [illegible]

ములు- కనుగొనుట-కీరోప్రాక్టిక్- డాకరు డాక్టరు స్టిలు పామరు - నాడీశక్తి హెచ్చుటతగ్గుట ఈరెండు (ఆస్టియోపతీ కీరోప్రాక్టిక్ లకు గల) భాగముల కునుగలసంబంధము-

నాప్రపతీ- స్వభావము- సంధాయకధాతువు - స్మిత్తు - సల్లక్కెస్నవర్ణు.

స్పాండిలోథెరపీ - ఆల్బర్టు అబ్రహాము - స్వభావము -

న్యూరోపతీ-జాన్ ఆర్నాల్డుక్ హారీవాల్డన్లు-స్వభావము నాడీశక్తికిఅభ్యం తరములు ఏర్పడుట-

న్యూరోథెరపీ-స్వభావము- లక్షణములు తరుణ కాలికరోగములు వెన్నె ముకస్వభావము వివిధభాగములు- వెన్నుపాము లోని సంధులు- మజ్జాంతర్నా ళులు-అస్థిపంజరము-జంతువుల కళేబరములు- మానవులకళేబరములు-తేడాలు-

వెన్నువంపులు-కారణములు- దెబ్బలు-భావలు సంధాయక ధాతువు తీరుతేడా- వెన్నులోని వంపులకును అవయవములలోని రోగములకును గల సంబంధము-

వెన్నులోని దోషములు-వెన్నుపూసలలోని సంధులు-ఒక జతచెనుట వలన మిగిలినవికూడా చెడిపోవును-

ఇతరదోషములు- గర్భిణీ స్త్రీలకూపకములు-కూపకములయొక్క ప్రాధా న్యత-లోపములను సరిచేయుట- మర్దనచికిత్సవలన కలుగు ఉపయోగము- చికిత్స చేయునపుడు గమనింపవలసిన విషయములు-చికిత్సలోకలుగుమంటలు- శ్వాస్థ్యసంకటములు-

న్యూరోథెరపీకిని మిగిలినభాగములకును గల సంబంధము- కార్య కారణ ముల సంబంధమును తెలుసుకొని మూలకారణమును తొలగింపవలెను- మందు వైద్యమువారి అభిప్రాయము శరీరశాస్త్రజ్ఞుల అభిప్రాయము-

ఆస్టియోపతీ కీరోప్రాక్టిక్ నాపపతి పేజీలు 418_424

వివిధభాగములు-వీటికిగల సంబంధము-డాక్టరు స్లైసిన్ అభిప్రాయము- సంపూర్ణ చికిత్సా ప్రక్రియలు కావు-(వీటిలోని అసమర్థత- ప్రకృతి వైద్య విధానము-సామ్యము-ఉదరములలో కలుగు సంకోచవ్యాకోచములు-మిగి లిన భాగములకన్నా ఈ భాగముముందడుగు వేయుట- ప్రత్యక్షప్రమాణము

గారడీకాదు- అస్థిసమీకరణభాగములకును ప్రకృతి వైద్యమునకును గలతేడా డా॥ లోవాన్ వ్యాసము-కకేసుకా శాస్త్రజ్ఞులఅభిప్రాయము-ప్రకృతివైద్యము వాని అభిప్రాయము జ్వరకారణము-సిద్ధాంతములలోని భేదములు- ప్రత్యక్ష ప్రమాణము-న్యూమోనియాజ్వరము-సమాధానము-తరుణరోగములే కాలికరోగ ములుగా మారుట- కేసుచరిత్ర శాస్త్రీయమైన కకేసుకా సమీకరణశాస్త్రము వలన కలుగు ఉపయోగములు-ఆహారచికిత్సా శాస్త్రమునకుగల సంబంధము- కాలికరోగముల ఉత్పత్తి మర్దన వలనకలుగు ఉపయోగములు- కాలికరోగము లలో చర్మము చెడుట-మర్దన చికిత్సలోని భాగములు-

## 30 కాంతశక్తి పేజీలు 424_441

కాంతశక్తిస్వభావము - లక్షణములు - నమ్మకముప్రధానము- ప్రేమ తోడుగా నుండవలెను- రోగి శాంతముతో నుండవలెను- నమ్మకములేనిది గారడీ- విద్యుచ్ఛక్తిని తయారుచేయుట-ధనాగ్రము, ఋణాగ్రము- శబ్దముల ఔచిత్యము-వాటికి వాడుటకు కారణము-విద్యుచ్ఛక్తి ప్రవాహమును చూడ లేకపోవుట-దేహములోని విద్యుచ్ఛక్తి- ప్రాణము పోయినతరువాత విద్యు చ్ఛక్తి లేకపోవుట-విద్యుచ్ఛక్తి దేహమునందు వ్యక్తమగుననుటకు సబబు-ఆర్య ఋషుల ప్రవచనము- శాస్త్రపరిశోధనల ఫలితము- లోహజనిత విద్యుచ్ఛక్తి- దీనిని వాడరాదనుట పంచభూతములు నాడీశక్తికిని ధాతుశక్తికిని గల సంబం ధము- తేజశ్చక్రము రంగు-ముదురు లేతల తేడాలు-కారణములు-వివిధ రంగుల స్వభావము-రోగనివారణలో గారడీలేదు- దయప్రధానమైనది సందేహము- క్రమపరిహారము ఉపయోగించవలెను-వీరిసామ్యము-శాస్త్రసమ్మతము- ప్రతి ఫలాపేక్ష-సాంఘికశీలములకు కారణము- ఉత్పత్తిదారులు-దళారులు- ఉప యోగించుకొనువారు- వీరి మధ్యవర్తులు- వైద్యులు, నర్సులమధ్య సామరస్య ము- ఆరోగ్యసదనములు ఆత్మశక్తిప్రబోధకములు- ఉపన్యాసములు ప్రధాన భాగముగా నుండుట- చెరిస్మశక్తి- ఆయస్కాంతము- వైద్యునిశక్తులుతగ్గవు- యెక్కువగును- గారడీపనులు- కాంతశక్తితో కొన్నిరోగములు కుదురుట- కొన్ని నయంకాకపోవుట-

# ప్రకృతి వైద్య తత్వము

౧

## కొలికిపూస

ప్రకృతి వైద్య తత్వమును గూర్చి పదేండ్లకు పూర్వమే వ్రాయుట మొదలు పెట్టాను అప్పుడు ఆవ్యాసములు (Nature Cure Magazine) నేచర్ క్యూర్ మాగజైనులో ప్రచురింప బడినాయి తరువాత కొంతకాలమునకే యీ వ్యాసములను పుస్తకరూపములో ప్రచురించాను

ప్రత్యేకముగా పుస్తకములను చదువుకొనేగాక, యీ సిద్ధాంతముల ఆచరణలో పెట్టి అనుభవమును సంపాదించుకొన్నాను. పెద్ద పెద్ద కాలేజీలలో చదువుకొని యీ సిద్ధాంతముల ఆచరణలో ప్రత్యేకానుభవమును పొందిన మరొక శాస్త్రజ్ఞుడు కూడా నాకు తోడ్పడినాడు ఈ శాస్త్రజ్ఞుడు పాత సిద్ధాంతముల మాత్రమే చదువుకొనినవాడు గక, ప్రపంచములో బయలుదేరిన నవీనశాస్త్రముల నన్నిటిని ఆ మూలాగ్రముగా తెలిసికొని ప్రకృతి వైద్యములో ప్రత్యేకమైన అనుభవమును సంపాదించినారు. వీరు ఈ రెండు సిద్ధాంతములను ఒక కాలములోనే అనుభవమునకు తెచ్చుకొని రెంటి యందలి తేడాలను కనుగొనినారు

ఇరువది సంవత్సరముల క్రితము ఈ వ్యాసము వ్రాసినా దరిమిలా గలిగిన యిరువది సం॥లలోను (అనుభవ

ములోను) పై వ్రాతలలో ఒక విషయముకూడా మార్పు నవసరము లేకపోయినది నా అనుభవములు పై సిద్ధాంతము లనే బలపరచినాయి కొన్ని కాలికపూసలు మాత్రము తరువాత వచ్చినాయి

మందు వైద్యమునకును, ప్రకృతి వైద్యమునకును మూల సిద్ధాంతములలోనే తేడాలు గలవు మందు వైద్య మును తొలగించి దాని స్థానములో నరయైన ప్రకృతి వైద్య మును స్థాపించుటకు ఈ నాల్గు ముఖ్య సూత్రములను మనసులో నుంచుకొనవలెను

(1) ప్రతి తరుణవ్యాధియు దేహములోని మాలిన్యము లను తొలగించి శుద్ధిచేయును

(2) తరుణ వ్యాధులకును, వీటివలన గలిగిన మిగిలిన వ్యాధులకును మూలకారణ మొకటే

(3) తరుణ, తరుణాంతర్గత, కాలిక వ్యాధులను మూల కారణమని మందు వైద్యులచే చెప్పబడు సూక్ష్మజీవి ముఖ్య కారణము కాదు ఈ సూక్ష్మజీవుల వలన రోగములు గల్గు టయు లేదు ఇది దేహములోనున్న రోగపదార్థముల వలన గలిగినవే ఈ వ్యాధులన్నియు రోగ పదార్థములను మండ బొందింపజేసి బహిష్కార్యావయవముల ద్వారా బయటికి వెడలి పోవునట్లు చేయు ఉపకారులేగాని వేరుగావు.

(4) సూక్ష్మజీవులకు దేహమునందలి అన్యపదార్థమే కారణము. ఈ రోగపదార్థములో ఈ జీవులు పుట్టి వృద్ధి పొందును.

ఈ పై సూత్రములను అనుగుణముగా మన శాస్త్రమును సమన్వయపరుద్దాము రోగ పదార్థమునుండి పుట్టిన సూక్ష్మ జీవులను విషౌషధములతోను, టీకాలు చేతను, రసముల చేతను చంపివేయక సహజ మార్గములద్వారా జీవించుట నేర్చుకొని సహజ మార్గములద్వారా రోగములను నివారణ చేసికొనెదము వివిధ రోగములకు మూలకారణమైన యీ రోగపదార్థములను దేహమునుండి తొలగ చేసెదము

పై సిద్ధాంతములకు అనుగుణముగా నేనువ్రాసిన వ్రాతలు మా చదువరులను అప్పటికి తృప్తి పరచలేదు

పాశ్చరు, మెచ్ని కాఫీ సిద్ధాంతములనే నే నప్పుడు వివరించితిని రోగపదార్థములను, సూక్ష్మజీవులు తిని వేసి, దేహమునకు మేలు చేయుచుండగా, అట్లు శుద్ధిచేయు సూక్ష్మ జీవులను తెల్లకణములు మ్రింగివేయునవి నేను చెప్పినప్పుడు వారలకు ఆశ్చర్యము గలిగినది ఇదిగాక, యిటువంటి వనేక సందేహములు గలిగినవి అందులో మరొకటి చెప్పతాను “దేహములో రోగపదార్థము పేరుకొన్నపుడే సంకటమ్ములు బయలు వెడలును అట్లా బయటపడినవే గజ్జి, చీడ, పేలు మొదలగు అంటువ్యాధులు” మరొక సందేహముగలదు మీ అభిప్రాయమే నిజమయితే ఈసూక్ష్మ జీవులు ఎక్కడ నుండి వచ్చినవి? సూక్ష్మజీవులు ఎచ్చట పుట్టినా యని మీ అభిప్రాయము

ఇటువంటి ప్రశ్నలు వస్తాయని ఊహించి ముందుగనే సమాధానము చెప్పాను మన దేహములో రోగపదార్థ

ఉండినయెడల సూక్ష్మజీవులు ఎచ్చటనుండియో వచ్చెనని మనముఆలోచింకవలసిన పనిలేదు మందముపొందిన (పులిసిన) రోగపదార్థములనుండి యే సూక్ష్మజీవులు వెలువడును అవి మనదేహములోనే యున్నవి ఆ సూక్ష్మజీవులు ఎచ్చట నుండి వచ్చెడివి? వాటికి ఆధారమేమిటి? అను ప్రశ్నలకు నాకప్పటికి అంతకన్న సమాధానము తెలియదు

వీటికి సమాధానములు నాకు అకస్మాత్తుగా దొరకినవి గత శతాబ్ద మధ్యభాగములో ఆంటోనీబీ చాంపు అను ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు ఈ విషయాన్ని శాస్త్ర సమ్మతముగా తెలియజెప్పాడు కూరలలోను, జంతువులలోను, మానవ దేహములలోను ఉన్నటువంటి యీ సూక్ష్మజీవుల పుట్టుకనుగూర్చియు, వాటి అభివృద్ధిని గూర్చియు విపులంగా తెలియజెప్పాడు • లండను నగరమునకు జెందిన కడగసుహ్యామప్రచురించిన 'Lifes Primal' లైఫ్సుప్రైమల్, అనేగ్రంథమునుండి యీ విషయములను తెలిసికొంటిని తరువాత బీలాంపు వ్రాసిన 'రక్తము' అను పుస్తకమును చదివితిని ఆ పుస్తకములో రక్తముయొక్క శక్తినిగూర్చియు అందులోని సూక్ష్మాతి సూక్ష్మమగు భాగములను గూర్చియు తెలియజెప్పాడు

పాశ్చరు అతని అనుయాయులు చెప్పినట్లు కణములే దేహములోని సూక్ష్మభాగములు కావు ఈ కణములను సూక్ష్మాతి సూక్ష్మభాగముల సమూహము లే కణములోని సూక్ష్మాతి భాగమునే మైక్రోజిమా అనే పేరు పెట్టారు మైక్రోజిమా అంటే ఆంగ్లమున (Minute Ferment Body) పులియు స్వభా

వముగల చిన్న పదార్థము అని అర్థము చెప్పుకొన్నారు. ఈ విషయములను 1864 సం॥ లో పారిసులోని మాంటు పెలి యర్ సార్‌బోన్ విశ్వవిద్యాలయములలో బీఛాంపుచెప్పాడు

అతని సిద్ధాంతముల ప్రకారము ఈ కణములన్నియు మైక్రో జిమాల సమూహములే మానవదేహమంతయు అసంఖ్యాక కణముల సమూహము ఈ కణముల దైహిక మానసిక శక్తులు, పెరుగుచోటుయొక్క గుణావగుణముల బట్టి యుండును ఆరోగ్యవంతమైన పదార్థములు తినినయెడల ఈ మైక్రోజిమాలును ఆరోగ్యముగలిగి దేహశక్తిని వృద్ధి పొందించును అనారోగ్యకరములైన పదార్థములను తినినయెడల ఈ మైక్రోజిమాలును రోగవంతములగును

“ప్రొఫెసరు బీఛాంపు అతని యనుయాయులు చూపిన అసంఖ్యాకములైన నిదర్శనములలో ఈ క్రిందజెప్పబోవునది ఒకటి కొద్ది సారాయి సారమును పంచదారకలిపిన నీటిలో వేసినయెడల ఈ పంచదారనీళ్ళన్నియు సారాయిగా మారిపోవును ఆసారములోని సూక్ష్మజీవులు నీటిలోని పంచదారనుతిని వృద్ధిపొంది ఈ పంచదారనీటిని సారాయిగాను, తదితర ఆమ్లములుగాను మారుస్తాయి ఈ పంచదార నీటిలో క్రియోసోటుగాని పుట్టుకను తగ్గించు ఏ యితర మందునుగాని కలిపితే ఆసారాయి సారములోని సూక్ష్మజీవులను వృద్ధి తగ్గిపోతుంది. వృద్ధిలేకపోవుటచే ఆసూక్ష్మజీవులు అట్లనే నిలబడినవి” దీనినిబట్టి మనకు తెలియునదేమనగా అన్ని వస్తువులును ఈ సూక్ష్మాతి సూక్ష్మ జీవుల సమూహములే

చాలా పురాతన కాలములోకూడా యీసూక్ష్మజీవులు ఉన్నట్లు మనకు తెలుస్తుంది ఇవి నాశనముకావు. అనాదినుండి సజీవములే ఈ సూక్ష్మజీవులే రోగమును కలిగించలేవనియు అవి వృద్ధిపొందుటకు అనుకూలమైన రోగపదార్థము లుండవలయుననియు మనము తెలిసికొనుచున్నాము

ఇది యేయభిప్రాయమును ప్రొఫెసరు బీఛాంపు గ్రంథమును తర్జుమాచేసిన అనువాదకులు వెలిబుచ్చుచున్నారు మందులు పుచ్చుకుంటే రోగములు నయమగునని చెప్పుట సత్యముకాదు ఆరోగ్య సూత్రములను ఆచరించుటవలననే రోగములు నయమగునని ప్రొఫెసరు బీఛాంపు అతని అనుయాయులు విశదపరచినారు మానవుల కష్టార్జితమైన డబ్బును మందులపేరిట డాక్టర్లకు పోయుచున్నారు ఈ మందులతోను డాక్టర్లతోను సామాన్యజన మెంత మోసపోవలెనో అంతా మోసపోవుచున్నారు

బీఛాంపు అభిప్రాయములు నాకు తెలియవచ్చేటప్పటికే యీ పుస్తకము చాలా భాగము పూర్తియైనది నా అనుభవములు బీఛాంపు వ్రాతలతో కలిసిపోవుట నాకు చాలా విచిత్రమైనది.

తరువాత వచ్చిన పాశ్చరుమొదలిని కాఫ్‌సిద్ధాంతములు బీఛాంపు సిద్ధాంతములను తారుమారుచేసి అలోపతీ వైద్యశాస్త్రమునకు మూలమైనవి. వారి వాదనప్రకారము ఎక్కడనుండో సూక్ష్మజీవులువచ్చి రోగమును కలిగించుచున్నవనియు దేహములోని సహజశక్తి యీ రోగజీవులను రాకుండా అడ్డు

దలచేయుననియు, టీకాలుగాని, యింజక్షనులుగాని, చేసి కొంటే రోగనివారణశక్తులు ఎక్కువగుననియు వారు శల విచ్చినారు ఇదే అలోపతీ మందువైద్యులు రోగకారణముగా భావించెదరు ఈ తప్పుసిద్ధాంతముమీదనే నేటి మందువైద్య మంతా ఆధారపడినది

'మైక్రోజిమా' సిద్ధాంతమే ప్రకృతివైద్యమునకు కాలికిపూస. లాన్‌యాంగిలకు చెందిన డాక్టరు ధామసు పవెల్సు మరొక సిద్ధాంతమును వెలువరచాడు వీరి సిద్ధాంతమేమంటే తెల్లకణ ములను సూక్ష్మజీవులు నాశనము చేయవు ఈ కణముల సమూహామే దేహములోపలికి మారిన పదార్థము

తెల్లకణములు సూక్ష్మజీవులను మింగుతవనే అభిప్రాయ మునే బీఛాంపు తన పుస్తకములో పరిహాసించాడు "రక్తము" అనే పుస్తకములోని భాగమును ఎత్తివ్రాయుచున్నాను. పాశ్చరు తెల్లకణములు సజీవములు కావని చెప్పినాడు వారి అనుయాయులు మాత్రము తెల్లకణములకు, ప్రాణమేగాక గతికూడా గలదని, చెప్పినారు ఇవే వృద్ధిపొంది రోగమును నాశనముచేయు సూక్ష్మజీవులు దైవికముగా వృద్ధిపొందుత వని వారు చెప్పినారు రక్తపరిణామమునుగూర్చి వారికింతకన్న నేమియు తెలియదు పాశ్చరుచెప్పిన సూక్ష్మజీవిసిద్ధాంతము బీఛాంపు ఎందుకు తప్పన్నది తరువాత తెలిసికొందాము

తెల్ల కణములనుగూర్చి డా॥ పవెల్సు సిద్ధాంతములును 'మైక్రోజిమాలను' గూర్చి మా అనుభవము ను రోగోత్పత్తి శాస్త్రసమ్మతముగా తెలియపరుస్తున్నవి.

ఎండలలో తిరిగినంత మాత్రముననే నయమైనట్లు యుద్ధభూము లనుండి వచ్చినవార్తలు చెప్పుచున్నాయి ఈ విషయములనే దరిమిలా చికాగోలోని కాలేజీలలో కూడా చెప్పుచూ వచ్చారు గాయములనెట్లు చికిత్సించవలసినదీ మరొక పుస్తక ములో తెలుసుకుందాము

మైక్రోజిమా వృత్తాంతము - ఈ భౌతిక పదార్థ మంతయు అణువుల సమూహము ఈఅణువులన్నియుపరమా ణువుల సమూహము ఈ పరమాణువులనే ఎలక్ట్రానను చున్నారు అణువులలో పరమాణువులుగాని, ఎలక్ట్రానులు గాని యెట్లున్నాయో అట్లనే కణములలోను మైక్రోజిమా లును ఉన్నవి ఎలక్ట్రానుల సంఖ్యనుబట్టి,వాటి చలనమును బట్టి, వివిధపదార్థములు మనకు తెలుస్తవి మైక్రోజిమాలు నివసించు పదార్థమునుబట్టి వాటివృద్ధి వికాసములుండును.

మానవుడు కణముల సమూహము మానవునకే గుణ ములు, లక్షణములునుఉంధునో? కణములకును ఆగుణములు, లక్షణములు ఉండును ఈగుణములే నిబిడీకృతముగా పురుషుని శుక్లములోను, స్త్రీశోణితములోను, ఉండును ఈ లక్షణము లన్నీ యెట్లాయుండునదీ ఆధునిక బయాలజీ చెప్పేటంత వివర ముగా పురాతన మందువైద్య శాస్త్రము చెప్పలేకపోయింది

బీఛాంపు మైక్రోజిమా సిద్ధాంతము శాస్త్రసమ్మత ముగానున్నది అనేక మైక్రోజిమాలుకలిసిన కణమగుచున్నది. అనేకఎలక్ట్రానుల కలయికయే అణువు. అనేక అణువుల సమూహామే మనకగపడు చున్నవలక.

ఈ నలకల సమూహమే పెద్దవస్తువు ఇట్లనే పెద్దవీన్ను. మైక్రోబియాయే కణమునకు ఆధారముకాబట్టి స్థూల దేహమునకు ఏలక్షణములుండునో (అనగా జాతికి సంబంధించి నట్టివిన్ని, కణమునకును) మైక్రోబియాకును ఆలక్షణములే ఉండును

## ౨

# ప్రకృతి వైద్య స్వరూపము: పుట్టుక

మానవ దేహమునకు కలుగు బాధలను, నొప్పులను సహజ మార్గముల ద్వారా నివారణచేయుట యే ప్రకృతి వైద్యము. జీవిత సరళిని పరిసర వాతావరణమును పూర్తిగా మార్చివేయుట మతములోని, వేదాంతములోని గొప్పతనమును ఆచరణ ద్వారా వ్యక్తము చేయుట

ఈ ఉద్యమమును 70 సం క్రితము జర్మనీ దేశస్థుడగు ప్రిస్నిట్జ్ యనునతడు ప్రారంభించినాడు జర్మనీలోని గ్రాఫెన్బర్గ్ అతని నివాసస్థలము సహజ మార్గములద్వారా రోగముల కుదుర్చుట అతనికి ప్రీతిదాయకము మందులు, మాత్రలు అతని సంచికట్టులో లేవు. కొండలమీదనుండు స్వచ్ఛమైన గాలితోను, వ్యాయామముతోను. నీటితోను రోగములను కుదుర్చువాడు రోగులైనను, అభ్యాసాలను రోగులకు [illegible]ముగా నిచ్చుచుండెడివాడు.

ఈ సహజ జీవనమువలన అద్భుతమైన ఫలితములు

కలిగినవి అరణ్యములో నితను ఉంటున్నప్పటికినీ అన్ని దేశములనుండీ, అన్ని ప్రాంతములనుండి, రోగులు వచ్చిజబ్బులు నయముచేసుకొని యింటికి వెళ్లుచుండెడివారు రాజులు, ధనికులు, దరిద్రులు వారు వీరననేల అందరును వీరి ఆరోగ్యసదనమునకు వచ్చి పోవుచుండెడివారు మందూ, మాకు లేకుండా రోగములు నయమగు వైద్యమునుగూర్చి దేశమందంతటా వ్యాపకము గలిగినది ఈ సిద్ధాంతములయందు నమ్మకముండుటచే చాలామంది వీరికి శిష్యులైరి వీరి శిష్య కోటిలో ఈ క్రిందివారు ముఖ్యులు డాక్టర్ హాల్ వీరు మంత్రశాస్త్ర ప్రవీణులు. రిక్లీ, జిస్ట, కూనేలు, పాథరుఃప్రు లీగు మత ప్రచారకులు లహామన్ వీరి మందువైద్యులు. టర్నపేటరు జాన్ వీరు వ్యాయామ శాస్త్రవేత్తలు ప్రకృతి వైద్యములోని ఆ యా భాగములలో పై వారు కృషిసల్పి అత్యుత్తమ స్థానమునకు తెచ్చిరి కొందరు జలచికిత్సను అభిమానించి ఆ శాస్త్రప్రభావమును విపులపరచిరి ఇట్లనే తంగు వైద్యమును, మానసిక శాస్త్రమును అభిమానించినవారు గలరు వాన్ పెక్ జీప్, కనీనికా నిదానము శాస్త్రమును అభిమానించెను. ఈ నిదానముప్రకారము దేహములోని అంతరవయవములలోని లోపాలన్ని కనీకలో విశదముగా కనబడుతాయి

సముద్రముల దాటి వీరి శిష్యకోటిలో చేరినవారిలో మిచిగాన్‌లోని బాటిల్ క్రౌను ఆరోగ్య సదనాధిపతులగు డా. కెల్లాను, అమెరికా దేశస్థుడగు డా ట్రాల్ ముఖ్యులు. సహజ మార్గములద్వారా రోగముల నయము చేయుటయందు అభి

లాష గలిగిన వారిలో క్వీబీ ఒకడు ఇతడు మొదట మర్దన జలమానసిక చికిత్సలను అభిమానించాడు తరువాత మానసిక చికిత్సనే ప్రధానముగా ఆదరించాడు అన్నిరోగములను ఈ చికిత్స ప్రక్రియలతోనే నయము చేసెడివాడు ఎడ్డీ అనునామె యీయన శిష్యురాలు. ఈమె మానసిక చికిత్సా శాస్త్రమును నవీనపద్ధతుల ప్రకారము వృద్ధిపరచినది డా॥ స్టిల్ అస్థిసమీకరణమును అభివృద్ధిపరచెను ఈ శాస్త్ర ఫలితమే కసేరుకా సమీకరణము డాక్టరు పామరు ఈ భాగమును వృద్ధిపరచెను.

పైన చెప్పినవారందరును ఈ నవీన వైద్యశాస్త్రమును దేశమంతటా వ్యాపింపజేశారు వీరందరు తమ తెలివితేటలను సక్రమముగా ఉపయోగించి రోగములు ఎందుకు వచ్చేది? యెట్లా నయమయ్యేది తెలిసికొన్నారు, పీనుగుల కాలేజిలనుండి వీరేమీ తెలిసికొనలేదు అడవులలోను, అరణ్యములలోను, తిరిగి తెలుసుకొన్నారు తరముల నుండే మానవులు ప్రకృతినుండి విడివడుట చేత ఈ మానవులనుండి తెలిసికొన దగ్గది యేమీ లేదని నిశ్చయించుకొని సరాసరి అడవులలోనికి పోయి అచ్చటనే తెలిసికొన్నారు. మానవకోటికి శాస్త్రమనుపేర జరుగు మహోపద్రవాలను సారాయిని సేవించడము పొగాకును నమలుట, మందులను తినుట, టీకాలు వేయించుకొనుట మొదలగు అసంఖ్యాక నష్టాలనుగూర్చి తెలిసికొని వాటిని నివారించు అభినవ వైద్యమును ప్రతిపాదించారు మానవులు ప్రకృతిని అనుసరిస్తే చాలా లాభాలను పొందుతారని తెలియజెప్పారు. తామే కాకుండా తమ సంతానముకూడా ఆలాభాలను పొందుతారు

దేహములు ఆరోగ్యవంతములుగా ఉంటే బుద్ధికూడా చాలా నిశితముగా ఉంటుంది పెద్దలు ఇట్లు ఆచరిస్తే, పిల్లలుకూడా తమ అలవాట్లను పెద్దల కనుగుణముగా మార్చుకొని అత్యధిక మైన ఆనందమును పొందగలరు ఇటు పెరిగిన సంతానము, తమకు, తమకుటుంబాలకే కాకుండా తమ సంఘమునకు, తమ దేశమునకు చాలా సేవచేస్తారు

ఇవన్నీ గొంతెమ్మ కోర్కెల కావు ఆచరించిన లభిం చునవేను కొన్ని నెలలుగాని, సంవత్సరములుగాని అను సరిస్తూ, మానవజాతికి నిర్దేశించిన ఆహారమునే తింటూయుంటే పైన చెప్పిన లాభాలనన్నిటిని కొన్ని తరములలోనే సంపాదించ గలము ఇట్లా పెరిగినవారు రాబోవు తరములవారికి మార్గ దర్శకులగుదురు జీవితములో వారికి కావలసినదేదియు లేదు దైహిక, మానసిక, నైతికశక్తులే వారిని వృద్ధిలోనికి తెస్తాయి తాగుబోతులపిల్లలు, నిరంతరము మందులసేవించేవారి సం తానము, ఇంద్రియలోలుర పిల్లలు, తమకు, తమతల్లిదండ్రు లకేగాక సంఘమునకు, దేశమునకు భారమగుదురు

## 3

## సాంకేతికములు

శాస్త్రములు వృద్ధియైనవి పరిశోధనలు చురుకుగా జరుగుచున్నవి ఫలితములను మానవకోటి పొందుతున్నది. ఈ ఫలితములు మానవకోటి యొక్క జనన మరణములకు

ఆరోగ్యమునకు, రోగమునకు, నివారణమునకును ఎట్లుప
యోగపడునది తెలిసికొనుటయే ప్రకృతి శాస్త్రము.

శాస్త్రము చెప్పుటకు ముందు ఆ శాస్త్రములో వాడు
శబ్దములను వాటి అర్థములను ముందుగా చెప్పుట శాస్త్ర
మర్యాద

ఈ శబ్దముల అర్థమును ముందుగనే తెలుసుకొంటే
శాస్త్రము కూడా తేలికగా అర్థమగుతుంది

(1) ప్రకృతి వైద్య తత్వ మననేమి?

మానవునిలో నిర్మాణశక్తి విచ్ఛిన్నశక్తి యను రెండు
శక్తులు గలవు నిర్మాణశక్తికి అనుకూలముగా మానవుని,
దైహిక, మానసిక, నైతికశక్తులను వృద్ధిపరచుటయె ప్రకృతి
వైద్యతత్వము.

(2) నిర్మాణశక్తి అననేమి ?

మానవుని దైహిక శక్తులను వృద్ధిచేయవలెను మాన
సికోల్లాసమును కలిగించవలెను నైతిక మార్గములను క్రమ
పరచవలయును దైహిక, మానసిక నైతికములను మూడు
విధములైన ఆనందములను ప్రసాదింప జేయునది నిర్మాణ
శక్తి నిర్మాణశక్తి, విచ్ఛిన్నశక్తి వ్యతిరేకముగా నుండును.

(3) విచ్ఛిన్నశక్తి యననేమి ?

మన కంటికగపడు వాటిని విడగొట్టి విశ్లేషము నొంద
జేసి తూంత సౌందర్యములు [illegible] చేసి సహజశక్తులను
రూపుమాపునది విచ్ఛిన్నశక్తి

(4) సమాజము అననేమి?

మానవుని జీవితావసరములకు అనుకూలముగా నుండునది

(5) ఆరోగ్య మననేమి ?

అనేక సూక్ష్మజీవుల సమూహామే కణము అనేక కణముల సమూహామే మానవ దేహాము మానవదేహాము ఆరోగ్యముగా ఉండాలంటే వాటి చలనము, వేగము, క్రియ ముగా ఉండాలి ఎక్కువ తక్కువలు లేకుండా ఉండాలి మానవుని దైహిక, మానసిక, నైతిక ప్రవర్తనలలో ఒడు దుడుకు లేకుండా ఉండాలి

(6) రోగమననేమి ?

సూక్ష్మజీవులలోను, కణములలోను గల క్రియచల నము లోపించినపుడు రోగములు వచ్చును వీటిలో అక్రమ చలనము వలన నిర్మాణశక్తికి అను గుణముగా ప్రవర్తించవు ఈ క్రియచలనము దైహికకారణములచేగాని, మానసిక కణ ములచేగాని నైతిక కారణములచేగాని లోపించవచ్చును

(7) రోగమునకు ముఖ్యకారణమేమి ?

ఆపదలను వదలిపెడితే, మాములుగా చెప్పాలంటే, ప్రకృతి నియమములను ఉల్లంఘించుటవలననే రోగము వచ్చు చున్నది

(8) ప్రకృతి నియమములను అతిక్రమించుటవలన ముఖ్యముగా మూడు ఇబ్బందులు కలుగుచున్నవి

(1) రాతిశక్తి తగ్గిపోవుట

(2) రసము, రక్తము కలిసిపోవుట (ధాతుసాంకర్యము)

(3) దేహమునకు అనవసరమైన రోగపదార్థము పేరు కొనుట.

ప్రతి రోగమునకును ఈ మూడు లక్షణములుండును. ఈ లక్షణములు సూక్ష్మ జీవులచలనమును అక్రమమొనర్చి నరముల బలహీనపరచును

(9) తరుణవ్యాధి అననేమి ?

తరుణవ్యాధి దేహములో పేరుకొనిన మలినముల తొలగించి అందువలన వివిధ నరములగతులకు ఏర్పడిన అవరోధములనుతొలగించి ఆయానరములకుజ్జీవనమొసర్చును అంటే ప్రతి తరుణరోగము కూడా దేహమునుండి మలిన పదార్థముల తొలగించి బాగుచేయుటకే వచ్చుచున్నది

(10) కాలిక వ్యాధులన నేమి ?

కాలిక వ్యాధులలో దేహములోని ధాతుశక్తితగ్గిపోతుంది. ధాతుశక్తి తగ్గిపోవుటచే రోగపదార్థమును పేరుకొంటుంది రోగ పదార్థము ఎక్కువగుటచే దేహములోని అంతరవయవ ములు మలిన పదార్థములను బయటకు నెట్టివేయలేవు. దేహములోని రోగ నిరోధక శక్తి రోగపదార్థములను బయటకు నెట్టివేసి దేహమునుఅనుక్షణము శుద్ధిచేయలేక పోవును

తరుణ రోగములలోవలె, కాలిక వ్యాధులలో, రోగ పదార్థము వెనువెంటనే బయటకు రాదు ప్రకృతి రోగ పదార్థములను అంత త్వరగా బయటకు నెట్టి వేయలేదు

(11) స్వాస్థ్యసంకటములనగా నేమి ?

ఆరోగ్యమునకు మార్గదర్శకములగు సంకటములు.

సంకటములు రెండు విధములు సంకటముల వలన కలుగు ఫలితములనుబట్టి వేరుచేయుదురు రోగపదార్థము కన్న, దేహతత్వము, బలముగానున్నపుడు రోగపదార్థముచు బయటకు నెట్టివేయును అట్లు బయటకు నెట్టి వేయించబడిన రోగపదార్థము కాయలుగాను కురుపులుగాను బయటకు వచ్చును స్వాస్థ్యసంకటములు ఎప్పుడునూ ఆరోగ్యము కలుగ నున్నదని చెప్పును

రోగ పదార్థమును బయటకు పంపుటకు దేహము చేయు ప్రయత్నము

(12) రోగసంకటములననేమి?

దేహతత్వముకన్న రోగపదార్థము లే పైచేయగానున్నపుడుకూడ సంకటములు కలుగును ఇవి రోగసంకటములు ఈ సంకట ములు రాబోవు ప్రమాదావస్థను తెలుపును

(13) రోగనివారణ అనగానేమి?

మామూలు పనులుకూడా చేయలేని దేహమును దేహధర్మ ముల నిర్వర్తింప సమర్థముగా చేయుట

(14) దేహములోని నిర్మాణశక్తికి అనుకూలముగా రోగ మును నివారణచేయు విధానములేవి?

ఈక్రిందిసూత్రములకు అనుకూలముగా నుండుమార్గములు దేహములోని నిర్మాణశక్తికి (అనుకూలముగా రోగములను నివారణచేయును)

(1) ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవన పద్ధతులను పరిసరవాతావరణమును మార్చునట్టి పద్ధతులు

(2) ధాతుశక్తియొక్క వ్యయమును తగ్గించునట్టి పద్ధతులు

(3) అన్యూనాధికముగా అనగా ఎక్కువ తక్కువలు లేకుండా రక్తమును సహజమార్గముల వృద్ధిచేయునట్టి పద్ధతులు

(4) దేహమునకు ఏవిధమైన హాని కలుగకుండా రోగపదార్థమును బయటికి నెట్టివేయు పద్ధతులు

(5) అస్థినిర్మాణములో నుండునట్టి భేదాలను సరిచేయునట్టి పద్ధతులు

(6) దేహమునకు కలుగు సర్వరోగములను తానే నివారణ చేసికొనగల నను దృఢసంకల్పమును, విశ్వాసమును, వృద్ధి చేయునట్టి పద్ధతులు

(15) దేహములోగల నిర్మాణశక్తికి అనుకూలముగామందులు పనిచేయునా?

విషతుల్యములు గానట్టియు, దేహతత్వమును నాశనము చేయునట్టియు, నరములకు బలము నిచ్చునట్టియు, దేహములో పేరుకొనిపోయిన రోగపదార్థమును విశ్లేషమొనర్చి బయటకుపోవుటకు సాయపడు మందులు దేహములోని నిర్మాణశక్తికి అనుకూలముగా పనిచేయును

(16) విషగుటికలున్నా, శస్త్రవైద్యమున్నా దేహములోని నిర్మాణశక్తి అనుకూలముగా పనిచేయునా?

విషగుటికలున్నా, అనవసర శస్త్రవైద్యమున్నా, దేహములోని నిర్మాణశక్తికి అనుకూలముగా పనిచేయవు ఎందువల్లననగా తరుణరోగ రూపమున బైటకువచ్చు రోగపదార్థమును

పై రెండు ప్రక్రియలును లోపలనే అణచివేయును బయటకు వచ్చు రోగపదార్థమును అణచివేయుటయేగాక మందులు స్వాభావికముగా హానికరములు

ప్రకృతి సూత్రములకు అనుగుణముగా ప్రవర్తించక పోయినప్పటికినీ, ఆత్మవిశ్వాసము లేకపోయినప్పటికినీ, పై వానితో ఫలితములు లేకుండా మందులు సేవిస్తే రోగములు నయమగు నను నమ్మకము ఎక్కువగును

(17) ఆధ్యాత్మిక నివారణ మార్గములు నివారణశక్తికి అనుకూలముగా పనిచేయునా? ఈ క్రిందిసూత్రములకు అనుగుణముగా నుండునవి, నిర్మాణశక్తికి అనుకూలముగా పని చేయును

(1) స్వాస్థ్యసంకటములను అభ్యంతరపెట్టనివి

(2) రోగము నయముకాగలదను ఆశను, నమ్మకమును, వృద్ధిచేసి ధాతుశక్తిని ఎక్కువ చేయునట్టివి

(3) రోగమునకు కారణమును, రోగమునయమగుటకు అవసరమైన విధానములనుచెప్పి రోగియొక్క బాధ్యతను వృద్ధిపరచునట్టివి

ఈ క్రిందిచెప్పు సూత్రములకు అనుగుణముగా నుండునట్టివి, నిర్మాణశక్తి వ్యతిరేకముగా పనిచేయును

(1) మామూలుగా నివారణజేయు విధానములకు వ్యతిరేకముగానుండి సామాన్యజ్ఞానముకూడా వమ్ముచేయునట్టివి

(2) నిర్మాణ శక్తిని వృద్ధిచేయక, ఆత్మవిశ్వాసమునకు

దోహద మొసంగునట్టివి, ఆధ్యాత్మిక నివారణ మార్గములలో శ్రద్ధనమ్మకము గలుగజేయునట్టివి

(3) బాధ్యత తగ్గించుటకు ఉపయోగపడునట్టివి

(18) ప్రకృతి వైద్యము నిర్మాణశక్తికి అనుకూలముగా పనిచేయునా? ప్రకృతి వైద్యము ఈ క్రింది నియమములకు అనుగుణముగా నుండునుకాన నిర్మాణశక్తికి అనుకూలముగా పనిచేయును

(1) ప్రకృతిసూత్రములను నుల్లంఘించుటయే రోగమునకు కారణమని చెప్పును

(2) ప్రకృతి సూత్రములేవో వాటిని ఎందుచే అనుసరింపవలయునో తెలియజేయును

(3) తన ఆయురారోగ్యములకేగాక, తనపిల్లల ఆయురారోగ్యములకు కూడా తానే యెట్లు కారణమైనదీ తెలియజేయును

(4) స్వయంకృషిని, ఆత్మశక్తిని వృద్ధిచేయును

(5) పరిసర వాతావరణమును ప్రకృతిసూత్రములకు అనుగుణముగా మార్చును

(6) అందరకు అందుబాటులో నుండునట్టివియు, ఆరోగ్యమునకు అనుకూలమైనట్టియు సహజనివారణ మార్గములను వృద్ధిచేయును.

(19) సహజ జీవనమెట్లు? మామూలు నివారణ మార్గములేవి?

(1) సహజాహారము తినవలెను. మంచినీటినే త్రాగ

వలయును స్వచ్ఛమైన గాలిని పీల్చవలయును అవసరమైన పుడు నిద్రపోవలయును వ్యాయామము చేయవలయును నైతికపరివర్తనమును ఒడుదుడుకు లేకుండాచూచుకొనవలెను

(2) కొద్ది కొద్ది జబ్బులను నీటితోను, గాలితోను, వెలుతురతోను, మట్టితోను, కొంత శక్తితోను నివారణ జేసికొనవలెను

(3) సమరసాహారమునే తినవలెను

(4) నిర్మాణశక్తికి అనుకూలమైన హోమియోపతీ మందులనే వాడుకొనవలెను

(5) ఏ అవయవములకు ఏ వ్యాయామము అవసరమో తెలిసికొన వలెను ఆగంతుకముగా గలుగు ఆపదలలో నేమి చేయవలసినదీ ఆ నిర్మాణ మెట్లుండవలనది తెలిసి కొనవలెను

(6) మానసిక, ఆధ్యాత్మిక శక్తులను వృద్ధి చేసికొన వలెను

(7) రోగము మామూలుగా వచ్చిపోతుందని తెలిసి కొనవలెను ఏ విధమయిన ప్రమాదము జరుగదనియు రోగము నయమైన తరువాత మామూలుగానుండు ఆరోగ్య ము గలుగుననియు తెలిసికొన వలెను

౪

# జీవితమనగా నేమి?

రోగము ఎందుకు వస్తుందో తెలిసికొనుటకు ముందు ప్రాతిపదికమును గూర్చి తెలుసుకోవాలి ప్రాణమన నేమో దాని విశేషమేమో తెలిసికోవాలి ఈ ప్రాణముయొక్క చిహ్నము లేకదా ఆరోగ్యము, అనారోగ్యమును

నిజం చెప్పాలంటే యీ ప్రశ్న చాలా కష్టమైనదేను మానవుల బుద్ధిసూక్ష్మమునకు అందనిదే దీనిని తెలిసికొనుటకే తరతరములనుండి, సృష్ట్యాదినుండి, ప్రయత్నములు జరుగుచున్నవి మనమైనా ప్రాణముయొక్క పుట్టుకనుగూర్చి గాక, దాని చేష్టలనుగూర్చి తెలిసికొనుటకు ప్రయత్నిద్దాము.

ఈ దేహమును గూర్చి రెండురకములైన అభిప్రాయములు ప్రబలియున్నవి భౌతికమనీ, ఆధ్యాత్మికమని

మానవదేహము అనేకకణముల సమూహమనియు ఈ కణములును సూక్ష్మాతి సూక్ష్మమైన మైక్రోజీవాల సమూహమే ననియు, మనమిదివఱకే తెలిసికొన్నాము మానవుని దైహిక, మానసిక చర్యలన్నీ, మైక్రోజీవాలచర్యలని, యీ భౌతికవాదులు చెప్పుచున్నారు ఈ వాదము ప్రకారము మనము తిను ఆహారపదార్థముల రసాయనిక మార్పుల సమూహమే ప్రాణము.

జీవితమును గూర్చియు, దానివృద్ధి క్షయములను [illegible] (చార్లెసుమానింగు) (సెనసెన్సు అండ్ రాబా

వెనేసెన్స్) అనే పుస్తకమును వ్రాసినారు ఈ పుస్తకము చికాగో విశ్వ విద్యాలయము వారు ప్రచురించారు నేను పుస్తకమును చాలా శ్రద్ధగా చదివినాను ఈ పుస్తకమును చదివినందువలన తెలుసుకొన్న దేదీ లేదని చెప్పాలి గ్రంథ కర్త మాహామాలు సిద్ధాంతాలనే చక్కగా చెప్పాడు కాని యెందువలన అవి అట్లు జరిగేదీ చెప్పలేదు

ఇంకనూ రెండవ వాదమునుగూర్చి తెలిసికొందాము ఈ విశ్వమంతయు శక్తి వ్యాపించియున్నది ఇదే సృష్టికంతా మూలము ఈ ప్రాణికోటి అంతా యీ విశ్వశక్తియొక్క ప్రతి రూపమేను మన కగుపడు ప్రాణికోటి చలనమంతటకినీ యీ విశ్వ శక్తియే కారణము ఆకాశపథములోని వైహాయసను లును, స్థూల ప్రపంచములోని అణువులునూ ఈ విశ్వ శక్తి ప్రేరేపకములే

ప్రకృతిలోని సర్వ వస్తువులందును ఊహాతీతమైన గమన విశేషముగలదు మనసులో గలుగు భావన మొదలు కొని, వజ్రములోని సూక్ష్మాతి సూక్ష్మమైన నలుసు వఱ కును చలనముగలదు ఈ ఎలక్ట్రానుల గమన విశేషమువల ననే వివిధ వస్తువులను మనము తెలిసికొంటున్నాము కొన్ని వస్తువులయందు ఈ ఎలక్ట్రానుల గమనము త్వరితముగను, మరికొన్ని వస్తువులయందు ఈ గమనము తక్కువగను ఉండును, కొద్దికాలము క్రిందటివఱకు భౌతిక శాస్త్రము స్థూల ప్రపంచములోని అణువులే సూక్ష్మభాగమని చెప్పినవి అంతేకాక యీ అణువుకూడా ఘనరూపములోనే యుండుననీ చెప్పినది. తరువాత జరిగిన పరిశోధనలు ప్రపంచములో ఘన

రూప పదార్థము లేదనియు, ప్రతియణువు సవ్యాపసవ్య విద్యుచ్ఛక్తి యేనని చెప్పుచున్నవి ఇనపఅణువునకును, మైక్రోజిను లోని అణువునకునుగల తేడా ఆయాఅణువులలోని ఎలక్ట్రానుల నడకలోని తేడాయేగాని మరిదేనియందును లేదనిచెప్పుచున్నది.

సూర్యుడును, తదితర గ్రహములును నిరంతరమును ఈఖగోళములో ఎట్లు తిరుగుచున్నవో, అట్లనే అణువుల లోని ఎలక్ట్రానులున్నూ తిరుగుచుండును 2000 సం॥ క్రితము పైతాగరస్ కూడా యిదే అభిప్రాయమును చెప్పినాడు స్థూలపదార్థమంతయు సూక్ష్మాతి సూక్ష్మమైన ఎలక్ట్రానుల గమనము, సంఖ్య భేదము లేనని చెప్పినాడు నవీన భౌతిక శాస్త్రము కూడా అదే అభిప్రాయమును తెలుపుచున్నది పైతాగరస్ చెప్పిన primordial Substance (మూలద్రవ్యము) విశ్వమునంతను వ్యాపించిన నైహాయసములు, చలనమనగా ఎలక్ట్రిసిటీ సంఖ్య అనగా నిరంతరము అణువులలో తిరుగు ఎలక్ట్రానుల సంఖ్య

సవ్యాపసవ్య విద్యుత్ కణములే ఎలక్ట్రానులు ఎలక్ట్రిసిటీ కూడా ఒక రకమైనఅద్భుతమైనశక్తే సూర్యాదిగ్రహము లెంత క్రమముగా తిరుగునో అదే క్రమముతో అణువులలోని యెలక్ట్రానులున్నూ తిరుగును ఈఅద్భుతమైన శక్తిమూల

యొక్క గమనమును మాత్రమే తెలియజేయుననియు ఈ జీవము విశ్వశక్తిలోని ఒక భాగమేననియు మనకు తెలుస్తుంది ఆవిశ్వశక్తినే భగవంతుడనియు, ప్రకృతిమాత యనియు, పరమాత్మ యనియు, బ్రహ్మ మనియు, ప్రాణ మనియు, వారివారి తాహత్తు జ్ఞానమునుబట్టి" పిలుస్తున్నారు

మానవదేహములోని గర్భితమైయున్న యీవిశ్వశక్తియే నిజముగా సర్వరోగములనుకుదిర్చి దేహమునుశుద్ధి చేస్తోంది. చెడిన అవయవములను యథాశక్తిమంతము చేస్తోంది వైద్యులే చేయాలంటే అంతర్, బహిరవయవముల కదలికకు అడ్డముగానున్న అవరోధముల తొలగించి, సహజశక్తియే తన పనిని చక్కబెట్టు కొనగలట్లు సహాయము చేయాలి

మన మందువైద్య సోదరు లేమంటున్నారంటే మేము చెప్పినది కూడా అదేను అంతా పదార్థమేను

మానసిక శాస్త్రవేత్త లే మంటున్నారంటే అంతా ప్రాణమేగాని పదార్థమేమి లేదు రోగముకూడా ఊహాజనకమేకాని నిజముకాదు

అతీంద్రియ దృష్టితో చూస్తే వారు చెప్పే పదార్థముకూడా ప్రాణమేకావచ్చు కాని పదార్థముమాత్రము ఉన్నదని మాత్రము ఒప్పుకొనకతప్పదు అట్లాలేకపోతేగంటకు అరువది మైళ్ళ వేగముతో పరుగెత్తే యింజనుముందు నిలబడినమనిషి అట్లాగే ఉండాలిగా కాని నిలబడుట లేదు నామరూపములు లేకుండా పోతున్నాడు, ఈ పదార్థముకూడా యెట్లావచ్చిందని కాదు మనప్రశ్న అసలు ఉన్నదా? లేదా? అని మానవునికి

మానసిక, నైతిక, పంథాలున్నాయని యెట్లా ఒప్పుకోవాలో అట్లనే సృష్టిలోకూడా శక్తిపదార్థమున్నదని ఒప్పుకోకతప్పదు

3

# రోగమునకు కారణమేమి ?

ఆగంతుకముగా కలుగు ఆపదలుగాక, మిగిలిన అన్ని బాధలను ప్రకృతి సూత్రములను అతిక్రమించుటచేతనే వచ్చుచున్నవని గత అధ్యాయములో చదివియున్నాము అయితే ప్రకృతి సూత్రముల అతిక్రమించుట అననేమి? జగన్మాతయగు ప్రకృతి మన కొఱకు నిర్దేశించిన స్వచ్ఛమైన గాలిని పీల్చక పోవడము, శుద్ధమైన జలమును త్రాగక పోవడము, సాత్విక ఆహారము తినక పోవడము, నిద్ర పోవక పోవడము, కామేచ్ఛను అదుపులో ఉంచుకో లేక పోవడము, సాంఘిక, నైతిక, మానసిక ప్రవర్తనలలో అన్నిటిలోను అతిక్రమించడమే ఇట్లా అతిక్రమించుట వలననే రోగము వస్తోంది ఈ రోగమునుండి క్రొత్తరోగము పుట్టుటయు గలదు.

ప్రతి కణమునకును మూడు లక్షణములు గలవు.

(1) ప్రాణవాయువును తీసుకొని, ఆహారమును జీర్ణించుకొనుట

(2) రస, రక్తధాతువులను అన్యాన్యాధికముగా పంచుట.

(3) మాలిన్యముల నెట్టివేయుట

ఈ ధర్మములు సరిగా నిర్వర్తించనందువలన కలుగు ఫలితములు

ఏయే అవయవమునకు ఎంత శక్తి కావలెనో అంత శక్తిని ఎక్కువ తక్కువలు గాకుండ మెదడునుండి వెన్ను పూసలలోనికి, వెన్ను పూసలనుండియును ఇతర భాగములకును అందచేయును కేంద్రములకును అవయవములకును మధ్యను అడ్డము ఏర్పడితే నాడీశక్తి సరిగా అందదు అందువలన ధాతు శక్తి తగ్గిపోతుంది

(2) రసము, రక్తము ఎక్కువ తక్కువలు కాకుండా ఉండవలెను రక్తముయొక్క చిక్కదనము ఎక్కువ తక్కువలు గాకుండా యుండవలెను పైన చెప్పిన ఎక్కువ తక్కువలుగా ఉంటే ధాతుసాంకర్యము గలుగుతుంది

(3) మాలిన్యములను ఎప్పటి కప్పుడు బయటకు పంపవలెను బయటకు పోని మాలిన్యములు లోపలనే పేరుకొనును ఈ మాలిన్యముల నుండి ఘన, ద్రవ, వాయు పదార్ధమైన పదార్థములు అంతరవయవములగమనమునకు అడ్డుపడుట చేత నాడీశక్తి క్రమముగా ప్రవహించదు నాడీశక్తి తిన్నగా ప్రవహించకపోవుటచే ఆయా అవయవములలోని చైతన్యము తగ్గిపోవును.

## పట్టిక (1)

కణముయొక్క ముఖ్యలక్షణములు

(1) నాడీశక్తిని అంతటను ప్రవహింపజేయుట,

(2) రసము, రక్తము, మిగిలిన ద్రవభాగములును ఎక్కువ, తక్కువ గాకుండుట

(3) మాలిన్యములను తొలగించుట

కణము అశక్తమైనపుడు గలుగుఫలితములు

(1) ధాతుశక్తి తగ్గిపోవుట

(2) ఏభాగము ఎక్కువైనా, తక్కువైనా యిబ్బందులే గలుగును

(3) మధ్య ఏర్పడిన మాలిన్యముల అభ్యంతరములవలన కేంద్రములనుండి నాడీశక్తి తిన్నగా ప్రవహించకపోతే ఆ యా అవయవములు తిన్నగా పనిచేయవు నాడీశక్తి యెక్కువగా వచ్చిన అవయవములును పని యెక్కువగుట వలన త్వరగా శిథిలమగును

ఈ క్రిందిపట్టిక రోగముయొక్క మొదటి దశను, రెండవదశను తెలియజేస్తుంది

## పట్టిక (2)

ప్రారంభదశ

(1) ధాతుశక్తి కొంచెము తగ్గిపోతుండంగే

రెండవదశ

(1) తీవ్రముగా సంక్రమించినవి.

యెక్కువగా పనిచేయుటవలనను, రాత్రిపూట పనిచేయుటవలనను, దురలవాట్లవలనను, ఉద్రేక మును కలిగించుపదార్థములను తినుటవలనను, మందులు సేవించుటవలనను, శస్త్రచికిత్సచేయిం చుటవలనను, దురాలోచనలు చేయుటవలనను

(౨) రస, రక్తభాగములు అన్యాయాధికముగా నెట్లు ఉండునంటే సమరసాహారముల సేవించుట వలనను, సేంద్రియలవణములు తిని ఆహారమును సేవించుటవలనను, సేంద్రియము లవణములులేని ఆహారము సేవించుటవలనను

(౩) రోగపదార్థము ఎందుకు పేరుకొనుననగా ధాతుశక్తి తగ్గుటచేతను అవసరమునకు మించి తినుటచేతను, విశ్రాంతి తీసుకొనక పోవుటచేతను, విరుద్ధాహారములను తినుటచేతను మందులు సేవిం చుటచేతను, టీకాలు వేయించుకొనుటచేతను తరుణ రోగముల అణచివేయుటవలనను.

(౪) జ్వరములు, మంటలు, చర్మవ్యా ధులు, అభిష్యందములు, పుండ్లు, అంతర్వ్ర ణము, బహిర్వ్రణములు మొదలగు రోగ పదార్థములను బయటకు నెట్టి దేహమును శుద్ధిచేయురోగములన్ని

## రోగాద్వైతము - చికిత్సాద్వైతము

ఏకారణముచే రోగము వస్తుందో పై పట్టికవలన తెలిసి కొన్నాము నివారణమార్గములేవో తెలుసుకొందాము,

(1) ప్రకృతిని అనుసరించి పరిసర వాతావరణమును తదను కూలముగా మార్చుకొనవలెను ఎట్లాగంటే?

(అ) విజ్ఞానదాయకమైన గ్రంథములను చదువుట, పరులకు చెప్పుట

(ఆ) కార్యకారణముల సంబంధమును నియమనిగ్రహములను నేర్చుకొనుట, నేర్పుట

(ఇ) సహజాహారమునే తినుట, స్వచ్ఛమైన గాలిని పీల్చుట, నిర్మలమైన నీటిని త్రాగుట, సాంఘిక నైతిక సాంసారిక విషయములందు ఒడుదుడుకు లేకుండుట.

(ఈ) ఎముకలలో గలుగు లోపములను మర్దన చికిత్సతోను అస్థిసమీకరణముతోను కసేరుకా చికిత్స మొదలగు సహజ నివారణ మార్గములవలననే చికిత్సించుట.

(2) ధాతుశక్తి దుర్వ్యయము గాకుండా చూచుట యెట్లనగా

(అ) ఏకారణములచే ధాతుశక్తి దుర్వ్యయమైపోతుందో తెలుసుకొని అట్లా దుర్వ్యయము చేసికొనకుండా అడ్డువేయుట

(ఆ దేహమునకు విశ్రాంతి అవసరమైనపుడు శయనించుట

(ఈ) ఒడుదుడుకులు లేకుండ ఆలోచించి నిర్ణయము చేసికొనుట

(3) మాలిన్యములను బయటికి నెట్టివేయుట

(అ) శాస్త్రసమ్మతమైనట్టి సమరసాహారములనే తినుట

(ఆ) అవసరమైనపుడు అవసరమైనంత వరకు ఉపవసించుట

(ఇ) మామూలు చికిత్సకు జలము ఉపయోగించుట

(ఈ) గాలి, వెలుతురులో తిరుగుట

(ఉ) ఎముకలను సర్దుబాటు చేయుట

(ఊ) ముక్కుద్వారా గాలిని లోనికి పీల్చుట

ఏ అవయవము రోగగ్రస్తమైనదో తెలిసికొని ఆ అవయవమునకు వ్యాయామముద్వారా చికిత్సచేయుట

(ఋ) ఏ మందులను సేవిస్తే రస, రక్తభాగములు సరిగానుండునో తెలుసుకొని అటువంటివాటినే సేవించుట

బహిరాఘాతములవల్లనున్నూ, ఆగంతుకముగా వచ్చే ఆపదలుగాక మానవదేహములో కలుగు మిగిలిన రోగములలో ప్రతిఒక రోగమునకును ఈ ప్రకరణములో చెప్పిన 3 లక్షణములలో 1 గాని, 2 గాని, 3 గాని ముఖ్యకారణములుగా ఉంటాయి ఈవిషయమును రాబోవు అధ్యాయములో విపులముగా తెలిసికొందాము ప్రతిరోగము ప్రకృతి నియమములను ఉల్లంఘించినంత మాత్రమే వస్తుందని మనము తెలిసికొన్నపుడు ఆయా సూత్రముల అనుసరించినంతమాత్రమే

చేతనే ఆరోగ్యము కలుగుతుందని వెంటనే ఊహించగలము. ప్రకృతి వైద్య శాస్త్రము ఈ విషయమును సహేతుకముగా చెప్పగలిగినట్లైతే మానవజాతికి, మిగిలిన యేశాస్త్రము చేయలేని సహాయమును ఈ శాస్త్రమొక్కటే చేసి శాశ్వత కీర్తిని పొందగలదు

ఏకారణములవలన ఏరోగములు ఎట్లావచ్చేదీ తెలిసి కొందాము

## ధాతుశక్తి యెట్లా తగ్గుతుంది?

ఆరోగ్యము ధాతుశక్తిని వృద్ధిచేస్తుంది రోగము ధాతుశక్తిని తగ్గిస్తుంది జీవశక్తి దేహములోనికి నిరంతరము ప్రవహిస్తుంటే ధాతుశక్తివృద్ధి పొందుతుంది దేహము ఆరోగ్యముగాను బలముగాను ఉంటుంది మామూలుగా కలుగురోగములన్నింటినీ బయటకు నెట్టివేస్తుంది. లోపలనేచేరి గడబడ చేయుటకు తావీయదు దేహములో విద్యుచ్ఛక్తియొక్క సవ్యాపసవ్యము భాగములు రెండును అన్యూనాధికముగా నుండవలెను విద్యుచ్ఛక్తియొక్క సవ్యభాగముయొక్కవైనాకష్టమే అపసవ్య భాగముయొక్కవైనాకష్టమేను ఈ రెంటి సమన్వయమే ఆరోగ్యము ఈ రెంటిలో పొందికలేకపోవుటయే అనారోగ్యము ఈ రెంటిలో ఏఒకటి యొక్కవైనా మానవుని దైహిక, మానసిక, నైతిక పంథాలలో మార్పులు కనబడును మామూలు పద్ధతులకు, భిన్నముగా నున్నపుడు ఆహారము మందులు మొదలగున వన్నియు వాటిని(భిన్నపరిసితులను) పోషించుటకే ఉపయోగించును. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవింప

గోరు వైద్యులు ఈ సవ్యాపసవ్య భాగములను విద్యుత్ప్రభావమును ముందుగా తెలిసికొనవలెను

ధాతుశక్తితగ్గిపోవుటచే రోగమును నిరోధించే సత్తా తగ్గిపోతుంది రోగము పెరిగిపోతే జీర్ణముకాక మిగిలిపోయిన అన్య పదార్థము, విషము, సూక్ష్మజీవులు, పరాన్నభుక్కులు నిర్విరోధముగా పెరిగిపోతవి

ఈక్రింది ఉదాహరణమువలన ఈ విషయము ఇంకా బాగా విశదముగా గలదు అందరునూ రంకులరాటమును ఎరిగియేయుంటారు రంకులరాటము చుట్టునూయుండు జంతువులమీద వినోదార్థమై, ఆనందమును పొందగోరువారు కూర్చుందురు రాటము కొద్ది వేగముతో తిరుగుచున్నంతవరకు చుట్టూ కూర్చున్న జనము వారి వారి స్థానములలోనుండి సంతోషమునే పొందుదురు ఏమియు బాధపడరు రాటము ఎక్కువవేగముతో తిరుగునపుడు చుట్టూకూర్చొన్న జనమంతయూ స్థానభ్రంశమును పొందుదురు రాటము యొక్క వేగము ఎక్కువైతే ఎట్లా చుట్టునున్న జనముంతా దూరముగా పడిపోదురో, అట్లనేధాతుశక్తి యెక్కువైనకొద్దీ, దేహములోని రోగనిరోధకశక్తి యెక్కువగును. రోగపదారమును దగ్గరకు చేరనీయదు నెట్టివేయును

పెద్దతనమువచ్చినకొద్దీ దేహములోని పటుత్వము తగ్గిపోతుంది ధాతుశక్తి తగ్గిపోతుంది దేహభాగములైన అణువులలోని గమనము తగ్గిపోతుంది నిరోధకశక్తి తగ్గుటచే రోగపదార్థము పెరిగిపోవును ఈరోగపదార్థమే ధాతుశక్తిని వివిధ

అవయవములకు చెందనీయక అడ్డుపడును రోగకారణముల
మూడింటికిని అవినాభావ సంబంధమున్నది కణము దేహము
లోనిసూక్ష్మభాగమగుటవలన కణముయొక్క రోగారోగ్యము
దేహముయొక్క రోగారోగ్యమును దేహముమాదిరి కణము
నకును స్వతంత్రాలోచనయుండును కణముకూడా ఒకసూక్ష్మ
దేహమని చెప్పవచ్చును ప్రతికణము ప్రాణవాయువును పీల్చి
కొని ఆహారమును జీర్ణించికొనగలదు మానవుని మాదిరిగనే
కణమునకును వృద్ధిక్షయములుగలవు దేహము ఆరోగ్యముగా
నుండుటకుముందు కణము ఆరోగ్యముగా నున్నదా లేదా
అని మనము ఆలోచించాలి

వయసుతోబాటు ధాతుశక్తి తగ్గుట యనగా మైక్రో
జమాలోని గమనవేగము తగ్గుననిగుర్తు ఈతగ్గుదల యితర
దురలవాట్లవలన కలుగవచ్చును అరగక మిగిలిపోయిన పదా
ర్థము నరములకు అడ్డుపడి ధాతుశక్తిని కణములలో వ్యాపించ
నీయదు. గడియారపు మరలో మన్ను పేరుకొన్నయెడల గడి
యారము సరిగా పనిచేయుటకు ఎట్లా అభ్యంతరము కలు
గునో అట్లనే దేహాంతరవయవములలో రోగపదార్థము పేరు
కొని ధాతుశక్తిఅంతటా వ్యాపించనీయక, అభ్యంతరముపెట్టును
అంతరవయవములలో నే ఒక్క అవయవము ఎక్కువ తక్కు
వగా పనిచేసినా మొత్తమంతా చెడుతుంది. మందువైద్యులు
బలహీనులకు, మాంసము కోడిగ్రుడ్డును, మసాలాలను
బాగాబలము గాగలందుకు పెట్టుతారు వీటిని జీర్ణయంత్రము
సరిగా జీర్ణించుకొనలేకపోయినపుడు ఇది రోగపదార్థముగా
పేరుకొని పోవుచున్నది. అందువలననే ధాతుశక్తితగ్గిపోయి అనా

రోగ్యమేర్పడుచున్నది అనవసరమైనవి తినుటచేత, రోగమువస్తే మాంసాదులు తినుటచేత రోగములుపోయి బలవంతులగుదు రని మందువైద్యులు భ్రమపడుచున్నారు ఇది తప్పు ఎందు కనగా అనవసరపదార్థములు తినుటచేత వారిజీర్ణయంత్రము యు చెడినవి సరియైన పరిస్థితిలో లేవు ఎంత బలకరమైన ఆహార మొసంగిననూ వారి జీర్ణయంత్రములు ఈ ఆహారమును జీర్ణించుకొనలేవుగాన మిగిలిపోవును మొదట బాధే యిప్పు డునూ, తటస్థపడును అదీగాక వస్తువులబలమునుబట్టి దేహము నకు బలమురాదు జీర్ణయంత్రముయొక్క పటుత్వమునుబట్టి బలము వస్తుంది

పై విధముగా రోగపదార్థముపేరుకొని అనారోగ్యము గలిగినపుడు ఈ రోగపదార్థమును బయటకు పంపివేయ వలయును

ఈ అన్యపదార్థమును వెడలగొట్టుటకు జలచికిత్స ప్రక్రియలు, మర్దనచికిత్స ప్రక్రియలు అత్యంత ఉపయోగ కారులగును

## రస, రక్త భాగములు సరిగాలేకపోవుట

రస, రక్తభాగములు సరిగాలేకపోవుటచేతను రోగము వచ్చునని లోగడనే చదువుకొన్నాము మనముతిను ఆహారము మొదట రసముగా మారి తరువాత రక్తమగును రసము, రక్తము క్రమముగా ఉండవలెనంటే ఆహారము యుక్తమైనదిగా నుండవలయును రసాయనశాస్త్రము పదునెనిమిది ధాతువు లను కనుగొనినది దేహయంత్రము సరిగా పనిచేయవలెనంటే

యీ ధాతువులు ఎక్కువ తక్కువలు గాకుండా యుండాలి. ఇవి సరిగా నున్నంతవఱకు దేహము ఆరోగ్యముగానుంటుంది. ఈ సమ్మేళనములో ఏయొకటి యెక్కువైనా, తక్కువైనా రోగమే సిద్ధము

దేహములోని అవయవములకును గస రక్తముతే ఆధారములు కణములుగాని అవయవములుగాని క్రమముగా పనిచేయవలెనంటే రస రక్తములు శుభ్రముగా నుండాలి దేహపోషణకు అవసరమైన పదార్థమునే తినాలి అగత్యక ముగా వచ్చినపడు రోగముల వదలిపెడితే దేహము కులుగు ప్రతిరోగము రక్తములోని దోషము వలననే వచ్చుచున్నవి దేహపోషణకు అవసరమైన ధాతువులు లోపించినట్లు వెంటనే తెలుస్తుంది దేహపోషణకు అవసరమైన లోహాలవణములు మనము తినుఆహారములో లేవనివెంటనే తెలుస్తుంది దేహములో తయారగు మలినములు బయటకుపోక, లోపలనే నిలువయుండును ఏపదార్థములో సేంద్రియలవణములు సహజ రూపములో నుండునో తెలిసికొనుటలోనే కష్టమున్నది

## రోగపదార్థమెట్లు పేరుకొనును?

ధాతుశక్తి తగ్గి పోవుటచేతను, రస రక్త భాగములు సరిగానుండక పోవుటచేతను రోగపదార్థము పేరుకొనును రోగపదార్థము పేరుకొనుటతో రోగము వచ్చుచున్నది రోగ పదార్థము పేరుకొనుచున్నదనగానే అరగని పదార్థము నిల బడిపోతున్నదని వెంటనేదోషమైనకనుగుంతుంది మనముతిను ఆహా రములో కర్బను, హైడ్రజనములు ఎక్కువగుంట చేతను,

మాంసకృత్తులు ఎక్కువగుటచేతనూ, దేహమునుండి బహిష్కరింపబడవలసిన అన్యపదార్థమునకు అవసరమైన సేంద్రియము లోహలవణములు మనముతిను ఆహారపదార్థములలో లేకపోవుటచేతనూ, రోగపదార్థములు లోపలనేనిలచి యుండి పేరుకొనుచున్నవి

తరుణ, కాలికరోగములగూర్చి యింకా విశదముగా తెలిసికొనేటప్పుడు ఈ రోగపదార్థమును గూర్చి యింకా విశదముగా తెలుసుకొందాము

దేహములో తయారగు విషవాయువులు బయటకు పోనపుడు దేహమునకు ప్రమాదముగలుగును ఈ విషవాయువులకన్న మందులు మరింతహానిచేయును అందును ఖనిజములగురస, గంధకాదులను సేవించినపుడు అవి దేహమునుండి బయటకు వెడలుట దుర్లభము దేహములో నిరంతరము తయారగు విషవాయువులు బయటకు వెడలిపోయి బయటి గాలిలోనుండు ప్రాణవాయువు లోనికిపోతూంటే దేహము ఆరోగ్యముగా ఉంటుంది బయటకు వచ్చుటకుగాని, లోనికిపోవుటకుగాని యెట్టి అభ్యంతరములు గలిగినా ఆరోగ్యముచెడుతుంది మలినపదార్థమును బయటకుబంపి, ప్రాణవాయువును లోనికి పంపు వ్యాయామక్రీడ లన్నియు ఆరోగ్యమును వృద్ధి చేయుటకే ఉపయోగపడును

లోపల చేరినరోగపదార్థము ప్రాణశక్తిని అంతటా ప్రవహించనియదు రస, రక్తములను ప్రవహించనీయదు ఆహారపదార్థములను పచనముకానీయదు దేహములో తయా

రగు మురుగును బయటకు పోనీయదు రోగపదార్థము॥ మందులునూ దేహమునకు చేయని అపకారము లేదు

## మానసికోద్రేకములు

ధాతుశక్తి తిన్నగా ప్రవహించకపోవుటకు మానసికోద్రేకములుకూడా కొంతవఱకు కారణమే భయము, కోపము, క్రోధము, దిగులు మొదలగు వానివలన లోపలికండరము లన్నియు ముడుచుకొనిపోవును కణములన్నియు విచ్ఛిన్నమై పోవును రక్తప్రవాహమునకు అవరోధముగలుగుటచే ధాతుశక్తి సరిగా వ్యాపించదు అసహనము, ముక్కోపము, భయము మొదలగువాని వలన నరములయందు విపరీతమైన వేడిగలిగి మానసిక వేదనము గలుగును ఆత్మవంచనమే మనోరోగములకన్నిటికినీ మూలము మానసికోద్రేకముల వలన రోగములెట్లు వచ్చేదీ వాటినెట్లా నివారణచేసుకొనేదీ మరొక పుస్తకములో తెలిసికొందాము భయము, కోపము, క్రోధము మొదలగు ఈర్ష్యాభావములు మానసికా వేదనను కలిగించి ధాతుశక్తి సరిగా వ్యాపించనీయక జనారోగ్యము నెట్లుగలిగించునో? అట్లనే సంతోషము, ఉత్సాహము, నమ్మకము నరములలో ఉద్దీపనమును కలుగజేసి ఆరోగ్యమును వృద్ధి చేయును దైహికమార్పులకును మనస్సునకును ఎట్టి సంబంధముగలదో తెలిసికొందాము॥ మానవదేహము వివిధకణముల సమూహము అని లోగడనే చదువుకొన్నాము జీవశక్తి వలననే యీ కణములలోని యెలక్ట్రానులు కదులుతున్నవి. మానవదేహమున కలుగు మార్పులన్నియు సూక్ష్మదేహము॥

నకు గలవు విద్యుచ్ఛక్తి యొక్క సవ్యాపసవ్యాగ్రముల సమ
న్వయమే ఆరోగ్యమని మనమిదివరకే తెలిసికొన్నాము ఈస
వ్యాపసవ్యములను చెడగొట్టు ప్రతి అభ్యంతరమును ఆరోగ్య
మును చెడగొట్టును ఈ సంగతిని తెలిసికొనినతరువాత రోగ
మునుగూర్చి మనమింత ఆందోళనపడ నవసరములేదు అణువు
సిద్ధాంతమునకు పూర్వము దేహమంతా విడగొట్టటానికి వీలు
పడని పదార్థమనియు, మార్చుటకు వీలుపడదనియు, అను
కొనుచుండెడివారు ఆరోగ్యముచెడి రోగమువచ్చినపుడు ఈ
మొత్తం దేహానికి ఏమిచెయ్యవలెనా అని ఆలోచించు
చుండెడివారు

అణువు సిద్ధాంతమును కనుగొనిన తరువాత ఈ శ్రమ
తగ్గిపోయినది దేహములోని ప్రతి అవయవము అణువుల
సమూహమేనని, యీ అణువులును ఎలక్ట్రానుల సమూహమని
యీ ఎలక్ట్రానులు వేగముగా ఒక దానిచుట్టును మరియొకటి
తిరుగుచుండుననియు తెలిసికొన్నాము కొన్ని ఎలక్ట్రానులు
కలిసి అణువగును కొన్ని అణువులు కలిసి కుటికలగును కొన్ని
కుటికలు కలిసి కణమగును కొన్ని కణములు కలిసి అవయవ
మగును కొన్ని అవయవముల కలయికయే మానవదేహము.
మనకగుపడు స్థూలదేహమంతయు అణువుల సమూహ మగు
టచే ఆహారముగాని, మందుగాని, మరియేయితర భావములు
గాని దేహము మొత్తమునకేగాక ప్రతి చిన్న కణములోను
గలుగును

మనుష్యునకును దేహమునకును గల సంబంధమును
గూర్చి ప్రాచీన నవీన సిద్ధాంతములకును తేడాగలదు పూర్వపు

సిద్ధాంతము ప్రకారము దేహము చెప్పినట్లు మనస్సు నడచు చుండెను ప్రతిభావముకూడా ముందుగా భౌతికముగా కన బడిన తరువాతనే మనసునందు కలుగును పరిశోధనల ప్రకా రము ప్రతిభావము ముందుగా మనసులో గలిగి తరువాత భౌతికముగా వ్యక్తమగును అనుభూతమగును మనస్సు దేహము వాటిస్థానములలో ఉండుటచే అల్లకల్లోలముగ ఉండును దైహిక శక్తులన్నియు తమఅధికారికి అనగా మనసుకు లోబడియే ఉండును

## రోగాద్వైతము

రోగముయొక్క దశలనుగురించి గతపేజీలో చదివి యున్నాము వీటిఅంతర్దశలను అనూ వంశపరంపరగా వచ్చు రోగచిహ్నములను గూర్చి తెలుసుకొందాము

వంశపరంపరగా వచ్చునవే రోగానికి ప్రధానకారణ ములని మనకు తోచవచ్చును కాని అవి నిజముగాదు తల్లి దండ్రిలలో ధాతుశక్తి బాగుడిన రస, రక్త ధాతువులు సరి యైన భాగములలో నుండేవారికి గలిగిన సంతానముగూడా శక్తిమంతులుగాను,ఆరోగ్యవంతులుగానూఉంటారు గర్భధారణ కాలమందును,శిశువుజన్మించిన తరువాతను ఆరోగ్య సూత్రము లను విధిగాఆచరిస్తే శిశువు ఆరోగ్యము బాగుంటుంది వంశ పరంపరగావచ్చే రోగాలేమీరావు పిల్లలకు మొండి రోగా లేమైనా వచ్చినాయంటే అవన్నీ ఆపిల్లల తలిదండ్రులు బుద్ధి పూర్వకముగా గాని, ప్రమాదవశముచేగాని ప్రకృతి నియ

మములను ఉల్లంఘించి యుండాలి లేకపోతే అటువంటి రోగాలేమీ రావు

పురుషుని శుక్లము, స్త్రీ శోణితముతో కలిసినపుడు బిందువేర్పడి గర్భధారణ కాలమందు శిశువుగా మారుచున్నది. మానవ దేహమునకుగల లక్షణములు కణమునకును, మైక్రో జిమ్‌కును ఉండుటచే ఆ లక్షణములే శుక్లమునకును, శోణితమునకును ఉండును

అప్పుడే పుట్టినశిశువు కనీనికలనుచూస్తే శిశువు అవయవములోని లోపములేగాక, తల్లిదండ్రుల దేహములలోని అవయవముల లోని తేడాలుకూడా కనబడుతాయి ఈశిశువును ప్రకృతి సూత్రములకు వ్యతిరేకముగా పెంచితే ఆయా అవయవములలోని లోపములు ఎక్కువగుతవి కనుక పాపచుట్టునుండు కనీనికనుచూచి యీ అవయవములు ఎంత రోగగ్రస్తములైనదీ తెలుసుకొనవచ్చును శిశువ్యాధులుగా ముందు బయలుదేరి కాలిక వ్యాధులుగా పరిణమించి కష్టసాధ్యములగుచున్నవి అయితే యీరోగాలవారి పిల్లలు కూడా రోగులు కావలెగదా అంటారేమో? రోగిష్టి తల్లిదండ్రులకు గలిగిన సంతానము రోగులు కానవసరములేదు కాని పిల్లల లోని ఆయా అవయవములు మెతకగానే (లోపభూయిష్టము గానే) ఉంటాయి, తల్లిదండ్రుల అలవాట్లు ఈపిల్లలకువస్తే ఆయా రోగాలుకూడా రాకతప్పవు ప్రకృతిసూత్రములకు అనుగుణముగా ఈ పిల్లలను పెంచితే తల్లిదండ్రుల రోగాలేమీ వీరికి రావు ఆరోగ్యవంతులుగానే యుంటారు పైన చెప్పిన వాక్యములన్నియు ప్రమాణపూర్వకములు కల్పిత

గాధలుగావు అమెరికాలో ఇట్లు పెరిగిన పిల్లలు చాలా మందిగలరు వీరిసంతానము కూడా రోగముూ, రొప్పిలేకుండా ఉన్నారు తల్లిదండ్రులు తమ బాధ్యతను గుర్తించాలంటే, జవాబుదారీని వహించాలంటే, తాముబాధపడు తున్నప్పటికీ తమ పిల్లలకు మాత్రము ఆ రోగములు రాకుండా కాపాడాలి

## సహజనిరోధము

రోగముయొక్క అంతర్దశలనుగురించి తెలిసికొన్నాము ఈ అంతర్దశా ఫలితములే క్రిములు, కీటకములు, వరాన్న భుక్కులు, పుండ్లు, మంటలు, చర్మవ్యాధులు, జ్వరము మొదలగునవన్నీ

మందువైద్యమంతా సూక్ష్మజీవితోనేయున్నది వాటిని చంపుటకే క్రొత్తమందులను కనుగొనుచున్నారు దూరదర్శినీ యంత్రింతోచూస్తే కొన్నిరోగాలలో సూక్ష్మజీవులు కన బడ్డాయి, దీనిని పురస్కరించుకొనే దాదాపుగా అన్నిరోగాలు సూక్ష్మజీవులవలననే కలుగుతాయని శాస్త్రవేత్తలు నిర్ణ యించారు ఇంతేకాక వేరువేరురోగాలు వేరువేరైన సూక్ష్మ జీవులవలన వస్తాయని నిశ్చయించారు దీన్నిబట్టిచూస్తే మన బ్రతుకంతా సూక్ష్మజీవులమీాదనే ఆధారపడింది వీటి ఆగ్ర హానుగ్రహములమీాదనే మనము నిలబడుచున్నాము. మన బ్రతుకంతా ఆగంతుకముగానే ఉంటుంది వీరి సిద్ధాంతముప్రకా రము ఆరోగ్యములను మానవ మాత్రులు చేయగలిగినదేమీా లేదు.

మందువైద్యమంతా యీసూక్ష్మజీవులను చంపుటకు విషాన్ని కనుగొనుట కేర్పడినదేను.

ప్రకృతివైద్యమునకును, మందువైద్యమునకును ఎట్టి సంబంధమును లేదు, పైకిమాత్రము ఒకటిగానే కనపడుతాయి. రోగోత్పత్తినిగూర్చికాని, రోగనివారణను గూర్చికాని, ఈ ఉభయ వాదులకును ఏకాభిప్రాయము లేదు, రోగానికి సూక్ష్మజీవులు కారణమంటారు మందువైద్యులు రోగానికి రోగపదార్థమంటారు ప్రకృతి వైద్యులు మనము పీల్చు గాలిలోని దుర్గంధమువలనను రోగమురావచ్చును రోగ పదార్థములోపల పేరుకొనిన కణాంతర్భాగమైన మైక్రోజిమాలకు పోషకమగుట చేతనైనా రోగమురావచ్చు ఈ మైక్రోజిమాలే వృద్ధియై బాక్టీరియాలగుతవి ప్రకృతి చెడుద్వారానే మంచిని కలుగచేస్తుంది రోగమువస్తే రోగ పదార్థము వెడలిపోతుందని సంతోషించాలిగాని, యేడ్వరాదని చెప్పుమాటలలోని అర్థమిదేను మైక్రోజిమాలు అన్ని జీవ పదార్థములలోనుగలవు నిర్జీవమైన పదార్థములలో కూడా మైక్రోజిమాలుగలవు బాక్టీరియాలోని అంతర్భాగమైన మైక్రోజిమాలే రోగపదార్థముండి వాటికి పోషణదొరకే యెడల ఆపదార్థమునుతిని పెద్దవై రోగమును కలిగిస్తాయి రోగపదార్థములేని యెడల ఆమైక్రోజిమాలే మంచిపదార్థ మునుతిని ఆరోగ్యదాయక మగుతవి

ప్రొఫెసర్ బీఛాంపు చెప్పిన రోగజీవులు దేహమునకు మంచినే చేస్తాయిగాని చెడును చెయ్యవు సిద్ధాంతము ప్రకృతి శాస్త్రమునకు అనుకూలముగానున్నది స్నేహితుల మాదిరిగా రోగాలు వచ్చిపోతాయిగాని దేహమునకు ఏవిధమైన హానియు చేయవు ఈరోగజీవులన్నియు రోగపదార్థమునుండి

పుట్టిన ఫలితములేగాని రోగమునకు కారణములు మాత్రము
కావు మందువైద్యము వారిమాటే నిజమైతే సూక్ష్మజీవి ఆగ్ర
హమున బట్టి మానవజాతిఅంతా యిదివఱకే నామరూపాలు
లేకుండా పోవాల్సింది

రోగజీవులనుండి వచ్చు రోగముకన్న రోగము బయటనుండి
వస్తుందంటే భయమెక్కువగానున్నది

మా చికిత్సాలయమునకు అనేకమంది రోగులు వచ్చే
వారు వారందరికి రోగమేమిటిఅంటే, రోగజీవులు బయట
నుండి వచ్చి తమ్ము ఆవేశిస్తాయను భయము సర్వకాల సర్వా
వస్థలయందును ఈభయమే వారిని ఆవేశించి యుంటుంది రోగ
పదార్థమునుండి రోగజీవులు పుట్టుతాయని రోగపదార్థము లేక
పోతే రోగమురాదని వారికి తెలియదు

మైక్రోజిమూలు అంతటా వ్యాపించియే యున్నవి.
మనము పీల్చేగాలిలోఉన్నవి త్రాగేనీళ్ళలోఉన్నవి తినేఅన్న
ములో ఉన్నవి మనదేహములోనే ఉన్నవి మన ప్రయత్న
మంతా ఈ జీవులను చంపుటకుకాదు సరియైన వాతావరణ
మును కలిగించి మైక్రోబిజమూలు ఆరోగ్యవంతముగా వృద్ధి
పొందు నట్లుచేయును

మైక్రోబిజములు వృద్ధిపొందుటకు అనుకూలమైన రోగ
పదార్థమును బహిష్కార్యావయవముల ద్వారాను మలకోశ,
మూత్రకోశముల ద్వారాను, చర్మముద్వారాను, నాసికా
రంధ్రములద్వారాను బయటకుపోవుటకు వీలగునట్లుచేయుట
ఈ పద్ధతినికాక, వేరుమార్గములను త్రొక్కితిమా, అంటే

రోగమెక్కువగుటయే కాని తగ్గనుమాత్రము తగ్గదు ఆరోగ జీవులను చంపుటకై, మందులూ మాకులూ గొంతులో పోయుటచే ఆరోగ జీవులకు మరింత పోషక పదార్థము చేరి మరీ యెక్కువగుటచే రోగజీవులు బాగా వృద్ధిపొందుతవి కాని తగ్గవు మందువైద్యమువలెగాక ప్రకృతివైద్యమంటే రోగ జీవుల అభివృద్ధికి పోషణకు మూలకారణమైన రోగపదార్థ మునే బహిష్కార్యావయవములద్వారా బయటకు పోవునట్లు దేహతత్వమునకు సాయముచేస్తుంది. దేహములోని మాలిన్య ములవలన రోగము పుట్టుచున్నది ఈ మాలిన్యములను తొలగిస్తే రోగముదారిని రోగము పోతుంది. దేహములో నిర్మాణశక్తికి అనుకూలముగానుండి దేహమునకు హానిచేయని యేచికిత్స అయినను ప్రకృతి వైద్యములోనికేవచ్చును రోగ పదార్థము తొలగించకుండా, రోగజీవులనుచంపుటకు మందులు వాడుట శోచనీయము ఇంటిలో దుమ్ము పేరుకొనిపోయి చీమలు, దోమలు, ఎక్కువైపోతే వాటిని ఊడ్చి అవతల పారపోయకుండా వాటిమీద పినాయిలు చల్లునట్లున్నది ఇట్లు శుభ్రపరచాలంటే తలుపులూ కిటికీలు తెరచి వాటినన్నిం టిని ఊడ్చి బయటపారపోస్తామూ లేక తలుపులు కిటికీలు మూసియుంచే యింట్లో మాత్రము పినాయిలుచల్లి ఆపినాయిల్ వాసన పోవుటకు సాంబ్రాణి కర్పూరముల వెలిగిస్తాము. నిజంచెప్పాలంటే పినాయిలుగాని మరియే యితరమందులు గాని క్రిమికీటకాదుల నెక్కువచేస్తాయి రోగాన్ని కలుగజేస్తా యనే సూక్ష్మ జీవులు అనారోగుల దేహములలోనేగాక ఆరోగ్యవంతుల దేహములలో కూడా ఉన్నాయన్నమా

గతి సూక్ష్మజీవుల గూర్చి పరిశోధనలు చేసిన శాస్త్రజ్ఞులంతా వప్పుకొన్నదేను ఒక ప్రఖ్యాత ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు చెప్పాడు గదా! రెండు నెలల పిల్లలనోట్లో మందువైద్య శాస్త్రమునకు సంబంధించిన రోగములన్నింటికీ కలిగించే అన్నిరకాల సూక్ష్మ జీవులూ ఉన్నాయని ఇదేగాక క్షయరోగము యొక్క వృద్ధి క్షయములను కనుగొనుటకు ఫ్రెంచి గవర్నమెంటువారు ఒక శాస్త్రజ్ఞుని నియమించారు రోము నగరములో జరిగిన అంత ర్జాతీయ క్షయరోగతత్వ మహాసభలో ఈ శాస్త్రజ్ఞుడు చెప్పాడుగదా! నేను పరీక్షచేసిన బడిపిల్లలనందరి నోళ్ళ లోను నూటికి తొంబైయొదుమందిలో ఈ క్షయరోగ సూక్ష్మజీవులు ఉన్నాయట

మందువైద్యములోకూడా ఆస్లరు అందెవేసినచేయి. ఈ విషయమునుగూర్చి వారి అభిప్రాయమేమంటే శ్వాసాశయ వ్యాధులు, సర్పి, మొదలగు విషవ్యాధులకు సంబంధించిన సూక్ష్మజీవులు ఆరోగ్యవంతుల దేహములలోనూ ఉండును ఒకవ్యాధి అందరకునూ కలగకపోవుటచేతనే అది వ్యాపించు టకు అభ్యంతర పెట్టు సహజ నిరోధము మనదేహములోనే కలదనియు బాక్టీరియా ఒకటే రోగమును కలిగించ లేదనియు స్పష్టమగుచున్నది మానవజాతికి వంశానుగతముగా రోగము లన్నీ రావలెనను నియమములేదుగాని ఆయాఅవయవము లోని పటుత్వము తగ్గియుంటుందని మాత్రము మనము తెలిసికోగలము. రోగప్రవణత ఉంటుందని మాత్రము చెప్పక తప్పదు మనతండ్రి, తాతలు చాలా తరములనుండి ప్రకృతి సూత్రములఅతిక్రమించుటచేతను,మందులను సేవించుటచేతను

తరుణరోగములను అణచివేయుటచేతనూ, క్రొత్తక్రొత్తరోగ
ములు విచిత్రరూపములో వచ్చుచున్నవి ఇన్నిరోగాలు పిల్ల
లకు, తండ్రులకు కలిగినా ఆరోగాలన్నీ వారిసంతతికి రావలె
నను నియమములేదు రోగప్రవీణతమాత్రము ఉండవచ్చును
మందువైద్యమువారి సిద్ధాంతముప్రకారము రోగములుసూక్ష్మ
జీవులనుండేవస్తే యీ అంటురోగాలు అందరకు కలుగవలసి
నదేగా కాని చాలా కొద్దిమందికే యీరోగాలు వస్తాయి.
జగన్మాతయగు ప్రకృతి తన సహజనిరోధమువలననే మానవ
లోకమంతా యీబాధల పొందకుండా చేస్తున్నది ప్రకృతి
లోనే అనగా ప్రతి మానవ దేహములోనూ రోగ
మును నిరోధించు శక్తి గలదని పైవిధముగా మనకంద
రికును తెలియుచున్నది చికిత్సాలయములోని లెక్కలు
కూడా యీ సహజనిరోధమున్నట్లు తెలియజేస్తాయి ప్రకృతి
లోని యీ సహజనిరోధమును మరొకవిధముగాను, మనకు
తెలుస్తుంది వ్రణ రస టీకాలు ఎలుకలకును, చుంచులకునూ
వేస్తే యీ వ్రణములు వృద్ధిఅయి వాటిలోకొన్ని మాత్రమే
చనిపోయినవి

ఒకేరోగము పదిమందికే వ్యాపించిందిఅంటే యీ పది
మందిలోనూ రోగప్రవణత ఉండాలి రోగమువ్యాప్తినిపొందు
టకు అనుకూలమగు వాతావరణముఉండి ఉండాలి రోగ
ప్రవణ్ణత ఉండాలంటే రోగము వృద్ధిపొందుటకు అనుకూల
మగు రోగపదార్థముండాలని వెంటనే ద్యోతకమగుతుంది.
ఇదే రోగాద్వైతము ఈ విషయమునే వెనుక అధ్యాయములో
కూడ వివరించియున్నాము

## అంటురోగాలు ఎందుకు వస్తున్నాయి ?

పై విషయముల నన్నింటినీ నేను బహిరంగ ఉపన్యాసము లలో చెప్పుచున్నపుడు నన్ను చాలామంది అడిగినారుగదా రోగాలు బయటనుండిరాక దేహములోపలనే ఉద్భవిస్తాయని చెప్పుతున్నారుగదా! అయితే రోగము ఒకచోట నివసించే చాలామందికి వచ్చుటకు కారణ మేమిటి ?

దీనికి సమాధానమేమంటే ఒకచోట నివసించేవారం దరు ఒకే రకమైనగాలిని పీలుస్తారు ఒకేరకమైన ఆహారమునే తింటారు అందువలన వారందరకును రోగపదార్థము ఒకేవిధ ముగా వ్యాప్తిని (మండమును) పొందుతున్నవి అందువలన ఈ రోగపదార్థము నుండి ఒకేరకమైన రోగజీవులు పుట్టు తాయి వ్యాప్తినిపొందుతాయి వీరందరికినీ ఒకే రోగము పుట్టుతుంది

ఇంతేగాక రోగమువచ్చుటకు మనకు తెలియనికారణాలుకూడా కొన్నియుండవచ్చు వాతావరణములోనిలోపాల వలననూ రావచ్చు జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించిన కారణాలవలననూ రోగాలు రావచ్చును ఖగోళశాస్త్రమునకు సంబంధించిన లోపాలవలనను రోగాలు రావచ్చు

ధాతుశక్తి తగ్గిపోతే రోగాన్ని నిరోధించే సామర్థ్య మెట్లు తగ్గిపోయేదీ క్రిమికీటకాదు లెట్లు వృద్ధి పొందేదీ లోగడనే చదివియున్నాము

రోగపదార్థము చేరిన స్థానాన్నిబట్టి రోగానికిపేరు పెట్టారు చిన్నపేగులలో రోగపదార్థము చేరుకొంటే సన్ని

పాత జ్వరము వస్తుందన్నారు ఊపిరితిత్తులలో రోగపదార్థము
పేరుకుంటే శ్వాసాశయవ్యాధులు వస్తాయన్నారు తలలో
గాని, వెన్నుపాములోగాని రోగపదార్థము పేరుకొంటే ఆ
రెంటికీ సంబంధించినదేదో మజ్జాగతజ్వరము వస్తుందన్నారు

డా పెట్టిన్ కాఫర్ వియన్నా విశ్వవిద్యాలయ వైద్య
శాస్త్రవేత్త, సిద్ధహస్తుడు రోగజీవులే రోగముల కలుగ
జేయవని వీరు గట్టిగా వాదించారు ఇదే అభిప్రాయమును
వీరు తమ యుపన్యాసములలోను, వ్రాతలలోను విశదపరి
చారు ప్రత్యక్ష ప్రమాణములతో చూపించారు ఒకరోజున
ఉపన్యసిస్తూ ఒకగ్లాసెడు రోగజీవులను త్రాగారు కొద్ది వికా
రముగలిగిందిగాని యేమీ బాధనుగలిగించలేదు. బాగా
ఆరోగ్యముగా నున్నవారు టీకాలు వేయించుకొన్నా,
మందులుత్రాగినా వారినేమీ చేయవన్నారు రోగమునకుఅంటు
తనమేయుంటే వీరినందరినీ యీ రోగజీవులు బాధించవలసి
నదేగా మరొక ఉదాహరణమునుచెపుతాను, డాక్టరు రోడరు
మండ్ విసాకిన్ సిక్కురాష్ట్రనివాసి. వీరునూ చాలా పరి
శోధనలను జరిపినారు దేహము ఆరోగ్యముగా ఉంటే యెంత
రోగమున్నచోట్లకు పోయినా రోగమేమీ అంటదని వీరు
తెలియపరచారు నిర్ధారణగా తానే మశూచికపుటీకాల
వేయించుకొన్నారు ఈరోగముఅంతటా వ్యాపిస్తుందని గవర్న
మెంటువారు భయపడి వీరిని నిర్బంధములోఉంచినారు వీరికా
రోగము రానూలేదు మరెవరికి అంటనూలేదు

ఇకను స్వీయవృత్తాంతమును తెలిసికొందాము చికి
త్సాలయములో పనిచేసే నేమందరమూ అనేకసంవత్సరముల

నుండీ అంటువ్యాధులుకుదురుస్తున్నాము అనేక రోగాలవారు మా ఆసుపత్రికివస్తున్నారు అటువంటిరోగము మాలో ఎవరికిన్నీ రాలేదు ఒక తడవకూడా రాలేదు దేహాన్ని లోపలా బయటా శుభ్రపరచుకొంటే రోగమేమీరాదు ధాతుశక్తి తగ్గకుండా చూచుకోవాలి రస, రక్తధాతువులను సరిగా నుంచుకోవాలి బహిరాభ్యంతరావయవాలు బాగావనిచేసేటట్లు చూచుకోవాలి వీటన్నిటికన్న రోగము వస్తుందేమోనన్న భయము లేకుండా ఉండాలి ఇవన్నిచూచుకొంటే యేచోటికి పోయినా రోగమురాదు శాస్త్రకూ స్తలను దేహమే సరిచేస్తుంది

విషపురుగులను గూర్చి కూడా, తెలిసికొందాము. వేసవికాలములో నిత్యమూ తేలుకుట్టిందనో, మండ్రగబ్బకరచిందనో, పాము కరచిందనో అనేకమంది వస్తుంటారు వీటిని గూర్చియేదో విచిత్రముగా చెప్పుకుంటారు విషపురుగులుకరచిన వారందరూ చస్తారనే చెప్పుతారు ఇక కరచినా నూటికి రెండువంతులే చస్తారుమిగిలినవాళ్లందరూ బ్రతికేవారే ఇట్లు అనేక పిచ్చినమ్మకాలు ఉంటాయి వీటినివదలిపెట్టుట సామాన్యమా?

పాముకరిస్తే విస్కీ యివ్వడము మంచిదికాదా? అని నన్ను చాలామంది అడిగారు నిజంచెప్పాలంటే పాముకరిస్తే నూటికి ఏడుగురులోను ఎక్కువమంది విస్కీ సారాయిలవలననే చస్తున్నారు బ్రాందీ, సారాయిలు ఘాటైన మందులని వాటిని గొంతుకలో పోస్తున్నారు అందువలననే వారూ చస్తున్నారు పాముకరిస్తే చచ్చేవాళ్లు చాలా కొద్దిమందేనని సామాన్యజనమునకు తెలియదు ఈసంగతి తెలియకయే చాలామంది మందులకొరకు పరుగిడుతారు

మామూలుగా వచ్చే రోగాలన్నీ యేమందూ పోయ
కుండానే నయమగుతాయి ఒకటి, రెండురోజులు ఆలస్యము
గాని అంతకన్న నేమీలేదు ప్రకృతిలోనే యీశక్తి అంతా
యున్నది అది తెలుసుకోకనే యీ బాధలన్నీ జంతువిషాల
ను దేహానికి హానేమీ కలుగకుండా ప్రకృతే బయటకు
నెట్టుతుంది కొద్ది కల్లుమడ్డి వేస్తే పంచదార నీళ్ళు సారా
యిగా మారిపోతాయి అట్లనే రోగజీవులుకూడా రోగపదా
ర్థముయొక్క ఫలితమేగాక, రోగపదార్థముయొక్క ఉత్పత్తికిన్నీ
కారణభూత మగుచున్నవి రోగజీవులు అన్యపదార్థము
నందే పుట్టి అందులోనే నాశనమగుతాయి రోగపదార్థ
మును భ్రింగివేయును గాన ఇవి ఒకవిధముగా దేహానికి
మంచినే చేస్తున్నాయి

కల్లుమడ్డిలోని సూక్ష్మజీవులు నీళ్ళలోని పంచదారను
సారాయిగాను, అంగారామ్లముగాను మార్చివేయును ఈ
మురుగు ద్రవములోనుండి వచ్చినసారాయియే కల్లుమడ్డి
జీవుల పైపును నాశనముచేస్తోంది, మురుగులోనుండి
పుట్టిన సూక్ష్మజీవులను పులిసిన మురుగే హరింప జేస్తుంది
అయితే రోగమును వారించేమందులు కూడా మంచినే
చేస్తాయి గదా అని వీరడుగవచ్చును ఒక తేడా మాత్రము
న్నది దేహములోని రోగపదార్థమును బయటకుపంపువటకు
ప్రకృతి ఊరుకొనదు మందుఅన్నానో ధాతుశక్తినితగ్గించిరోగము
సరిగా వృద్ధిపొందకమునుపే అణచివేస్తుంది ప్రకృతి సామర్థ్య
ముకన్న మందుసామర్థ్యము ఎక్కువగుటచే రోగపదార్థ
మును బయటకుగెంటు పనిని ప్రకృతి తాత్కాలికముగా విరి

మించుకొంటుంది అప్పుడు రోగము నయమైనదని తలం తుము దేహములోని ధాతుశక్తి ఒకింత బలపడగానే, ప్రకృతి లోపలచేరిన మందును వెనుకటి రోగపదార్థముతో బయటకు నెట్టుటకు ప్రయత్నము చేస్తుంది అప్పుడు రోగము తిరగపెట్టిన దందుము ఇహతత్వమెరిగినాడని పాతవైద్యునిదగరకు వెళ్ళు దుము. ఆ వైద్యుడు వెనుకటికన్న ఘాటైన మందును ఎక్కువ మోతాగులుగా వాడుతాడు ఈ దెబ్బతో ప్రకృతి యెప్పటికీ తలెత్తలేకుండా పోతుంది ఇవే కాలికరోగములు వీటితో మొదటికే మోసము వస్తుంది ఈ విషయములను రాబోవు అధ్యాయములో విశదముగా తెలిసికొందాము

ప్రకృతికి అనుగుణమైన మార్గములో రక్తమును వృద్ధి చేసి బహిష్కార్యావయవములకు తోడుపడి బహిష్కరణ క్రియను వృద్ధిచేసినయెడల రోగజీవులు కలుగనే గలుగవు ఇదే సరియైన ప్రకృతి వైద్యము వంట్లో వేడి పుట్టగానే ఆ వేడి యెట్లాపోతుందనిగాదు మన ప్రశ్న ప్రకృతే యీ వేడిని తగ్గించుటకు సాయపడాలని చూడాలి మనము మాత్రము వాటికి అభివృద్ధికి నిరోధములు కల్పించకుండా ఉండాలి ప్రకృతివైద్యమేమి చేస్తుందంటే ఆహారనియమమునను,ఉపవాసములను, జలచికిత్స ప్రక్రియల తోను, మిగిలిన యితర చికిత్సా ప్రక్రియలతోను పైఫలితములను సాధించవలెను

పైనచెప్పిన వ్రాతలవల్ల నేను శస్త్రవైద్యమును నిర్లక్ష్యము చేస్తున్నానని భావించవద్దు శస్త్రవైద్యములో కొన్ని గుణాలున్నాయి. దోషాలుమాత్రము ఎక్కువ

ఉన్నాయి అందరకూ యీసంగతి తెలిసినదేను అంటు వ్యాధులు బయటనుండి వ్యాపించుటకన్న లోపల చేరినరోగ పదార్థమునుండే యెక్కువగా కలుగుతాయి బయటనుండి రాకుండా చూచుకోవాలి.

ఈ అధ్యాయమంతా ప్రొఫెసర్ బీఛాంప్ మైక్రో జైమా సిద్ధాంతమునకునూ, డా పవెల్సు అభిప్రాయమునకును అనుగుణముగా వ్రాశాను.

## నివారణ సూత్రములు

జ్వరమూ, మంటలూ నిష్కారణముగా రావనియు, నిర్హేతుకముగాపోవనియు మనము తెలిసికొన్నాము ఇవన్నీ అరగకమిగిలిపోయిన పదార్థము యొక్క ఫలితములే

ఆరోగ్యముగా ఉన్నంతవఱకు ఏమీబాధలేదు సరి పడని పదార్థము లోపల చేరగనే బాధలన్నీ మొదలు పెట్టు తాయి అదే రోగమువస్తే అన్నిరోగాలు నయమగుతవని 2000 సం॥ క్రితము సోక్రటీసుచెప్పినాడు దేహములో అరగక మిగిలిపోయిన పదార్థమువలననే అన్నిరోగాలూవస్తున్నా యనీ, రోగమువలన దేహము శుద్ధి అగుతుందనీ, మేము మొదటినుండి చెబుతునే యున్నాము

దీని అంతరార్థము తెలిసికొని ప్రయోగిస్తే అన్ని రోగాలు నయమవుతవి ఏశాస్త్రముచేయలేని సాయమును ఈ శాస్త్రముచేస్తుంది రోగాద్వైతము, చికిత్సాద్వైతము ఇదేను జలుబుమొదలుకొని, మశూచికమువఱకుగల రోగము లన్నీ అన్యపదార్థముయొక్క న్యూనాధిక్యములవలననే వచ్చుచు-

స్నవి సర్పి, ఉబ్బసము, క్షయ మొదలగునవన్నీ రోగపదార్థము యొక్క బాహ్యారూపములే. ఆరోగ్యసూత్రముల అతిక్రమించనివారికెన్నటికీ యీ పాడురోగాలు రావు

ఈరోగాలు మంచినే చేస్తాయిగాని చెరుపును చేయవన్నపుడు ఈరోగాలువచ్చి యింతమంది యెందుకు చస్తున్నారని మీరడుగవచ్చును ఈరోగాలతో చనిపోవుటకు రెండు మూడు కారణాలు గలవు (1) ధాతుశక్తి తగ్గిపోయి యుండవచ్చు (2) రోగపదార్థముబాగుగా పెరిగిపోయియుండవచ్చు (3) వాడినమందు అపకారము చేయవచ్చు ఈ మూటిబలము యెక్కువైతే రోగనిరోధకశక్తి తగ్గిపోతుంది.

రోగము మంచికే వచ్చిందను అభిప్రాయమును మందు వైద్యమువారునూ ఒప్పుకొన్నందేను ఇందులో విచిత్రమేమీ లేదు రోగ నిర్ణయాన్ని గూర్చి నిన్నా నేడు వెలువడే పుస్తకాలన్నీ యిదే అభిప్రాయమును చెప్పుతున్నాయి మందువైద్య గ్రంథములోని వ్రాతలు ప్రకృతి వైద్యము వ్రాతలకు అనుకూలముగానే యున్నాయిగానీ చేతలలోనికి వచ్చేటప్పటికి వేరుత్రోవను పోతున్నారు

రోగము వచ్చిందంటే దేహానికి ఆ ప్రకారము జరుగుతుంది గాన మందు వాడాలంటారు. మాటలకూ చేతలకూ సంబంధములేదు గాబట్టే, మందువైద్యమంతా వెర్రితలలువేసింది.

రోగము మంచికే వచ్చిందను మూలసూత్రమును ప్రకృతి వైద్యము విస్మరించదు మందువైద్యులన్ననో రోగమువలన అపకారము జరుగుతుందిగాన మందులతో నయము చేయాలంటారు ఈ నయముచేయుటనే అణచివేయుడమంటారు ప్రకృతి వైద్యులు

మానవజాతి ప్రకృతి నియమములను మీరుచున్నంత వఱకును ఈ రోగములు తరచుగా వస్తూనేయుంటాయి అవసరమే కూడాను ఇట్లావచ్చినరోగాలు రోగపదార్థమును బయటకుపోకుండా లోపలనే అణచిపెట్టితే చర్మ వ్యాధులుగా రావచ్చు కాయలు, కంతులు, గ్రంథులు కలుగవచ్చు. అతిసారము పుట్టవచ్చు బయటకువచ్చు రోగపదార్థమును మందుతో అణచిపెట్టుతాయి మన ప్రయత్నమెట్లున్నదంటే దేహాన్ని శుద్ధిచేయుటకు (ప్రకృతి) ఈ మురుగునంతనూ బయటకు పంపుతుంటే యీ మలినములను బయటకుపంపము మేము మురుగును లోపలనే అట్టిపెట్టుకొంటాము దీనినైనా యెట్లాతీవ్రాతితీవ్రమైన విషయములతోను భూమినుండిత్రవ్విన రసగంధకాదులతోను దీనిఫలితమేమంటే అగ్ని దేవునకు వాయుదేవుడు తోడయినట్లగుతుంది ఇవే కాలికరోగాలుగా మారి మృత్యువును వెంటతెచ్చుకొన్నాయంటే మనమేమీ ఆశ్చర్యపడ నక్కరలేదు

## మందువైద్యములో విషాలెందుకుంటాయి ?

రోగోత్పత్తిని గూర్చి మందువైద్యమువారి అభిప్రాయమును, ప్రకృతి వైద్యమువారి త్రోవలన్ను మనము తెలిసి

కొన్నాము ఇకను నివారణనుగూర్చి యుభయ వైద్యముల అభి ప్రాయమును తెలిసికొందాము

ప్రకృతి వైద్యము చికిత్సాద్వైతమునే ప్రసాదిస్తుంది. దేహమునకు హానిచేయని ఉపవాస చికిత్సను, జలచికిత్సా ప్రక్రియలను ప్రయోగిస్తుంది

మందువైద్యమన్ననో అట్లుకాక రోగజీవులను చంప మంటుంది ఈ రోగజీవులను చంపాలంటే విషములను కను గొనవలసివచ్చింది ఎంతత్వరగానయముచేయాలంటేఅంతతీవ్ర మైన విషాన్ని కనుగొనమంటుంది కాలము గడచినకొలది ఈ విషఫలితముగా క్రొత్తరోగములు పుట్టుచున్నాయి ఈ పాతరోగాలను త్వరగా నయముచేయుటకు క్రొత్తవిషాలను కనుగొనుటయేగాక ఈ క్రొత్తరోగాలను అణచిపెట్టుటకు కూడ క్రొత్తవిషాలను కనుగొనక తప్పక వస్తుంది

ఎంతతెలివితేటలున్నను 2 × 2 = 5 = అని మొద టలోనే తప్పువస్తే లెక్క తప్పుతుంది తప్పుసిద్ధాంతములనునమ్మి యీ సిద్ధాంతములమీదనే పెరిగిన యొక శాస్త్రమైనప్పటికిని తప్పుతోవనే పోతుంది

రోగాలను అణచిపెట్టుటకు మందులును, ఈ మందులు ఫలితముగా రోగాలును పందెములు వేసుకొని పెరుగు తున్నాయి రోగము వచ్చినదనగానే మందులుపోస్తారు ఈ మందులు రోగము వచ్చినదను స్పృహనే లేకుండా చేస్తాయి. బుద్ధి మొద్దుబారిపోవుటచే మన కాభావమే తోచదు.

బయటకు రానీయక మందులతో అణచిపెట్టబడినరోగ పదార్థమంతా రక్తములోనే కలిసిపోతుంది మంచుగడ్డనుకట్టి

జ్వరమును తగ్గింపజేయుట, శస్త్రచికిత్సతో రోగములనయము చేయుట మందువైద్యము కోటిలోనివే

మందువైద్యులు ఫలితాన్నే కారణ మంటున్నారు కడుపులో నొప్పి, కళ్ళమంటలూ, కాళ్ళతీపు మొదలగునవన్నీ రోగాలూకావు పనికిమాలిన పదార్థము లోపల పేరుకొని యుండుటచే దానిని బయటకు నెట్టుటకే ప్రకృతి సదాప్రయత్నముచేస్తుంది బలహీనముగానున్న అవయవాల ద్వారా యీ బాధలను తెలియజేస్తుంది పై బాధలకు మూలకారణమైన అన్యపదార్థమును తొలగిస్తే పై భాగములన్ని వాటంతట అవియె సమసిపోతాయి దేహానికి ఏమీ హానిచేయవు. మందువైద్యులు ఈ ఫలితములనే కారణమంటారు

ద్వివిధ ఫలితములు - ఏ చికిత్సాప్రక్రియకైనా రెండు ఫలితములుండును మొదటిది క్రియాఫలితము రెండవది ప్రతిక్రియా ఫలితము

జలప్రక్రియల వలననూ యీ రెండు ఫలితములునూ కలుగును మొదటకలుగు క్రియాఫలితము తాత్కాలికముగా నుండును ఎక్కువకాలము నిలువయుండదు రెండవది ప్రతిక్రియాఫలితము ఇది క్రియాఫలితమునకు వ్యతిరేకముగా నుండును ఎక్కువకాలము నిలుచును, దీనినే ప్రతీకార మందురు.

ఈ క్రియా ప్రతిక్రియ లను సహాయముతో ప్రకృతి శాస్త్రజ్ఞులు రాబోవు ఫలితములను చెప్పగలరు ఈ అభినవ వైద్యశాస్త్రమునకు ద్వివిధఫలితములు గల యీ చికిత్సాప్రక్రియలే ఆధారములు

# జ్వరము

## ౭

జ్వరమూ మంటయూ మామూలుగా వచ్చిపోవు స్నేహితులే కాని వాటిని చూచి గాభరా పడవలసిన భయమేమీ లేదు బయటకు వచ్చే మలిన పదార్థమును ఆపకూడదని మనము తెలిసికొన్నాము మురికి పదార్థము మామూలు మార్గాలద్వారా బయటకు వెళ్ళిపోవుటకు మనము సాయము చెయ్యాలి అట్లాగయితే మురికి అంతా త్వరగా బయటకు వెళ్ళిపోతుంది దేహము శుద్ధి అవుతుంది కంటికి చెవికి కాలికి ముక్కుకు వేరే రోగములు లేవనియు, అన్నిటికి ఒకటే కారణమనియు, అన్నిరోగములు ఒకే చికిత్స మార్గముతో నయమవుతవనియు, ఆరోగ్యసూత్రముల యథావిధిగా ఆచరిస్తే అన్ని రోగాలూ అంతరించుననియు ప్రకృతివైద్యము చెప్తుతుంది

రోగ పదార్థము పేరుకుంటేనేగాని రోగము రాదు అన్ని తరుణ రోగాలూ మురికిని వెళ్ళగొట్టే, దేహాన్ని శుద్ధి చేయుటకే వస్తాయి పరిస్థితులన్నీ ఒకటిగా ఉంటే యీ రోగాల పుట్టుకకూడా ఒకటిగానే ఉంటుంది తరుణరోగాలు దేహమున కేమీ కీడుచేయవు పాశ్చాత్యులు చెప్పినట్లుగాక సూక్ష్మజీవులవలన దేహమునకు హానికలుగదు సూక్ష్మజీవుల వలన దేహానికి ఉపకారమే కలుగుతుంది ఆరోగ్యదాయకమైన ఆహారమును తింటే యీ సూక్ష్మజీవులు రోగాన్ని వృద్ధి చేస్తవి మనజీవనపద్ధతులమీదనే రోగారోగ్యములు రెండునూ

ఆధారపడును సూక్ష్మజీవ శాస్త్రమిచ్చే నేయ లేవు ప్రతిరోగము యొక్క పుట్టు పూర్వోత్తరముల తెలిసికొన్ని అన్నిరోగముల పుట్టుక ఒకటే రకముగా ఉండునదీ, లేనిదీ, తెలిసికొందాము ఇప్పటివరకూ వెలువడిన రోగ నిర్ణయ గ్రంథములు, జీవ శాస్త్రగ్రంథములు, రోగాన్ని గూర్చి యేమిచెప్పానో తెలిసి కొందాము

## రోగము యొక్క పుట్టుపూర్వోత్తరాలు

మందు వైద్యము వారి అభిప్రాయము

మామూలుగా తిని తిరిగే మనిషికి రోగము వచ్చిందీ అంటే దేహములో ఏదో అభ్యంతరము ఏర్పడిందీ అన్న మాట ఈ అభ్యంతరము రెండురకములుగా రావచ్చును ఒకటి దేహములో పుట్టినదైనా కావచ్చు లేదా బయట నుండయినా రావచ్చును దేహములో పుట్టినదంటే దేహములో అనుక్షణము తయారగు మలినాలు బయటకు పోక లోపలనే నిలిచిపోవచ్చు కుటికలు చచ్చిపోయినా జ్వరము వస్తుంది విరిగిపోయిన యెముకలు దేహములో మిగిలిపోయినా నొప్పులు, మంటలు, పుట్టుతాయి ఇంకా యే కారణాలవల్లనైనా జ్వరమురావచ్చు బయటనుండివచ్చుటంటే విషములు మ్రింగితే జ్వరములు కలుగుతాయి, మనము పీల్చే గాలిలోనుండే దుమ్మువల్ల ననూరోగాలు రావచ్చు పొరపాటున మ్రింగిన రాయి, రప్ప, యినుపముక్కల వల్లనన్నా రోగాలు వస్తాయి రోగపదార్థము ఉన్నపుడు రోగాలుఉన్న ప్రదేశములకు పోయినా రోగాలురావచ్చు

సాధ్యమైనంతవఱకు ప్రకృతి యీ మంటలను, జ్వర ములనుండి వచ్చే ఆపదలను కాపాడుతుంది ఎప్పుడైతే తన శక్తికి మించిపోతుందో, అప్పుడు ఏమీచేయలేక, ఊరుకుంటుంది బయటి ఆఘాతముల వలనగానీ, లోపలి యిబ్బందుల వలనగానీ, రోగపదార్థము పేరుకొనినపుడు రక్తము బాగుగా వ్యాపించదు ఇరుకుసందులనుండి పోవలసివచ్చుటచేత రక్తపు వేగము ఎక్కువై రక్తపుపోటు అధికమగును రక్తవాహికలు ఉబుకును శుద్ధరక్తము ప్రవహించే ధమనులు, మురికి రక్తము ప్రవహించే సిరలు ఒకదాని ప్రక్కనే మరొకటి ఉండును అందువలన, ఒకదానిలో రోగపదార్థము పేరుకొంటే, రెండవదానిలో, ఒత్తిడి కలుగుతుంది ఇవికూడా ఉబుకుతవి ఇవిఉబుకుటచే ప్రక్కన ఉన్న ఆవరణ గోడలు సన్నపడును సన్నపడి పల్చనగుటచే యీ తెల్లకణములు ప్రక్కవాటిలోనికి పోతాయి

శంఖధ్వని వినగానే యుద్ధవీరులు యెట్లు సమావేశమగుదురో అట్లనే ఈ తెల్లకణములును దెబ్బతగిలినచోటికి పరుగెత్తుతాయి రాసాయనికానురాగమువలన, ఇవిదెబ్బతగిలిన చోటికి చేరుతాయి దీనినే (చెమోటాక్సిస్) అంటారు ఈ తెల్లకణములు దేహమునకు హానికలిగించు సూక్ష్మజీవులను మింగి దేహమునకు విపరీతమైన మేలునుచేస్తాయి వీరపురుషోచితమైన లక్షణములన్ని ఈ తెల్లకణములకు ఉండుటచేత బయటనుండివచ్చు సూక్ష్మజీవులను నాశనముచేయును. బయటనుండివచ్చు సూక్ష్మజీవులతో జరుగు పోట్లాటలో ఈ తెల్లకణములుకూడ చచ్చిపోవును ఈ యుద్ధభూమినుండి బయ

టకు వచ్చునదే చీము వాపు, మంటలు, జ్వరము, నరముల యందుండు బలహీనత, మొదలగునవన్నీ యిట్లా వచ్చినవేను దేహములో ఏ ఒక భాగమునకు ఇబ్బంది జరిగినా మిగిలిన భాగములకుకూడా యిది వ్యాపించును దీనివలన మిగిలినవికూడా కొద్దిగనో, గొప్పగనో, జబ్బుపడును బయటనుండి రోగజీవులువచ్చి, రోగమును కలిగించకుండా దేహములోని ధాతుశక్తి కాపాడుతుంది రోగజీవులను సంహరించుటకు అప్పటికప్పుడే దేహములో ప్రతిజీవులు పుట్టును తెల్లకణములు, నరములలో ఉండే కణములు, ప్రతిజీవులను తయారుజేసి రోగము రాకుండా ఆపుదలచేయును

కీడులో మేలు

పంచదార నీళ్ళలో కాస్త కల్లుమడ్డివేసి మురగనిచ్చిన యెడల ఆ పంచదారనీళ్లు అంగారక్షారముగను, సారాయిగను మారిపోవును మురిగినకొద్దీ సారాయిఘాటు ఎక్కువగును. కల్లు మడ్డి కణములు అట్లనే నిలువ యుండును

సారాయి, కల్లుమడ్డిని పెరగనీయదు కల్లుమడ్డినుండి పుట్టిన సారాయి, కల్లుమడ్డి పెరుగుదలను, ఎట్లా ఆపుచేసినదో, అట్లనే రోగపదార్థమునుండి పుట్టిన సూక్ష్మజీవులు, రోగపదార్థమును పెరుగనీయవు పరాన్నభుక్కులవని కూడా యింతే పరాన్న భుక్కులనుండి పుట్టే మురికియే వాటినిపెరగనీయదు ఈ సామ్యము ననుసరించియే, టీకారసమును, సర్పి రాకుండా చేసే మందులను తయారుచేశారు

రోగమువస్తే ప్రకృతి యేమి చేస్తుందో మందులు కూడా అదేపనిచేస్తాయని మందువైద్యమువారు అంటున్నారు గాని రెంటిలోనూ భేదమున్నది ఎట్లాగంటే రోగము మలిన పదార్థము పేరుకొనుటచేతనే వచ్చుచున్నదని మనమిదివరకే చదువుకొన్నాము రోగముపూర్తిగాబయటకు వచ్చువరకును, దానిఉద్ధృతాన్ని ప్రకృతి వైద్యము అణచివేయదు, పూర్తిగా బయటకు వచ్చుటకే సాయము చేస్తుంది రోగము పూర్తిగా బయటకువచ్చి నయమగువరకును అందు దశలు గలవు ఇంగ్లీ మందు వైద్యాలు వాడు మందులన్నియు రోగమును బయటకు రాకుండా అణచిపెట్టుటకే సాయపడును. ఈ అణచిపెట్టుట రోగము పూర్తిగా బయటకు రాకమునుపైనా కావచ్చును, పూర్తిగా బయటకు వచ్చిన తరువాతనైనా కావచ్చును, రెండు పద్ధతులును నష్టమే

లోపల చేరిన మందు బయటకు రాక పీరము పెట్టుకొని లోపలనే కూర్చుని ప్రధానావయవముల, నరముల, కుటీరల, పాడుచేసి చిత్రాతి చిత్రమైన రోగముల కలిగించిన దంటే ఆశ్చర్యమేమున్నది ప్రకృతివైద్యము సులభముగా, వ్యయప్రయాసలులేని, ప్రక్రియలతో, రోగముల నయము చేస్తుంటే, మతిలేని మానవులు, ఈ మందులు వాడుతున్నారంటే, బాధపడు వారినిచూచి పాపమనికూడా అనుటకు వీలు లేదు రోగపదార్థమునుండే అన్నిరోగాలు పుట్టి రోగపదార్థములను బయటకుపంపి దేహానికి మేలు చేస్తాయి గాని కీడునేమీ చేయవు రోగమువచ్చిందంటే ఆదుర్దాపడ నవసరములేదు

అన్ని రోగాల వృద్ధిక్షయములు ఒకటిగానే యుండును ఎట్లా ఒకటిగా యుండేదీ తెలిసి కొందాము అన్ని రోగాల పుట్టుపూర్వోత్తరముల పరిశీలిస్తే యీ క్రిందివిషయములు తెలిసినవి ప్రతి రోగమునకు ఈ అయిదు దశలు గలవు ఈ అయిదు దశలు ఏవంటే (1) ఉత్పత్తి (2) చయము (3) ప్రకోపము (4) ఉపశయము (5) శాంతి




(1) ఉత్పత్తి - ఈదశను ఇంగ్లీషులో Incubation ఇన్ క్యు బేషన్ అంటారు తెలుగులో దీనిని పొదుగుట అనవచ్చును ఆయుర్వేదములో ఈదశకు ఉత్పత్తియని నామకరణము చేసి నారు మనముకూడా ఆశబ్దమునే వాడుదాము అయిదు దశల లోను, ఈ దశ మొదటిది. మలినపదార్థము పేరుకొనుట మొదలు పెట్టినప్పటినుండి బయలుపడువఱకును అగుకాలము నుత్పత్తియందుము తరుణరోగాలలో ఈ వ్యవధి ఒకటి రెండు వారములే ఉంటుంది కాలికరోగాలలో రోగము బయటపడుటకు మాత్రము నెలలు సంవత్సరములు పట్టుతుంది ఈరోజులలో మలినపదార్థము క్రమేపీ వృద్ధిపొందును రోగ పదార్థము వృద్ధిఅగుటచే అభ్యంతరములుగలుగును అందు

వలన ప్రధానఅవయవములు వాటిపనిని చేయవు. అనారోగ్యముగా నుందుము ఎప్పుడో ఆపద రానున్నదని ప్రకృతి హెచ్చరించును ఇదేబాధ

మందు వైద్యులు సూక్ష్మజీవులు లోపల చేరుటతో రోగమునకు మొదలనెదరు కానీ ప్రకృతి వైద్యమువారు ఇంకొక అడుగు వెనుకకువేసిధాతుశక్తి తగ్గుట ప్రారంభించినపుడే మలినపదార్థము చేరుట మొదలు పెట్టినదనియు, రోగము ప్రారంభించినదనియు చెబుతారు

చయము —— రెండవ దశ చయము దీనిని వృద్ధి పొందుట యనవచ్చును. ఆయుర్వేదవైద్యులు ఈ దశను చయ మందురు ఆశబ్దమునే మేమునూ వాడినాము ఆంగ్ల వైద్యమున ఈ దశను ఎగ్రవేషన్ అందురు తెల్లకణములు ప్రతిజీవులు రెండునూ కలిసి రోగజీవులతోను మందులతోను పోట్లాడును వారి వారి బలాబలములకొద్దీ యుద్ధము చేయును ఇప్పుడే జ్వరము మంటలు వృద్ధియగును మలిన పదార్థమెంత యెక్కువగా నుంటే జ్వరము అంత తీవ్రముగా ఉంటుంది.

ప్రకోపము - ఇది మూడవదశ ఈదశలో సంహారము జరుగును ఆయుర్వేదవైద్యులు ఈదశకు ప్రకోపమనినామకరణము చేసిరి మేముకూడా ఆశబ్దమునే వాడుతాము ఆంగ్ల మందు వైద్యులు ఈదశకు డిస్ట్రక్షన్ అని నామకరణము చేసిరి అంతర్వ్రణములు, బహిర్వ్రణములు, కాయలు, కంతులు, గ్రంథులు, భగందరములు కలుగుటవలన నరములలో బలహీనత కలుగును. తెల్లకణములకు సూక్ష్మజీవులకు జరుగు

యుద్ధములో ఉభయతా (రెండు పార్టీలవారికి) నష్టము రావచ్చు సూక్ష్మజీవుల బలము మరీ పెరిగిపోతే మొదటికే మోసమువస్తుంది మలిన పదార్థమంతా బయటకు వెళ్ళిపోతే దేహమునకు ఉపయోగము గలుగుతుంది

4 ఉపశయము - ఇది నాల్గవదశ, వెనుకటి ఉద్ధృతము ఈ దశలో తగ్గిపోవును ఈదశను ఆయుర్వేద వైద్యులు ఉపశయము అని అనినారు మేముకూడా ఆశబ్దమునే వాడు తాము అలోపతీ వైద్యులు ఈ దశను ఎబేటిమెంటు Abatiment అనినారు రోగాన్ని తట్టుకునే సామర్థ్యము దేహమునకు ఎక్కువగా నుండి శీతలోపచారములు ధాతుశక్తికి సాయముచేస్తే (యెట్లాగంటే) (1) ధాతుశక్తిని వృద్ధిచేసి (2)రసయుక్త భాగముల సరిగానుంచి(3)బహిష్కరణ క్రియకు తోడ్పడితే) మలినపదార్థము తగ్గిపోవును మంటలుజ్వరముతగ్గిపోవును రోగపదార్థము బయటకు వెడలిపోవుటచే నరములు బలవంతములగును

5. శాంతి —ఇది అయిదవదశ ఆయుర్వేద వైద్యులు ఈ దశకు శాంతియని నామకరణము చేసినారు మేము కూడా ఆశబ్దమునే వాడినాము అలోపతీ వైద్యులు ఈ దశకు రికన్‌స్ట్రక్షన్ (Reconstuction) అని నామకరణము చేసినారు నాలుగవ దశలో రోగమంతా బయటకు వెళ్లిపోవుటచే రోగము నయమగును దెబ్బ తగిలిన కుటికలను, అవయములన, నరములన్న,జాగ్రత్తగాబాగుచేయును. అన్నిటి లోనికి ఈ దశయే కష్టమైనది తరువాత జీవితమంతా యా

దశమీదనే ఆధారపడును పునర్నిర్మాణము చేయుటలో ప్రకృతికి సాయము చేసినట్లయితే నిర్మాణము బాగుగా జరుగును లేకపోతే కుంటుపడును

ఇంతవఱకు రోగముయొక్క పుట్టుకనుగూర్చి మందు వైద్యము వారి అభిప్రాయమును తెలిసికొన్నాము ఇంకను ప్రకృతివైద్యమువారి అభిప్రాయమును తెలిసికొందాము.

## ప్రకృతి వైద్యము వారి అభిప్రాయము

రోగముయొక్క పుట్టుకను గూర్చి మందు వైద్యులు చెప్పు కట్టు కథలన్నియు వినుటకు ఇంపుగానే యుండును రాజసేనలు పరరాజ్యముపై దండెత్తివచ్చినప్పుడు చాల గలభా జరుగును అట్లనే బయటనుండివచ్చు సూక్ష్మజీవులను నాశనము చేయుటకు లోపలి తెల్లకణములు వాటి సైన్యమును తయారు చేసుకొనును ఈ కట్టుకథలన్నియు బృహత్కథల మాదిరి విచిత్రముగానే యుంటవి

రోగముయొక్క పుట్టు పూర్వోత్తరములగూర్చి యీ కట్టుకథలు మొదలుగాచెప్పినవాడు మెచ్నికాఫ్, తరువాత వచ్చినవారు దానికి వన్నెలు దిద్దినారు

ప్రకృతి వైద్యము చెప్పుతుందిగదా సూక్ష్మజీవులు పరాన్నభుక్కులు, మలినపదార్థములను రూపుమాపి దేహమునకు మేలుచేయును. మందువైద్యమువా రంటారుగదా రోగజీవులు బయటనుండి దేహములో ప్రవేశించును స్వతస్సిద్ధముగా దేహములో నుండు తెల్లకణములు, రోగజీవులను

నాశనము చేయుటకు దేహములో, తయారగు ప్రతిజీవులు కలసి రోగజీవులను నాశనముచేయును

రోగముయొక్క పుట్టుకనుగూర్చి మందు వైద్యము వారిఅభిప్రాయమున్నూ, ప్రకృతివైద్యమువారిఅభిప్రాయమునూ ఎన్నటికినీ కలియవు రెండునూ ఉత్తర, దక్షిణ ధృవములే లాస్ యాంగిల్సుకు చెందినడా థామస్ పవెల్సు మరొక సిద్ధాంతమును చెప్పెను ఈ యభిప్రాయము ప్రకృతి వైద్యము వారి సిద్ధాంతమునకు అనుకూలముగా నుండును ప్రకృతి వైద్యము చెప్పినట్లే పవెల్సు సిద్ధాంతమునూ, సూక్ష్మజీవులు దేహమునకు మేలుచేస్తాయని చెబుతుంది, తెల్లకణములు, సూక్ష్మజీవులు రెంటిలో దేహమునకు ఏవి మేలుచేయునో యని మేమున్నూ పరిశోధించినాము గత మూడు సంవత్సరములనుండి మా చికిత్సాలయములో చేసిన పరిశోధనలవలన డా॥ పవెల్సుచెప్పిన సిద్ధాంతమే నిజమనియు రెండవది అసమంజసమనియు తెలిసికొన్నాము

ఈ క్రొత్త సిద్ధాంతమును గూర్చి చెప్పుచూ డా॥ థామస్ పవెల్సు ఎమన్నాడంటే "రోగపదార్థము లేనిదే" రోగము రాదు "ఇంతవఱకు దీని పుట్టుకను గూర్చిగాని, స్వభావమును గూర్చిగాని, ప్రభావమును గూర్చిగాని యే ఒకరైనను చెప్ప లేదు రోగపదార్థముయొక్క పుట్టుపూర్వోత్తరముల గూర్చి యింతవఱకు ఎవరు ఏమీ చెప్పలేదనుటలో డా॥ పవెల్సు తొందర పడ్డాడని చెప్పాలి ధాతుశక్తి తగ్గిపోవుటచేతను రసరక్తధాతువులు సహజస్థితిలో నుండక పోవుటచేతను పనికిమాలిన పదార్థము లోపల పేరు

కొనుట చేతను రోగము వచ్చుచున్నదని డాక్టరుగారు చెప్పుతున్నారు ప్రకృతివైద్య తత్వముకూడా యిదే డాక్టరుగారు తనగ్రంథము 1909 సం॥ లో ప్రచురించారు ప్రకృతి పత్రికలు ఈ అభిప్రాయమునే 1907 సం॥లో చెప్పినాయి తరువా తవెలువడిన యీ పుస్తకముయొక్క మొదటి ముద్రణలో గూడ ఈ అభిప్రాయముగలదు డాక్టరుగారి గ్రంథములోని భావములు ప్రకృతి పత్రికలోని భావములు అన్నిఒకటే పోలికలు. రోగాన్ని గూర్చి డాక్టరుగారు చెప్పిన అభిప్రాయములో ఒక విశేషము మాత్రమున్నది తెల్లకణముల పుట్టుపూర్వోత్తరముల గూర్చి బాగా తెలియజెప్పాడు రోగపదార్థము పేరుకొంటేనేగాని రోగముర్రాదు ఈరోగపదార్థము ఎట్లాపేరుకుంటుందంటే మనము నిత్యమూ తిను ఆహారములో అరగక కొంతమిగిలి పోవచ్చును సరిగా పచనము కాకపోవచ్చు. కణములలోని లోపముల వలన నిలబడిపోవచ్చు జీర్ణశక్తితగ్గుట వలనగాని నరములలోని బలహీనత వలనగాని యీపని జరుగవచ్చు ఇవేగాక ఇంకాయితర కారణములుగూడా ఉండవచ్చు. డాక్టరుగారు చెప్పిన రోగపదార్థమునే నేను అరగక మిగిలి పోయిన ఆమ్లపదార్థములు, క్షారపదార్థములు మురుగు పదార్థములు అని చెప్పినాను ఇన్నిమాటలు లేకుండా డాక్టరుగారురోగాన్ని కలుగజేసే "మురుగుపదార్థమని"కుదించి చెప్పినారు ఇంతటినుండీనేనుకూడా అదేమాటను వాడుతాను. మూత్రికామ్లములో రోగపదార్థము కలియుటచే గట్టిపడి జారక, అంటుకొనిపోయి సన్నని కేశనాళికల ద్వారా చివరల కంటా వ్యాపించదు మధ్యనే కుదుపలు, కుదుపలుగా చిక్కు

కొనును ఈ కుదుపలవలన కలుగు ఫలితములు అప్పటి ప్రకృతి పత్రికలు, ఈ పుస్తకముయొక్క మొదటి ముద్రణము బాగా చెప్పినవి

డాక్టరు వవెల్సు రోగపదార్థమును గూర్చి చెప్పినదియు, రోగముయొక్క వృద్ధిక్షయములలో మనము చెప్పిన ప్రథమ దశయు ఒక్కటే మనము పనికిమాలినచెత్త, చెదారము, అన్నచోట, వవెల్సుగారి 'రోగపదార్థము' అన్నమాటను చేరిస్తే చాలు రోగముయొక్క వృద్ధిక్షయములలో రెండవ దశయగు 'చయమును' వవెల్సుగారి అభిప్రాయముతో సమన్వయము చేయవచ్చును రక్తములో మలిన పదార్థములు చేరుటచేత రక్తము గట్టిపడి సన్నని కేశనాళికలద్వారా తుదలకంటా వ్యాపించదు అందువలన అంతర్గతముగ వేడిగాను, వెలుపల చలిగాను ఉంటుంది చివరలదాకా వ్యాపించక దెబ్బతగిలినచోటనే నిలబడి గడ్డకట్టుతుంది దెబ్బ తగిలిన భాగమునకును, మిగిలిన దేహమునకును సంబంధము లేకుండాపోతుంది

మలినపదార్థములు చేరుటచేత, రక్తము చిక్కపడి ప్రక్కగోడలను పట్టుకొని వదలదు ధాతుశక్తి తగ్గుటచేతను రోగపదార్థము పేరుకొనవచ్చు రోగనిరోధకశక్తి తగ్గుటచేతను ఇది పేరుకుంటుంది ఉద్రేకములవలననైనా, బయటి ఆఘాతముల వలన నైనా యిది పేరుకొనవచ్చు

రక్తము చివరలవరకు ప్రవహించకుండా కేశనాళికలలో అవరోధము లేర్పడుటవలన రక్తము పేరుకొని ఉబుకుతుంది ఉబికి లావగుటవలన ప్రక్క ఆవరణగోడలను

దూరముగా నెట్టుతుంది ఆవరణగోడలు నెట్టబడుటవలన సన్నపడును ఆవరణ గోడలు సన్నపడుటవలన వాటిగుండా తెల్లకణములు బయటకు పోవును డాక్టరు పవెల్సు తెల్లకణములు రోగపదార్థమని చెప్పుచున్నారు రక్తముతోబాటు ఈ రోగపదార్థము కూడా సన్నని కేశనాళికలద్వారా పోవుటచే కదనొక్కబడి కణముల మాదిరిగనే ఉండును హృదయమునకు దెబ్బతగలకుండా రక్తములోని మలినములను సాధ్యమైనంతవఱకు ప్లీహము మ్రింగును కాన దాదాపుఅన్నిహృదయములలోను అన్ని జబ్బులలోను ప్లీహము ఉబికియే ఉంటుంది. శోషరసగ్రంధులు కూడా ఉబికియే యుంటవి ఈగ్రంధులలో లోపమున్నదని మన సర్జనుగారు వాటిని కత్తిరవేస్తారు వీటి వాపుకు మూలకారణమైన రోగపదార్థమును తొలగించాలి కాని కత్తెర వేయటానికి ఇవేమితప్పు చేసినాయి?

శోషరసగ్రంధులు ప్లీహము రక్తములోని మలినములను హృదయమునకన్న ముందుగనే మ్రింగును ఇవి ముందుగా మ్రింగుటవలన హృదయమునకు దెబ్బతగులదు విరామము లేకుండా తినుటచే రక్తములోని మలినములు మరీ యెక్కువగును శోషరసగ్రంధులు, ప్లీహము, రక్తములోని మలినములను మ్రింగలేవు జ్వరము వచ్చినప్పటికే శోషరసగ్రంధులు ప్లీహము, ఉబికి ఉంటవి సోదాహరణముగా చెప్పవలెనంటే తలలోనికి పోవు రక్తమును కంఠములోనుండు టాన్సిల్సు అదుపులో నుంచును రక్తములోని మలినములను ఈ టాన్సిల్సు మ్రింగివేయును ఇట్లా మ్రింగుటవలననే యివి వాచును. వాచినవాటిని తీసివేస్తే లాభమేమున్నది? రోగపదా

ర్థము మరొక త్రోవను బయటకువస్తుంది. ఈ తడవ గవద
కాయలను బాధించవచ్చును వీటని కూడా తొలగిస్తే కంఠ
ములో చేరుతుంది దానికి ఆపరేషను చేస్తే ముక్కులో
కొయ్యగండల పెట్టుతుంది పనిముట్లు ఖాళీగా ఉన్నాయని
ఆపరేషను చేస్తే ఊపిరితిత్తులలో చేరుతుంది. ఈ పనంతా
ఎట్లా ఉన్నదంటే ఎలుక చేరినదని కొంపను తగులపెట్టుతామా?
ఎలుకను పారద్రోలుతామా? తుక్కు చేరినదని కాలువను
పూడుస్తామా? తుక్కును తీసివేస్తామా? పెరిగినవను నెపముతో
అవయవముల తీసివేయుట సర్జనులవంతు మూల కారణము-
లను తొలగించుట ప్రకృతివంతు రెంటికీ యిదే తేడా

కథనువదలి చాలాదూరము వచ్చాము మళ్ళీ కథకు
పోదాము తెల్లకణములు ప్రక్క యిండ్లలోనికి చొరబడు
వరకూ యిందాక చెప్పుకున్నాము దేహానికిమేలుచేసే సూక్ష్మ
జీవులు ఈబయటకువచ్చిన తెల్లకణములను మ్రింగివేస్తాయి.
పాతకథలో ఈ తెల్లకణములే సూక్ష్మజీవులను మ్రింగివేస్తాయని
చదివినాము కాని కథమాత్రము అడ్డముతిరిగినది ఏమయితే హాని
చేస్తాయనిమందు వైద్యులుచెప్పారో అవేమేలుచేస్తాయని యీ
క్రొత్త శాస్త్రము చెప్పుతోంది సూక్ష్మజీవులలో ఉండే క్రిమిచలన
మువలనరోగపదార్థముంతా విడిపోయిచీముగాబయటకువస్తుంది.
ఇంతవఱకు చదువుకొన్నదేమంటే క్రొత్తకథ పాతకథను తల
క్రిందుచేసింది ఎట్లాగంటే? దేహానికి మేలుచేస్తాయన్న తెల్ల
కణములు నిజముచెప్పితే కీడుచేస్తాయి రోగజీవులను తరిమి
నాశనముచేస్తాయన్న తెల్లకణములు సూక్ష్మజీవి పెరుగుటకే

తోడుపడుతాయి ఇంతేగాక అన్నిరోగాలు దీనివల్లనే వృద్ధి పొందుతాయి

ఈ కథంతా విన్న తరువాత ఒక-సందేహము కలుగుతుంది ఆ సందేహమేమిటంటే తెల్లకణములు రోగపదార్ధమయితే వాటికి రూపము చలనము ఎట్లాయుంటుంది? ఈ ప్రశ్న సమంజసముగానేయున్నది ఇది యుక్తివాదనగాని యిందులో సత్యమేమీ లేదు రక్తముతో బాటు రోగపదార్థము కూడా ప్రవహిస్తుందని లోగడనే చదివినాము రక్తము హృదయములోనికి పోవుటకు ముందుగా ప్లీహముగుండా పోతుందని, ప్లీహము రక్తములోని మలినములను మ్రింగుతుందనీ చదువుకొన్నాము రక్తముతోపాటు రోగపదార్థము కూడా ప్లీహముద్వారా ప్రవహించుటచే ఈ రోగపదార్థమునకు, రూపమూ, చలనమూ గలుగుతుంది,

మరొకప్రశ్నకూడా తోచవచ్చు ఏమిటంటే అసలు ప్లీహము శోషరసగ్రంథులు రెండూ రోగపదార్థమును తెల్లకణాలుగా ఎట్లా మారుస్తాయి? ఈ ప్రశ్నకు సమాధానము చెప్పాలంటే జీర్ణక్రియ దగ్గరకు వెళ్ళాలి మనముతిను ఆహారమంతా ముందుగా రసమగును తరువాత రక్తమగును రక్తము కేశనాళికలద్వారా వ్యాపించును అట్లుప్రవహించి దేహములోని సూక్ష్మాతిసూక్ష్మ కణములకు పోషకశక్తినిచ్చును. సమరసన్యాయమువలన రక్తములోని పోషకశక్తి కణములలోనికిని, కణములలోని మలినములు రక్తములోనికి వచ్చును ఈ క్రింది ఉదాహరణవలన సమరస న్యాయమన నేమో బాగుగా తెలియగలదు

ఒక తొట్టిలో మంచినీటినిపోయుము సూక్ష్మరంధ్ర
ములుగల రబ్బరు తిత్తిలో మంచినీటిని పోయుము
ఈ తిత్తిని ఆ తొట్టిలో ఉంచుము తొట్టిలోని నీటిలో కొద్దిగా
ఉప్పునువేయుము కొద్దిసేపటికి రబ్బరుతిత్తిలోని నీరుకూడా
ఉప్పుపడును తొట్టిలోని ఉప్పు నీరు రబ్బరుతిత్తికిగల సూక్ష్మ
గ్రంథముల ద్వారా తిత్తిలోనికి చేరినది తొట్టిలోని యుప్పు
నీటివలన రబ్బరుతిత్తిలోని నీరు ఉప్పవడు న్యాయమును సమరస
న్యాయమందుము ఈ న్యాయమునే (రూల్ ఆఫ్ ఆస్మోసిస్)
(Rule of osmosis) అందురు ఇట్లనే కణములలోని మలినములు
సిరలలోనికిని, రక్తములోని పోషకశక్తి కణములలోనికిని
ఇంకను కణములనుండి బయటకువచ్చిన అంగారామ్లము,
ఇతర మాలిన్యములు సిరలలోనికివచ్చి బహిష్కార్యావయవ
ములద్వారా బయటకు గెంటివేయబడును మలముగాను
రావచ్చు మూత్రముగాను రావచ్చు చెమటగాను రావచ్చు
శ్వాసావయవముల ద్వారాను రావచ్చు

రక్తములో మలినములుంటుంటే రక్తము చిక్కగా
ఉంటుంది మలినములు లేకపోతే పలచగాఉంటుంది రక్తము
శుభ్రపడిన కొలదినీ, రక్తమునుండి కణములకును, కణముల
నుండి రక్తమునకును రాకపోకలు త్వరగా జరుగును
మలినములు చేరుటచే జిగటబారిన రక్తమునుండి రాక
పోకలు ఆలస్యముగా జరుగును రక్తములోని పోషకశక్తి కణ
ములలోనికిరాదు కణములలోని మలినములు రక్తములోనికి
రావు ఎచ్చటివచ్చటనే నిలబడిపోవును కణములలోని మలిన
ములు బయటకుపోవుట చేతను, బయటనుండి రావలసిన

రక్తముద్వారావచ్చు ప్రాణవాయువు అందక పోవుటచేతను కణములు చచ్చుపడిపోవును ఇట్లు చచ్చుపడిపోయిన కణములవలన దేహమునకు అపకారము జరుగకుండా ప్రకృతి సదాప్రయత్నము చేస్తుంది రక్తములో ప్లీహముద్వారా ప్రవహించునపుడు రక్తములోని మలినములను చిన్న చిన్న కుదుపలు (తెల్లకణములు) గా కదనొక్కుతుంది మరొకటికూడా కావచ్చు పలచగాఉండి రక్తమంతటా వ్యాపించిన మురుగు కన్న కుదుపలుగానున్న రోగపదార్థములోనే (మైక్రోజిమా) దబ్బునపుట్టవచ్చు బీఛాంపు అభిప్రాయము ప్రకారము ఈ తెల్లకణములే సూక్ష్మజీవులుగా విడబడుతాయి తెల్లకణములు రోగజీవుల వెతకిపట్టుకొని నాశనముచేస్తా యన్న మాట శుద్ధ అబద్ధము మరొక చిన్న విషయమును తెలిసికొందాము పాతకథలో తెల్లకణములు దేహానికి మేలు చేస్తాయని చదివినాము బయటనుండి వచ్చిన రోగజీవుల వెదకి వేటాడి నాశనము చేస్తాయని కూడా చదివినాము ఈ మాటలే నిజమయితే రోగము ముదిరినకొలది ఈ తెల్లకణములు కూడా ఎక్కువ కావాలన్న మాట. అట్లయితే రోగము ముదిరితే చావెందుకు వస్తుంది? ప్రతిమనిషి తెల్లకణముల సంఖ్య పెరిగిపోయి దేహానికి మేలే జరగాలని కోరుకుంటారు గదా! కానీ చస్తున్నారే! అసలుసంగతి యిది కాదన్నమాట లోపల జరిగే గ్రంథమును మనము సరిగా గ్రహించలేదు

క్రొత్తకథనుబట్టి పోతే మనకేమైనా మార్గముదొరుకుతుందేమో విచారింతాము దేహములో రెండురకములగు, సూక్ష్మజీవు లున్నాయి శాకసంబంధమైనవి, జంతుసంబంధ

మైనవి, ఇవి కొద్దిగానో, గొప్పగానో, మన అందరి దేహముల లోను నిలవేయుంటాయి యుక్తమైనఆహారమును తినినయెడల సూక్ష్మ జీవులు దేహానికి పోషకశక్తి నిచ్చును అట్లుగాక ఊరుగాయలను ఎక్కువగా తినినయెడల ఆమ్లములు తయారై దేహములో దేహపదార్థ పేరుకొనును ఈ సూక్ష్మజీవులు సాధ్యమయినంతవఱకు ఆమురుగును బయటకు వెడలగొట్టును మనము తిను ఆహారము మంచిదైతే ఆ ఆహారమునే తిని సూక్ష్మజీవులు దేహానికి మేలుచేస్తాయి ఆహారముచెడుదైతే ఆ ఆహారమునే తినిన సూక్ష్మజీవులు దేహానికి కీడునే చేస్తాయి మనముతిను ఆహారములోని అంగారము రక్తములోకలిసి, హృదయములోనికిపోయి గలభా చేయకుండా సాధ్యమయి నంత వఱకు మ్రింగివేయునని లోగడనే చదివినాము ఇట్లా మ్రింగుటయే గాక రక్తములోని మలినములను కుదువలు కుదువలుగా ప్లీహము కదనొక్కుతుంది తాను మ్రింగలేని మురుగు వచ్చునప్పుడు ఊరుకొంటుంది ఊరు కొనుటచే మురుగు అంతా రక్తములోనేకలిసి తిరుగుతూ యుంటుంది తనకుసాధ్యమయినంతవఱకుమురుగునుమ్రింగుటచే ప్రతిరోగములోను ప్లీహము, శోషరస వాహికలు ఉబికియే యుంటాయి క్షయ చలి జ్వరములు ముదిరి పోతే, ప్లీహము శోషరస గ్రంథులు ఉబికి వాచిపోవును రక్తమంతా రోగపదార్థముతోనిండి మురుగు బయటకు పోకపోవుటచేతనే చస్తున్నారు తెల్లకణములు దేహానికి మేలుచేయకపోగా కీడు చేయగలవని చెప్పుటకు పై యుదాహరణ మొక్కటియే చాలును ఈ కథంతా విన్నతరువాత మరొక సందేహము

తోస్తుంది ఈ తెల్ల కణములకు ప్రాణమే లేకపోతే వాటికి రూపము చలనము ఎట్లాఉన్నది?

డాక్టరు పవెల్సు అభిప్రాయము చెప్పితే ఈసందేహాము నివృత్తి అవుతుంది అందువలన వారి అభిప్రాయమునే యీ క్రిందపొందుపరుస్తున్నాను ఈ రోగపదార్థము సన్నని కేశ నాళికలద్వారా పోవుటచే వాటికి రూపము ఏర్పడింది పదార్థమంతయు సజీవమైనదగుట వలన వాటిలోను ప్రాణముండుటచేచలనము గలిగింది

ఇంతవఱకు చదివినదానినిబట్టి యేమి తెలిసికొన్నామంటే తెల్ల కణముల మురుగేకాని మరేమీకాదు ఈ మురుగులోని (మైక్రోజిమా) నుండే బాక్టీరియా "సూక్ష్మజీవి" పుట్టి వృద్ధి పొందుతుంది "మైక్రోజిమా" బాక్టీరియాగా యెట్లా తయారు యేదీ రాబోయే అధ్యాయములో తెలిసికొందాము

రోగపదార్థము మురిగి బురబురా పొంగి అట్లుపిండి మాదిరిగా యెక్కువచోటును ఆక్రయించుకొంటుంది ఈ మురుగుటలో బొగ్గు పులుసుగాలి పుట్టుతుంది ఈ బొగ్గు పులుసు గాలే తెల్ల కణముల క్రిమిచలనమునకు కారణము.

రోగపదార్థము రక్తములో కలియుటచే రక్తము కలుషిత మవుతుంది రక్తములో మలినాలు చేరగనే యీ చెడు రక్తము హృదయమునకు వచ్చుటచే ఈ మలినము లను తొలగించుటకు హృదయము ఎక్కువగా స్పందిస్తుంది. ఇట్లా కొంతవఱకే యెక్కువగా స్పందిస్తున్నది తనశక్తి మీరి పోతే, హృదయము కూడా అట్లా స్పందించుట మానుకొం

టుంది స్పందనములు తగ్గును సన్నని కేశనాళికల సంధులలో రోగపదార్థము పేరుకొనుటచే శుద్ధరక్తము ప్రవహించుటకు అభ్యంతరము లేర్పడుతవి హృదయమునకు వచ్చు సిరారక్త ప్రవాహములకు అడ్డంకులేర్పడుతవి మర్దన చికిత్సలో కూడ దేహములోని వివిధ భాగములు వీలెరిగి మర్దిస్తే కండరము లలోని మలినములన్నియు చెడురక్తముతో కలిసి హృదయము లోనికిపోయి శుద్ధినిపొందును మరికొన్ని బహిష్కార్యావయ వములందునచేరి స్వేదముగాను, మలమూత్రములుగాను బయటకుపోవును.

మా ఆసుపత్రి లెక్కలు కూడా పై అభిప్రాయమునే స్థిరపరుస్తున్నాయి మా చికిత్సను పొందినవారిలో నూటికి తొంబది మందిలో తెల్లకణముల సంఖ్య తగ్గిపోయింది మొండి రోగాలలో కూడా ఎర్రకణముల సంఖ్య చాలా పెరిగిపోయింది

నయముకాని రోగాలలో తెల్లకణముల సంఖ్య పెరిగింది క్షయలో మాత్రము అట్లా కాదు క్షయరోగము యొక్క చివరదశలో తెల్లకణముల సంఖ్య తగ్గుతుంది ఎందు కంటే రోగపదార్థము ఎక్కువగా వచ్చి పడుటచే ప్లీహము, శోష రసగ్రంధులు ఆ రోగపదార్థమును కుదపలుగా కద నొక్కలేవు కొన్ని కేసులలో మాత్రము చికిత్స మొదలు పెట్టక పూర్వము తెల్లకణముల సంఖ్య తక్కువగానే ఉన్నది. మొదలు పెట్టిన తరువాత వీటి సంఖ్య యెక్కువైనది ఎందు కంటే ప్లీహము, శోష రసగ్రంధులు రోగగ్రస్తము అగుటచే రక్తములోని మలినములనుపిండలేవు. మా చికిత్సా ప్రక్రియల

వలన వీటికి శక్తికలిగి రక్తములోని మలినములను కదనొక్కు-టచే తెల్ల కణముల సంఖ్య పెరుగును మొదటలో 2000-3000 ఉన్న తెల్ల కణములు ఇప్పుడు 4000 వరకు పెరిగినవి మందు వైద్యమువారు సామాన్య ఆరోగ్యవంతుని దేహములో 7500 లకు తక్కువ గాకుండా తెల్లకణములు ఉండాలని నిర్ణయిం చారు మందువైద్యమువారి యావరేజి లెక్కకన్న మనరోగు లలో 3500 తక్కువ

ఇప్పుడు మనము తిను ఆహారపదార్థము లన్నియు రోగమును ఎక్కువ చేయుటకే తోడ్పడును ఆరోగ్యము నేమీా వృద్ధిచేయవు, రోగాన్ని పెంచు ఆహారమునే తినుటచే, ఈ జనమంతా అనారోగులే ఈ అనారోగులనుబట్టి తయారు చేసిన లెక్కలన్నీ సరియైనవికావు ఈ ఆహార పదార్థములలో పిండి పదార్థము లెక్కువై పులిసి రోగా లెక్కువగుచున్నవి ఈ పులుసును సమరస పరచే క్షారములు సేంద్రియ లోహ లవణములు తక్కువ

మందు వైద్యమువారి అభిప్రాయము ప్రకారము, ఒక ఎర్రకణమునకు 666 తెల్లకణము లుండును జంతువులలో ఈ విభాగము ఇంకా తక్కువగా ఉంటుంది
గర్భిణీ కాలములోను, ప్రసవించిన తరువాతను యుక్తమైన ఆహారమునిచ్చి శిశువును పెంచితే, ఈ తెల్ల కణముల సంఖ్య 4000 కన్న చాలా తగ్గిపోతుంది.

పైనచెప్పినవానిని బట్టి ఒక సందేహము తోచవచ్చును. ఏమిటంటే - పరాన్నభుక్కులు బాక్టరియాలను వృద్ధిచేయా లంటే అంటురోగా లున్నచోటికి పోవలెగదా. అట్లా పోకుం

డానే రోగాలు వృద్ధిపొందుతున్నవేమి? మేముచెప్పు సమాధాన మేమంటే, సూక్ష్మ జీవులను బయటనుండి దేహము లోనికి ప్రవేశపెట్టవలసిన పనిలేదు అవిపెరుగుటకుదోహదము చేయ నవసరము లేదు

---

౮

# మైక్రోజివమా పుట్టుపూర్వోత్తరాలు

ఆంటోనీ బీఛాంపు ఫ్రెంచిదేశపు శాస్త్రజ్ఞుడు వీరి పరిశోధనలన్నియు అప్పటికి అమలులోనున్న జీవశాస్త్రమును తారుమారు చేసినాయి. ఎట్లా తారుమారు చేసినదీ యీ అధ్యాయములో తెలుసుకొందాము బీఛాంపు గొప్పమేధావి. మాంటుపెలియరు విశ్వవిద్యాలయములో వైద్యశాస్త్రమునకు సంబంధించిన రాసాయనిక శాస్త్రపండితుడు ఢిల్లీ విశ్వవిద్యాలయములో జీవశాస్త్రపండితుడు పాశ్చరు, ప్రొఫెసర్ మెచ్నికాప్, ప్రొఫెసర్ బీఛాంపులు సమకాలికులే

లూయీపాశ్చరు తన సిద్ధాంతముల ప్రచురపరచి జగద్విఖ్యాతిని పొందాడు పక్షపాతము లేకుండా చెప్పాలంటే యీకొత్త సిద్ధాంతాలన్నీ బీఛాంపు పండితునివే లూయీ పాశ్చరు వీటిని తస్కరించాడు సమకాలికు లగుటవలన వీరిద్దరకువాగ్వివాదము జరుగుచుండేది ఎవరి అభిప్రాయముల వారు చెప్పుచుండెడివారు, పాలు, రక్తము మొదలగు ద్రవ

పదార్థములు ఆరుబయట ఉంచితేనేగాని పులిసి మురగవని పాశ్చరు చెప్పెడివాడు పైద్రవపదార్థములు మురుగుటకు గాలిలోని సూక్ష్మజీవులు అవసరమని వాదించేవాడు సీసాలో బీరు సారాయిపోసి గాలికివదలి పెట్టితే, యెట్లా పులుస్తుందో అట్లాగే, జంతుదేహములో ప్రవేశించిన సూక్ష్మజీవుల శక్తి వృద్ధి రోగము వస్తుందనీ పాశ్చరు చెప్పేవాడు

అంతేగాక, ఒకరకమైన సూక్ష్మజీవులవలన ఒకరోగము వస్తుందనీ, మరొకరకమైన సూక్ష్మజీవులవలన మరొకరోగము వస్తుందనీ పాశ్చరు అభిప్రాయము పాలను పెరుగుగా మార్చే సూక్ష్మజీవులు వేరనియు, ద్రాక్షపండ్ల రసమును సారాయిగా మార్చే సూక్ష్మజీవులు వేరనియు, సారాయిని వినిగర్‌గా మార్చే సూక్ష్మజీవులు వేరనియు పాశ్చరు చెప్పాడు ఇట్లాగయితే అంతులేనన్ని సూక్ష్మజీవులుంటాయి.

ప్రొఫెసర్ మెచ్నికాఫ్ తెల్లకణముల పుట్టుపూర్వోత్తరములగూర్చి విచిత్రమైన కథనుచెప్పాడు సర్ ఆల్మర్ రాత్, డాక్టర్ బుల్లర్ అను పండితులిద్దరును రోగజీవుల చంపుటకు దేహములో ప్రతిజీవులు పుట్టునను సిద్ధాంతమును బయలుదేరదీశారు ఈ రెండు విచిత్ర సిద్ధాంతములు నేటి మందు వైద్యశాస్త్రమునకు పునాది మామూలు సూత్రములకు సహితము భిన్నముగానున్న యీ విచిత్ర కథలు రెండూ చాలా అసందిగ్ధముగానున్నాయి. ఎంత అసమంజసముగానున్నదీ మాచదువరులే చెపుతారు.

(1) ప్లేగు వ్యాపించుటకు ( ఈ పండితులు చెప్పే కథ యేమంటే) ముందుగా ఈ రోగము ఎలుకలకు వస్తుంది అవి చస్తాయి వాటినుండి సూక్ష్మజీవులు మనుష్యులకు సంక్రమిస్తాయి వీరుకూడా మరణిస్తారు అయితే యీరోగము ఎలుకలకుమాత్రము ఎక్కడనుండి వచ్చింది? ఈ ప్రశ్నకేమీ సమాధానము లేదు

(2) సూక్ష్మజీవివలన ఒకరోగమువస్తే అందరిలోనూ యీ లక్షణాలు ఒకటిగానే ఉండాలిగా అట్లా ఉండుటలేదే- మనిషినిబట్టి రోగము మారుతున్నది జంతువులకు వచ్చే జబ్బులు వేరు మనుష్యులకువచ్చే జబ్బులు వేరు

(3) పై వాటికి ఏదోవిధముగా సమాధానము చెప్పా కొన్నా మరొక ప్రతిబంధకమున్నది (రోగాలు రాకుండా కాపాడుతాయని చెప్పే మందులన్ని) గాలిలోపుట్టే సూక్ష్మజీవులవలన వచ్చే రోగాలను ఆపుచేయుటకు గాలిలోపుట్టే సూక్ష్మజీవులనుండే మందులు తయారుచేయాలిగా అట్లా లేదే రోగాలేమో గాలిలోని సూక్ష్మజీవులవలన వస్తాయట. అవి రాకుండా కాపాడుటకు రోగాలువచ్చిన జంతువులనుండి మందులు తీస్తారట ఇవేగాక భూమినుండి త్రివ్విన ఖనిజముల తోన్నూ మందులు తయారుచేయుట కద్దు గాలిలో పుట్టే సూక్ష్మజీవులను చంపుటకు రోగాలు వచ్చిన జంతువులనుండి తయారుచేసిన మందులెట్లా ఉపయోగిస్తాయి రెండూ వేరు వేరు తోవలవపోవుటలేదా

(4) ఒక సూక్ష్మజీవివలన ఒక రోగము వస్తుందని, పలానా మందువేస్తే ఆరోగము పోతుందను సిద్ధాంతమును

లేవదీసినవాడు కోక్ అందుకు అనుకూలముగా నిబంధనల వ్రాసినాడు Lancet అందు వైద్యమువారి అధికారపత్రిక కోక్ గారి సిద్ధాంతమును ఈ పత్రిక ఒప్పుకోక అసమంజసమని త్రోసివేసింది 1908 సంవత్సరము మార్చి 20 వ తేదీన వెలువడిన లాన్ సెట్ ఏమంటున్నదో చూడండి పూర్వాపరములకు సంబంధము లేదుగాన కోక్ గారి సిద్ధాంతము సమంజసములుగా కనబడుట లేదు

ఇంతవరకు లూయీపాశ్చరు వాదమును విన్నాము ఇకను బీఛాంపు పండితుని అభిప్రాయముల తెలుసుకొందాము

తనపరిశోధనల ఫలితముగా బీఛాంపుపండితుడు ఈక్రింది నిర్ణయాలను తేల్చుకొన్నాడు ప్రాణమున్న అన్ని జంతువుల దేహములలో ఉపులియుట జరుగుతుంది పులియుట అనగా జీర్ణక్రియ బహిష్కరణ క్రియలరెంటిలో జరుగు రాసాయనికమార్పు రాసాయనికమార్పు జీర్ణక్రియలోనూ జరుగుతుంది బహిష్కరణక్రియలోను రాసాయనిక మార్పు జరుగుతుంది లూయీపాశ్చరుకును, ప్రొఫెసర్ బీఛాంపుకును అభిప్రాయభేదములున్నవి శ్రుతికుదుర లేదు ఒక సూక్ష్మజీవివలన ఒక రోగము వస్తుందని లూయీపాశ్చరువాదము ఒకేరోగపదార్థమునుండి వేరు వేరు పరిస్థితులలో వేరు వేరు రోగాలువస్తాయని బీఛాంపుపండితుని అభిప్రాయము పరిస్థితులబట్టిరోగాలు వస్తాయిగాని సూక్ష్మజీవులవలన రోగాలు రావంటాడు

బీఛాంపుపండితుడు ఇంకా యేమన్నాడంటే, అన్ని వస్తువులూ కణములసమూహములే ఈకణములు సూక్ష్మజీవుల సమూహములు ఈ సూక్ష్మ జీవులు మైక్రోజిమాల

సమూహము మనమూదిరిగనే ఈ మైక్రోజిమాలు ఆహార మును జీర్ణించుకొనును గాలిలోపుట్టే జీవులవలన అనేకవస్తువులలో అనేకరకములైన రోగములెట్లు కలుగునదీ బీఛాంపు పండితుడు తెలుసుకొన్నాడు

జంతువులు, పక్షులు, చెట్లు, చేమలూ, అన్నీ ప్రాణవంతములే మానవదేహమెట్లనో, ప్రాణవంతములైన మిగిలిన సృష్టిఅంతా ప్రాణవంతములైన మైక్రోజిమాల సమూహములే బయటగాలిలోనుండు జీవులు లోపలకురాకుండా చూచుటకును, లోపలజీవులు మురగకుండా ప్రాణవంతములుగా ఉండునట్లు చూచుటకును వేడి అవసరము లోపలజీవులు మురగకుండా ఉంచుటకును, బయటగాలిలోని జీవులు లోపలకురాకుండా కాపాడుటకును, రెండు పనులకును దేహములోని వేడితగ్గకుండా చూడవలయును

పాశ్చరు మాంసపుముక్కను గాలి తగలని చోటులో దాచినప్పటికిని అది మురిగినది దీనిని బట్టి యేమి తెలుసుకొనవలసినదంటే- గాలి తగిలినా తగకలపోయినా మాంసపుముక్క మురుగుతుంది- అని

ఆరోజులలో కణమే మానవ దేహమునకు మూలమను విర్కో-సిద్ధాంతము అమలులో నున్నది

బీఛాంపు పండితుడు మాత్రము కణములు కూడా సూక్ష్మజీవుల సమూహమేనని సిద్ధాంతీకరించాడు ఈ సూక్ష్మజీవులకే మైక్రోజిమాలనే పేరుపెట్టాడు వీటినే మండము నొందు సూక్ష్మ పదార్థములనికూడా చెప్పవచ్చు వీటిపుట్టు

పూర్వోత్తరముల గూర్చి విల్సను పండితుడేమి చెప్పాడో చూడండి

'హెన్లీ 1841 సంవత్సరములోనే వీటినిగుర్తించాడు. ఆసిద్ధాంతమునే బీఛాంపు పండితుడును ఈస్టరును విపులపరిచారు ఈ మైక్రోజిమాలకు కూడా వృద్ధి క్షయము వున్నవనియు, ఇదేమానవ దేహమునకు మూలమనియు అట్టమన్ చెప్పినాడు. కణములేగాకుండా మైక్రోజిమాలు ఎట్లాయుండేదీ అప్పటివారికి అవగాహనగా లేదు బీఛాంపుపండితుడు ఈ కణములుకూడా మైక్రోజిమాల సమూహమేనని తెలియచెప్పాడు మానవ దేహమునకు ఇవి యింత ప్రధానమైనప్పటికినీ వీటిని గూర్చి జీవశాస్త్రము ఒకమాటైనా చెప్పలేదు. బీఛాంపుపండితుని అభిప్రాయము ప్రకారము జంతుసంబంధమైనవీ శాకసంబంధమైన సూక్ష్మజీవులు గాలిలోను, భూమిలోను, కొండలలోను కలిసిపోయి యెక్కువగా నుండును. చెట్లు, జంతువులు చచ్చిపోయినపుడునుమాత్రము పురుగులన్నియు గాలిలో కలిసిపోవును చెట్లు, జంతువులు ఎక్కడ ఎక్కువగా నుండునో అచ్చటి గాలిలోని సూక్ష్మజీవులు కూడా యెక్కువగా నుండును ఎడారులలోను, పర్వతపంక్తుల మీదను చెట్లు, జంతువులు ఉండవు కాబట్టి అచ్చటిగాలిలో ఈ సూక్ష్మజీవులు తక్కువగానే ఉండును

బాక్టీరియాలు, సూక్ష్మజీవులు బయటనుండి వచ్చునవిగాదు దేహములోపలనే పుట్టును. మానవదేహమెట్లు కణముల సమూహమో అట్లనే కణములును మైక్రోజమాల సమూహామే. జంతుదేహములలోనుండు కణములలోనుండు

మైక్రోజీమాలు, మానవ దేహములలోని కణములలోని మైక్రోజీమాలకన్న నాల్గురెట్లు పెద్దవి ఈఅభిప్రాయమే రోగాద్వైతము, చికిత్సాద్వైతములో విశదము గాగలదు

ఈజీవశాస్త్రపండితులకు ఒక చిక్కుకలిగింది సూక్ష్మజీవులు బయటనుండియే లోనికి ప్రవేశిస్తాయని వీరు చెప్పుచున్నారు సరే మంచిదే అయితే కోడిగుడ్డే కోడిపిల్లగా మారుతున్నదిగదా గుడ్డు పిల్లగా మారుటకు అట్లా మార్చే సూక్ష్మజీవులు బయటనుండి లోపలకు చేరాలన్నమాట ఈ కోడిగుడ్డుకు పైనుండు పెంకులోనుండి సూక్ష్మజీవులు లోనికి పోవని అందరూ యెరింగినదే అయితే కోడికడుపులో ఉండగానే యీసూక్ష్మజీవులు చేరినాయని చెప్పాలి ఇట్లా చెప్పితేనే పాశ్చరువాదమునకు అనుకూలమగుతుంది ఇది యేకాలములోనైనా సాధ్యమేమో బుద్ధిమంతులు ఆలోచించండి!

ఈ విషయమునుగూర్చి బీఛాంపుపండితుడేమి చెప్పుతాడో విందాము మామూలు పరిస్థితులలో కోడిగుడ్లు పిల్లలగుతవి గ్రుడ్లు పిల్లలుకావడము, కాకపోవడము అనేది కోడిగుడ్డులోని సొనమీద ఆధారపడుతుంది అంటే సొన మంచిదైతే పిల్ల బయటకు వస్తుంది సొన మురిగిందాఅంటే పిల్లరాదు లోపలనే కుళ్ళిపోవును సొన బాగా ఉన్నదాఅంటే లోపలి మైక్రోజీమాలకు ఆహారమూదొరకి కోడిపిల్లగా మారుతుంది లోపలి మైక్రోజీమాలకు చెడు ఆహారము దొరకినదా అంటే లపలనే మురిగిపోయి కోడిపిల్లరాదు

ఈసందర్భములో ఒకవిషయము చెప్పుతాను డాక్టరు

లిం డ్లావ్లా రుకుమారునికి మశూచికము వచ్చినది ఆరోగికి మేము ఈక్రింది చికిత్సా ప్రక్రియలను చేసినాము

నాకు తెలిసినంతవఱకు అప్పుడు చికాకోనగర సమీపములో మశూచికము లేదు మశూచికము అంటువ్యాధి అయితే యీపిల్లవాడికి ఎక్కడనుండివచ్చింది ? అంటువ్యాధి అయితే ఆయింట్లోనే మిగిలినవారెవరకును రాలేదు నాకు తోచిన సమాధానమేమంటే వంశానుగతముగా ఈ పిల్లవానికి వచ్చిన జబ్బులను రోగప్రవణతలను ప్రకృతి మశూచికముద్వారా బయటకు పంపింది

ఈ మైక్రోజీవులు దేహములోని మురుగునుండి పుట్టినవేగాక, బయటనుండి కూడా రావచ్చుగదా అని సందేహము తోస్తుంది ఇవి ఒకవేళ బయటనుండి వచ్చినా అవి వృద్ధిపొందుటకు అనుకూలమగు స్థితిగతులు లేకపోతే అవి నిలవనేనిలవవు అవి పెరగాలంటే వాటికనుకూలమైన వసతులు కావలెను ఈ అనుకూల పరిస్థితులే రోగపదార్థము ఇవి అన్నీ <u>బయటనుండి వచ్చే మాట నిజమైతే వాటినిఅన్నీ బయటకు తోలగానే క్రొత్తవి లేకుండా ఉండాలిగా కానీ అట్లుకాదు క్రొత్తవి పుట్టుతున్నాయి కాబట్టి క్రొత్తవిగాని, పాతవిగాని, రోగపదార్థము నుండే పుట్టుతున్నాయిగాని బయటనుండి రావడము లేదన్నమాట</u>

1869 సంవత్సరములో బీఛాంపు పండితుడేమిచెప్పాడో

వినండి విషమజ్వరము, కుష్ఠురోగము, పశువులకు వచ్చుగాళ్లు మొదలగు రోగాలు వచ్చిన వారిదేహములోని రక్తములోను, కుటికలలోను, సూక్ష్మజీవులుండుటచే బయటనుండి వచ్చిన సూక్ష్మజీవులు ఈ రోగాన్ని సంక్రమింప చేసినవని తలచినారు మనసిద్ధాంతముప్రకారము చూస్తే సూక్ష్మజీవులు రోగ పదార్థముండుటచేతనే వచ్చినవి మరొక సందేహము తోచ వచ్చు ఇన్నిరకాల సూక్ష్మజీవులు లేకపోతే యిన్నిరోగాలు ఎట్లావచ్చినాయి? దీనికి సమాధానమేమంటే ఈరోగాలన్నీ రోగపదార్థముయొక్క చిహ్నము లేగాని సంబంధములేని వేరు వేరు రోగాలుగావు

మైక్రోజిమాల సమూహామే కణము అనేక కణముల సమూహామే అవయవములు అనేక అవయవములు కలిస్తే మానవదేహమగును అనేకమానవుల సమూహామే ప్రపంచము మానవుడెట్లు ప్రాణవాయువును తీసికొని, మాలిన్యము బయటకు వెళ్లగొట్టునో, పునర్నిర్మాణము చేయునో అట్లనే కణములుకూడా ఆహారమును జీర్ణించుకొని, మురికిని బయటకు వెళ్ళగొట్టును పునర్నిర్మాణము చేయును స్వచ్ఛమైనగాలిపీల్చి, పరిశుద్ధమైన ఆహారమును తినుటచే ఈ మైక్రోజిమాలు జంతుసంబంధమైన, శాకసంబంధమైన కణములుగా తయారగునేగాని పరాన్నభుక్కులుగా మాత్రము తయారుకావు

ఈ బాక్టీరియా సిద్ధాంతమే మందువైద్యమువారి సందేహములను (20- 3- 1909 తేదీన వెలువడినలాన్‌సెట్టు) విడగొట్టుతుంది ఆ సందేహమేమనగా గొడ్లకు మామూలుగా

వచ్చేరోగాలు రాకుండా సూదిమందుల (ఇంజక్షనుల)పొడిస్తే క్రొత్తరోగాలు వచ్చినవి మనమిచ్చిన మందుకూ వచ్చిన రోగమునకును ఎట్టి సంబంధమూ లేదు

దేహములో రోగపదార్థము పేరుకొంటుంది కాబట్టే ఆరోగపదార్థమునుండి యేరోగమైనా పుట్టుతుంది మందులు వాడితే ఆరోగము నయముకాకపోగా క్రొత్తరోగాలు పుట్టుతవి ఈరోగాలు ఎప్పటికినీ బయటనుండివచ్చు సూక్ష్మజీవులవలనరావు ఈ సూక్ష్మజీవులు గాలిలోకలిసిపోయి ఆరోగ్యవంతులకు కూడా ఫంక్రమిస్తాయని రోగాలురాకుండా కాపాడాలంటే సూదిమందులు పొడిపించుకోవాలని మందు వైద్యులు చెప్పుచున్నారు గాలిలో కలిసిపోయిన సూక్ష్మజీవులవలననే రోగమువస్తే ఆరోగము రాకుండా కాపాడుటకు ఆరకమైన (రోగమును కలిగించు) సూక్ష్మజీవులు లేని గాలినుండేగదా మందులు తయారుచేయవలసినది! కానీ అట్లాతయారు చేయుటలేదు రోగాలు వచ్చిన జంతువులనుండిగదా మందుల తయారు చేయుచున్నారు

మరొక ఉదాహరణ వలనను మందు వైద్యమువారి అభిప్రాయము ఎంత సమంజసమో మా చదువరులకే తెలుస్తుంది కీళ్ళజబ్బులు రాకుండా చేయుటకు టీకాలు వేస్తారు ఈ టీకాలు జంతువులకును మనుష్యులకును వేస్తారు ఈ టీకాలు జంతువులకు వేస్తే వాటికి చలిజ్వరము వస్తోంది ఆ టీకాలే మనుష్యులకు వేస్తే గజ్జి లేచుచున్నది దీనిని బట్టి మనము గ్రహించిన దేమంటే - దేహములో ఉన్న సరుకును బట్టే రోగము వస్తున్నదిగాని, ఈ మందువలన నేమీ వచ్చుట

లేదు, ఒక వేళ వచ్చేదేమైనాఉంటే, ఆరోగము ఈ మందుతో ఆగుట లేదు

మనము పెంచుకొన్న రోగపదార్థమును బట్టే మనకు రోగము వస్తున్నది ఆరోగ్యమైనా అట్లాజాగ్రత్తగా పెంచుకో వలసిన దే గాని అమాంతముగా ఒక మూలనుండి వచ్చి మన నె త్తినపడేదీ కాదు మందుల షాపులలోని టానికులతో వచ్చేదీ కాదు ఏవో గ్రహాలు బాగా లేకపోతే రోగాలు వస్తా యనునది కూడా భ్రమేనని బీఛాంపు పండితుని అభి ప్రాయము రోగము కాని; ఆరోగ్యము కాని ప్రకృతి సూత్ర ముల అతిక్రమించుట, ఆచరించుటలోనే ఉన్నది ఒకతడవతో ఆగంతుకముగా వచ్చి పడేదీ కాదు ఒక మాత్రతో పోయేదీ కాదు నిరంతరము ప్రకృతి సూత్రములను అతిక్రమించుట చేతనే ఈ రోగము వచ్చుచున్నది ఆచరిస్తే రోగముపోతుంది ఆరోగ్యము కలుగుతుంది

రోగము కానీ, ఆరోగ్యము కానీ ఈ సూక్ష్మజీవుల వలననే వస్తుంటే, మానవ లోకమంతా వీటి దయాధర్మ బిచ్చముల మీదనే ఆధార పడవలసినదేగా ఈ సృష్టిఅంతా వీటి అగ్రహానుగ్రహముల మీదనే ఆధార పడవలసినది కానీ అట్లా జరుగుట లేదే

మనలో చెత్తా చెదారము చేరితేనే రోగము వస్తున్న దని యెప్పుడైతే అనుకొన్నామో చేరకపోతే ఆరోగ్యముగా ఉంటామని కూడా అప్పుడే తోస్తుంది కణములలోని అంతర్భా గములైన సూక్ష్మజీవులకును సరియైన ఆహారమును,

విశ్రాంతినీ, శ్రమనునిస్తే ఆరోగ్యముకూడా కలుగుతుంది ఈ కణములు ఆరోగ్యముగా ఉండాలంటే యింకా యేమేమి చేయాలనగా తినుటలోనూ, తిరుగుటలోనూ, విశ్రాంతిని తీసికొనుటలోనూ, సంగమ క్రియలోనూ, దేహములోని నిర్మాణ శక్తికి అనుకూలముగా ఉంటే ఈ కణములన్నీ ఆరోగ్యముగా ఉంటాయి మానవుడునూ ఆరోగ్యముగా ఉంటాడు

ఆగస్టు వెయిస్‌మెన్ ఏమన్నాడంటే - 'చాలా పెద్దదైన ఈ ఖగోళమును గూర్చిన్నీ, సూక్ష్మాతి సూక్ష్మమైన మైక్రోజమూను గూర్చిన్నీ, కూడా మనము తెలిసికొనవలసియున్నది "

హగ్ల్యామ్ ఏమి చెప్పుచున్నాడో వినండి - ఈ సూక్ష్మాతి సూక్ష్మమైన మైక్రోజమూల నుండియే మానవ లోకమంతా సృష్టింపబడినది సర్వశాస్త్ర పారంగతుడైన న్యూటన్, స్వరశాస్త్ర విద్వాంసురాలైన బిదోవెన్, అందగత్తెలలో మిన్నందిన హామిల్టన్‌రాణి మొదలగు వారందరు ఈ సూక్ష్మజీవుల సమూహములే

హిందూ పురాణములు కూడా ఈ అభిప్రాయమునే వ్యక్తపరుస్తున్నాయి ఎప్పుడైతే 'బహుస్యాం ప్రజాయేయా' అనేక మందిని అగుదామని బ్రహ్మదేవుడు అనుకొన్నాడో అప్పుడే నిర్మలమైన ఆకాశములో స్పందనాలు మొదలు పెట్టినాయి

సంకల్పముతోనే సృష్టి ప్రారంభమైనది

భగవంతునిగూర్చి మంత్రపుష్పములో ఏమి ఉన్నదో వినండి_ 'అణో రణీయాన్, మహతో మహీయాన్' సూక్ష్మాతి

సూక్ష్మమైనట్టిన్ని, స్థూలాతి స్థూలమైనట్టిన్ని, పదార్థమే భగవంతుడు

మందు వైద్యము వారి సిద్ధాంతమే సమంజసమో ప్రకృతి వైద్యమువారి సిద్ధాంతమే సమంజసమో మాచదువరులే ఆలోచింతురుగాక మానవుల పుటుకకే ప్రధానమైన ఈ సూక్ష్మజీవులను మందు వైద్యులు పరిహాసించారు ఈ సూక్ష్మజీవులే రోగారోగ్యములకును చావుపుటుకలకు కారణములని ప్రకృతి వైద్యము వారు సోదాహరణముగా నిరూపించారు

---

౯

## మందుతో అణచిపెట్టినందువలన కలిగే ఫలితాలు

మందులు వేయవద్దంటావుగదా! మందులుపోస్తేవచ్చే కష్టాలు, నష్టాలు ఏమిటి? అని మీరడుగవచ్చు రోగమును ఏదశలో అణచిపెట్టితే యెట్లామారేదీకూడా తెలిసికొందాం

దేహములో అరగని పదార్థము నిలవ ఉంటేనే కాని రోగము రాదని యిదివరకే చదువుకొన్నాము సజీవమైన దేహములో నిర్జీవమైన యీరోగపదార్థమునకు చోటులేదు ప్రకృతి బయటకు గెంటివేస్తుంది, ఏమూల ఉన్న రోగపదార్థమునైనా బహిష్కార్యావయవములద్వారా బయటకు పంపి

వ్వుదిగదా అని సంతోషించవలసినదే దెబ్బలు తగిలి నలిగి
పోయిన కుటికలన్నియు బాగుపడును సహనము పెట్టుకొని
చూస్తూ ఊరుకోగలిగి ఉండాలి బయటకువచ్చు మురికిని
అభ్యంతరపెట్టరాదు మురికిని బయటకు పంపుటకు ప్రకృతికి
సాయం చేస్తే చాలు చర్మరోగాలు చూచుటకు అసహ్యా
ముగా ఉంటాయి బయటకు కనపడకుండా పోవాలని మం
దులురాస్తే యేమిజరుగుతుంది లోపలచేరి ప్రధానావయవ
ములనే పాడుచేస్తుంది క్రొత్తరోగాలు బయటపడతాయి
గాలికొట్టితే బజారులలో ఉండే చెత్తా చెదారము అంతా
కొట్టుకుపోతుంది అట్లనే తరుణరోగము వచ్చిందంటేసరి
దానితోనివని దానినిపోనిచ్చివూరుకొని శైత్యోపచారములు
చేస్తేచాలు లోపలి మురికినంతనూ బయటకుపంపేస్తుంది

రోగాన్ని రెండు మూడు విధాలగా అభ్యంతరపెట్ట
వచ్చు రోగము మనలనేమీ చేయలేదని నిర్లక్ష్యము చేయుట
మొదటిది. జ్వరము వచ్చినా అన్నముతిని, నిద్రపోతే యెంత
తీవ్రముగా బాధలు కలిగేదీ అందరు ఎరిగినదే చేయవలసిన
శైత్యోపచారములు చేయకపోయినా క్రొత్తత్రోవలపోతుంది.
ఇది రెండవది

పైన చెప్పిన రెండు విధాలలోను మందులు పోయుట
లేదు మరొకవిధముకూడా గలదు. ఇది మూడవది మందు
లతో అణచిపెట్టటము విషాన్ని విషముచేతనే చంపాలి
కత్తులు కటారులతోను అణచిపెట్టవచ్చు.

పైనచెప్పిన మూడు పద్ధతులలోనూ చివరపద్ధతి మరీ
దారుణమైనది. ప్రకృతికీ మందుకీ జరుగుపోట్లాటలో మందుల

బలము ఎక్కువైతే, ప్రకృతియొక్క బలము తగ్గుతుంది ఇదే నిరంతరమూ జరుగుచుంటే మృత్యువే సంభవిస్తుంది

రోగముయొక్క పుట్టుపూర్వోత్తరములగూర్చి మనమేసిద్ధాంతమును నమ్మినా, యివన్నీ దేహమునకు మేలుచేస్తాయన్నమాట మాత్రము నిజము సరియైన త్రోవన ఆ రోగమును పోనీయకుండా, అభ్యంతరపెట్టితే, ఆపద లెక్కువగుతాయి ప్రతి రోగమునకును అయిదు దశలున్నాయని లోగడనే చదివినాము ఏదశలో ఆపితే యేమిజరిగేదీ విశదముగా తెలుసుకొందాము

## మంటలు తెలియకుండా రోగమును ఒకటి రెండు దశలలోనే అణచిపెట్టితే కలిగేఫలితాలు

మానవున కెట్లు పుటుక, చావులు గలవో అట్లనే రోగమునకును పుటుకచావులుగలవు ఈ పుటుక చావులనే అయిదుదశలుగా చెప్పినాము ఈ అయిదు దశలలోనూ మొదటి రెండుదశలూ ఉత్పత్తి, చయము రెండునూ పుట్టుకను చెప్పును

మామూలు త్రోవన వీటిని పోనిస్తే యివేమీ హాని చేయవు మందులతో అణచిపెట్టినా మొదటికే మోసమును అప్పుడే చేయవు కానీ రోగమును మాత్రము ఊడిక క్రింద పెట్టును రోగము కాలికమగును బయటకు పోకుండా లోపలనే నిలబడిన రోగపదార్థము ప్రధానావయవముల జోలికి పోయినదాఅంటే నాశనమునకు మొదలు జరుగబోయే ప్రమాదములకు ఇదే పునాది మందులు, మాకులతోగాని

కతులు కలారులతోగాని యీ మొదటిదశలను ఆపనవ
సరము లేదు శైత్యోపచారములచేత నే ఉపశమింప చేయవచ్చు
రోగాలు ఈ అయిదుదశలలో నెట్లావృద్ధిపొందేదీ నిదర్శన
పూర్వకముగాను, శాస్త్రసమ్మతముగాను తెలుసుకొందాము
మామూలుగా అందరికీ జలుబు చేస్తుంది కాబట్టి దీనినిగూర్చి
ముందుగా తెలుసుకొందాము

## జ లు బు

మామూలుగా జబ్బుపడు వారందరు మా, రోగచరిత్రను
చెప్పమనగానే, ఆరోజున జలుబుచేసినది మొదలు
అప్పటినుండీ జ్వరము వచ్చినదంటారు ప్రతివారి నోటా
యీమాటే వస్తుంది కాబట్టి యిదే మొద లను
కొందాము అయితే యిదిమాత్రము ఎందుకు వచ్చింది ?
గాలిపాటువలననే వస్తే అందరకూ వచ్చుటలేదే? ఆగాలినే
అందరూ పీలుస్తున్నారుగదా? అందరూ బాధపడవలసినదేగా?
గాలిపాటేగాక వేరేకారణము మరొకటి ఉన్నదన్నమాట.
ఆరోగ్యముగా ఉన్నవాడిని ఈ గాలిపాటేమీ చేయలేదు.
ఏమన్నా కాస్తో, కూస్తో మెతకతన్నవాడినే, యీ గాలిపా
టేమైనా చేసేది ఆమెతకే మన మిదివఱకు చెప్పుకొన్న రోగ
పదార్థము

ఈమాటలన్నీ మందువైద్యమువారికి కటువుగా ఉండ
వచ్చు నిత్యకృత్యములకును విచిత్రముగా నుండవచ్చు జలుబు
ఎందుకువచ్చిందా అని ఒకడుగు వెనుకకు వేసి విచారిస్తే
అసలుసంగతి బయటపడుతుంది మామూలులు నిజమగుతవి.

ఈరోగపదార్థం కొందరకు కొన్ని రోజులలోను, కొందరికి కొన్ని వారములలోను, పేరుకొంటుంది మరికొందరకు కొన్ని సంవత్సరాలు పట్టుతుంది

జలుబుచేయుట అంటే యేమిటి? జలుబు చేసినపుడు దేహక్రియలలో నేమిమార్పు జరుగుతుంది? అనే ప్రశ్నలు తోచవచ్చు దేహము భరింపగలిగిన దానికన్న నెక్కువ చలి దేహమునకు తగిలితే చలి తగిలిన దేహభాగములోని చర్మరంధ్రములన్నియు మూసుకొనిపోవును అచ్చటి రక్త ప్రసరణము బాగా జరగదు రక్తప్రసరణము బాగా లేక పోవుటచే, నిరంతరము బయటకు పోవలసిన వాయురూపమైన మురికి బయటకుపోదు లోపలనే నిలవ ఉంటుంది మిగిలిన మూడు బహిష్కార్యావయవములును బాగుగా పనిచేస్తున్నట్లయితే, యీ వాయురూపమైన మురికినిగూడా అవియే బయటకు గెంటివేయును వాటిప్రక్కలన రోగపదార్థము పేరుకొనక పోతే, యీచర్మము చేయుపనిని ఆమూడు అవయవములు తేలికగానే చేయును రోగపదార్థముతో అవే మునిగిపోతుంటే అవిమాత్రము ఏమిచేయగలవు?

దేహములోని ధాతుశక్తి బాగాఉంటే యీ పేరుకొన్న మురికినంతనూ బయటకు పెట్టుటకు త్వరగా ప్రయత్నముచేస్తుంది

దేహము ఇదివరకే, రోగపదార్థముతో, నిండితే, వాయురూపమైన మలినములు ముక్కులు ద్వారా బయటకు పోవు. ద్రవరూపమైన మలినములు మూత్రముగా బయటకు పోవు. ఘనరూపమైన మలినములు మలముగా బయటకు పోవు

ఈ అవయవములన్నీ కూడా యీ మురుగును బయటకు నెట్టుటకు ప్రయత్నము చేసిచేసి విసుగెత్తి చచ్చుపడిపోవును వీటికితోడుగా మనిషికూడా నిర్లక్ష్యముచేసి, తోసేసుకొని తిరిగి మితిమీరిన చాకిరీ చేస్తే ధాతుశక్తి తగ్గిపోతుంది రస రక్తములు రెండునూ సరియైన రూపములో ఉండవు మిగిలిన ధాతువులు కూడా కాస్తో, కూస్తో లోపిస్తవి దేహములోని మలినములనన్నిటినీ ప్రకృతి రక్తమునుండి బయటకు నెట్టుటకు ప్రయత్నము చేయుచునే ఉండును చర్మము బాగుగా పనిచేస్తుంటే వాయురూపమైనట్టివన్నీ ఘనరూపమైనట్టివన్నీ మలినములు బయటకువచ్చును ఎప్పుడైతే దేహము భరించగలిగిన చలికన్న ఎక్కువ చలి తగులునో అప్పుడు చర్మము బిగదీసుకొనిపోవును. అప్పుడు చర్మరంధ్రములు మూసుకొనిపోవును మిగిలిన బహిష్కార్యావయవములన్నియు స్వధర్మములను చక్కగా నిర్వర్తిస్తూ ఉంటే యీపనికూడా అవే చేయును వాటిపనులతోనే అవి మునుగుతూఉంటే చర్మము ద్వారా రావలసిన మురికి వేరేత్రోవన రావలసి ఉంటుంది గొంతుద్వారానైనా రావచ్చు శ్వాసావయముల ద్వారానైనా రావచ్చు మూత్రకోశముద్వారానైనా రావచ్చు మలకోశముద్వారానైనా వస్తుంది ఈ రోగపదార్థము శ్వాసాశయములద్వారా వస్తే దగ్గువస్తుంది. మలకోశము ద్వారా వస్తే గ్రహణి, అతిసారము వస్తుంది ఏరూపముతో వచ్చినా యివన్నీకూడా దేహమునకు మోసముకలుగకుండా చేసే ప్రయత్నాలేను తనశక్తి ఉన్నంతవరకూ, ప్రకృతియే నివారణ చేస్తుంది చలిగాలితగులుట, జలుబుచేయుటయు కారణమే

గాని కార్యము మాత్రముగాదు చలిగాలి తగులుట సాకు మాత్రమే

బుద్ధిమంతులకు ఇంకా కొన్ని సందేహములు కలుగ వచ్చును రోగపదార్థము పేరుకుంటేనేగాని రోగమురాదని చెప్పుచున్నారు రోగపదార్థము మంటలుగానే యెందుకు రావాలి? బహిష్కార్యావయవాలద్వారా యెందుకురాదు?

దేహములో నాల్గు బహిష్కార్యావయవములు గల వని లోగడనే చదివినాము దేహములో తయారగు కొద్ది పాటి మురుగే యీ నాలుగు త్రోవలా బయటకు వస్తుంది. ఈ మురుగైనా లోహాలవణాలుచేరి గట్టిపడితే యే ఒక త్రోవనా రాలేదు దేహములో తయారగు రాసాయనిక మురుగంతా కలియుటచే గట్టిపడి యీత్రోవలన బయటకు రాదు

అరగని పదార్థమంతా చిన్నపేగులద్వారా బయ టకు వస్తుంది మామూలు మార్గముద్వారా వచ్చుటకు వీలు లేనంత చిక్కబడి గట్టిపడిన రాసాయనిక పదార్థములే రోగ పదార్థము మామూలు మార్గాలద్వారా యీ రోగపదా ర్థము రావాలంటే విడిపడాలి విశ్లేషమునుపొందాలి మురిగితే గాని విడిపడదు మురుగునపుడు మంటలు పుట్టును మంటలు కలుగుట అవసరమే

జలుబుచేసినపుడు నాలుగు బహిష్కార్యావయవాలు చేయలేని బహిష్కరణ క్రియను ఆమత్యాచముచేయును. దేహములో రోగపదార్థము ఎక్కువైతే ధాతుశక్తి తగ్గి పోతుంది రసరక్తధాతువులు సరియైన రూపములలో ఉండవు.

బయటకు రావలసిన మురుగంతా బయటకుపోదు అప్పుడు జలుబుచేస్తుంది ఎప్పుడూ పడిశ భారముతోనే ఉంటాము ఇట్లాబయటకు వచ్చుటకు ప్రయత్నముచేయు మురుగునంతనూ మందులతో అణచివేయుట యెంత తెలివైనపనో బుద్ధిమంతులు గ్రహిస్తారు మురుగంతాలోపలనే నిలవఉండి పిల్లలపెట్టాలని కోరుతున్నాము మందులతో అణచివేయుటవలన రోగ పదార్థములోని విషముతో మందులలోని విషములు తోడవు తాయి అగ్నికి వాయువు తోడ్పడితే నాశనము ఎంత త్వరగా జరుగుతుంతో అట్లాగే యిచ్చటనూ నాశనము జరుగుతుంది. పై రెండు విషాలవలనను దేహములోని శక్తి ఉడిగిపోయి చచ్చుపడిపోయి రోగము కాలికమగుతుందంటే ఆశ్చర్య మేమున్నది?

"ఆ చలిగాలి తగిలితే జలుబుచేసింది" అని అనుట కూడా పట్టి సమాధానములను చెప్పి తృప్తిపడుటయే గాని వేరుకాదు మామూలుగా రోగము వచ్చుటకు దేహక్రియ లలో ఏలోపములు కారణములని చదివినామో ఆ లోప ము లే జలుబుకును కారణములు ఏవనగా (1) ధాతుశక్తి తగ్గిపోవుట (2) రసరక్తములు సరియైన విభాగములలో ఉండకపోవుట, (3) రోగపదార్థములు పేరుకొనుట

జలుబుచేస్తే ప్రకృతివైద్యముప్రకారము ఏమిచేయా లంటే లోపల పేరుకొని గట్టిపడి కరుడుగట్టిన రోగపదా ర్థములనన్నిటిని మామూలు మార్గాలద్వారా బయటకు పంపి వేయాలి. ఫలరసములు పుచ్చుకొని ఉపవాసముండాలి బహిష్కార్యావయవములు నాల్గు, వాటిపనులు చేయుటకు సాయ

ముచేయాలి ఎంతచెప్పినా ధాతుశక్తి తగ్గిపోకుండాచూడాలి దేహమునకు కష్టము నష్టములేకుండా మామూలు మార్గాల ద్వారారోగపదార్థములను బయటకు పంపాలి

రోగము వృద్ధికాకుండా మొదటి రెండుదశలలోనే మందులతో అణచిపెట్టితే యేమిజరిగేదీ పై పేరాలో చదివి నాము

## మూడవ దశలో అణచిపెడితే కలిగే ఫలితాలు

మూడవదశలో జబ్బుచేసిన భాగములలోని కణములు వేటికవి విడగొట్టబడి సంబంధములేకుండా ఉంటవి వీటి అన్నింటిలోను రోగపదార్థము ఉంటుంది రోగపదార్థముతో ఇవన్నీ తోణికిసలాడుతూ ఉంటవి నిత్యకృత్యములలో జరుగవలసిన పనులనుకూడా యివి చేయలేవు ఇటువంటి స్థితిలో అణచిపెట్టితే యేకణమునకు ఆకణము సంబంధము లేకుండా ఉండిపోతుంది

మూడవదశలో రోగమును అణచిపెట్టితే యేమిజరిగేదీ యీ క్రింది ఉదాహరణవల్ల బాగా విశదమగుతుంది. పాడుపడిన యింటిని బాగుచేయుటకు ఖామందు తలుపులూ, దరవాజాలు, కిటికీలు, వేటికవి విడగొట్టినాడు ఇట్లా విడగొట్టిన తరువాత కూలీలమీద కోపమువచ్చి వాళ్ళను వెడలగొడితే యెప్పటికయినా యిల్లు బాగుపడుతుందా? వేటికవినిలబడిపోవా? అట్లనే మూడవదశలో రోగమును అణగత్రొక్కినా యేభాగమునకు ఆభాగము విడపడి ఉంటుంది ఎన్నటికిని కలియవు

మామూలుగా వచ్చే తరుణరోగాలను మూడవదశలో అణచిపెట్టితే కాలికరోగాలుగా మారిపోతవి శ్వాసాశయ వ్యాధులు, మూత్రపిండవ్యాధులు, పక్షవాతము మొదలగున వన్నీ ఇట్లా వచ్చినవేను మా ఆసుపత్రికి ఇటువంటి కేసులు అనేకమువచ్చినవి అందులో ఒకరి కథను చెపుతాను

## మంచుగడ్డ కట్టినందువలన కలిగే ఫలితాలు

మంటలు ఎక్కువగాఉన్నాయంటే మందు వైద్యులు మంచుగడ్డ కట్టుతారు ఇట్లా కట్టినందువలన నేమి జరుగుతుందో చూతాము

గ్రీసుదేశస్థునికి ఒకనికి జబ్బుచేసినది రెండు నెలలైనవి పెద్ద పెద్ద ఆసుపత్రిలలోనికి తీసికొనిపోయి వైద్యము చేయించారు, ఏమిగాగుణము కనపడలేదు అప్పుడు మాఆసుపత్రికి వచ్చారు. విచారించగా ఏమితేలిందంటే అతనికి న్యుమోనియా (శ్వాసాశయ) వ్యాధి మొదటలో వచ్చిందట మందు వైద్యులు అన్ని ప్రక్రియలను వాడినారు మంచుగడ్డను రబ్బరు సంచులలో వేసి దేహమునకంతకూ కట్టుతూ ఉండే వారు రోగము పోయేటంతవఱకూ యిట్లాగే కట్టారుట

రోగము రాకుండా పోయినదిలే అని సంతోషపడినారే గాని తరువాత ఏమిజరిగేదీ విచారించలేదు దేహము భరించలేని చలి తగులుటచే చర్మము బిగతీసుకొని పోవును చర్మరంధ్రములన్నియు మూసుకొనిపోవును బయటకు పోవలసిన మలినములు లోపలనే నిలచిపోవును మంటలన్నీ అణగిపోతవి.

ఊర్ధ్వప్రతములో నున్న మంటలను మంచుగడ్డతో అణచి పెట్టుటవలన రోగపదార్థము శ్వాసాశయముల పూర్తిగా ఆవరిస్తుంది ఇట్లా ఆవరించుటచే దీనిని శ్వాసాశయ క్షయ అని పేరు పెట్టినారు రోగము నయముకాదనియు, రెండుమూడు వారాలలో చస్తాడని చెప్పినారు ఇటువంటి పరిస్థితులలో రోగిని మా ఆసుపత్రికి చేర్చారు చికిత్స ప్రారంభించారు. ఫలరసముల నిస్తూ ఉపవాస ముంచినాము మంచుగడ్డకు బిగుతుగా తడికట్లను కట్టినాము మామూలు ప్రక్రియల నన్నిటిని చేసినాము ఈ ప్రక్రియలన్నీ రోగపదార్థము బయటకు పోవుటకు సాయపడినాయి రోగమునేమీ అణచి పెట్టలేదు ఇట్లు చేయుటవలన రోగముయొక్క కార్యక్రమము పూర్తిఅయినది మిగిలిన రెండు దశలూ జరిగినాయి

మా ఆసుపత్రిలో చేరిన రెండు నెలలకు స్నేహితులతో కలిసి వారిదేశమునకు పోయినారు ప్రయాణ బడలిక లేమియు లేవు వాతావరణము అనుకూల పడింది రోగము నయమైంది

మా చికిత్సాలయమునకు వచ్చిన కొన్ని కేసులలో ఊపిరితిత్తులలో చేరిన రోగపదార్థమును మందులతోను మంచుగడ్డతోను అణచివేయుటచే గట్టిపడి ఉబ్బసము, క్షయ మొదలగు దుర్భరవ్యాధులుగా మారిపోయినవి ఇట్లా గట్టిపడిన రోగపదార్థము ఊపిరితిత్తులలోను, ఊపిరితిత్తుల చుట్టూ నుండు పుప్పుసములోను చేరుతుంది ఇట్లా చేరిన మురికిని మందువైద్యులు గొట్టములతో బయటకు తోడేస్తారు తిరిగి తోడుట మొదలుపెట్టగనే మురికిచేరుట యెక్కువగుతుంది.

మనవైద్యము ప్రకారమైతే యీ మురికినంతనూ నాలుగు త్రోవలా బయటకు పంపుతాము

మంచుగడ్డను రబ్బరుసంచులలో భద్రపరచి తలకు కట్టినా, వెన్నుపాముమీద ఉంచినా నష్టమే, తలనూ, వెన్ను పామును పైవిధముగా చల్లబరుస్తూఉంటే క్రియాఫలితముగా చలవ కలుగుతుంది ప్రతిక్రియా ఫలితముగా వేడికలుగు తుంది ఇదేకనుక మితిమీరిపోతే పక్షువాతము వస్తుంది మేదోమజ్జాగత జ్వరమును మందులతోనూ, మంచుగడ్డతోను అణచిపెట్టితే పక్షువాతముగాని, యితరవ్యాధులుగాని రావచ్చు. ఇట్లా అణచిపెట్టబడిన రోగాలనే నయముకాని కాలికరోగా లన్నారు మందువైద్యులు, జన్మావధీ యిట్లాగే బాధపడా లంటారు నయముకావని సెలవిచ్చిన పెక్కు-రోగాలను మా ఆసుపత్రిలో నయముచేసి పంపినాము

స్నానమునకుగానీ, తడికట్లకుగానీ, త్రాగుటకుగానీ వాడునీరు, దేహముభరించగల చన్నీరుగానే ఉండవలెను. అంతకన్న చన్నీటిని వాడరాదు మరీచన్నీటినిగాని, మంచుగడ్డ నుగాని ఉపయోగించుటవలన చర్మము బిగదీసుకొనిపోయి చర్మరంధ్రములు ముడుచుకొనును ఈ నీటిని ఉపయోగిస్తే ప్రతిక్రియలో జరుగు ఉపయోగమూ, మంచుగడ్డను ఉపయో గిస్తే జరుగదు మంచుగడ్డనువాడితే ప్రతిక్రియలో ఉపయో గము కలుగకపోవడమే కాకుండా, హానికూడా, కలుగుతుంది. క్రియా ఫలితమునకు, ప్రతి క్రియాఫలితము వ్యతిరేకముగా నుండును మంచుగడ్డను కట్టుటవలన క్రియాఫలితములో చర్మము బిగదీసుకొని పోవుటయు, నష్టమే. ప్రతిక్రియాఫలిత

ముగా ఎక్కువవేడి బయటకు వచ్చుటయు నష్టమే ఉష్ణ యత్రాని నష్టమేగాన మంచుగడ్డనుగాని, మరీ చన్నీటినిగాని యేప్రక్రియలందును ఉపయోగించరాదు

## నాలుగు అయిదు దశలలో రోగమును అణచిపెట్టితే కలుగు ఫలితాలు

తరుణరోగములను ఒకటి, రెండు, మూడు దశలలో మందులతోను, కోతలతోను అణచిపెట్టితే కలిగేఫలితములను చదివినాము చివర రెండు దశలలోను రోగమును అణచి పెట్టితే కలిగేఫలితములను గూర్చి తెలుసుకొందాము ఆరోగ్య మునకు వ్యాఘాతమునుకలిగించు రోగపదార్థమునకును, నివా రణోపాయములకును జరుగుపోరాటములో, నివారణోపాయ ముల శక్తి అధికమైతే రోగపదార్థము తగ్గిపోతుంది రోగపదా ర్థపు చిహ్నములు అనగా వాయుట,కందుట, మంటలు, పోట్లు తగ్గిపోతవి అంతవఱకూ యెక్కువైన హృదయ స్పందనములు తగ్గిపోవును రోగపదార్థమంతా చెదురకము ప్రవహించు సిరలద్వారాను, శోషరస వాహికలద్వారాను బయటకు వెడలిపోవును

రోగపదార్థము పై విధముగా బయటకు వెళ్ళిపోతే 'మైక్రోజిమాలు' దెబ్బలుతగిలిన భాగములను బాగుచేయును. క్రొత్త రణములు తయారగును బయటకుపోవు రోగపదార్థ మునకు మందులు అడ్డుతగిలినపుడు మురికిఅంతా బైటకుపోక లోపలనే నిలచిపోవును. ఈ మురికి ప్రధానావయవములను పాడుచేయును. చెడిపోయిన అవయవముల బాగుచేయు

"మైక్రోజివూల"లకు మందులు అడ్డుపడినపుడు అనగా అయి పవదశలో (ఈదశలో పునర్నిర్మాణముజరుగును) మందులతో అణచిపెట్టబడినపుడు చెడిపోయిన అవయవములు పూర్తిగా బాగుపడకపోవుటచే ఇబ్బందిజరుగును పూర్తిగాబాగుపడని అవయవములు మెతకగానే ఉండును

## మందులువాడితే కలుగు తరువాత ఫలితములు

## విషజ్వరమును మంచుగడ్డతో నయముచేస్తే వచ్చే ఫలితాలు

మా ఆసుపత్రికి వచ్చిన రోగుల కనీనికలను చూచుటతోనే వారు అజీర్ణముతో బాధపడేవారని చెప్పెడివాడను వీటికి కారణము వారికి విషజ్వరము వచ్చినదనియు, దానిని మందులతో అణచివేసినారనియుచెప్పేవాడను నేను కనీనికను చూచిచెప్పినదియు, వారు చెప్పుకథ దాదాపుగా సరిపోయేది విషజ్వరమునకు వాడిన మందురంగు కనీనిక వెలుపటి ఆవరణలో కనుపడెడిది దీనినే నాగ్రంథములో విషజ్వరపురం గని పేరిడినాను ఈవెలుపటి ఆవరణకును, చిన్నప్రేగులలోని శోష రస వాహికలకును సంబంధమున్నది మందులు ఆపరేషనుల వలన చిన్న ప్రేగులలో రోగపదార్థము పేరుకుంటే కనీనిక వెలుపటి ఆవరణలో కనపడుతుంది చిన్నప్రేగులలో రోగపదార్థము పేరుకొనుటచే తిన్న అన్నము సరిగా జీర్ణముకాక, శరీరమునకు పుష్టినివ్వక, బయటకు వెళ్ళిపోతుంది

విషజ్వరము ఉద్ధృతములో నున్నపుడు చిన్నప్రేగులలో కదలికలేకచచ్చుపడిపోవును రోగిమలముపచ్చాపులుసురంగుగా నుండును ఈచిన్నపేగులలో నుండు శోషరసవాహికలన్నీ

చచ్చుపడిపోవును ఏ అభ్యంతరములు లేకుండా విషజ్వరమును త్రోవసపోనిచ్చి, అయిదుదశలను గడవనిచ్చినయెడల రోగ పదార్థమంతా బయటకువచ్చును అయిదవదశలో పునర్నిర్మాణము జరుగును, ఇట్లు సక్రమముగాజరుగనిస్తే రోగి వెనుకటి కన్న ఆరోగ్యముగా నుండును రోగమంతా బయటకు రాక మునుపేఆపినా, పునర్నిర్మాణము పూర్తిగాకమునుపే ఆపినా, దేహానికి నష్టమేజరుగుతుంది లోపలి అవయవములన్నియు చచ్చుపడిపోయి మామూలు పనులను సహితము చేయలేక పోవును

మందులతో నయముచేసుకొన్నవారు రోగము నయమైనదిగదా అని సంతోషపడవచ్చు డాక్టరుగారి ప్రతాపమును వేనోళ్ళ పొగడవచ్చు తరువాతనైనా మన వైద్యపద్ధతులతో నయముచేసుకొంటేనేగాని, రోగము రహితము కాదు ఆహారవిహారములలో నియమము లేకపోతే మందులు సేవించినవారిగతి అధోగతి అగుతుంది రక్తక్షీణము, పాండువ, క్షయ మొదలగు తీవ్రవ్యాధులు తప్పకుండా వస్తాయి వాడిన మందులవలన ప్రత్యక్షముగా అప్పటికప్పుడు చావకపోయినా జీవితాంతమువరకూ మలబద్ధకముతోగాని, నాడీ దౌర్బల్యముతోగాని పరోక్షముగా చచ్చుటమాత్రము నిజము

కొద్దిగా త్రోవకు వచ్చినారు కూనే మొదలగు ప్రకృతి శాస్త్రవేత్తలందరును గత యేబదియేండ్ల నుండీ మందులు మాకులు లేకుండా రోగము నయముచేయుచూ వచ్చినారు మందువైద్యులు వారలను పరిహాసించినారు పిచ్చి వాళ్ళని ప్రచారము చేసినారు నిన్నా నేడు వెలువడే[illegible]

వైద్యగ్రంథములు "విషజ్వరమును మందులు లేకుండానే నయము చేయవచ్చు"నని చెప్పుచున్నవి ఫలరసములనిచ్చి మామూలు జలప్రక్రియలచేస్తేనే రోగము నయమగునని చెప్పుచున్నవి

ఈ ప్రకృతివైద్యము ఒక్క విషజ్వరములోనే గాక మిగిలిన అన్నిజ్వరములలోనూ బాగానే ఉపయోగిస్తుంది మందువైద్యులు ఓపికపట్టి మిగిలిన అన్నిజ్వరములకును ఈ శైత్యోపచారము చేస్తే తప్పకుండా గుణము కనబడుతుంది మందువైద్యులు తమ తెలివితేటలను సరియైన మార్గములలో ఉపయోగించుటలేదు ప్రకృతివైద్యులు నిరంతరము చేయు మలశోధనలవలన అన్నితరుణరోగములును, చన్నీటిప్రక్రియలతోను, వర్ణవైద్యప్రక్రియలతోను, సూర్యకిరణ చికిత్సాప్రక్రియలతోను కుదురునని తేల్చుకొన్నారు

విషజ్వరములో మాదిరిగనే క్షయరోగములోకూడా మందు వైద్యులు సూక్ష్మజీవి సిద్ధాంతమును వదలుకొన్నారు మందులతోవిసిగి, వేసారి, విధిలేక ప్రకృతివైద్య పద్ధతులను అవలంబించినారు గుణములనుకనుగొన్నారు ఫలరసములతో ఉపవాసములతోను, జలప్రక్రియలతోను విషజ్వరమును కుదుర్చుచున్నారు స్వచ్ఛమైనగాలిని పీల్చుటవలన క్షయరోగము కుదురునని చెప్పుచున్నారు అసంగతమైనట్టిన్నీ, సందిగ్ధమైనట్టిన్నీ సూక్ష్మజీవి సిద్ధాంతమును వదలుకొని ప్రకృతివైద్య పద్ధతులతో రోగములను నయముచేసి తమబుద్ధిసూక్ష్మమును సరియైన మార్గమునకు త్రిప్పితే, మందువైద్యులు మానవ లోకమునకు [illegible] సేవ చేసిన వారగుదురు.

## ౧౦

# శస్త్ర చికిత్స

క్లోరోఫారము, కొకెయిన్, సారాయి మొదలగున వన్నియు, మత్తును కలిగించుమందులు. ఈ మందులను సేవింపగనే ఒళ్లు తెలియకుండా పోతుంది. పెద్ద ఆపరేషనులు చేయునపుడు ఒళ్లు తెలిస్తే రోగులు విపరీతమైన బాధ ననుభవిస్తారు. ఈ బాధ తెలియకుండా చేయుటకై ఆపరేషనుకు ముందు మత్తును కలిగించుమందును ఇత్తురు ఇట్లా బాధను తెలియకుండా చేయునవిగాన ఈ మత్తుమందును కనిపెట్టిన శాస్త్రజ్ఞులందరును మానవకోటికి మహోపకారము చేసినారని జనులు సంతోషపడుచున్నారు ఇది భ్రమయే గాని నిజమెన్నటికినీ కాదు.

మత్తుమందుల నుపయోగించితే శస్త్రచికిత్స అప్పటివఱకును తేలికగానే జరిగిపోతుంది ఎన్నికోతలు కోసినా అప్పటివఱకును బాధ యేమియు ఉండదు బాధ తెలియకుండా పోతున్నదిగదా అని మత్తుమందుల నెక్కువగా వాడుతున్నారు. కాస్తకు, కూస్తకు ఈ మత్తుమందులనిచ్చి ఆపరేషనులు చేస్తున్నారు ఇప్పుడు జరిగే ఆపరేషనులలో నూటికి తొంభై అవసరమే లేదు మిగిలిన పదికేసులకే ఆపరేషన్లు చేయవలయును కాస్తకు, కూస్తకు మత్తుమందునిచ్చి ఆపరేషనులు చేయుటచేత వికలాంగులై యావజ్జీవితము బాధపడుచున్నారు తప్పనిసరిగా ఆపరేషనులు చేయవలసిన [illegible]

లలో మత్తుమందు నివ్వకుండా ఆపరేషను చేసినపుడు చాలా బాధ ననుభవింతు రను మాటమాత్రము నిజము. కానీ చీటికి, మాటికి మత్తుమందునిచ్చి ఆపరేషనుచేస్తే యావజ్జీవితము పడుబాధ, ఆపరేషను చేసినపుడు తెలియకుండా చేసినప్పటి బాధకన్న వేయిరెట్లధికము

దీనిని బట్టి శస్త్ర చికిత్సయందు నాకు నమ్మకము లేదని మీరు భావించరాదు. చికిత్స అవసరమేకాని ప్రతి చిన్న కేసు లోను శస్త్రముల నుపయోగించరాదు. ప్రాణాపాయము సంభవించినప్పుడు శస్త్రముల నుపయోగించవలసినదే. ప్రాణాపాయము రాకుండా కాపాడవలసినదే. పెద్ద పెద్ద గాయములు తగిలినపుడును, ఎముకలు విరిగినపుడును, మరే యితరమార్గముల వలనను లోపములను సరిచేయువీలుకానపుడును శస్త్రముల నుపయోగించ వలసినదే. అటువంటి పరిస్థితులలో మత్తు మందులు నొప్పి తెలియకుండా చేసి రోగికి మంచి ఉపకారమునే చేయును. అనవసరమైన కేసులకు, మత్తుమందుతో ఆపరేషనులు చేయించు కొన్నవారు తరువాత చాలా బాధ పడెదరు. ఈ బాధల చూచినవారెవరైనా మత్తుమందులు రెండు వాయిల కత్తు లనియును, శస్త్ర చికిత్సవలన మేలుకన్న కీడే యెక్కువ జరుగుననియు గ్రహించెదరు.

పాతమందు వైద్య పద్ధతులందు చాలామందికి ఏవగింపు కలిగినది. పాత పద్ధతులతో విసిగి వేసారి క్రొత్తపద్ధతి (శస్త్ర చికిత్స) నుపయోగించు చున్నారు. దీనితో తప్పకుండా రోగము కుదురునని భ్రమపడుచున్నారు. చెడిపోయిన అవయవముల కోసివేస్తేనే త్వరగా నయమగునని వీరందరును

భ్రమపడుచున్నారు. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము లేనివారికి ఈ వాదన సమంజసముగానే తోస్తుంది. కాని కొంచెము ఆలోచిస్తే యిందులో మాటల పసే గాని సత్యమేమీ లేదని వెంటనే గ్రహించగలరు. దేహములోని అవయవమును తీసివేయగనే ఒక భాగము కొఱతపడును. ఇట్లా కొఱతపడిన భాగమును పూర్తి చేయుటకు వీలు కాదు.

<u>మంచిమార్గము ఏది?</u> ఒక అవయవము జబ్బుపడగానే రోగము వచ్చిందంటాము. ఆ అవయవమును కత్తెర వేసి తీసివేయుట మంచిదా? నెమ్మదిమీద బాగుచేసుకొనుట మంచిదా? రోగి సర్జను దగ్గరకుపోగానే సర్జను అంటాడు, 'ప్రతి అవయవము ఏయే పని చేస్తుందో, నాకు తెలుసు. చచ్చిపడిన అవయవములవలన ప్రయోజన మేమియు లేదు' అని. గడియారముల బాగుచేయువాని వద్దకు చెడిన గడియారమును తీసుకొని వెళ్ళినా మనుకోండి, అతను అంటాడు గదా, 'నీ గడియారములోని స్ప్రింగు పోయింది, చక్రము పోయింది, అవి మళ్ళీ వేయకుండానే నీ గడియారమును బాగుచేస్తా నంటాడనుకోండి' వాడి తెలివి తేటలను మనమెంత మెచ్చుకొంటాము? చిన్న గడియారములోనే పనికిరానిముక్క లేకపోతే, ప్రతి చిన్న స్ప్రింగూ అవసరమైతే సృష్టికర్త మానవ దేహములో పనికిమాలిన అవయవాలను నిలబెట్టి నాడని అనగలమా? తలంచగలమా? దేహయంత్రములోని అవయవాలు గడియారములోని యినుపముక్కలకన్న పనికిమాలినవా?

నిన్న మొన్నటివరకూ శస్త్రచికిత్సకులు అనేవారుగదా గొంతులోని వయోగగ్రంధులు (టాన్సిల్సు) తీసివేయవచ్చు వాటి వలన దేహమునకేమీ ప్రయోజనములేదు అప్పటి వరకూ శస్త్రచికిత్సకులు వాటి ఉపయోగమును కనుగొనలేదు. ఉపయోగముల తెలుసుకొనలేదు కాబట్టి వాటిని తీసివేయ వచ్చు నన్నారు ఎప్పుడైతే వాటి ఉపయోగములను తెలుసుకొన్నారో పొరపడ్డా మన్నారు ఈ గ్రంధులు తీసివేసినవారందరును పెండలకడనే యమదర్శనమునకు వెళ్ళినారు మందు వైద్యులు తమ తెలివితేటలను అప్పటికి తెలుసుకొన్నారు

మరీ బుద్ధిమంతులు పైత్యకోశమునుకూడా తీసివేయ వచ్చునన్నారు హేమా హేమీలు, ఆపరేషనులు బాగానే జరిగినాయని సంతోషపడుచుండగనే, రోగిచచ్చాడు అప్పుడు కళ్లుతెరచి పొరపడ్డామన్నారు ప్రధాన అవయవముల సహితము తేలికగానే తీసివేసినట్లు రోజూ పత్రికలలో వార్తలు చదువుచునే ఉంటాము తీసివేయుటతో డాక్టరుగారి పని పూర్తిఅయింది అతని పాన్పు అతనికి చెల్లింది ఇకను రోగి పడేబాధలు భగవంతునికే యెరుక

మానవదేహములో ఒక అవయవము జబ్బుపడితే జబ్బు ఆ అవయవములోనే లేదు దానివెనుక ఉన్న గ్రంథమునకంతా అది చిహ్నమే ఆ ఒక్క అవయవములోనే లేదన్నట్లు ఈ క్రింది ఉదాహరణమువలన బాగా తెలుస్తుంది అతిమూత్రపు రోగికి ముల్లుగుచ్చుకొన్నా వ్రణముగా మారుతుంది ఒళ్ళంతా చెడిపోయినదన్నమాట ముల్లువిరుగుట ఒకసారేగాని, ప్రధానముమాత్రముకాదు ముల్లువిరిగి

తేనే ప్రాణములు లేస్తే అందరకు లేవవలసినదేగదా! నిత్యకృత్యములో అట్లుజరుగుట లేదు వంశానుగతముగా వచ్చురోగములవలననైనా జబ్బుచేయవచ్చు నాభి మొదలగు వాటిన్ని మింగినా జబ్బుచేయవచ్చు పైపూతలుపూస్తే పుండుమానుతుందా? అసలు కారణం తొలగించాలి గాని

లోపలి మురుగునంతనూ పరిశృతే బయటకు నెట్టుతుంది ఏమీ అభ్యంతరపెట్టక చూస్తూ ఊరుకోంటేచాలు ఆపితిమా అంటే మొదటికన్న పరిమూదమగుతుంది నీరు పోకుండా ప్రవాహామునకు అడ్డముకట్టితే కాస్సేపటివరకు ఆగుతుంది తరువాత నీరు ఎక్కువై గండిపడి నీరంతా పోతుంది. ఖానాలు వదలిపెట్టాలిగాని, నీరేమీపోకుండా బిగిస్తే నిలబడుతుందా?

ఇట్లు చెప్పుటవలన శస్త్రచికిత్సను హేళనచేస్తున్నామని తలంచవద్దు ప్రతిచిన్నదనికి శస్త్రముల నుపయోగించుట కాలిలోని ముల్లును కరుతితో తీసినట్లున్నది గత యిరువది సంవత్సరములనుండీ చాలా కేసులు శస్త్రములతో పని లేకుండానే నయమైనాయి ఇవన్నీ మందువైద్యులు శస్త్రముల నుపయోగిస్తే గాని కుదురవని వదలివేసినవే మామూలు జల ప్రకియలు చేస్తేనే యివన్నీ నయమైనాయి

గర్భాశయమును తీసివేస్తేగాని రోగము నయముకాదని మందువైద్యులు అనేకమందికి సలహానిచ్చారు వారిల్లో చాలామంది మా ఆసుపత్రికివచ్చి మామూలు ప్రక్రియలతోనే రోగముల నయముచేసుకొన్నారు ఆ అవయవములన్నీ బాగానే ఉన్నవి ఆమాశయముల తొలగిస్తేనేగాని

రోగము నయముకాదని చెప్పినవా రందరును ప్రకృతివైద్య చికిత్సా పద్ధతులతో మా ఆసుపత్రిలో రోగముల నయము చేసికొని తమయిండ్లకు సుఖముగానే వెళ్ళినారు

రాయీ, రప్పా మూత్రపిండములలో చేరినది వాటిని తొలగించకపోతే రోగములు నయముకావని మందువైద్యులు చెప్పిన చాలా కేసులు మావద్దకువచ్చి మాచికిత్సాప్రక్రియల తోనే రోగముల నయముచేసుకొని సుఖముగా ఇళ్ళకు చేరి నారు గవదబిళ్ళలు లేచినాయి వాటిని కత్తెర వేయవలయు చెప్పినవారందరును వచ్చి నయముచేసుకొని సలక్షణముగా ఇంటికి చేరినారు

అవయవములో లోపమున్నదని అవయవమును కత్తెర వేస్తే ఆ అవయవము పోతుంది కొరతగానే ఉంటుంది తొలిగించక బాగుచేసుకొంటే ఉపయోగిస్తుంది తొందరపడి తొలిగిస్తే ఏస్తుపోవుటకన్న మరేమీ ఉపయోగములేదు తేలికగా నయమయ్యే కేసులన్నిటికిని శస్త్రములనుపయోగించి మరింత అధ్వాన్నము చేసినారు పురుషుల లింగములను స్త్రీల గర్భాండములను తొలగించి యావజ్జీవితము సుఖములు పొందకుండా చేసినారు పోనీ తొలగిస్తేనేగాని బ్రత కరాఅంటే అదీకాదు కత్తులూ, మందులూ చేతిలోఉన్నాయి కదా అని ఉపయోగిస్తున్నారేగాని మరేకారణము కను పించుటలేదు

ఆపరేషన్ చేసి దేహములోనుండియేచిన్నముక్కనన్నా తీసివేసినారా అంటే, జీవితములో ఎప్పటికైనా ఆముక్కరాక పోవడమేకాక, ఆరోగ్యముకూడా బాగుపడదు వెనుకటి

మాదిరిగానైనా ఉండదు మరింత అధ్వాన్నమగుతుంది గడి యారములోని ఏ ఒక చిన్నస్ప్రింగు తీసివేసినా గడియారము ఎట్లా మూలపడుతుందో అట్లాగనే మానవదేహముకూడా పనిచేయదు చెడిపోతుంది

మానవదేహము సమస్తపదార్థము The human body is a and is a comprsite body మానవదేహములో తొలగించ వలసిన దేమియు లేదు ప్రతిచిన్న ముక్క అవసరమైన దేను మానవదేహములో అనవసరమైన ముక్క ఒకటికూడా లేదు అన్నింటికినీ సంబంధమున్నది సంబంధములేని ముక్కగాని పనికిమాలిన వస్తువుగాని ఒకటీ లేదు చిన్నముక్కేగదా అని తొలగిస్తే ప్రధానావయవమునకే దెబ్బ తగులుతుంది ఏ చిన్నముక్క పోయినా నాడీమండలమునకు ప్రధానముగా దెబ్బ తగులుతుంది నాడీమండలమునకు దెబ్బ తగలగానే మెదడులోని ప్రధాన కేంద్రమునకు దెబ్బ తగులుతుంది

వియన్నా పండితు డొకడు విచిత్రమైన గ్రంథమును వ్రాసినాడు ముక్కులోని భాగములకును దేహములోని అవ యవములకును సంబంధమున్నదని చెప్పినాడు ముక్కులోని భాగములకును ఊపిరితిత్తులకును సంబంధమున్నదట ఉబ్బ సపు రోగుల ముక్కులోని ఒక భాగమును విద్యుచ్ఛక్తి కలి గిన సూదితో ముట్టుకొంటే రొప్పువస్తుంది అదే భాగము నకు మత్తుమందును తగిలిస్తే దగ్గూ, రొప్పూ తగ్గిపోతుంది. ముక్కులోని మరొక భాగమునకు, రహస్యావయవములకు సంబంధమున్నదట విద్యుచ్ఛక్తి కలిగిన సూదిని ఈ భాగ

మునకు తగిలిస్తే గర్భస్రావ మగును మత్తుమందును (ఈ భాగమునకు) తగిలిస్తే గర్భస్రావము ఆగిపోతుంది

## Zone Therapy - జోన్ థెరపీ

దేహములోని యే భాగమైనను, చిన్న ముక్కనుగాని తొలగించ కూడదనియు, అన్నింటికిని దగ్గరసంబంధ మున్నదనియు, నేది తొలగించినను, మిగిలినవి కూడా కాస్తో, కూస్తో చెడుననియు, అందువలన నే భాగమునైనా, ఏ చిన్న ముక్కనైనా అసాధారణ పరిస్థితులలో తప్ప, తొలగించ కూడదనియు లోగడనే చదివినాము మా అభిప్రాయమును ప్రోత్సహించు మరొక శాస్త్రమును కూడా చెపుతాను ఒక శాస్త్రజ్ఞుడు చేతి వేళ్ళకును దేహములోని భాగములకును సంబంధమున్నదని చెప్పినాడు వేళ్ళమీది ప్రదేశములను ఒత్తుటచేత అవయవములలోని బాధలు ఉపశమిస్తాయి దేహములోని యే భాగమును తొలగించినా నష్టము ఆ భాగముతోనే పోక, సంబంధమున్న మిగిలిన అవయవములకు కూడా సంక్రమించును ప్రాణమునకే మోసమువచ్చు పరిస్థితులలోనే శస్త్రముల వాడవలెను చీటికీ, మాటికీ వాడరాదు

శస్త్ర చికిత్సలో మరొక విచిత్రమున్నది ఆపరేషనులు చేసినందు వలన నష్టము అప్పటికప్పుడు తత్క్షణము కనుపడదు. గుణము గానే ఉంటుంది ఆ అవయవములను తొలగిస్తే బాధ మాత్రము ఉపశమిస్తుంది. క్రొత్తరూపాలతో బయటకు వస్తుంది మానవకోటిని ఇప్పుడు బాధించే చిత్రవిచిత్ర రోగము లన్నీ ప్రకృతి సూత్రముల నతిక్రమించుటచేత

వచ్చిన ఫలితములే క్రొత్త రోగములకును ప్రాత రోగము
లకును దగ్గర సంబంధమున్నది రోగిమాత్రము, రెండునూ
వేరువేరనియు, సంబంధమేమీ లేదని భావిస్తాడు మరొకవిధ
ముగా కూడా అనుకోవచ్చును మొదట ఆపరేషను రోగము
యొక్క మూలమును తీసివేయలేదనియు నిర్మూలము
చెయ్యాలంటే వాడియైన కత్తులను మళ్ళీ ఉపయోగించాలనీ
తలుస్తాడు మొదటి ఆపరేషను జరిగి యేడాది తిరగకమునుపే
మరొక ఆపరేషనుకు సిద్ధమగుతాడు డాక్టరన్ననో మొదటి ఆప
రేషను కన్న రెండవ ఆపరేషను మరీ తేలికగా చేస్తాడు.
శాస్త్రాభివృద్ధినీ, సర్జనుగారి ప్రతాపమును రోగి వేనోళ్ళ
పొగడుతాడు ఇన్ని ఆపరేషన్లు చేసినా డాక్టరు కార్యకారణ
ముల సంబంధమును చెప్పడు రోగకారణమును రోగి మనసు
నుండి తీసివేయడు ఎక్కువగా తినవద్దని చెప్పడు ఆహార
మునకును రోగమునకును గల సంబంధమును గూర్చి అసలే
ముచ్చటించడు రోగికి మతి పోతుంది యథావిధిగా తింటూనే
ఉంటాడు మూలకారణము అట్లాగే ఉండుటచే క్రొత్త
మురుగు చేరుతుంది. పిల్లల పెడతుంది. వీటి ఫలితముతే
కాయలు, కంతులు, గ్రంథులూ తరుణ రోగములను మందు
లతోను, కత్తులతోను అణచిపెట్టితే కాలికరోగా లెట్లువచ్చి
నదీ గత అధ్యాయములో తెలుసుకొన్నాము

ఒక్క సంగతిని మాత్రము మనము మరచిపోరాదు.
స్త్రీల గర్భాండముల జోలికి ఎప్పుడును పోరాదు ప్రకృతి
వైద్యమువారు స్త్రీల గర్భాండముల జోలికి పోవద్దని
చాలా కాలమునుండి ప్రచారము చేస్తునే ఉన్నారు వీరిని

పిచ్చివాళ్ళని మందువైద్యులు అపహాస్యము చేస్తూనే వచ్చారు దూరదృష్టిగల మందువైద్యులు ఇప్పుడిప్పుడు తమ తప్పును ఒప్పుకొనుచునే ఉన్నారు గర్భాండముల తొలగిస్తే నాడీదౌర్బల్యమైనా పుట్టుతుంది పిచ్చిఅయినా పుట్టుతుంది

ఆపరేషనులు చేసినతరువాత పుట్టే దుర్భరరోగాలన్నీ గర్భాండముల తొలగించకపోతే రావేమోనని అనుకొన్నారు అవయవముల తొలగించకపోతే పిచ్చి మొదలగు రోగాలు రాలేదనికూడా ననుకొన్నారు గడియారము సరిగా పని చేయాలంటే ప్రతిచిన్నముక్కా యెట్లా అవసరమో అట్లనే మానవదేహము ఆరోగ్యముగా సరిగాపనిచేసి ఆరోగ్యముగా ఉండాలంటే ప్రతి అవయవము అవసరమేను బటానీగింజంత అవయవమేపోతే పిచ్చిపుట్టుతుంటే పెద్ద పెద్ద అవయవములే పోతే యేమిజరిగేదీ వేరే చెప్పనేఅక్కర లేదు. కాబట్టి మా మందువైద్యమిత్రులు చీటికిమాటికీ కత్తులను ఉపయోగించి అవయవముల తొలగించక చెడిన అవయవముల బాగుచేసి మానవలోకమునకు సరియైనసేవ చేయుదురుగాక.

# ౧౧

# ఔషధములు - శస్త్రచికిత్సలు - వానివలన కలుగు దుష్ఫలితములు - అనర్థకములు

మందులతో అణచివేయుటవలన రోగములు ఎక్కు-
వగుచున్నవి ఇపుడు అమలులోనున్న మందువైద్యమంతా
తరుణరోగములను మందులతో అణచివేయుచున్నది మా-
వైద్యమిత్రులు పై అభిప్రాయమును కాదనవచ్చును వారి
వైద్యప్రక్రియలు కూడా రోగములను అణచివేయుటే గాక,
రోగనిర్మూలమునకే సాయపడునని చెప్పవచ్చును కాని
వాడుకలో మాత్రము మాటలు సత్యములుగా కనబడుట
లేదు పాదరసము మొదలగు లోహములతో తయారు
కాబడిన మందులన్నియు చర్మరోగముల నణచివేయును
కాయలు, కంతులు, గ్రంధులు మొదలగువాని ద్వారా
మాలినపదార్థము నంతను ప్రకృతి బయటకు నెట్టివేయును.
ఇట్లు బయటకు నెట్టుట వలన పడిన త్రోవలను రస, విష,
పాషాణాదులతో తయారు కాబడిన మందులతో పూసి
వేస్తాము పై పూతలవలన ఈ త్రోవలన్నియు మూసికొని
పోవును

డాక్టరు లిల్లి అను ప్రభుత్వ రాసాయనికవేత్త జలుబు-
మొదలగు సామాన్య జబ్బులకు ఉపయోగించు అనేక మందు-
లను చెప్పినాడు. వాటిలో కొన్ని మత్తును కలిగించే మందులు,
మరికొన్ని ఉద్రేకమును కలిగించు మందులు. ఈ మందు-

లన్నియు ఊపిరితిత్తులను, నాసికా రంధ్రములను తమ స్వధర్మమునందు అసమర్థములుగా చేయును బయటకు రాక లోపలనే నిలిచిపోయిన రోగపదార్థమంతా శ్వాసనాళికలను, ఊపిరి తిత్తులను, జీర్ణమండలమును, మలకోశమును, మూత్ర కోశమును ఇబ్బంది పరచును బయటకు పోవు త్రోవలను మూసివేయుటచే ఈ మలిన పదార్థమంతయు రక్తముతో కలిసిపోవును ఇట్లా రక్తముతో కలిసి పోయినపుడు కలిగే హానియేగాక మందులలో ఉండే స్వతస్సిద్ధమైన విషములతో రోగములు మరింత తీవ్రమగును

శస్త్రచికిత్సవలన కలిగే యిబ్బందులను చెప్పనలవియే కాదు ఆమాశయములో మంటలు పుట్టినాయని దానిని తొలగించవచ్చును టాన్సిలున్సలో మురికి చేరినదని వాటిని కత్తెరవేయవచ్చు ఈ రెండూ తేలికపనులే రోగము కూడా వెంటనే నయమైనట్లు బయటకు కనపడుతుంది

ప్రకృతి సహజమైన మార్గములతో రోగపదార్థమును బయటకు పంపి ఆరోగ్యమును పొందుటకు నెక్కువకాలము పట్టవచ్చును ఎక్కువకాలము పట్టునని విషము మ్రింగుట ఎట్లాఅయుక్తమో విషయజ్ఞులు గ్రహింపకపోరు బహిష్కరణ క్రియకును, శస్త్రచికిత్సకును, నెట్టి సంబంధమూ లేదు. రెండునూ వేరువేరు మార్గములే శస్త్రచికిత్స రోగపదార్థ మును బయటకు పంపుటకు సాయపడదు రోగమునకు, మూలకారణమును కనుగొనక, బయట కగుపడు కంతులను గ్రంథులను శస్త్రములతో కోసివేయుదురు బయటకు వచ్చు త్రోవలు మూయబడుటచే ఈ రోగపదార్థము బయట

టకు త్రోయలేక, బలహీనమైన అవయవములలో చేరును వాటిని బాధించును మామూలు ఆరోగ్యముకూడా చెడి పోవును ప్రధాన అవయవములను ఆపరేషను చేయించు కొనినవారందరును దాదాపుగా పదేండ్లలోపులనే యమదర్శనము చేయుచున్నారు ఇవి మా చికిత్సాలయ లెక్కలను బట్టి చెప్పుచున్న మాటలుగాని గాలికబుర్లు గావు పోసి ఆపరేషను చేయించుకొనిన తరువాత ఆరోగ్యవంతులైనారంటే అదీలేదు ఈ విషయాన్ని ప్రకృతి వైద్యులేగాక సుప్రసిద్ధ ఆంగ్ల మందువైద్యులును ఒప్పుకొన్నదే రోగముల అణచిపెట్టి నందువలన కలిగే ఫలితము యిను, నేరోగముల నేమందులతో అణచిపెట్టితే యేరోగాలు వచ్చేవీ తెలుసుకొందాము

అతిసారమును నల్లమందు ద్రావకముతోగాని, మత్తు మందులచేగాని ఆపివేస్తే ప్రేగులలోని క్రిమిచలనము స్తంభించి పోవును. ఈమందులనే నిరంతరము సేవిస్తూఉంటే శాశ్వతమైన మలబద్ధకము ఏర్పడుతుంది

కొఱుకుడు సవాయి, పచ్చసెగ మొదలగు సుఖసంకటములను, సౌవీరము, అయిడోఫారము, పాదరసము, గంధకము, మొదలగువాటితో తయారుకాబడిన మందులతో అణచివేస్తే రోగపదార్థము బయటకు వెళ్ళిపోక లోపలనే నిలవఉండి క్రొత్తరోగాలను కలుగచేస్తుంది

మంటలు పుట్టించని మందులు, కుళ్ళును పుట్టించని మందులు ఒళ్లుతెలియకుండా చేసేమందులు, హుషారును పుట్టించే మందులు జ్వరాలను అణచిపెట్టటానికే ఉప

తూగిస్తాయిగాని రోగకారణమును నిర్మూలించలేవు శాస్త్ర వేత్తలు, వారి పుస్తకములలో ఈ మందులనుగూర్చి యేమేమో అంతూపొంతూ లేకుండా చెపుతారు ఒకమాత్ర వేసుకొంటే యెంతజ్వరమైనా హరించి పోతుందంటారు. రోగాన్ని హరించినా హరించకపోయినా ప్రాణాన్నిమాత్రము తప్పకుండా చివరకు హరిస్తుంది

నరాలు బలహీనముగా ఉండటమును, నిద్రపట్టక పోవటమును, చెప్పనలవిగాని మనోబాధలను మాన్పేమందులు చాలాగలవు ఈ మత్తుమందులన్నీ యేమిచేస్తాయంటే బాధగాఉన్నదని మనబుద్ధికి తోచకుండానే చేసేస్తవి అప్పటికి మాత్రం కల్లుత్రాగినవాని మాదిరిగా హాయిగా నున్నదని గంతులువేస్తాం తరువాతగా వీరిపాట్లు ఈ మందులన్నీ నాడీ మండలమును స్తంభింపజేయుటకే ఉపయోగపడును

మూర్ఛలు రాకుండా ఉండగలందుకు బ్రోమిన్ ఇంజక్షనుల నిస్తారు మత్తునుకలిగించు మందులలో బ్రోమిన్ ఒకటి ఈ మత్తుమందులు బాధ ఉన్నదనే జ్ఞానముకూడా లేకుండా చేస్తాయి బాధమాత్రము అట్లాగనే ఉంటుంది ఈ ఇంజక్షనులే నిరంతరము చేయించుకుంటూఉంటే పక్షవాతము వస్తుంది త్వరలోనే ముదుసలులై పోతారు చిత్రమేమంటే ఎంతదబ్బున రోగాన్ని నయముచేస్తే అంత ఘనవైద్యుడని ప్రతీతి లోపలజరిగే గ్రంధమంతా రోగికీ అక్కరలేదు. వైద్యునికీ అక్కరలేదు

సున్నితమైన ప్రదేశముగుండా రోగపదార్థము త్వరగా బయటకు వస్తుంది ముఖమునకు గాలీ యెండలూ ఎక్కువగా

తగులుటచే రోగపదార్థము అచ్చటినుండి యెక్కువగావస్తుంది. తలనుండి (అనగా పుర్రెనుండికూడా) యెక్కువగా వచ్చుట కద్దు ఇవే పేనుకొరుకుడు, చుండు, బొచ్చురాలిపోవడము. బయటకు పోవు మురికిని లోపలనే అణచిపెట్టరాదు తలలోనే పేరుకొనునట్లు చేయరాదు వీటి పర్యవసానమే నిగనిగలాడే బట్టతలలు విషాలుపుట్టకుండా చూడాలిగాని, పుట్టిన విషాన్ని అణచివేస్తే యేమీ ప్రయోజనములేదు క్రొత్తరూపాలతో బయటకు వస్తాయి నిరంతరము బుర్రకురాచిన మందులవలన బుద్ధిమాంద్యముగాని, తలదిమ్ముగాని, మతిభ్రమణముగాని, చెవుడుగాని, గుడ్డిగాని పుట్టివచ్చిందంటే మనమేమీ ఆశ్చర్య పడవలసిన పనిలేదు

మామూలుగా తలలోనుండే యీపి, పేలు, మలిన పదార్థ ముంటేనేగానీ పుట్టవు ఈ మలిన పదార్థమే వాటికి ఆహారము మామూలు మార్గాలద్వారా యెప్పుడైతే రోగ పదార్థము బయటకు వెళ్ళిపోతుందో అప్పుడే యీపీ, పేలు మాయమవుతాయి ఆహారమే లేకపోతే నశించక యేమవు తవి ఇదిన్నీ 'బీఛాంపు మైక్రోజిమా' సిద్ధాంతమే గాని మరేమిగాదు మా చికిత్సాలయమునకు వచ్చిన చాలా మందికి నివారణ కాలములో- నీ యీపి, పేలు మొదలగు పరాన్న భుక్కులు తటస్థమైనాయి నబ్బునీటినైనా వాడక శుభ్రమైన చన్నీటిని రాచి దువ్వెనతో దువ్వించెడివారము. పేలు-వచ్చిన త్రోవనే పోయేవి ఈ పరాన్న బుక్కులు పుట్టు టకు ముందు వారికి జబ్బులుచేసి ఉండాలి రస, గంధ కాదులతో వాటిని నయము చేసి ఉండాలి.

ఒట్టిసీటితో పోయేదానికి చాలా మందులతో నెంత గ్రంధం జరుపుతున్నారో! మనమేమో రోగము నయమైనదని సంతోషపడుతూంటాము లోపలేమో యింత గ్రంధము జరుగుతుంది ఈ వ్రాతలుచూచి మా మందు వైద్యమిత్రులు చాల హంగామా చేశారు చాలా కోపము కూడా వచ్చింది ఏమిచేస్తాను మరి? నిజం చెప్పక తప్పిందికాదు మా చికిత్సాలయములో జరిగిన ఒకామె చరిత్రను చెపుతాను ఆమె భాగ్యవంతురాలు చాలా దర్జాగా కాలము గడిపినది ఆరోగ్యము బాగా ఉన్నంతవఱకు గడచిపోయినాయి రోజులు రోగము వచ్చింది చికిత్సార్థమై మా ఆసుపత్రికి వచ్చింది ఆసుపత్రిలో గాలీ, వెలుతురు ధారాళముగా వచ్చు ఒక గదిని ఆమెకు ప్రత్యేకించాము సహజస్నానము నాలుగు వారాల పాటు చేసింది ఇకను బయలుదేరింది లోపలి సరుకల్లా దీన్ని చూచి గాభరాపడింది ఈ పుస్తకములోని యీ భాగమునూ, ఆమె రోగనిర్ణయ పట్టికను చూపిన తరువాత తృప్తిపడింది కనీనికను పరీక్షచేస్తే గజ్జి, తీట, చుండు, చీడ మొదలగునవి కలిగినట్లునూ, వాటిని మందులతో అణచివేసినట్లునూ ఆనాడే మాకు కనపడింది మేము అప్పుడు వ్రాసి ఉంచిన వ్రాతలను ఆమెకు ఇప్పుడు చూపించినాము నిజము తెలిసిన తరువాత ఖంగారేమీ లేదు ఇవి రెండు మూడు వారాల పాటుండి వాటింతటవియే అంతరించాయి. వీటికి మేము చేసినదల్లా చన్నీళ్ళను రాయటము, దువ్వటము రోగ పదార్థములో సూక్ష్మ జీవులెట్లు పుట్టునో, అట్లనే వంశాను

గతముగా వచ్చు రోగపరిణతవలన గజ్జి, తీట, చీము, చుండు, తామర మొదలగునవన్నీ సంప్రాప్త మగుతాయి

శిశువ్యాధుల నణచివేయుట - శిశువులు నిరంతరము ఆడుకొనుచుండుటచే వారిలో ధాతుశక్తి బాగా ఉండును పొంగు మొదలగు తరుణవ్యాధులు వారికి తరుచుగా వచ్చుచుండును. త్వరగానే నయమగుచు పెద్దలకు అంతత్వరగా రానూరావు. వచ్చినా అంతత్వరగా నయమూకావు టీకాలు వేసిన పిల్లలందరును పుండ్లతో బాధపడుతూనే ఉంటారు వారిలో ధాతుశక్తి బాగా ఉండుటచే టీకారసములోని విషాన్ని బయటనెట్టుటకు ప్రకృతి ప్రయత్నము చేస్తుంది టీకాలు వేసినతరువాత రెండు మూడు నెలలకు చీము పట్టుకున్నదా అంటే వదలిపెట్టను. తలా చేతులు పుచ్చిపోతాయి ఈచీముద్వారా బయటకు వచ్చు మురికినంతను పూతలద్వారా లోపలనే నెట్టివేస్తాము. హారతికర్పూరమును కొబ్బరినూనెలో కలిపియు, మైలతుత్తమును మంచిగంధముతో కలిపియు రాస్తారు వీటివలననే మూర్ఛలు, భద్రినాట్యము మరీముదిరితే క్షయరోగము వచ్చిందంటే మనమేమీ ఆశ్చర్యపడనక్కరలేదు

పిల్లలకు మామూలుగా వచ్చు దవడ (గవద)బిళ్ళలు, సర్పి, మాంససంతానిక, మేదోమజ్జాగత జ్వరములను అభ్యంతర పెట్టకపోనిస్తే లోపల పేరుకొనిన సరుకుఅంతా ఖాళీ అగుతుంది మురికి బయటకు వచ్చుటకు సాయము చేయకపోగా అభ్యంతర పెట్టుటచే మరెంత తీవ్రస్వామముతో బయటకువస్తాయి. లేదా లోపలనే కూర్చొని ప్రధానావయవములలో పేరుకొంటుంది లోపల చేరినదొంగ ఊరకొంటాడా మరి? ప్రధా

నావయవముల తినేస్తాడు ఊపిరితిత్తులతో చేరితే క్షయ, ఉబ్బసము రావచ్చు యకృత్తులో నిలవఉంటే పైత్యకోశ వ్రణము పుట్టవచ్చు క్రిమికలో దూరితే ఆమాశయవ్రణము కలుగవచ్చు మూత్రపిండములలో నిలబడిందాఅంటే మూత్రా శ్మరి, లాలామేహము, శిలామేహము మొదలగునవన్నీ రావచ్చు అదేమిటి, యిదేమిటి, లెక్కలేనన్ని మూత్రవ్యాధులు కలుగ వచ్చు ఇంతవఱకు ప్రత్యక్షరోగాలగూర్చి చెప్పకొన్నాము. వీటినుండి పరోక్షరోగాలుకూడా రావచ్చు సామాన్యజ్ఞానము కలవారందరకు ఈరోగాలు ఈకారణములచేత వచ్చుచున్న వని తెలిసినా శాస్త్రజ్ఞులకు మాత్రము అంతర్వ్రణముల పుట్టు పూర్వోత్తరములు తెలియలేదట? ఎంతవిచిత్రము!

ప్రకృతి గోత్రికుల అభిప్రాయములతో మనకేమీ పని లేదు సుప్రసిద్ధమందు వైద్యుడు డాక్టరు నికాలస్‌సేన్ వ్రణరోగ కారణమునూ, రోగ నిర్ణయముగూర్చి ఏమీ చెప్పాడో తెలుసుకొందాము శాస్త్రమును గుడ్డిగా నమ్మె వారు, నారాధించువారు, ఈ విషయమైనా గ్రహింతురు గాక ప్రపంచయాత్ర ముగించుకొని, చికాగోలోని పత్రికా ప్రతినిధులతో జరిగిన సంభాషణనుండి యీ భాగమును వ్రాయుచున్నాను

## మితిమీరి తినుట, నాయకట్టడమే వ్రణమునకు కారణము

ఆఫ్రికా ఖండమంతనూ తిరిగివచ్చాను అనేక విషయ ములను గ్రహించితిని నవనాగరికులలోనే అంతర్వ్రణములు

ఎక్కువనియు, మోటువారిలో నివి లేనే లేవనియు తెలుసు కొన్నాను

ఈ భయంకర వ్యాధిని గూర్చి చాల కొద్దిమందికే బాగా తెలుసును అందులో నేనొక్కడను ఈ రోగము ప్రారంభ దశలోనే శస్త్ర చికిత్సతో కుదురుతుంది రోగము ముదిరిపోతే శస్త్రికూడా యేమీ చేయలేదు అందువలన రోగము రాకుండా కాపాడుకోవడమే మంచిది ఎట్లాగంటే ఆహారమును, విహారమును నియమించు కోవడము

మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము మొదలగు రోగములవలె నిదికూడా నవనాగరికులకే వస్తుంది ఉష్ణదేశములలో ఉండి, చలిదేశములలో లేదా అంటే అదీ కాదు శీతోష్ణములకును, దీనికిని నెట్టి సంబంధము లేదు శీతోష్ణముల మార్పులు ఈరోగమును నయము చేయలేవు

## మితిమీరి తినడంవల్లనే వ్రణములు పుట్టుచున్నవి.

మానవులు తమ అలవాట్లను చాలావఱకు మార్చుకోవాలి ముఖ్యంగా పొట్టకు తినడములోనూ, దుస్తులను ధరించడములోనూ ఎంత త్వరగా తమ అలవాట్లను మార్చుకొందురో అంత త్వరగా రోగవిముక్తు లగుదురు. పెద్దలకుండే అలవాట్లు పిల్లలకు వస్తాయి నయము చేసికొనుటకు తెలియదు కాబట్టి రాకుండానే చూచుకొనుట యుక్తము. ప్రకృతికి అనుగుణముగా పిల్లల పెంచామా అంటే యీ పాపిష్ఠి రోగాలు రానేరావు జీర్ణక్రియ బాగుండి, మలిన పదార్థములు ఎప్పటికి కప్పుడు వెడలిపోతుండటే నరములు జల

వంతముగా ఉంటవి నరములు బలవంతమైతే రోగము రానే రాదు వచ్చినా త్వరగానే నయము చేయవచ్చు ఇదివరకే రోగపదార్థము సంక్రమించినదని భయపడేవాళ్ళు ఆహార విహార నియమములతో నయము చేసుకోవచ్చు శుచిగా ఉండాలి చుట్టత్రాగటం మానాలి వస్త్రులు బిగించి కట్టరాదు.

ఆఫ్రికా ఖండము తూర్పు తీరమున ప్రయాణముచేసి ఆ ఖండవాసులను గూర్చి చాలా నేర్చుకొన్నాను ప్రయాణము చాలా బాగున్నది ఆఫ్రికాఖండవాసు లందరూ ఒకేరకంగా ఉంటారు నీగ్రో యెక్కడకు పోయినా ఒకటే అందరూ మోటువారే దేశమధ్యభాగమందు వారు చక్కగా ఉంటారు తీరములందుండు వారు స్తబ్ధులు

వికలాంగులు, ఉన్మాదులు వారిలో లేనేలేరు అంత క్షీణములతో బాధపడేవారు మచ్చునకైనా కానరారు. ఈ బాధలన్నియు నాగరికులలోనే ఉన్నవి

వారిలో చాలామంది శాకాహారులు, ఉత్తర భాగమునందుండు ఎస్కిమోలు మాంసాశనులు వీరందరూ కావలసినంతవరకే తింటారుగాని యెప్పుడూ యెక్కువ తినరు అందువలననే వారికి రోగాలురావు ఏ ప్రదేశములలో నివసించేవారు ఎక్కువగా తింటారో ఆ ప్రదేశములలోనే రోగాలు ఎక్కువగా ఉంటాయి

నవనాగరికులలోనుండేచాలా రోగాలు ఎస్కిమోలలో లేవు క్షయ రోగము మచ్చునకైనా కానరాదు. తెల్ల జాతుల సంపర్కము ఎక్కడైతే ఉన్నదో అక్కడల్లా క్షయ

రోగమున్నదన్నమాటే ఇచ్చట చలిజ్వరము మాత్రము తీవ్రముగా ఉన్నది తూర్పు తీరమంతా యిది ఉన్నది

(వరగడుపుననే 5 గ్రైనుల క్వినైను నిమ్మరసముతో సేవించు చుండెడివాడను అందువలన నేను చలిజ్వరముతో బాధపడకుండా తప్పించుకొన్నాను )

సమీక్ష - డాక్టరు సేన్ 2-1-1908 తేదీన చనిపోయినాడు తిరిగి వచ్చిన తరువాత డాకరుగారు బాగుండలేదని, కొండలలో తిరగడమువలన ఆరోగ్యము చెడిపోయి అకాల మృత్యువును పొందినాడని పత్రికలన్నీ చెపుతున్నాయి నిజము చెప్పాలంటే ప్రయాణ బడలికకన్న క్వినైనే డాక్టరుగారి ప్రాణాన్ని హరించినది

తరుణరోగాలను త్రొక్కి పెడితే కాలికరోగా లగుతవి

ప్రకృతిసహజముగా జీవనము చేయుట అలవరచుకొన్నామా అంటే అన్నిరోగాలు అంతరిస్తాయి ప్రకృతి నియమములను ఉల్లంఘించుటవలననే యిన్నిరోగాలు వస్తున్నాయి నేటి నాగరికత జీవిత పంథాలను మార్చినది సరియైన నాగరికత బుద్ధి వికాసమునకును ఆత్మోపలబ్ధికిని సాయపడాలి డా సెన్ చెప్పినట్లు మాంసమును, ఎక్కువగా తినడము, టి, కాఫీ, సారాయిలను సేవించడము, భయము, కోపము, ఆదుర్దా, యింద్రియ లౌల్యము,కృత్రిమాహార సేవనము,విషవాయువుల పీల్చడము మొదలగునవన్నీ కూడా జాతినీ, దేశాన్ని నాశనము చేసినవి ఇవన్నీ నాగరికతాఫలితములే అనాదినుండి ప్రకృతి వైద్యులు ఈవిషయాన్ని హెచ్చరిస్తునే ఉన్నారు చలి జ్వేడి

దేశాలలో తిరిగివచ్చిన డా సెన్ యీవిషయాలన్నీ చెప్పాడు ఎట్లా జీవిస్తే అంతర్వ్రణాలు రాకుండా ఉండేదీ చెప్పాడు మనతాతలు ప్రకృతిసూత్రమునకు అనుకూలముగా జీవించుట చేతనే హృద్రోగములు అగ్నిమాంద్యము, పిచ్చి, ఉన్మాదము, మనోదౌర్బల్యము, గగనభీతి, పక్షవాతములు వారినేమీ చేయలేకపోయినవి ప్రకృతినియమముల నతిక్రమించుటచేతనే నేటి నవనాగరికు లందరును వీటితో బాధపడుచున్నారు నాగరికులలో ఉండే ప్రసవవేదనలు మోటువారిలో మచ్చునకైనా లేవని డా సెన్ చెప్పాల్సింది

ఒక్కవిషయమునుమాత్రము ఈ వైద్యశేఖరుడు మరచినాడు తరుణ రోగాలను త్రొక్కిపెట్టుటచేతనే కాలిక రోగాలన్నీ త్వరగా వృద్ధిపొందుతున్నవి విషౌషధముల ప్రయోగించియు, శస్త్రచికిత్సల చేయుటవలననే యివన్నీ వస్తున్నాయనికూడా చెప్పాల్సింది

కృత్రిమాహారములకు అలవాటుపడితే ధాతుశక్తితగ్గి పోతుంది ధాతుశక్తి తగ్గిపోతే దేహములో తయారై బయటకు వెడలి పోవలసిన మలములు బయటకు పోక లోపలనే పేరుకొని పోవును ఇట్లు పేరుకొనుటచే బహిష్కార్యావయవములు అనగా చర్మము, మలకోశము,మూత్రపిండములు, ఊపిరితిత్తులు సరిగాపనిచేయవు. వీటిలో నే ఒకటైనా పనిచేయుచుండినచో పని యెక్కువగుటవలన అదికూడా చెడిపోతుంది ఎప్పుడైతే మలద్వారములు నాలుగు కట్టుబడి పోతవో అప్పుడు లోపలి రోగపదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతి మరొక

మార్గమును వెదుకును లేనియెడల ఈమురుగుతో మనమే నాశనమై పోతాము ఇట్లా బయటకు వచ్చినవే జలుబు, చర్మ వ్యాధులు, అతిసారము, కంతులు, పుండ్లు, చెమట యెక్కువగా పోయుట, మూలవ్యాధి మొదలగు ననంఖ్యాకమైన వ్యాధులన్నీ

చర్మముద్వారా బయటకువచ్చు మలినములనురసము, గంధకములపూతలు లోపలకు నెట్టివేయవచ్చు జ్వరము, రక్తాభిష్యందము ఒక్కతడవతోనే మళ్ళీ రాకుండా పోవచ్చు డాక్టరుగారి ప్రతాపమును రోగి వేనోళ్ళ పొగడవచ్చు. అయితే లోపల జరిగే గ్రంథమేమిటి? నేను వెళ్ళిపోతానో అన్న మురికినంతను లోపలనే నిర్బంధించినా మన్నమాట ఈ మురికినన్నా యెట్లా నిరోధించడము? తీవ్రమైన విషములతో అణచివేయుట ప్రకృతి అప్పుడు ఏమి చేస్తున్నదని మీరడుగవచ్చు

కొద్దిమురికే దేహములలో ఉండకూడదని పుండ్లద్వారా బయటకు నెట్టివేసే ప్రకృతి,అంతకన్న నెక్కువ మురికివస్తేయూరుకుంటుందామరి దాన్ని నెట్టుటకు ప్రయత్నము చేస్తుంది వెనుకటి చిన్నపోట్లాటను వదలిపెట్టి యావచ్ఛక్తితో కొత్త మురికిని బయటకు నెట్టుతుంది ఎప్పుడైతే రోగము స్వాధీనమునకు రాదో వైద్యుడు ఘాటైనమందులు పోస్తాడు ధాతుశక్తి బాగాఉంటే త్వరగా ఎదురు తిరుగుతుంది వైద్యుడు మరింత తీవ్రమైన మందులు వాడుతాడు సాధారణముగా వైద్యుడిదే పైచేయి అవుతుంది ధాతుశక్తి యీవిషముల బయటకు నెట్టలేక ఊరుకొంటుంది ఇప్పటికి లోపల రెండు

విషాలు చేరినాయి, ఒకటి, రోగానికి కారణమైన విషము రెండు, మందులలోని విషము ఈదేహములో రెండే విషాలు ఉన్నదీ లేనిదీ కంటినిచూస్తే బాగా తెలుస్తుంది ధాతుశక్తి ఒకింత బలపడుటతోడనే రోగపదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతి మళ్ళీ ప్రయత్నము చేస్తుంది వెనుకటి త్రోవన రావచ్చు లేదా మరొక త్రోవనైనా రావచ్చు రోగము తిరగపెట్టినదని ఘాటైన మందులు పోస్తాము కాబట్టి రెండో తడవకూడా ప్రకృతి వెనకడుగు వేస్తుంది ఇట్లా అనేక పర్యాయములు ప్రయత్నాలు జరుగుతాయి అన్నితడవలు మందుతో అణచివేస్తారు చివరకు తలఅయినా యెత్త లేకుండా పోతుంది రోగపదార్థమును తరుణ రోగములుగా బయటకు నెట్టలేకపోయింది ప్రకృతి ఇదే కాలికరోగమునకు ప్రారంభము ఈ కాలిక రోగాల్నే కుదరవంటారు మందు వైద్యులు జన్మావధీ వాటితో తీసికోవలెనంటారు క్రమేపి పోతుందంటారు (అర్థాత్ పోదన్నమాట)

రోగాలు రాకుండాను, వచ్చినతరువాతను మానవ జాతిని కాపాడుటకు మందువైద్య శేఖరులు పెక్కుమందులను కనిపెట్టారు శస్త్రములు, యక్సరే, రసములు, టీకాలు ఈ సంచికట్టులోనివే మందులతోబాటు రోగాలు కూడా యెక్కువైనాయి నరాల బలహీనత, పిచ్చి, గగనభీతి, క్షయ, ఉబ్బసము, సుఖసంకటాలు, అగ్నిమాంద్యము, మొదలగు దుర్భర రోగాలన్నీ యిట్లా వచ్చినవే తరుణరోగాలను విషౌషధములతోను, శస్త్రములతోను, అణచివేయుటచేతనే

కాలికరోగాలు పుట్టుతున్నా యన్నమాటను డాక్టరు సేన్ విస్మరించాడు ప్రకృతి వైద్యమును మనసులో ఉంచుకొని తన అనుభవముల పరిశీలిస్తే యెక్కడ మందులషాపులు ఎక్కువగా ఉన్నాయో అక్కడనే రోగా లెక్కువని యీ వైద్యశేఖరుడే చెప్పినాడు పై విషయాలు అతిశయోక్తులని మీకు తోచవచ్చు మా చికిత్సాలయములో జరిగిన విషయాలు చెపితే మా పై వాక్యములు నిజమని మీకే తెలుస్తున్నది

మామూలుగా అనుకొనునట్లు పక్షవాతము, కాళ్ళూ, చేతులూ చచ్చువడుట, మొదలగున వన్నీ సుఖరోగాలను రెండు మూడు తరములనాడు అణచి పెట్టుటచే వచ్చిన వ్యాధులుగావు సుఖసంకటాలను నయము చేయుటకు వాడిన పాదరసము వలననే యివన్నీ వచ్చినాయి పాదరసము, అయిడోఫారము వాడకపోతే పైనచెప్పిన యేరోగాన్నైనా ఆరు నెలలలోనే నయము చేయవచ్చు. రోగాన్నే మీా ముట్టుకోకుండా, మలినపదార్థముల బయటకు నెట్టుటకు ప్రకృతికి సాయముచేస్తే తుక్కు తగల పెట్టడానికి నిప్పు అవసరమేగాని, యిల్లుముట్టుకోకుండా చూడాలిగా ప్రకృతి వైద్యపద్ధతులతో నయముచేయుటకు మొదటే మొదలు పెట్టితే యీ రోగమే కాకుండా తరతరాలనుండి రక్తములో జీర్ణించిపోయిన నరుకంతా బయటపడుతుంది నయమైన తరువాత రక్తము, నరములు, శుభ్రిమగుతవి

అవినీతిగా పోతేగదా సుఖసంకటాలు కలిగేదని మీా

రడుగవచ్చును నీతి, అవినీతులతో మన కిప్పుడు సంబంధము లేదు వచ్చిన రోగాన్ని ఎట్లా పోగొట్టుకోవడమా అనే మనము చూడాలి మొదటికే మోసము తెచ్చే ప్రక్రియను గూడా మనము ప్రయోగించరాదు ప్రాణానికే మోసము వస్తే వైద్యమెవరికి? ఉన్నవస్తువును బాగుచేయాలి మందులు పోస్తే మరింత అధ్వాన్నమవుతుంది సుఖసంకటాలు ఆడ వాళ్ళకు, పిల్లలకూ యేమీ తెలియకుండానే వస్తాయి పాద రసము, అయిడోఫారము, 606 (నియోసాల్వర్సన్) మొద లగున వన్ని సేవించుట చేతనే యివన్నీ వచ్చినాయని వారికి నచ్చ చెప్పాలి ఏమీ భయపడ నవసరములే దనాలి

ఈ మందులన్నీ రోగపదార్థమును బయటకు రాకుండా అణచిపెట్టుటకే సాయపడుతవి బయటకు రాదుగాన రోగాన్ని కలుగచేసిన విషము రక్తములో కలిసి దేహమంతటా తిరుగు తుంది రక్తములో కలిసి తిరుగు చుండుటచే, దగ్గరగానుండు బహిర్భాగావయవము చర్మ మగుటచే దాని ద్వారా నైనా బయటకు నెట్టుటకు ప్రయత్నము చేస్తుంది పొక్కులు ఇట్లా వచ్చిన వేను చర్మముమీద పొక్కులు కనబడగానే రసమును, గంధకమును, నెలలూ, సంవత్సరముల కొద్దీ కలిపి రాస్తాము. అప్పటికి పొట్టు రాలిపోతుంది రెండు మూడు నెల లైన తరువాత మళ్ళీ బయట పడుతాయి

ఈతడవ ఘాటైన మైలతుత్తమును రాస్తాము అప్పటికి తగ్గిపోతుంది. బయటకు రాలేనంతవరకు మందులు రాస్తాము చివరకు రక్తమంతా మురికే అవుతుంది రక్తముపోయి మురికే మిగులుతుంది. రోగాన్ని నయముచేయుట యిదే.

మందు వైద్యులకు ఈ సంగతంతా తెలుసు "రెండు, మూడేళ్ళు రసపుమందులు వాడితే సుఖరోగా లేవీ బయటకు రావు పెళ్ళిచేసుకో వచ్చునని చెప్పు కానీ రోగముపూర్తిగా నయమైనదని మాత్రము గ్యారంటీ యివ్వకు" అని వైద్య విద్యార్థులకు అధ్యాపకులు చెపుతారు

ఎందుచేతనంటే తాము వాడినమందుల వలన రోగము పూర్తిగా పోలేదనీ, ఈ రోగి పెండ్లి చేసుకొన్నట్లయితే వారికి కలిగే పిల్లలకు ఈ రోగాలు వస్తాయని, అంతేగాక పెద్దలకు కూడా సుఖరోగాలు అదేరూపములో గాని, వేరేరూపములో గాని, ఎప్పుడైనా తలెత్తితే వారు సతాయిస్తారని భయము రసము చొరరాని చోటేలేదు నరాలలో చేరిందా చిమచిమలు పుట్టుతాయి వెన్నెముకలో చేరితే మూలవ్యాధి వస్తుంది తలలో చేరితే పార్శ్వపునొప్పి పుట్టుతుంది. మెదడులో చేరితే పిచ్చెక్కుతుంది ఈరసము, గంధకమే నిరంతరమూ వాడుతూఉంటే నరాలన్నీ బిరుసెక్కిపోతాయి నిగడ తన్నుకొంటాయి పక్షవాతము రావచ్చు ఇంతేగాక ఇంకా అనేకరోగాలకు అనేకమందులు వాడుతారు

కొన్ని యేండ్లక్రితము మా చికిత్సాలయమునకు ఒకామె వచ్చింది ఆమెకు కాళ్ళూ, చేతులు చచ్చుపడిపోయినాయి బాధపడుతోంది విచారిస్తే మలబద్ధకమునకును, మధుకోశములోని జబ్బునకును, రసభస్మమును చిన్నపుడు నాలుగు అయిదు తడవలు వాడారట కొద్దిగాఅయితే బాగానే ఉండేది గొడ్డుకుపోసినట్లు చేలికొద్దీ పోశారు గజ్జిలేచింది

రసముపూశారు ఆమెకు 14 ఏండ్లు అప్పటికే పాదరసము వాడినందువలన కలిగే రోగాలన్నీ వచ్చినాయి

మరొకరికథ చెపుతాను ఒక పెద్దమనిషికి పదిహేనేండ్లకిృందట గజ్జిలేచినది రసము, గంధకము కలిపిరాచారు తుప్పు రాలిపోయినట్లు రాలిపోయింది అప్పటినుండీ జబ్బు లేదు ఇప్పుడు మాత్రము కాళ్ళూ చేతులు చచ్చుపడి పోవుటచే బాధపడుతున్నాడు

ఒక పెద్దమనిషికి 30 సంవత్సరాలుంటాయి ఆయనకు పిచ్చిఎక్కినది ఆయనకు నాల్గేళ్ళప్పుడు చీడ పగ లేసినదట. దాసీదానినుండి సుఖరోగాలు అంటినాయన్ని వారివైద్యుడు ఆరు నెలలు రసపుమందులను వాడినాడు (Psora) అంటే వంశానుగతమున వచ్చిన రోగప్రవణత కంటేని చూస్తే ఆసంగతి తెలిసింది పోనీ దాసీదాని కేమైనా అటువంటి రోగాలున్నాయా అంటే అవీలేవు సుఖరోగాలు ఎందుకు వచ్చేదీ, యెట్లాపోయేదీ మరొకపుస్తకము లో సాకల్యముగా తెలుసుకొందాము

### కసీనికను చూస్తే యేమి తెలుస్తుంది?

క్వినైను, అయిడోఫారము, పాషాణములు మొదలగు లోహముల మందులపేరుతో నిరంతరము వాడితే వారికిరోగాలు వచ్చినట్లు తెలుసుకొని చాలా కేసుల నయము చేసినాము అట్లా నయమైన రోగాలలో సంధివాతము, ఆమవాతము, నాడీవ్యాధులు, మూర్ఛ, క్షయ, అంత

రక్షీణము, బుద్ధిమాంద్యము మొదలగునవన్నీ, ఉన్నాయి. ఈ రోగాలున్నట్లు కనీనికను చూస్తే తెలుస్తుంది.
ఎట్లాగంటే —

(1) దేహములో ఉండే రోగాలన్నీ కనీనికలో కనుబడుతాయి

(2) దేహములోని యే అవయవములో రోగవదార్థమున్నా, కనీనికలో దానికి సంబంధించిన ప్రతినిధి స్థానములో రోగము కనుబడుతుంది

(3) లోగడ ఏ రోగము వచ్చినదీ అందుకు ఏమందులు వాడినదీ తెలుస్తుంది

(4) ప్రకృతి వైద్యము చేస్తే పాతరోగాలన్నీ బయటపడుతాయి స్వాస్థ్య సంకటములుగా బయటకు వెళ్లిపోతాయి.

(5) ఏమందులతో ఆ రోగాలనణచిపెట్టారో ఆ యా మందులుకూడా ఈ స్వాస్థ్య సంకటాలతో బయటకు వెళ్ళిపోతాయి

(6) మందు బయటకు వెళ్ళిపోగానే కనీనికలో ఉండే ఆమందురంగు లోపిస్తుంది

ఇంకా విశదముగా చెప్పవలెనంటే,

(1) క్వినైను మెదడులో చేరినట్లు తెలుస్తుంది

(2) క్వినైను తలలో చేరినదీ అంటే తలనొప్పి వస్తున్నదని, చెవులు గింగురు మంటుంటాయని, ముకోపి అనీ రోగిని అడగకుండనే చెప్పవచ్చు,దీని నే మందు వైద్యులు వంటజితించిన దంటారు

(3) రోగిని అడిగితే తాను కాస్తకూ కూస్తకూ అంతులేని క్వైను తిన్నట్లు చెపుతాడు

(4) ప్రకృతి వైద్యము చేస్తే రోగి బాగుపడుతాడు

1 దేహము శుద్ధి అగుతుంది 2 బహిష్కార్యావయవములు బాగా పనిచేస్తాయి 3 పాతరోగాలు, మందులూ బయటకు వెళ్లిపోతాయి 4 బయటకు పోయేటప్పుడు క్వైను ఏమన్నా గడబిడ చేస్తే చేయవచ్చు

(5) క్వైను వెళ్ళిపోయేటప్పుడు తలనొప్పి, చెవులు గింగురుమనుట, జలుబు చేయుట, నాడీ వ్యాధులు, చివరకు నోటిలో కూడా ఆ వాసన రావచ్చు

(6) ప్రకృతి వైద్య చికిత్సా పద్ధతులతో స్వాస్థ్య సంకటములు కలుగచేసినట్లయితే రోగము త్వరగా నయమగును దేహమునుండి పాతరోగాలు పోగానే కనీనికలోని మందులు రంగులు పోవును కనీనిక తేటగా నుండును

ఇంతవరదాకా శాస్త్రాన్ని చెప్పాము ఇకను ప్రత్యక్ష ప్రమాణములకు వద్దాము ఆమాశయములో పుట్టినవని చెప్పేజబ్బులను, వాటికి మందువైద్యమువారు చేయు ప్రక్రియలను తెలుసుకొందాము జలచికిత్సా ప్రక్రియలతో ఆమాశయములో కలిగే మంటలెట్లా పోయేదీ ముందు అధ్యాయములో తెలుసుకొందాము

# ౧౨

# ఆమాశయ వ్రణములు

## మందు వైద్యమువారి రోగనిర్ణయము చికిత్సా ప్రక్రియలు

ఆమాశయమునే క్రిమిక అంటారు ఊర్ధ్వముఖముగా పోవు పెద్దప్రేగు క్రిందిభాగమున ఇది ఉండును దీనిలో కలిగే జబ్బులనుగూర్చియూ దానికి మందువైద్యమువారు చేయు వైద్యప్రక్రియలగూర్చియు తెలుసుకొందాము

మందువైద్యులు అంటారుగదా "అన్నిరోగములవలెనే యీరోగమూ సూక్ష్మజీవులవలననే వస్తుంది సూక్ష్మజీవులే కారణము"

ఆమాశయములోని ఆమత్వచములో కలిగినలోపముల వలననే రోగ మెక్కువగును మలముగడ్డకట్టుకొనిపోయినా, అరగని పదార్థములు మిగిలిపోయినా, గింజలు నిలబడినా యీరోగమువస్తుంది సూక్ష్మజీవుల తీవ్రమునుబట్టి కారణము లేకుండానే రోగమురావచ్చు రోగలక్షణములు — అమాంతముగా కడుపులో నొప్పి వస్తుంది పొత్తికడుపంతా బాధగా ఉంటుంది మూత్రపిండముల దగ్గరగా నొప్పి ఉంటుంది కొద్దిజ్వరముండును నాలుక మొద్దుబారిపోవును మలబద్ధకము బాగానే ఉంటుంది కక్కులు ఉండవచ్చు కుడిప్రక్క కండరములు బిగకట్టినట్లుండును కుడితొడకూడా నొప్పిగానుండును క్రిమికతో తెలుపుప్రదేశము వాయును చిన్నప్రేగుచుట్టూనుండుపొరలో పుండ్లుపడి మంటలు పుట్టితే చావు తప్పకుండా రావలసిందే

## మందు వైద్యమువారి చికిత్సా ప్రక్రియలు

మందువైద్యము ప్రకారము క్రిమికలో జబ్బుపుట్టగనే ఆపరేషను చేయవలసినదే అంతకన్న తేలికమార్గము లేదు ఆపరేషను చేయకపోతే రోగము పూర్తిగా నయము కాదు మళ్లీ తలెత్తుతుంది ఆపరేషనుచేస్తే రోగము ఎన్నటికీ తలెత్తదు చిన్నప్రేవులచుట్టూ నుండు పొరలో మంటలు, పోట్లు పుట్టవచ్చును ఇవేయెక్కువైతే యమదర్శనము తప్పదు

లోపల పుండ్లుపుట్టితే ఆపరేషను చేయవలసినదేగాని కుదురుటమాత్రము చాలాఅరుదు

ఈ రోగముల కన్నిటికినీ సామాన్యముగా శస్త్ర చికిత్సనే చేయుచున్నారు రోగి శస్త్రచికిత్సను వద్దన్నా రేపుఎల్లుండిలో శస్త్రచికిత్స చేయవచ్చునని ధైర్యమున్నా వైద్యుడు మందుల నుపయోగిస్తాడుకాని, రోగి వచ్చాడాఅంటే శస్త్రచికిత్స చేయవలసిందే అప్పుడుమాత్రము ఏమి మందులను వాడుతారు? నొప్పియున్న ప్రదేశమును వేడినీటితో కాస్తారు ఎనిమా చేస్తారు నొప్పి తెలియకుండా ఉండేటందుకు మార్ఫియా యింజక్షను ఇస్తారు పాలను తాగిస్తారు కదలకుండా, మెదలకుండా పడుకోమంటారు

## ప్రకృతి వైద్యమువారి చికిత్సా ప్రక్రియలు

ప్రకృతివైద్యము ప్రకారము క్రిమికలో కలుగుబాధలన్నీ మామూలు కడుపునొప్పులేగాని వేరేమీగావు వీటికేమీ ఆపరేషనులు అవసరములేదు ఆపరేషనులు ధనవంతులకే కావాలిగాని సామాన్యులకు కోతలు అవసరములేదు.

పాత మందువైద్య అనుయాయులందరును టాన్సిల్సు తోబాటు ఆమాశయములను కోసివేయవలసినదేనని గట్టిగా వాదించుచున్నారు. మరి బుద్ధిమంతులు టాన్సిల్సు, ఆమాశయములు ఉంచుటచేతనే యిన్ని యిబ్బందులు గలుగుచున్నవి గాన, మానవలోకమునకు బాధలేకుండా చేయవలెనంటే పుట్టినవెంటనే శిశువులకు ఈ రెంటినీ తీసివేయవలెనంటున్నారు.

లోకజ్ఞానము లేనివారు ఆమాశయములలో రాతి ముక్కలు చేరినవని, వాటిని తొలగించుటకుగాను ఆమాశయముల తొలగించవలెనని భావింతురు. ఆమాశయములలో గింజలు ఉన్నవని చేయు ఆపరేషనులలో నూటికి ఒకరిలో కూడా యివి ఉండవు. ఆమాశయ రోగములగూర్చి పెద్దలేమి చెప్పారో విందాము.

విలియమ్ ఆస్లిర్ సుప్రసిద్ధ మందువైద్యులు. కెనడా దేశమునకు ముఖ్యపట్టణమగు మాంట్రీలులో పది సంవత్సరములు వైద్యవృత్తి నవలంబించారు. ఆయన యేమన్నాడంటే నాపది యేండ్ల అనుభవములోను రెండు కేసులలో మాత్రమే ఆమాశయములో అరగని పదార్థములు చేరినట్లు నేను చూచినాను అని 'మందువైద్య పద్ధతులు' అనే తమ గ్రంథములో 520 పేజీలో చెప్పారు.

పెద్దలు చెప్పినమాటలబట్టి చూస్తే ఆమాశయములో జబ్బులున్నవని చేయు ఆపరేషనులలో నూటికి పదిహేను మందిలోనే ఆమాశయములలో జబ్బులున్నవని తేలుతున్నది. మిగిలిన యెనుబదిఅయిదు కేసులలోను అచ్చట జబ్బులుండవు. ఆచుట్టుప్రక్కల నెక్కడ లోపమున్నా ఆమాశయ

ఘములోనే జబ్బులున్నవని వాటిని ఆపరేషను చేస్తారు చిన్న ప్రేగులలో జబ్బు ఉండవచ్చు పెద్దప్రేగులో లోపము ఉండవచ్చు చిన్నప్రేగుకు చుట్టూనుండుపొరలో మాటలు పుట్ట వచ్చు 'మూసేవాడు, చేసేవాడు ఇద్దరు గ్రుడ్డివాళ్ళే' అన్నట్లు నోరు వాయీ లేనిజనమంతా ఆపరేషను చేయించుకొనేటం దుకు సిద్ధపడతారు ఈ రోజులలో ఆపరేషనులు చేయించు కొనుట సరదా అయింది

రోగి డాక్టరు దగ్గరకు వెళ్ళుతాడు ఆ చుట్టుప్రక్క ల నెప్పుట జబ్బుగా ఉన్నా కొత్తరకమైన పనిముట్లు వచ్చి నాయి ఒక్క క్షణములో ఆపరేషను చేస్తానంటాడు రోగి యిష్టపడతాడు

కత్తులతోనే పనిలేకుండానే మా ఆసుపత్రిలో వందల కొద్దీ కేసుల నయముచేసినాము అందరూ సలక్షణముగా ఇంటికి చేరినారు ఒక్కటికూడ బీరుపోలేదు డంబోక్తులు పలుకుతున్నామని భావించవద్దు ఆరోగ్యశాఖవారికి మేమప్ప టికప్పుడే పంపినలెఖ్ఖలే యిందుకు నిదర్శనములు 'రోగులకు ఈ రోగము ఉన్నదో లేదో అంటే ఈ రోగము ఉన్నది ఆపరేషను చేయించుకొకపోతే బ్రతకవు అని వైద్య పండి తులు చెప్పిన తరువాతనే మా దగ్గరకువచ్చి నయము చేసుకొని సలక్షణముగా ఇంటికి చేరినారు'

ఈ సోదంతా యెందుకు? ఏదో పనికిరాని అవయవ ముగదా ఆదిమ మానవులలో అవసరమైనదిగాని యిప్పుడు అవసరము లేదుగదా, కాయలు ఆకులు తినినపుడు అవసర మైనదేమోగాని యిప్పుడేమీ అవసరము లేదంటారేమో

దీనికి మా సమాధాన మేమంటే అమీబా మొదలు మానవునివఱకుగల జంతువులను అవి తిను ఆహారమును బట్టి నాలుగు తరగతులుగా విభజింపవచ్చును (1) మాంసభక్షక జంతువులు (2) తృణభక్షక జంతువులు (3) ఫలభక్షక జంతువులు (4) సర్వభక్షక జంతువులు మాంసభక్షక జంతువుల జీర్ణావయవములకును ఫలభక్షక జంతువుల జీర్ణావయవముల కును తేడా ఉన్నది వేటికవి వేరు. ఇట్లనే మిగిలినవియు జీర్ణావయవములను బట్టి మానవులు ఫలభక్షక జంతుకోటిలోని వారు

మాంసభక్షక జంతువులలో ఆమాశయము చాలా చిన్నదిగా నుండును తృణభక్షక జంతువులలో అంతకన్న పెద్దదిగా నుండును ఫలభక్షక జంతువులలో ఇంకాపెద్దదిగా నుండును సృష్టి మొదటనుండి యిప్పటివఱకూ యిది పెరుగు చునే వచ్చినది దీనినిబట్టి చూచినా మానవుడు ఫలభక్షక జంతుకోటిలోనివాడు

ఇది పెరుగుటయేగాక, ఇందులో ఊరు ధాతువు జీర్ణక్రియకు ఉపయోగపడుతుంది దీనిఉపయోగ మేమిటన్ని సందేహము రావచ్చు దీనికి సమాధాన మిది - మాక్ ఈవెన్ గారు సుప్రసిద్ధ ఆంగ్ల మందువైద్యులు మరే వైద్యులుచేయని, ఆమాశయ వ్రణఆపరేషనులనువీరుచాలా చేసినారు ఆమాశయములు పనికిరావనియు కోసితీసివేయ వచ్చుననియు మొదటిలో వాదించినారు తరువాత తమ అభిప్రాయముల మార్చుకొన్నానని వాదించుట మొదలుపెట్టారు. వారి అభిప్రాయములనే యీ క్రింద పొందుపరుస్తున్నాము.

ఆమాశయములో ఒక రకమైన రసము ఊరును ఈ రసము జీర్ణక్రియకు అద్భుతముగా ఉపయోగపడును ఏయి బ్రిన్ ను మధురరసము ఆరు గంటలలో జీర్ణము చేయును. ఆమాశయములోని రసము ఆ మధురరసముతో కలిస్తే ఆ ఏయిబ్రిన్ నే 3 మొదలు 10 నిమిషములలోనే జీర్ణము చేయును మధురరసము కోడిగుడ్డుమీది పెంకును పదిగంట లలో గాని జీర్ణము చేయదు క్రిమికలోని రసము కలిసిన యీ మధుర రసమే కోడిగ్రుడ్డుమీది పెంకును 3-6 నిమిష ములలో జీర్ణము చేయును

ప్రేగులలోని నరములును, ఆమాశయములోని నర ములు అల్లిబిల్లిగా అల్లుకొని పోవును ఇట్లా అల్లికొనుటచే దీనిని కత్తెర వేయునపుడు, ఆ నరములు కూడ కత్తిరించ బడును పెద్ద ప్రేగునకును, చిన్న ప్రేగునకును, నష్టము కలుగునుకాన తొలగించరాదు

## ప్రేగులలోని ఆయువుపట్టు

మనము తిను ఆహారము జీర్ణాశయములోనికి చేరును అచ్చటనుండి చిన్న ప్రేగులలోనికి పోవును అరగక మిగిలి పోయిన పదార్థము ఇలి యోకేకల్ వాల్వ్ ద్వారా క్రిమికలోనికిని, అచ్చట నుండి లంబికలోనికిని పోవును పెద్ద ప్రేగు మొదటలో లంబిక ఉన్నది ఊర్ధ్వముఖముగా పోవు పెద్దప్రేగు మొదటలో లంబిక (క్రింది మట్టములో) సంచిమాదిరిగా నుండును లంబికనుండి మలము ఊర్ధ్వగతిగా పెద్ద ప్రేగులోనికి

పోవును తరువాత సరళాంత్రముద్వారాపోవును అటుపిమ్మట అధోముఖాంత్రము ద్వారా బయటకు పోవును అచ్చట నుండి సిగ్మాయిడ్ ఫ్లెక్షర్ లోనికిని, తరువాత ఆసనము ద్వారా బయటకు పోవును మలము ఊర్ధ్వముఖాంత్రము గుండా పోవలసివచ్చినపుడు ఊర్ధ్వముఖముగా పోవలసియుండును మిగిలిన పెద్ద ప్రేగు భాగముల ద్వారా మలము కష్టము లేకయే క్రిమిచలనమువలన వదలిపోవును ఊర్ధ్వముఖముగా మలముపోదు క్రిమిచలనము ఉన్నప్పటికిని గురుత్వ నియమము చేత మలము క్రిందికే పడును మలమును క్రిందికి పడకుండా క్రిమికలో ఊరు ధాతువు సాయపడుచున్నదని ఇడి బ్యాబిట్ యం డి గా రభిప్రాయపడుచున్నారు ఈ క్రిమికను అందువలననే ప్రేగులలోని ఆయువుపట్టు అని నామకరణము చేసినాము మలబద్ధకమున్నదంటే లంబికలోని మలము అచ్చటనే నిలబడిపోయి మురుగుతుంది దుర్వాయువులు బయటకు వెళ్లుతాయి ఇచ్చట పుట్టిన ఆమ్లముల వలన ఆవరణ గోడలు పుండ్లుపడును లంబికలో మురుగు ఉండుటచేత, లంబికలోని, నరములకును క్రిమికలోని నరములకును సంబంధముండుటచేతనూ క్రిమికలో కూడా మురుగు నిలిచిపోవును బయటకు పోదు ఇచ్చట నిలబడిపోవుటచే మంటలు, పోట్లు, వ్రణములు, ఆమాశయములో ఏర్పడును జ్వరము వచ్చును రక్తములో మలినములు చేరుటచే ఈమలినములను శుద్ధి చేయుటకు హృదయము ఎక్కువగా స్పందించును సన్నిహిత దోషముచేత మూత్రపిండములలో కూడా మంటలు, పోట్లు పుట్టును

## క్రిమికలోని జబ్బులకు కారణమేమిటి ?

ఆంగ్ల మందువైద్యమువారు చెప్పినట్లు బయటనుండి వచ్చురాయి, రప్ప, గింజలవలన క్రిమికలో జబ్బులు పుట్టుట లేదు చిన్నప్రేగు, పెద్దప్రేగు తమపనినిత్ప ప్తికరంగా చేయక పోవుటవలననే అచ్చట మలము నిలవ ఉండును ఇట్లా నిలవ ఉన్నమలములో ఆమ్లములు, మంటలు పుట్టుచున్నవి ఇట్లా పుట్టిన మంటలకు శస్త్ర చికిత్సకులు చేయు పరిహారమేమిటి? తమ వైద్య సిద్ధాంతము ప్రకారము కత్తుల నుపయోగించి ఆమాశయముల తీసివేస్తారు పోనీ తీసివేసిన తరువాత ఆహార విహారములలో మార్చవలెనని రోగిని మందలిస్తారా అంటే అదీలేదు మార్చవలెనని వైద్యుడూ చెప్పడు రోగి చేయడు ఆహారములోని నియమములు లేనందున క్రొత్తమురుగు నిరంతరము చేరుచుండును

కొన్ని సంవత్సరముల క్రితము ఫ్రెంచి శాస్త్రజ్ఞుడొకడు ఏయే దేశాలలోని ప్రజలకు ఎక్కువగా ఆమాశయ వ్రణములు వచ్చేదీ, ఎందువలన వచ్చేదీ లెఖ్ఖలతో తయారు చేశాడు శాకాహారుల కన్న మాంసాహారులలోనే యీ జబ్బు లెక్కువగా ఉన్నవని తెలియచెప్పాడు ప్రపంచ మందలి దేశములలోకల్లా అమెరికాలో మాంస మెక్కువ ఖర్చగును అచటి ప్రజలు మాంసము నెక్కువగా తిందురు. మిగిలిన జబ్బులతోకన్న ఈ వ్రణములతో ఎక్కువగా బాధపడెదరు అమెరికా తరువాత ఇంగ్లాండులో మాంస మెక్కువ ఖర్చగును. తరువాత ఫ్రెంచి దేశములో మాంస మెక్కువ ఖర్చగును ఫ్రెంచిదేశస్థులు ఎక్కువగా తిందురు.

తుదకు జర్మనులు, ఆమాశయ వ్రణములతో బాధపడువారు
పై వరుసలోనే ఉందురు. ఈదేశవాసులలోను మద మాంస
ములు తిను ధనవంతులకు, తిండిపోతులకే యీ జబ్బులు
ఎక్కువగా నుండును కాయలూ, కూరలూ తినువారికి
మాత్రము చాలా తక్కువగానే వచ్చును

మలబద్ధకమును కలిగించు ఆహారములే ఆమాశయ
వ్రణములను వృద్ధిచేయును మాంసము, చేపలూ, కోడిగ్రుడ్లు,
కాఫీ, తెల్లరొట్టెలు, (మరపట్టిన గోధుమ పిండితో తయారు
చేయబడినవి) మొదలగునవన్నియు జీర్ణకారులుగావు గనుక
ఆమాశయ వ్రణములనే పోషించును మానవుని జీర్ణావయవ
ములు మాంసమును పచనము చేయుటకు అనుకూలముగా
సృష్టింప బడలేదు అరగదుగాన పులియును ఈ మురుగు
నుండే సూక్ష్మజీవులు పుట్టును మంటలునూ పుట్టును తరు
వాత అతిసారము పుట్టును జీర్ణావయవము లన్నియు చచ్చు
పడిపోవును ఆమ్లపదార్థములు, క్రొవ్వుపదార్థములు, చక్కెర
పదార్థములు, రోగపదార్థమును పెంపుచేయును కాఫీ, టీ
మొదలగుపానీయాలు ప్రారంభములో ఉద్రేకమునుకలుగచేసి
హుషారిచ్చును. ప్రతిక్రియలో నీరసమును వృద్ధిచేయును వీటినే
నిరంతరము సేవిస్తుంటే జీర్ణావయవములు చచ్చుపడి నిత్యకృత్య
ములకు సహితము ఉపయోగించవు జీర్ణావయవములు సరిగా
పనిచేయకపోవుటచే మూత్రపిండములలోను మూత్రకోశము
లోను రాళ్ళు చేరుటయేగాక క్రిమిక లంబికలలో గడ్డలుకట్టిన
మలమునిలిచిపోవును ఈగడ్డలవలన ఈ అవయవములలోను
ఉద్రేకముకలుగును బహిష్కరణ క్రియ సక్రమముగాజరగదు.

## తెల్లరొట్టె యెందుకు అరగదు ?

వరి, గోధుమ మొదలగు కాయధాన్యములను దంచుటయు, మరపట్టించుటయు గలదు వరిధాన్యమును దంచిన బియ్యముతయారగును ఈబియ్యములో మొలకలెత్తుపదార్థము నిలిచి ఉండును మరపట్టించిన బియ్యములో ఈ మొలకలెత్తుపదార్థము లోపించును దంపుడు బియ్యములో తీపి యెక్కువగా ఉండుటచే అవి యెక్కువకాలము నిలవయుండవు పురుగు పట్టును మరలలోని వేడికి బియ్యపుచివరనుండు పోషకశక్తి కాలిపోవును ఈ ఉష్ణమునకు బియ్యములోనుండు సేంద్రియ లోహాలవణములు నశించిపోవును బియ్యముమీదనుండుతవుడు ప్రేగులలో ఉద్రేకమును కలుగచేసి క్రిమిచలనమును వృద్ధి చేయును ఈతవుడే జిగటబారిన పిండిపదార్థమును జీర్ణకోశము యొక్క ఆవరణ గోడలకు అంటుకొనకుండ చేయును జారుడలను కలుగచేయును జీర్ణక్రియకు అవసరమగు రసము లన్నియు పిండిపదార్థముగుండా పోయి యీపిండిపదార్థమును ఆవరణగోడలకు అంటుకొనకుండా చేయును

తెల్లరొట్టెలకు వాడు పిండిలోని తవుడు లోపించుట చేత ఆపిండి జిగటబారి జీర్ణావయవముల గోడలను పట్టుకొని వదలదు చిన్నప్రేగులను పట్టుకొని యిది వదలకపోవుటచేత చిన్నప్రేగులలో గడ్డలుకట్టును ఈగడ్డలే జీర్ణక్రియకు అభ్యంతరములు కలిగించును ఈ తెల్లపిండిని గుఱ్ఱములుకూడా హారించుకొనలేక చిక్కి శల్యావశిష్టములగును చనిపోవుటయు గలదు వాటిలోగూడా యీపిండి అరగక గడ్డలుకట్టి జీర్ణక్రియ, బహిష్కరణక్రియలు క్రమముగా జరుగనీయకపోవుట

చేత అవి చనిపోవును జంతువులకే అరగని పిండిపదార్థములు మానవులకు అజీర్ణమును, ఆమాశయ వ్రణములను కలిగించు ననుటలో ఆశ్చర్యమేమున్నది ?

మదమాంసములు, చేపలు, కోడిగ్రుడ్లు మొదలగు నీచు పదార్థములు కాఫీ, టీ, కోకో మొదలగు పానీయాల సేవించుట వలన మలబద్ధకము ఏర్పడుతుంది ఈమలబద్ధకమునుపోగొట్టు కొనుటకు ఉద్రేకమును కలిగించు మందులు సేవిస్తార ఈ మందులు ప్రతిక్రియా ఫలితముల ననుసరించి యీఅవయవము లన్నియు తమపాటవమును పోగొట్టుకొనును చచ్చుపడిపోవును నిరంతరమూ మందులుసేవించువారిఅవయవములన్నియు ఇట్లా చచ్చుపడిపోయినవేను

మలబద్ధకము, ఆమాశయ వ్రణములు రాకుండాకాపాడు కోవలెనంటే కూరలు, పండ్లు ఎక్కువగా తినాలి మందు వైద్యమువారు, పండ్లలోని గింజలవలననే యీ వ్రణములు పుట్టుచున్నవని చెప్పుచున్నారు నిజముచెప్పాలంటే గింజల వలన ఈ రోగాలు రాకపోవకమేకాక, పండ్లను భుజించి నందువలన ఉన్నరోగాలుకూడా పోవును ఇవన్నియు నిదర్శన పూర్వకముగా చెప్పుమాటలేగాని గాలికబుర్లుగావు కాయలు పండ్లు తినువారిలో ఈ రోగాలు వచ్చుటయేలేదు ఆహార శాస్త్రము మందువైద్యులకు తెలియదు తెలిసినప్పటికిని రోగులకు చెప్పనే చెప్పరు వారుచెప్పకపోవుటయే న్యాయము ఎందుకంటే ఆపరేషనులు చేయుటకే వారికి డబ్బు నిచ్చు చున్నారుగాని, ఆరోగ్యసూత్రముల చెప్పుటకు వారికేమియా ఫీజుల నిచ్చుటలేదు

## ఆమాశయపు వ్రణములకు ప్రకృతివైద్య చికిత్సాపద్ధతులు

అన్ని తరుణరోగములవలెనే ఈ రోగమునకును చికిత్స చేయవలయును శుద్ధమైనగాలి తగులుప్రదేశములో రోగిని పరుండబెట్టవలెను ఆహారమేమియు నివ్వక రోగిని ఉపవాసముంచవలయును మామూలు జలప్రక్రియలతో చికిత్సింపవలయును అస్థిసమీకరణము చేయవలయును ఉపవాసకాలములో కొంచెము పుల్లటి ఫలరసమును నీటితోకలిపి యీయవలెను ఇవికూడా అవసరమును గుర్తించియే రోగికి ఈయవలయును

మందువైద్యులు ప్రయోగించు వేడినీటి కాపడము మంచుగడ్డకట్టులు రెండునూ హానికరములే వేడినీటి కాపడము వలన కలుగు నష్టములగూర్చి మరొక పుస్తకములో విశదముగా తెలుసుకొందాము వేడినీటి కాపువలన బాధ తాత్కాలికముగా ఉపశమించును బాధమాత్రము పైకి తెలియదు అవయవములలో అంతర్గతమై ఉన్న వేడిమాత్రము అట్లనేనిలిచిపోవును లోపల ఉన్న వేడిని దహించివేయును

వేడినీటివలన ఏమిహాని జరుగుతుందో మంచుగడ్డవలననూ అదేహాని జరుగుతుంది మంచుగడ్డను వాడినందువలన చర్మము బిగుసుకొనిపోవును లోపలి అవయవములు గూడా సంకోచమును పొందును అవయవములలోని మురుగు విశ్లేషమును పొంది బయటకు రాక అక్కడనే నిలబడిపోవును.

వేడినీటికాపు, మంచుగడ్డను రబ్బరుసంచులలో వేసి కాచుటయూ రెండునూ తీవ్రమార్గములే స్నానమునకును, కట్లు

కును, త్రాగుటకును, సామాన్య ఉష్ణముగల నీటినే వాడవల
యును ఇంతవఱకు ఏ శాస్త్రజ్ఞుడును ఈసంగతిని చెప్పక
పోవుట చాలావిచిత్రముగా నున్నది మామూలు తడికట్టును
రోగినడుమునకు వేయవలయును మంట ఉన్న ప్రదేశము
కాద్ది వేడినీటితో రాచినను ప్రమాదము లేదు మంటలు
తీవ్రముగా ఉంటే ఆప్రదేశములో తడికట్లను వేయవలయును
ఈ తడికట్లవలన వేడి తగ్గిపోతుంది రక్తము అంతటనూ బాగుగా
ప్రసరిస్తుంది. రెండు, మూడు, కట్లను భరించలేకపోతే ఒక
కట్టునైనా వేయవలయును ఈ కట్లను రాత్రివగళ్ళలో నెప్పు
డైనా వేయవచ్చును లోపల వేడికి ఈ తడిగుడ్డలు ఎండి
నపుడుమాత్రము ఈ కట్లను తీసివేయవలయును

మానసిక, నైతిక చికిత్సను, అడ్డసమీకరణ చికిత్సయు
ఇందుకు ఉపయోగించును ఉపవాసముమాత్రము తప్పదు
మానసిక ఆందోళనలు ఏమియులేక విశ్రాంతిగా ఉండ
వలయును కొంచెము పుల్లటి ఫలరసమును నీటితో కలిపి త్రాగ
వలయును పాలు, రొట్టె, అసలు పనికిరావు దేహములోని
ప్రకృతియే రోగపదార్థమును బయటకుపంపి, రోగమును
నయముచేయునట్లు సాయము చేయవలయును మాసమొట్టప్రవ
తవకలను చేయరాదు ఫలరసముకన్న మరి యేయితర ఆహా
రమునిచ్చినను జబ్బుపడిన ప్రేగుల నెత్తిన మరింతబరువుపడి,
పాత క్రొత్త బరువులతో మరింత చెడిపోవును లోపలి అవయవ
ములకు సంపూర్ణమైన విశ్రాంతి నీయవలయును గాని, ఏదో
కానటు ఏమిటని మరింతతుక్కును తినరాదు ఈరోజులలో
తినినపదార్థము ఆహారనాళపుగోడల సందులలో చిక్కుకొని బయటకు

పోక లోపలనే నిలవఉండుటచే రోగము నయమైనా వెంటనే తిరగపెట్టును రోగలక్షణములు తగ్గినప్పటికినీ రోగశక్తినిబట్టి ఉపవాసము, ఒకటి, రెండువారములకుతక్కువలేకుండా ఉంచ వలయును రోగలక్షణములు తగ్గగనే ఉపవాసములుచాలిస్తే రోగము తిరగపెట్టుతుంది పైప్రక్రియలన్నీ తప్పకుండాచేస్తే రోగము నయమగుతుంది మా ఆసుపత్రిలోని రోగులకు ఈ ప్రక్రియలన్నీ చేయుటచే రోగము నిర్మూలమై సలక్షణముగా ఇంటికిపోయెడివారు ఒక్కకేసుకూడా బీరుపోలేదు ఉపవాసమువలన అంతరవయవముల కన్నిటికినీ విశ్రాంతి కలుగును భరించగల చన్నీటిని వాడుటవలన వేడి, దేహమంతటా సమముగానే (హెచ్చుతగ్గులు లేకుండా) ఉండును. ప్రకృతి చేయు నివారణమార్గములకు పైప్రక్రియలు ఎట్టి అభ్యంతరములు కల్పింపవు

## ఇదివఱకే పుండ్లుపడితే యేమిచేయవలెను?

ఇంతవరదాకా పుండ్లు పడనపుడు చేయవలసిన వైద్య ప్రక్రియలను చెప్పితిమి రోగము ప్రారంభదశలో నుండగా ఏమిచేయవలయునో చెప్పితిమి రోగము ముదిరిపోయి లోపల పుండ్లుపడితే యేమిచేయాలి? అనేసందేహము వస్తుంది. అప్పుడయినా దేహములోని వైద్యుని (ప్రకృతి) మీదనే భారమువేయాలిగాని కత్తులనెప్పుడూ ఉపయోగించరాదు. ఇవన్నీ మా ఆసుపత్రిలో చేసినవే గాని, చేయనివి ఒక్కటి కూడా లేదు రోగము మొదటిదశలో అనగా పుండుపడనపుడు చేయవలసిన ప్రక్రియలనే యిప్పుడూ చేయవలయును. పుండ్లు

చిట్లి అధోముఖముద్వారా రసి కాఱిపోవును మెతకగా
ఉన్నచోటుగుండా చర్మముపైకి కూడా రావచ్చును మన
ప్రయత్నమేమియు లేకుండానే ప్రకృతే యీ మురుగునంతనూ
దేహమునకు ఎట్టి నష్టములేకుండా బయటకు పంపివేయును.

రోగము ప్రారంభించగనే పై ప్రక్రియల మొదలు
పెట్టితే పుండ్లు మంటలూ పుట్టనే పుట్టవు ఇంత గ్రంథము
జరగనే జరగదు వేడినీటి కాపడముచేత నైనా పుండ్లు
మంటలు, పోట్లు పుట్టవచ్చు మంచుగడ్డ కట్టినా యివిరావచ్చు
ఆహారము పెట్టరానపుడు పెట్టినా రావచ్చు ఇటువంటి
పరిస్థితులలోనే చాలామంది నాదగ్గరకు వచ్చినారు పై పద్ధ
తులు చేస్తేనే ముగిరిపోయిన రోగాలుకూడా చాలా
నయమైనాయి

## — శస్త్రచికిత్సవలన కలుగు నష్టములు —

లోపలి పుండ్లనూ, సూక్ష్మజీవులను తీసివేయాలంటే
చాలా లోతుకుపోయి కోసివేయాలి ఈ త్రోవలో అనేక
నరము లుండవచ్చును ఇంత లోతుకుపోయి కోయాలంటే
నిజముగా చాలా కష్టమే ఏమీ చేయకుండా వదలిపెట్టితే
"జగన్మాతయగు ప్రకృతియే చాలా సాయము చేస్తుంది.
మంటలు ప్రక్క అవయవము లకు వ్యాపించకుండా జగన్మాతయే
చాలా పొరలతోనూ, ఆవరణలతోనూ, వ్రణములను
కప్పి మిగిలిన దేహ భాగములను కాపాడుతుంది చూచితిరా!
జగన్మాత తనబిడ్డలకు హానికలుగకుండా యెట్లా కాపాడు-
తుందో" "చాలాలోపలకు కోస్తేనేగాని పుండుబయటపడదు"

అని శస్త్ర చికిత్సకులు అనే మాటయే పై వాక్యములకు ఆధారము

హోమియోపతి వైద్యశాస్త్రమును కనిపెట్టిన హానిమన్ పెద్ద పండితుడు విద్వాంసుడు అతనియందు నాకు పెద్దలక్ష్య మున్నది ప్రకృతి చాలా కొద్ది సాయమే చేస్తుం దన్నప్పుడు మాత్రము అతనితో నేనేకీభవించలేను క్రొత్తగా తయారైన వైద్యులు ప్రతికేసుకు ఆపరేషను చేయవలె నంటారుగాని వృద్ధ వైద్యుడు మాత్రము - ప్రకృతి, యేమి చేస్తుందో చూద్దామంటాడు

మా ఆసుపత్రికి వచ్చిన ఒకపెద్దమనిషి కథ చెప్తాను క్రిమికలోని పుండే చిన్నప్రేగుల చుట్టూనుండు ఆంత్రవేష్టనమువరకు వ్యాపించినది ఆంత్రవేష్టనములో కూడా మంటలు పుట్టినాయి చాలాకాలమునుండీ మధుమేహాముతో బాధపడు చున్నాడు మందులు సేవించాడు కొంతవరకు నయమైనది క్వింబీ పండితుని మానసిక చికిత్సలో నమ్మకముకలిగి ఆ సిద్ధాంతముల ఆచరించాడు అప్పుడునూ పూర్తిగానయము కాక ఆంగ్ల మందు వైద్యమును మొదలు పెట్టాడు గుణమేమీ కనుబడ లేదు. మా ఆసుపత్రికి అప్పుడు చికిత్సార్థమై వచ్చినాడు. కంటిని చూస్తే మధుకోశముతో గజ్జిపొక్కులు కనబడినాయి. విచారించగా గజ్జితో ఏడేండ్లు బాధపడినాడనియు, ఆబాధ తప్పుటకు గంధకము, పైలుతత్తము వ్రాసినారనియు తెలియ వచ్చినది

ఆరు నెలలు ఫలరసముతో [illegible] [illegible]గా రోగము పూర్తిగా నయమైనది. రోగములో [illegible] [illegible]

తినుట మొదలు పెట్టినాడు తనకు రోగము వచ్చినపుడు ఫలరసములు విపరీతముగా సాయము చేసినప్పటికినీ ఫల రసములు చేసిన ఉపకారమును విస్మరించి, ఆంగ్ల మందు వైద్యమును వేనోళ్ల పొగడేవాడు ప్రకృతి వైద్యమునకు మందు వైద్యమును కూడా జోడించమని నాకు సలహా చెప్పుచుండెడివాడు ఆంగ్ల మందు వైద్యము ప్రకారము విధి నిషేధములు లేకుండా తినవచ్చు అరగకపోతే మందులు తినవచ్చునని బాగా పొగడుతూ ఉండేవాడు

మిత్రమా! "నీవు చెప్పు విధముగా ఎప్పుడునూ జరుగదు జగన్మాతయగు ప్రకృతిని మోసము చేయలేవు మితి మీరి తినుట వలన కలుగు ఫలితముల నెప్పుడైనా అనుభవించక తప్పదని" యెంత చెప్పినా వినెడివాడు కాదు

నేను చెప్పి ఆరు నెలలు జరిగినదో లేదో, మా మిత్రుడు ప్రమాదావస్థలో నున్నాడని కబురు వచ్చింది. సరేగదా అని వెళ్లాను మామూలు రోగమే గాని క్రొత్త యేమియు లేదు వెనుకటి జబ్బే మళ్లీ హాజరైంది ఆంత్ర వేష్టనములో పుండు పుట్టింది

తడికట్లన్ని వేసినాము మానసిక, నైతిక చికిత్సలను చేసినాము అరగంట జరిగేటప్పటికే రోగము స్వాధీనమైనది బాధలు చాలా వరకు తగ్గినాయి రోగి హాయిగా నిద్రపోయి నాడు వారము రోజుల నుండి తాను పడిన బాధలన్ని చెప్పినాడు 'ఈ వారము రోజులూ యమదర్శనమునకు వెళ్లి నాను. చాలా బాధల ననుభవించాను చికాగో నగరము

లోని హేమా హేమీలందరు నా బాధల తగ్గించ లేక పోయి నారు '

మంటలు తగ్గిన తరువాత ఎనిమా చేసినాముగాని యేమీ ఉపయోగము కలుగలేదు. మందుల నేమీ వాడ లేదు జగన్మాతయగు ప్రకృతినే నమ్మినాము ఇరువది యెనిమిది రోజులైన తరువాత మలమూత్రములు క్రమముగా కా సాగినవి ఈ దెబ్బతో మామూలు ఆరోగ్యము కలుగ లేదు గాని ఒళ్లు మాత్రము జాగ్రత్తగా కాపాడుకోవలసి వచ్చింది

చికిత్సా కాలములో లోపలి రోగమంతా కురుపు లుగా బయటకు వచ్చినది గాని మొదటి రోగము మాత్రము రాలేదు మందు వైద్యశాస్త్రమునే నమ్ముకొనక ప్రకృతిని ఆశ్రయించుట మొదలుపెట్టి నప్పటినుండీ ఆరోగ్యము బాగున్నది.

రోగము నయమైనతరువాత తాను చేసిన అవకతవకలు చెప్పినాడు "మొదటలో ప్రకృతివైద్యమునే నమ్ముకొంటిని మధుమేహరోగము తగ్గిపోయినది రోగము పోయినదిగదా అని మాంసముతినుట మొదలుపెట్టాను ఫలితమేమంటే మల బద్ధకమెక్కువైనది వారమునకు ఒకపర్యాయము విరోచన మయ్యేడిది మావైద్యుడు వేదాంతిఅగుటచే ఆదుర్దా యేమియు లేదు భగవంతుడే ఆపనిని పూర్తిచేయును" అని ధైర్యము చెప్పేవాడు

నిజముగా, క్రిమికలోని జబ్బును భగవంతుడే కలుగ చేసాడేమో? మామూలు జ్ఞానముకూడా లేని తీవ్ర మందు

వైద్యులు, మెట్టవేదాంతులుగా మారిపోతారు మందువైద్య మును అభిమానించినపుడు కాస్తకూ కూస్తకూ, తీవ్రమైన మందులు వాడారు ఉపయోగమేమీ లేక విసిగివేసారి,వ్రమాదావస్థలలో కూడా భగవంతునే నమ్మి కదలకుండా కూర్చుంటారు

మందులతో అణచిపెట్టితే కలుగుఫలితాలు

రోగము నయమైనప్పటికినీ, తిరగపెడుతుందేమో నని మందువైద్యులు క్రిమికనే తీసివేయాలంటారు మేముచెప్పే దేమంటే మందులనూ, కోతలనూ, ఉపయోగించక ప్రకృతి వైద్యచికిత్సా పద్ధతులతో రోగమును నయముచేసుకొంటే రోగమిన్నటికినీ, రానేరాదు అవసరమైనవి తినకపోవుటవల ననూ, మందులు సేవించుటవలననూ, ఆపరేషనుల చేయుట వలననూ, తరుణ రోగములన్నియు, కాలికరోగములుగా మారిపోతవి రోగగ్రస్తములైన అవయవములకు విశ్రాంతి నీయవలయును అవసరమైనంత ఆహారమునే తినవలయును మిగిలిపోయిన ఆహారమువు, రోగగ్రస్తములైన అవయవములు జీర్ణముచేయలేక చచ్చుపడిపోవును

ఆపరేషనుచేసినంతమాత్రిన రోగమురాకుండాపోదు జల్లెడగా అల్లుకొన్న నరములలో ఒకదానిని తొలగించుటతో మిగిలినవాటికి కూడా నష్టముకలుగుతుంది ఈ నరములు పోవుటతో రోగము తగ్గుటకుబదులు మరింత తీవ్రరూపముతో బయిలుపడును.

క్రిమికను తొలగించుటవలన రెండునష్టము లు కలు

గును. అందులో ఒకటి - క్రిమికలో తయారగురసము జీర్ణ క్రియకు అవసరము ఈరసము మధురరసములో కలిస్తేనే గాని జీర్ణక్రియ త్వరగా జరుగదు మధురరసము పదిగంట లలో చేయుపనిని క్రిమికలోని రసముతో కలిసిన ఆ మధుర రసమే ఆరునిముషములలో పూర్తిచేయును క్రిమికను తొల గించిన అందులో రసము ఊరదు ఆ రసము మధురరసముతో కలియదు అందువలన జీర్ణక్రియ ఆలస్యముగా జరుగును అజీర్ణము పెరుగును (క్రిమికలో ఊరినరసమువలననే మలము ఊర్ధ్వగతిగా నడచుచున్నదనియు గురుత్వాన్యాయము ప్రకా రము క్రిందపడుటలేదనియు హ్యాబిట్ అభిప్రాయపడుచున్నారు) రెండు -ఆపరేషనువలన నరములలోని రోగనిరోధకశక్తి తగ్గి పోతుంది రోగనిరోధకశక్తి తగ్గిపోవుటవలన ఆపరేషను జరు గకపూర్వము మామూలుగా వచ్చిపోయేరోగములు ఇప్పుడు మరింత తీవ్రరూపములో బయటపడును కాన రోగమెక్కు వగునేగాని తగ్గనుమాత్రము తగ్గదు

ప్రకృతివైద్య చికిత్సాపద్ధతులతో రోగము కుదరా లంటే ఎక్కువకాలము పట్టుతుంది చాలామంది యీమాటలే అంటారు అయితే యీమాటలలో ఎంతనిజమున్నదీ తెలుసు కొందాము

ఇటలీదేశస్థునికి ఒకనికి అజీర్ణవ్యాధి ఉన్నది దీనినుండే మూలవ్యాధి వచ్చింది మూలవ్యాధి పోగొట్టుకొనుటకు ఆప రేషను చేయించుకొన్నాడు దీనిఫలితముగా ఆసనము మూసు కొనిపోయింది ఈ బాధను తప్పించుకొనుటకు రెండవ ఆపరేషను చేశారు మల మూత్రములు జారీ అగుటలేదు.

మూడవ ఆపరేషనులో క్రిమికనే తొలగించారు ఎనిమా చేసినాకూడా మలము బయటకు వచ్చుటలేదు బుద్ధిసూక్ష్మముగల మందువైద్యుడొకడు ఊర్ధ్వముఖాంత్రములోనికి వెలుపలినుండి వెండిగొట్టముద్వారా నీరుపోయుట మొదలు పెట్టాడు ఇట్లా వేడినీరులోనికి పోస్తేనేగాని మలము బయటకు వచ్చుటలేదు రెండేండ్లదాకా యిట్లా పోస్తునే ఉన్నాడు అక్కడపడినపుండు కుళ్లుట మొదలుపెట్టింది అంత్రవ్రణము పుట్టునేమోనని భయపడినాడు విధిలేక ప్రకృతి వైద్యము నాశ్రయించాడు

నెల తిరుగకముందు పైగుణము కనబడినది వెండిగొట్టము కూడా వేడినీరుపోస్తేనేగాని, కాని విరేచనములు, తనంతటనే బయటకు వచ్చుట మొదలుపెట్టినవి తరువాత ఎప్పుడునూ విరేచన బద్ధకము లేదు వెనుకటిరోగము తిరుగపెట్టునేమోనని భయపడి ఊర్ధ్వము ఖాంత్రములోని బెజ్జమును నయము కానీయ లేదు గరాటీగొట్టమును నిరంతరమునూ ఉపయోగించుటచే ఆ పుండు మానకుండా అట్లనే నిలబడిపోయింది ఏప్రయత్నము లేకుండా మూడు నెలలకాలము విరేచనము క్రమముగా అగుటచే తనరోగము పోయినదనిరోగికినమ్మకముకలిగెను రోగము తిరగపెట్టదని రోగికిఅప్పుడు ధైర్యము కలిగినది బయటనుండి నీళ్లుపోయువలసిన అవసరములేదనినమ్మి, పుండునయమగుటకు రోగియేమియు అభ్యంతరముల నేర్పరచలేదు వెండిగొట్టమును గరాటీని తీసివేసినాడు రోగము పూర్తిగా నయమైనది. మరెన్నటికినీ తలెత్తలేదు

మూడేండ్లు ఖాయిలాపడి మూడు ఆపరేషనులు చేయించుకొనిన తరువాతనే, ఆహారముల మార్పుతో నెల రోజులలోనే రోగము నయమైతే మొదటగానే ప్రకృతివైద్య చికిత్సల నవలంబిస్తే రోగముఎంత త్వరగా నయమయ్యేదీ చెప్ప నవసరములేదు నిదర్శన పూర్వముగా ఈ కథను చెప్పితే విన్నవార్లంతా ఆశ్చర్యపడ్డారు.

---

## ౧౩

## టీకాలు

రోగము రాకుండా కాపాడుటకు వాడు మందుల వలననూ, రోగము వచ్చినతరువాత త్వరగాపోవుటకు వాడు మందులవలననూ, దేహమునకు జరుగు అపకారముకన్న ఈ టీకాలవలన ఎక్కువహాని కలుగుతుంది

టీకాల పుట్టుపూర్వోత్తరముల తెలుసు కొందాము

ఎడ్వర్డు జన్నరు ఆంగ్లేయుడు మంగలివృత్తితో జీవించే వాడు ఇతనికి కసేరుకా నమీకరణ శాస్త్రముకూడా కొంత వఱకు తెలుసు టీకారసమును మొదటగా ఈ జన్నరే కనుగొనినా డను ప్రతీతిగలదు లిడక్కు అను చరిత్రకారుని అభిప్రాయము ప్రకారము 1672 వ సంవత్సరములో ఒక స్త్రీ మశూచికము రాకుండుటకై ఒకమందును కనుగొనినది ఇదే టీకారసము కాన్‌స్టాంటి నోపిలులోని వారందరును ఆమె తెలివితేటలను మెచ్చుకొన్నారు

పారసెక్‌సను పదునారవ శతాబ్దములో అయిరోపా ఖండములో విచిత్రమైన పరివర్తనను తెచ్చెను వ్యాధిగమును ఆరోగముతోనే నయము చేయవలె నను సిద్ధాంతములను పారసెక్‌సన్ను ప్రతిపాదించెను టీకారసమునకు పైసిద్ధాంతమే మూలము అప్పటికి చాలాకాలమునుండి పాటకజనములో వ్యాధిగమును ఆరోగముతోనే కుదర్చవలె నను అభిప్రాయము అమలులో తెలియవచ్చుచున్నది

ఆమె మందుతోపాటు పథ్యమునుకూడా విధించినది భగవంతునిధ్యానించుటయు, నలుబదిరోజులువిధిగాఉపవాసము ఉండవలెననియు నిర్ణయించినది అయిరోపాఖండములో మశూచికము బాగా వ్యాప్తిలో నుండుటచే క్రొత్తగా కనిపెట్టబడిన యీ మందును అందరునూ వాడిరి మొదటలో ఈ మందును కూలినాలి చేసికొను పాటకజనమే వాడిరి వీరినిచూచి మిగిలిన జనమంతయు వాడుట మొదలుపెట్టిరి అందరూ వాడుటచే మందు ప్రియమైనది వైద్యులందరును ఈ మందును తమసంచికట్టులో చేర్చుకొని ధనము సంపాదించుట మొదలుపెట్టిరి

అంటురోగముకన్న తీవ్రముగా ఈ వెర్రి వ్యాపించినది ఈ వెర్రికికూడా పుట్టుక, వృద్ధి, క్షయములు గలవు. జనసమూహములో ఈ వెర్రిపుట్టినట్లుగానే చనిపోవును

కొంతకాలము జరిగిన తరువాత టీకాలువేయుటవలన మశూచికము తగ్గుట లేదనియు, పెచ్చుపెరిగి పోవుచున్నదనియు అందరును కనుగొనినారు ఆదరణలేక పాలపడి పోయిన యీ మందును నూరు సంవత్సరముల తరువాత

ఎడ్వర్డు జన్నరు వేరొకరూపముతో ప్రచారము చేసినాడు మశూచికపు రోగులపొక్కులలోని చీమునుతీసి, భద్రము చేసి, ముందు సంతతివారికి వాడుచుండెడివాడు జన్నరు మాత్రము మశూచికపు పొక్కులోని రసమునకు బదులు ఆవుదూడల రసమునే వాడెను

ఆంగ్లమందు వైద్యములో ఈమందును పెద్ద మోతాదులతో వాడుదురు హోమియోపతీ వైద్యమందన్నో మందు భాగము చెప్పుటకు వీలుకానంత సూక్ష్మముగా నుండును క్రమముగా మశూచికముతోబాటు టీకాలు వేయుటకును అన్ని దేశములలోని ప్రజలును అలవాటు పడినారు అందువలననే మశూచికము తగ్గిపోయినదని జన్నరు అనుయాయులు చెప్పుచున్నారు

నిజమేమిటి? మశూచికము టీకాలు వేయుటవలన రూపు మాసిపోవుచున్నదా? లేక ఎక్కువగా వచ్చుచున్నదా? టీకాలు వేయవలెనని గట్టిగా వాదించేవారికే యీ మందులో నమ్మకములేదు మశూచికము ఈ టీకాలవలన పోదనికూడా వారికి గట్టిగా తెలుసును టీకాలు వేసుకుంటే మశూచికము రాదని ధైర్యముంటే (టీకాలు వేసుకున్నవారు) మశూచికపు రోగులదగ్గరకుపోతే యీరోగము అంటుతుందని యెందుకు భయపడాలి? రాకుండుటకై టీకాలు వేసుకుంటే ఆరోగులదగ్గరకు పోతే మశూచికము ఎందుకు రావాలి? టికాలు వేసుకొన్నవాళ్ళు టీకాలు వేసుకోనివాళ్ళనుచూచి రోగమువస్తే హేళన చేయవచ్చునుగా టీకాలు వేసుకోని వారికేగాక, టికాలు వేయించుకొనినవారికిని మశూచికము వస్తున్నదని లెఖ్ఖలతో సహా చూపించగలము

1870_71 సం॥లో జర్మనీలో మశూచికము తీవ్రముగా నున్నది అందులో10,00000 మందికిమశూచికమువచ్చినది వీరిలో 1,20,000 మంది చనిపోయినారు చనిపోయినవారిలో నూటికి 96 మంది టీకాలు వేసినవారే నూటికి నలుగురికి మాత్రమే టీకాలు వేయలేదు చనిపోయినవారందరును ఒక పర్యాయ మన్నా టీకాలు వేయించుకొన్నవారే వీరిలో చాలామంది కొలదిరోజుల క్రితమే టీకాలు వేయించుకొనిరి అయినప్పటికినీ మశూచికముతో చనిపోయినారు

బిస్మార్కు జర్మనీ దేశమునకు రాజు 1888 సంవత్సరములో జర్మను రాష్ట్రములకన్నిటికినీ ఒకతాఖీదును పంపినారు దానిలో టీకాలవలన కలుగు దుర్బలవ్యాధులనుగూర్చి ఖచ్చితముగాను నిర్మొగమాటముగాను తెలియజెప్పినాడు

గజ్జి, తీట, చీడ, చుండు మొదలగు జబ్బులు టీకాలవలననే వచ్చుచున్నవి ఇంతేగాక అంటువ్యాధులన్నీ యీ టీకాల వలననే వచ్చుచున్నవను నిజము వప్పుకోక తప్పదు మశూచికపు రసికన్న మంచిదని ఆవుమూడచీము వాడినాముకాని అపకారము యెక్కువగా చేసినది నిజము గ్రహించినారు కాబట్టే జర్మను ప్రభుత్వములన్నియు ప్రజల యిష్టానుసారముగ టీకాలు వేయవలెనని తమ నిబంధనల మార్చినవి

జన్నరుయను యాయన మాత్రము టీకాలు వేయుట వలననే మశూచికము తగ్గినదని వాదించుచున్నాడు

ప్రపంచములో గత శతాబ్దములోకన్న యీ శతాబ్ధములో మశూచికపుతీవ్రము తగ్గినది ఈ తగ్గుదలకు జన్నరు

అనుయాయులు చెప్పినట్లు టికాలు కారణముకాదు ఈ టీకాలే కారణమైతే మిగిలిన దుర్భరవ్యాధులన్నీ యే టీకాలవలనతగ్గినవి? ప్లేగు, కలరా మొదలగువ్యాధులన్నీ యెందుకు తగ్గినాయి? వీటి కేమియు టీకాలు వేయుట లేదు మశూచికము తగ్గుటకు మేము చెప్పు సమాధాన మేమంటే ప్రజలు ఆరోగ్యసూత్రము లను శ్రద్ధగా ఆచరించినకొలదీ రోగములకు తావే లేదు రోగ ములకు తావు లేకపోవుటచేత రూపుమాసిపోయినాయి

స్పెయిన్ దేశస్థులు హావానాలో ప్రవేశించుటకు పూర్వము అచ్చట యెల్లోఫీవరు తీవ్రముగానున్నది ఈప్రజలు ప్రవేశించి ఆచార వ్యవహారములు ఆహార విహారములనుగూర్చి ఆరోగ్యసూత్రములను విధిగా ఆచరించినతరువాత ఆ రోగము నామరూపములు లేకుండా పోయినది ఈ జబ్బు పోవుటకు వీరు యెట్టి టీకాలను వేయించుకొనలేదు ఒక సందేహముకూడా రావచ్చును ఆరోగ్య సూత్రములను ఆచరిస్తే రోగములుపోతే యీ దుర్భర రోగాలన్నీ యింకా నిలువవుండుటకు కారణమేమి? నిజము చెప్పాలంటే ఈ పాడురోగాలన్నీ టీకాలవలననే నిలువ వున్నవి టీకాలు వేయకపోతే ప్లేగువలెనే మశూచికముకూడా అంతరించిపోయేదేను టీకాలరసము వంశానుగతముగా వచ్చు రోగములను సుఖసంకటవ్యాధులను అణచి పెడుతుంది అణచి పెట్టబడిన రోగాలకు టీకాలవిషము తోడగుతుంది ఈ రెండు విషములు కలసి మానవలోకమును తరములకొద్దీ బాధిస్తు న్నవి మొదటలో యీ టీకారసముతోను మశూచికమును అణచిపెట్టకపోతే ప్లేగు మొదలగు వ్యాధులకువలెనే యీ

రోగముకూడా అంతరించేదే మందులలోని మైక్రోజిమాలే తరములనుండి మానవలోకమును బాధిస్తున్నవి ప్రతి పదియేండ్ల కును విధిగా టీకాలు వేయించుకొనవలెనని మన ప్రభుత్వములు ఆజ్ఞాపించుటచే మన పూర్వీకులందరును ఆ ప్రకారమే వేయించు కొనిరి పదియేండ్లలో రెండు, మూడు, తడవలుకూడా టీకాలు వేయించుకొన్న ఛాందసులు లేకపోలేదు ఇట్లా వేయించు కొనుటచే టీకారసము శల్యగతమైపోయినది అంటువ్యాధులు చీటికీ మాటికీ వస్తున్నవంటె ఆశ్చర్యమేమీ లేదు ఈ రోగాలన్నీ పిత్రార్జితము లే

టీకారసము పదిమందికి వేయుటచేత ఒకరి రోగము లే పదిమందికిని, పదిమంది రోగము లే ఒకరికినీ వచ్చుచున్నవి. టీకాల రసమువలననేగాక రోగమురాకుండా కాపాడుటకు వాడు మందులన్నియూ పై విధముగా రోగముల పెంపుచేయుచున్నవి గాని తగ్గించుట లేదు మొత్తముమీద మందుల వలననే క్షయ, అంతర్వ్రణము, సుఖరోగములు, పక్షవాతము, పిచ్చి, ఉన్మా దము మొదలగు పాడు రోగాలన్నీ హెచ్చు పెరిగిపోయినవి

రసగంధకాదులను వాడక పోవుటచేతను, టీకాలు వేసు కొనక పోవుటచేతను ఆదిమవాసులందరును రోగము, కొప్పి లేక చిరకాలము బ్రతికిరి రెండువందల యేబది సంవత్సరముం నుండీ యీ టీకారసము వాడుకలోనికి వచ్చుటచేతను రస, విష, పాషాణములతో తయారైన మందులు వాడుకలోనికి

వచ్చుటచేతను మన పూర్వీకులందరును వాటిని నిరాటంకముగా వాడుటచేతను యీ దుర్భరవ్యాధులకు మనము యిప్పుడు గురికావలసి వచ్చినది

దేహమును శుద్ధి చేయుటకుగాని, దేహములోని యే భాగములోని మురుగునైననూ ప్రకృతి బయటకు పంపివేయు ననియు లోగడనే చదువుకొన్నాము దేహములోని రోగనిరోధకశక్తికన్న రోగబలము యెక్కువైతే మురుగు లోపలనే నిలవవుండి ప్రధానావయవముల పాడు-స్తుంది అట్లుకాక రోగనిరోధకశక్తి యెక్కువగా నున్నయెడల రోగపదార్థము బయటకు వస్తుంది మందులతో నిరోధకశక్తిని అణచిపెట్టితే యెంత చిన్న రోగమునైనా నిరోధించే సామర్థ్యము తగ్గిపోతుంది మశూచికము రాకుండా టీకాలు వేయించుచున్నారు ఈ టీకాల వలన ప్రకృతియొక్క రోగనిరోధకశక్తి తగ్గిపోతుంది ఈ శక్తి తగ్గుటచే యేరోగమునైనా నిరోధించలేదు విషముతోనే విషమును చంపవలెనంటే యీ రెంటి సమ్మేళనమువలన మూడవ విషము పుట్టుచున్నది ఒక విషమునకు బదులు మూడు విషములు తయారగుచున్నవి నేటి మశూచికమంతా యిట్లా వచ్చినదే సుఖరోగము లున్నవారికి టీకాలు వేస్తే మశూచికము వస్తుంది

అయితే సుఖరోగములకును మశూచికమునకు సంబంధమేమని మీరడుగవచ్చు ? ఈ రెండు రోగములకును దగ్గర సంబంధమున్నది చూపుకు యీ రెండును సమముగానే యుండును వీటి రెంటి లక్షణములునూ ఒకటిగానే యుండును

వీటివలన మానవ దేహమునకు గలుగు హానియు సమముగానే యుండును ఈ రెండు రోగములను పరిశోధించి పుట్టుపూర్వోత్తరముల కనుగొనిన క్రూవెలు పండితు డేమి చెప్పుచున్నాడో తెలిసికొందాము! టీకాలు వేయుటకును, సుఖరోగములు కలిగించుటకును యేమియు తేడా లేదు ఆవుచీము ఒకటే టీకా రసము కాదు మశూచికపు పొక్కులోని చీమును ఆవుమాడ చీముతో కలిపితేగాని టీకారసము వచ్చుటలేదు మానవుని సంపర్కము లేనిదే జంతువులకు యీ రోగము వచ్చుటలేదు మానవుని సంపర్కమువలననే ఆవుల పొదుగులమీద పొక్కులు కనబడుచున్నవి జంతువులకు మామూలుగా యీజబ్బు రాదు సహజముగా వచ్చేటట్లయితే ఆవులకు, ఆంబోతులకు అన్నింటికినీ యీ జబ్బు రావలసినదేగా? కానీ అట్లా వచ్చుటలేదు టీకా రసమును కనిపెట్టిన జన్నరుకూడా సరహానెహెనెస్ మశూచికపు పొక్కు చీమును ఆవుమాడలకు రాచి టీకారసమును కనిపెట్టెను

ఆరోగ్యముగానున్న పిల్లలకు, పెద్దలకు టీకాలువేస్తే పుండ్లు పడతాయి ఒంటినిండా చీడ పగలేసుంది తీటఉంటుంది అదివరకే దేహమంతా రోగపదార్థముతో నిండివున్నదా అంటే అగ్నికి వాయువు తోడయినట్లే పక్షవాతము, పిచ్చి మొదలగు నవన్నీ ప్రత్యక్షమగును టీకారసమును తయారుచేయుట లాభసాటి బేరముగానే యున్నది అనేక కంపెనీలు సంవత్సరానికి కొన్ని కోట్లు లాభాల పొందుచున్నారు కంపెనీ భాగస్వాములందరును యీ లాభములను పొందుచున్నారు పదివేల మంది స్త్రీలకు వ్యక్తస్వరాంధ్రము కాకముందే రెండు, మూడు, తడ

వలు టీకాలు వేసినారు ఈ టీకాలవలన వీరందరకును బాలింతలుగా నున్నప్పుడె పాలెండిపోయినాయి అంటే ఆశ్చర్యమేమీ లేదు

అనేకవేల కంపెనీలలో ఒక కంపెనీలో జరుగు కార్యక్రమము వలననే యింతవరకు చెప్పినాము మిగిలిన కంపెనీలన్నీ ఇట్లాగనే చేస్తున్నాయి

చాలా యేండ్ల క్రితము స్కాట్లండులోని గొఱ్ఱెలకు మశూచికము మాదిరి జబ్బు వచ్చింది ఈ రోగములు గలిగిన వాటికి అంటకుండుటకై టీకాలు వేసినారు టీకాలువేసిన కొద్ది యేండ్లకే గొఱ్ఱెపిల్లలకు పాలు లేకుండాపోయినవి గొఱ్ఱెలలోనే పాలు లేకుండాపోతే మానవస్త్రీలగతి చెప్పేదేమున్నది? నవనాగరికులలోనేగాక పాటకజనములలోకూడా తల్లులకు పాలు లేకుండా పోయినవి అందువలన పిల్లలు పడు బాధలు చెప్ప నలవికాదు

## దాబోపు ఫలితములు

మందువైద్యమువారు క్రొత్త క్రొత్త మందులను కనుగొనుచున్నారు సంవత్సరములు గడచినకొలదీ రకరకాల మందులు బయటపడుతున్నాయి గత సంవత్సరములో మూడు రోజులలో నయమైన రోగమును క్రొత్తమందులు వాడితే మూడు పూటలలోనే నయమగుచున్నది కాలము గడచిన కొలదీ, మూడు గంటలలోను, మూడు నిముసములలోను నయమయే మందులు కనిపెట్టవచ్చు, నయముకానూవచ్చు-

ంతను కొండంతలుగా చేసి చెప్పుటకు మందువైద్యము
పత్రికలు, వారి అనుయాయి పత్రికలు చాలా పాటుపడు
వి శాస్త్రము యిట్లా పెరిగిపోతున్నదిగదా నష్టమేమి
కూరేమో? మా అభిప్రాయము చెపుతాను వినండి
నవకోటిమీద యీ మందులను ఉపయోగించకపోతే
యేమీలేదు మానవులమీద ప్రయోగిస్తే వారికేగాక
వు తరములవారికినీ ఊహించుటకుకూడా సాధ్యము
ంత నష్టము తప్పక జరిగితీరుతుంది ఏమినష్టము జరుగుతుం
రా?

పూర్వీకులందరునూ మందులు మాకులు తినుటచేతను
నుగతముగా వచ్చుచున్న రోగములకు లెక్కలేదు తాను
మందువల్ల వచ్చే రోగాలకు తెంపులేదు అవీ, యివీ,
యేకమై పిల్లలకు పదేండ్లయినా నిండకమునుపే లెక్కలే
రోగాలు వస్తున్నాయి వీటిని కుదుర్చుటకు మళ్ళీ మందులు
న్నారు చివరకు తేలిన పర్యవసాన మేమంటే నాల్గేండ్ల
నిండని పిల్లలకే మశూచికము, హైడ్రాఫోబియా,
మజ్జాగత జ్వరము, సన్నిపాతము, సర్పి, శ్వాసావయవ
ములు వస్తున్నాయి ఇన్నిటిని తప్పుకొని బ్రతికినాడాఅంటే
నెత్తురుతో పాములను చంపగలడు మందు వైద్యుల చేతు
నే రాజ్యాధికారముండునుగాన వారు కనుగొను మందు
ణముగా చట్టముల తయారు చేతురు కాలము పెరిగిన
తలనే తీసివేయవలెనను చట్టముకూడా రావచ్చు

రాజులు తలచుకొంటే దెబ్బలకు కొదువా?
పై రెండు పద్ధతులలోను యేది మంచిదో ఆచరణయోగ్య మైనదో నిరపాయకర మైనదో, మీరే యూహించుకొందురు గాక విషముతో విషమును చంపి మానవ దేహములో చెప్ప నలవికాని విషముల తయారుచేసి తనకే గాక రాబోవు తర ముల వారికినీ వ్రాయనలవి కాని బాధల కలిగించుట యుక్త మో, లేక యుక్తమగు ఆహార విహారములతో రోగము రాకుండ కాపాడుకొనుట యుక్తమో మీరే యూహించండి

ఈమందుల నన్నింటినీ విధిగా సేవించాలని ప్రభుత్వమే శాసిస్తే కలిగే ఫలితాల చెప్పనలవికాదు టీకాలవలననే అన్ని రోగాలూ యెట్లావస్తున్నదీ చెపుతాను టీకాలవలననే అన్ని రోగాలు వచ్చుచున్నవి

టీకాలవలన ఇన్నిరోగాలు యెట్లవస్తున్నాయన్న సందే హము కలుగవచ్చు ప్రతిరోగము దేహములో ఇగిరిపోయిన రోగపదార్థమువలననే వచ్చుచున్నదని ఇదివరకే చదివినాము దేహములోని రోగపదార్థమును ప్రకృతి దేహములోనే పేరు కొననీయ దనియు యెప్పటి కప్పుడు యీరోగపదార్థమును బయటకు పంపివేయుననియు, ఇట్లు బయటకు పంపు ప్రయత్న మే వ్యాధి అనియు ఇదివరకే చదివినాము టీకాలు వేయ గనే ఆరోగ్యవంతులైన పిల్లలకైనను పుండ్లు పడును చీడ పగ లేయును గజ్జి, తీట, చుండు మొదలగు చర్మ వ్యాధులు గలు గును, ఈ పుండ్ల ద్వారా టీకా రసములోని విషమేగాక లోపల దాగియున్న యితర విషములు కూడా బయటకుపడును.

ఈ హేతువును పురస్కరించుకొని జన్నరు అనుయాయు లు టీకాలు ఉపయోగమేనని వాదించ వచ్చును దేహమునకు హాని చేయవనికూడా చెప్పవచ్చును మోటు పద్ధతులలో చెడురక్తమును పీల్చుగండుకు జుగను పట్టించుట కూడా గలదు అయితే యీజుగలు చెడురకమునే పీల్చునను నియామక మెక్కడిది? ఆ చెడురక్తముతో బాటు మంచిరక్తమును కూడా పీల్చవచ్చును సంపర్క దోషముచేత జుగలలోని రోగములును మానవులకు రావచ్చును

మందువైద్యులు ఉపయోగించు పై పద్ధతుల వలన రోగము పోకపోవుటయేగాక జలగలలోని రోగములు వచ్చినట్లు గనే మిగిలిన రోగములును మానవులకు వచ్చును ప్రకృతి వైద్యమందన్ననో లోపలి మురుగు నంతెనూ తడికట్లవలననూ, జలప్రక్రియవలననూ, బయటకు పంపుదుము టీకాలు వేయగనే పుండ్లు పడును ఈపుండ్లనుండిచీముకారును వంశానుగతముగా దేహములో నిలవయున్న విషములు యీచీముతో బయటకు వచ్చును టికారసము తయారు చేయుటకు ఉపయోగపడిన జంతువుల జబ్బులు కూడా బయటకు పోవును అనేకమంది మురుగుతో పవిత్రమైన టీకారసమునే శాస్త్రమను పేరుతో మానవదేహములోనికి చొప్పించుచున్నారు ఆరోగ్యవంతులైన పిల్లలకు,పెద్దలకుటీకాలు వేయుటవలననేరోగాలువచ్చుచున్నవని, తెలుసుకొన లేనిబుద్ధిమంతులు ఈపిల్లలకు యీరోగాలన్నీ యెట్లా వచ్చాయని తెలుసుకొనలేని మూఢవైద్యులు పిల్లలకీరోగముల సంక్రమింప చేసినారని తల్లిదండ్రులను నిందించు చున్నారు.

## ఒక వింత విషయము

చికాగోనగరములో 17_5_1909 తేదీన వెలువడిన దినపత్రిక లన్నీ యీ వింతవిషయమును ప్రకటించినవి పరువు పోతుందని టీకాలకు సంబంధించిన అధికారులు ఆ విషయముల ప్రకటించ కుండా తరువాత కట్టుదిట్టముల చేసినారు మిచిగాన్, న్యూయార్కు, పెనెన్సిల్ వేనియా, మారిలాండ్ మొదలగు నగరములలో బయలుదేరిన గొడ్లజబ్బులన్నియు పరదేశముల నుండి వచ్చినవేనని జంతువిషయపరిశోధనశాఖ వాని అధికార పత్రిక తెలుపుచున్నది టీకారసమును తయారుచేయుటకు ఉపయోగించిన ఆవుదూడలకు జబ్బులుండుటచేతనూ, ఆ జబ్బుతో బాధపడు ఆవుదూడలనుండే టీకారసము తయారు చేసి ఆ రసమునే పై దేశములలోని గొడ్లకు వేయుటచేతనూ అదే జబ్బు వచ్చినది ఈ సత్యము బయటపడకుండా అణచి వేయుటకు రాష్ట్రప్రభుత్వములు 15,000 పౌన్లు ఖర్చుపెట్టినవి

జర్మనీలో హెచ్ డి మల్ ఫర్ కంపెనీ, పార్కు—డేవిస్ కంపెనీ అను రెండు పెద్ద కంపెనీలు గలవు ఈ రెండుకంపెనీలు టీకారసమును తయారుచేయును ఈ కంపెనీలవారు టీకా రసమును తయారుచేయుటకు ఉపయోగించిన ఆవుదూడలకు పైనచెప్పిన గొడ్లజబ్బులు గలవు టీకారసమును తీసిన తరువాత ఆ ఆవుదూడలను డెటరాయిట్‌లోని కసాయిదుకాణములకు పంపినారు

అక్టోబరు 20 వ తేదీన మిచిగాన్‌నుండి కొన్నిదూడలను డెటరాయిట్‌లోని కసాయి దుకాణములకు పంపినారు ఈ

దూడలను పశువులను వుంచుసావిళ్ళలో వుంచినారు అప్పటికే ఆ సావిళ్ళలో కొన్ని దూడలను వుంచినారు ఈ మొత్తములో కొన్నింటిని కసాయిదుకాణములకు అమ్మినారు మరికొన్నింటిని బఫ్ఫలో, దాన్‌విల్లీ, వాట్సన్‌టవును మొదలగు నగరములకు పంపినారు ఈ దూడలవలన యీ జబ్బులు ఆయానగరములకు కూడా వ్యాపించినాయి

పై రెండు కంపెనీలు పై విధముగా తయారు చేసిన టీకారసమును వాడుటచేత ఆజబ్బులే టీకాలువేసిన గొడ్లకునూ వచ్చినవి మిగతాకంపెనీలు తయారుచేసిన టీకారసమును వాడితే యీ జబ్బులు రాలేదు మొత్తముమీద ఈ దూడల జబ్బులన్నీ ఒకటిగానే యున్నవి ఒకటి రెండు కేసులలో మాత్రము రోగలక్షణములు సరిగా సరిపోయినవి

1902_03 సంవత్సరములలో యింగ్లాండులో గొడ్ల జబ్బులు బయలుదేరినాయి విచారించగా మల్‌ఫర్డు కంపెనీవారు టీకారసమును తయారుచేయుటకు వుపయోగించిన జపాను దేశపు ఆవుదూడలకు ఈ జబ్బులున్నట్లు తెలియవచ్చినది ఇంత ముఖ్యమయిన విషయమును పదిమందికినీ తెలియకుండా ఆపుచేసినారు సత్యము బయటకురాకుండుటకు కొన్ని వేల పౌన్లు ఖర్చుచేసినారు అంటువ్యాధులన్నీ టీకారసమువలననే వచ్చు చున్నప్పటికినీ ఆరోగ్యశాఖవారు యిప్పటివరకూ అంటువ్యాధు లకు కారణము తెలియదంటారు సత్యమును తెలిసికొనికూడా నోరులేని ప్రజలకు చెప్పుటలేదు ఇంతకన్న మోసము మరొకటి లేదు పై దినపత్రికల ప్రకటనలబట్టి మనము తెలిసికొనే

దేమనగా హెచ్ కే మల్ ఫర్డుకంపెనీవారు టీకారసమును చేయుటకు ఉపయోగించిన ఆవుదూడలకు గొడ్లజబ్బులు గలవు టీకారసమును తయారుచేయుట యెట్లన ఆవుదూడను బల్లమీద పడుకొనబెట్టి నాల్గు కాళ్ళను కట్టెదరు పొత్తికడుపుమీద చర్మమును కత్తితో కోసివేయుదురు కోసినతరువాత కత్తితో గాట్లు పెట్టెదరు మశూచికపు పొక్కులోని చీమును ఈ గాట్ల మీద పూయుదురు టీకారసములోని విషమును, ఆవు దూడ దేహములోనికివ్యాపించుమురుగును దేహమంత గావ్యాపించును ఈ గాట్లద్వారా లోపలిమురుగును బయటకు నెట్టుటకు ప్రకృతి ప్రయత్నము చేయును ఈ గాట్లన్ని గాయములుగా మారి పోతవి ఈ పుండ్లలోనుండి వచ్చిన చీమును (రసమును) జాగ్రతగా తీసి భద్రపరచి పవిత్రమైన క్రొత్త టీకారసమని దేశములోని అన్నిమూలలకు పంపుతారు ఆవుదూడకున్న జబ్బులన్నీ వాటినుండి తయారుచేసిన టీకారసములో వుంటవని మన మిదివరకే నిర్ధారణము చేసినాము ఈ రసమే దేశము లోని పిల్లలకందరకునూ వాడుటచేత టీకారసములోని విషమే గాక జంతువుల జబ్బులుకూడా పిల్లలకు వచ్చుచున్నవి ఈరెండు విషములతోను పిల్లలు అప్పటికప్పుడు చావకపోయినప్పటి కినీ ఈ రోగములతోను వీటినుండి పుట్టిన యితరరోగముల తోను జన్మావధి బాధపడుచున్నారు టీకాలు వేయుటనగా క్రొత్త రోగముల కలుగజేయుట పితార్జితమైన విషములకు టీకారసము లోని విషములు తోడై క్షయ, ఉబ్బసము, పిచ్చి మొదలగు దుర్భరరోగాలు పుట్టుచున్నవి

మానవసేవయను పేరుతో ప్రభుత్వములు యిటువంటి దారుణములను చేయుచున్నవి శాస్త్రపరిశోధకులు (Cowpox) కౌపాక్సు గొడ్లకువచ్చు జబ్బుగాదనియు యెడ్లకెప్పుడును యీ జబ్బులు రాలేదనియు నిర్ధారణ చేసినారు పాలుపితుకువాండ్ల కున్న జబ్బులే ఆవులకుకూడా వచ్చుచున్నవని చెప్పవచ్చు ఈ సామ్యము ననుసరించి మనుష్యులరక్తమును గొడ్లకును, గొడ్లరక్తమును మనుష్యులకును, వుపయోగించవచ్చునని మా మందువైద్య మిత్రులు వాదించవచ్చునుగాని మశూచికపు పొక్కులోని చీముతోను, ఆవుదూడల చీముతోను తయారైన టీకారసమును మానవదేహములలోనికి ప్రవేశపెట్టుట నింద్యము విషముతోనే విషమునుచంపితే ఆరోగ్యము కలుగు నను గ్రుడ్డినమ్మకముకన్న బుద్ధితక్కువ వేరొకటిలేదు ఇది సత్య మని ప్రచారము చేయుటకన్న మహాపాపము మరొకటి లేదు యుక్తముగా ఆహారము తినుటవలన మురుగేమియూ లోపల నిలవదు బయటకు వెళ్ళిపోతుంది

టీకాలు వేయకపోతే ప్లేగు, కలరా మొదలగు దుర్భర వ్యాధులవలె మశూచికముకూడా చాలా సంవత్సరముల్కతమే అంతరించేది

మందులవలననూ, టీకాలవలననూ వచ్చే ప్రతిబంధ మే మనగా వీటివలన ఫలితములు వెంటనే కనపడవు చాలా ఆలస్య ముగా కనబడును వాడిన మందులకును, పుట్టు రోగములకునూ, సంబంధము లేనట్లే కనబడును తీవ్రముగా విచారిస్తేగాని యీ సంబంధము గోచరించదు మందులు తల్లులైతే, తరువాతకలుగు

రోగములు వాటిపిల్లలు పాండువ, క్షయ, కుష్టు, బొల్లి మొదలగు చర్మరోగములు మందులవలననూ, టీకారసమువలననూ, వచ్చినాయని చెప్పుటకు పైకి మనకేమీ ఆధారములు కనబడవు కంటిని చూస్తే అంతా తూ, చా, తప్పకుండా చెప్పవచ్చు

టీకారసము తయారుచేయుటకన్న మరొక విచిత్రమైన సంగతి గలదు పవిత్రమైన యీ టీకారసమును తీయునప్పటికే చాలాదూడలు చనిపోవును మొండిజీవులే చావక మిగులును వాటంత టవి చావకపోయినప్పటికినీ సొమ్ము చేసికొనుటకు (మాంసముకొరకు) వాటిని చంపెదరు చచ్చిన ఆవు దూడల చర్మమునేవుపయోగించరు రోగభూయిష్టమయిన మాంసమును కూడా అమ్మెదరు కసాయిదుకాణములన్నీ యీమాంసమును అమ్మివేయును పేరుప్రఖ్యాతులుగల కంపెనీలన్నీ ప్రజల ఆరోగ్యము కొరకే తమ సర్వస్వమును ధారపోస్తూన్నామని నిరంతరము ప్రచారముచేస్తున్న కంపెనీ యజమానులందరును పాపపుణ్యములు తెలియని సామాన్యులకందరకును రోగభూయిష్టమై యీమాంసమునే ఆహారపదార్థముగా అమ్మించుచున్నారు ఈ సొమ్ముతో తమ బొక్కసముల నింపుచున్నారు ఈ వ్యాపారము అంతూ పొంతూలేకుండా పెరిగిపోవుచున్నది తగ్గుసూచన లేవియు కనబడుటలేదు ఈ మాంసమును తిను బుద్ధిమంతుల అజ్ఞానమునకే విచారపడవలెనేగాని అమ్ముకొనువారి నని ఉపయోగమేమున్నది? ఒకటి రెండు ఉదాహరణల చెబుతాను

1914 వ సం॥లో చికాగోలో అంటువ్యాధి ప్రబలిపోయింది అప్పటి ఉపన్యాసములో ట్రిబ్యూను పత్రికనుండి

కొన్ని ప్రకటనల చదివినాను వాటి అభిప్రాయముకూడా విశద ముగా తెలియజేశాను ఉపన్యాసము పూర్తిఅయిన తరువాత సభికులలోనుండి ఒక పెద్దమనిషి లేచి అధ్యక్షుని అనుమతిమీాద అంటుజాడ్యములగూర్చి తన అనుభవముు చెప్పినాడు వారి వాక్యములనే యీాక్రింద పొందుపరుస్తున్నాను కసాయి దుకాణ ములలోని గొడ్లజబ్బును పరిశోధించుటకు ప్రభుత్వమువారును ఒకసంఘమును యిచ్చుటకు పంపినారు అందులో నే నొకడను లోగడవచ్చిన అంటుజాడ్యములనూ, గొడ్లజబ్బులవలననే వచ్చిన వనుసంగతి డా లిండ్లాహారు మాదిరిగా వాషింగ్టన్ సభ్యుల కును తెలుసును ఇప్పుడు వచ్చిన అంటువ్యాధికూడా ఆ జబ్బుల వలననే వచ్చినట్లు పెక్కునిదర్శనములు గలవు టీకారసమును తయారుచేయు కంపెనీల ప్రోద్బలమువలననే ప్రభుత్వము యీా సత్యమును అణచిపెట్టినది లోపలమురుగును బయటకు నెట్టుటకు ప్రకృతిచేయు ప్రయత్నమే వ్యాధియను డా లిండ్లాహార్ గారి అభి ప్రాయముతో నేను యేకీభవించుచున్నాను మామూాలు జల ప్రక్రియలతో వైద్యముచేస్తే రోగము నయమైపోవును ఏమీా ప్రమాదము చేయదు గొడ్లజబ్బులుకూడామామూాలుప్రక్రియల వలననే నయమగును

బాగా బలముతో వున్నజంతువులే ఈ జబ్బుల కో చచ్చి పోవుచున్నవి దేశసంపదకు యివి అవసరముగాన వీటిని రోగము లనుండి కాపాడుటకు ప్రయత్నములు జరుగుచున్నవి ఈజబ్బులు వస్తే నాలుకపుండుపడి ఆహారము మ్రింగుటకు వీలుగాకుండును ఆహారముతినుటకు వీలుపడదుగాన ఆకలితో ఆగొడ్లు చనిపోవును.

ఈ జంతువులను నాలీ వెలుతురు తగులు ప్రత్యేకస్థలములలో నుంచి నాలుకలకు ఎబ్బరు సంచులను తగిలించి అవసరమైనపుడు మంచినీటిని పోసినంత మాత్రముననే యీ రోగము నయమగును ఏవిధమగు అభ్యంతరములపెట్టక రోగమును వదలి పెట్టితే క్రిమేపీ అదే తగ్గిపోవును రోగమూ నయమగుతుంది అవయవాలు బాగుపడతాయి

ఇంత తేలికగా రోగము నయమైపోతుండగా ఈ విషయమును కాపులకు (రైతులకు) చెప్పకుండా ప్రభుత్వమువారు యెందుకు ఆపుతున్నారో తెలియుటలేదు ఈ చిన్నసూత్రమును కూడా తెలియకపోవుటచేతనే వేలకొలది జంతువులు చనిపోవుచున్నవి గొడ్లకు మామూలుగా వచ్చే జబ్బులన్నీ ఈ సామాన్య ప్రక్రియల వలననే నయమగును

## టీకాలవలనకలుగు ప్రతిఫలము

ఒకరోజున చికాగోలోని వైద్యకళాశాలలకు వెళ్లాను ఆ వైద్యకళాశాలలకు సంబంధించిన ఆసుపత్రికి అనేకమంది రోగులు వచ్చినారు అచ్చటకు వచ్చిన రోగులలో ఒకామెకు పదునెనిమిది సంవత్సరముల వయస్సు ఉండును ఈమె పైకి సంపూర్ణ ఆరోగ్యవంతురాలుగానే కన్పించును గాని యెడమ చేతికి పుండుపుట్టినది చిటికెనవ్రేలు పోవుటయేగాక అరచేయి కూడా చాలాభాగము తినివేసినది అప్పటికి ఆరునెలలనుండి ఆమె బాధను అనుభవించుచున్నది తల్లివైపువారికిగాని, తండ్రివైపువారికిగాని యెట్టిరోగములు లేవు ఇరుపక్కలవారునూ

యెన్నడునూ, గండమాల, క్షయ మొదలగు వ్యాధులతో బాధపడలేదు తల్లిదండ్రులును, అన్నదమ్ములును, అక్కచెల్లెళ్లును, సంపూర్ణ ఆరోగ్యవంతులుగానే యున్నారు వారికెట్టిరోగములునూ లేవు ఈమెకూడా ఇదివరకెన్నడునూ యెట్టి రోగములతోను బాధపడలేదు ఆమెను పరీక్షచేసినవారందరికినీ యేకారణములునూ కనుపించలేదు కారణము దొరకకపోవుట చేత ఆశ్చర్యచకితులైరి ఆమెకళ్లను చూడగా లోపములున్నట్లు గోచరించినది ఎడమచేతిని తెలుపుప్రదేశములో నల్లటిమచ్చ ఉన్నట్లును, ఈమచ్చలో తెల్లటి గీత లున్నట్లును కనబడినవి చేతిమీాదపుండు దానినుండి చీము కారునంతవరకును తెల్లని గీతలుగల నల్లమచ్చ కనబడుచునేవుండును ఈ పుండ్లును మానగనే నల్లమచ్చకూడా మాయ మగును ఎక్కువమచ్చలు యెక్కువపుండ్లను తెలియజేయును (ఇది కనీనికానిదానశాస్త్ర సాంప్రదాయము )

ఈ రోగికంటిలో యెడమచేతిని తెలుపు ప్రదేశములో నల్లమచ్చలును ఆమచ్చలచుట్టూ తెల్లచక్రము లుండెను కంటి లోని యీా నల్లమచ్చల వలన టీకాలసంగతి విచిత్రముగా గుర్తువచ్చినది

నాకునూ ఆరోగికినీ యీాక్రింది సంభాషణ జరిగినది

నేను —ఒకటి రెండేండ్ల క్రితము నీకు టీకాలువేశారా?

ఆమె —అవును

నేను —అపుడు పుండ్లు పడినవా ?

ఆమె —అవును

నేను —ఆ పుండ్లను మందులతో మాన్పితివా ?

ఆమె —అవును

నేను చెప్పినదంతయు తూ, చా, లు, తప్పకుండా ఒప్పు కొన్నది "ఒక సంవత్సరము క్రితము యూరోపునుండి తిరిగి వచ్చుచుండగా ఆమెకు టీకాలు వేసినారు అపుడు పుండ్లు పడినవి ఎంతకాలము ఆ పుండ్లు అట్లనే నిలవయుండగా చివరకు మందులతో వాటిని మాన్పితిని"

కనీనిఃను పరీక్షించిన తరువాత టీకాలవలన అపుడు పుండ్లు పడినవనియు, ఆ పుండ్లను మందులతో అణచిపెట్టినందు వలన యిపుడు చేతికి మరల పుండ్లుపడినవనియు తెలియచెప్పితిని అచ్చట గుమికూడిన వారందరకును నామాటలు విచిత్రముగా తోచినవి టీకాలు వేసి ఆరునెలలు దాటిపోవుటచే టీకాలవలన ఈ రోగము వచ్చినదని చెప్పుట వారికి విచిత్రముగా తోచి నా మాటలు నమ్మలేదు

నేను యీ క్రింది సమాధానమును చెప్పితిని రోగము తగిలిన ఆరునెలలకుగాని సవాయి బయటపడదు ఇంతేగాక గజ్జిని మందులతో అణచిపెట్టిన కొన్ని యేండ్లకుగాని వ్రణము పుట్టదు దీనికి మరేమి చెబుతారనగా వారు నిరుత్తరులైరి ఆ సదనాధిపతి నావాదనలోని సత్యమును గ్రహించి వారిని మందలించెను

## మూర్ఛలు

టీకాలవలన కలుగు ప్రతిఫలములలో మూర్ఛలు మరొకటి చాలాయేండ్లక్రితము మా ఆసుపత్రికి ఒక పెద్దమనిషి

వచ్చాడు ఇతను నాలుగుయేండ్లనుండి మూర్ఛలతో బాధపడు చున్నాడు చికాగోలోని హేమాహేమీలందరును వైద్యము చేసి విసుగుపొంది నిరాశచెందిరి కంటిని చూడగనే యెడమ చేతిని తెలుపు ప్రదేశములో చుట్టూ తెల్ల గీతలుగల నల్ల మచ్చలు కనుపించినవి దీనివలన ఆ అవయములకు దెబ్బతగిలి ఉండవలె నని గ్రహించితిని నాకునూ ఆ రోగికినీ యీ క్రింది సంభాషణ జరిగినది

నేను — నీ యెడమచేతికి యెప్పుడైనా దెబ్బతగిలినదా?

రోగి — లేదు (కొంచము ఆగి) మూర్ఛలు వచ్చినపుడు యెడమచేయినొప్పిగా నుండును ఈ నొప్పి పైకిపోవును మోచేయి దాటి పోయినపుడు నాకు వళ్ళు తెలియక పడిపోవుదును

నేను — (కంటిని నిదానముగా పరీక్షించి) నీకెప్పుడైనా టీకాలు వేశారా?

రోగి — నాలుగుయేండ్లక్రితము టీకాలు వేసిరి

నేను — అప్పు డేమయినా పుండ్లు పడినవా?

రోగి — చేయి వాచినది రెండువారములు మంచములో నుండి లేవలేదు

నేను — అప్పుడేగా మూర్ఛలు ప్రారంభించినవి?

రోగి — టీకాలు వేయకపూర్వము నా కెప్పుడునూ మూర్ఛలు రాలేదు టీకాలు వేసిన తరువాతనే మూర్ఛలు ప్రారంభించినవి

చాలామంది టీకాలవలననే దైహిక మానసిక బాధ లను భవించుచున్నారు టీకాలు వేసిన తరువాత చాలాకాలమునకు

ఈ రోగము వచ్చుటచేత పైకిమాత్రము ఈ రెంటికినీ (టీకాలకును రోగమునకునూ) సంబంధము కానరాదు కంటిలో ఈరోగ కారణములు విశదముగా కనబడును కాలికరోగములకు కారణములు తెలియవని మందువైద్యము చెప్పును మందువైద్యము వారికి తెలియకపోతే తెలియకపోవచ్చును కాని కంటిని చూచిన యేసామాన్యునికైనా ఈ రోగములకు కారణములు తెలియకపోవు మేము చెప్పేసమాధాన మేమంటే చేతికివేసిన టీకాలవలన దేహములోని రక్తము విషముగా మారిపోయినది టీకాలువేసినచోట పడినపుండ్లనుండి చీము రానిచ్చిన యెడల లోపలి మురికంతా బయటకు పోయేది మురికి పోగానే రక్తము శుభ్రపడేది మురుగు నిలవవుండకపోవుటచే కాలికరోగాలు వచ్చెడివికావు పుండ్లను పక్వము కాకమునుపే మందులతో మాన్పుట వలన బయటకు రావలసిన మురుగు లోపలనే నిలచిపోయినది

కంటిని చూడగనే మూర్ఛలకు మూలకారణమైన రోగపదార్థము తలలో యెడమచెవికి వెనుకవైపున చేరినదని తెలుసుకొంటిని ఎడమచేతికి టీకాలువేయుట మాత్రము విచిత్రము

ఈ రోగి ప్రకృతివైద్యముచేసిన యెడల రోగపదార్థమును వెలువరించుటకు అనుకూలమగు చికిత్సలనే అవలంబింపవలయును

నెల పదునైదు రోజులు ప్రకృతి వైద్యము చేయగా యెడమచేతిమీద నాల్గుయేండ్ల క్రితము సరిగా టీకాలు వేసిన చోటనే పుండ్లు పుట్టినవి లోపలి మురుగంతా యీ పుండ్ల

ద్వారా బయటికి వెళ్ళిపోయినది రెండు మూడు వారములున్న తరువాత యీపుండ్లు వాటంతటవియే మానిపోయినవి అప్పటి నుండి యీ మనిషికి మూర్ఛలు లేవు పెండ్లి చేసికొని, పిల్లలు తాను సుఖముగానున్నారు ప్రకృతివైద్యమంటే ఆయనకు విపరీతమైన అభిమానము మందువైద్యముప్రకారము యితను జన్మావధి రోగముతో తీసికొనవలసినది పెండ్లిచేసికొని పిల్లల కన్నట్లయితే వారికి యీ పాడురోగాలు సంక్రమిస్తాయిగాన యీ దరిద్ర సంతానముతో సంఘమును బాధించకుండా వుండాలంటే పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయవలసింది టీకాలు వేయుట చేతనే చాలామందికి క్షయ, ఏనుగుగజ్జి, పాండువ, అంకిళ్లు కలిసికొనుట, పక్షవాతము మొదలగు రోగములతో బాధపడుచున్నారు టీకాలు వేయకూడదని వాదించు సంఘములు లెక్కలతో అనేకవేల కేసులను ప్రచురిస్తున్నారు

1908 సంవత్సరములో చికాగోలో మశూచికముతో యిద్దరు చనిపోయిరి చాలామంది టీకాల వలన చనిపోయిరి టీకాలువేసిన చాలాకాలమునకు ప్రతిఫలము కనబడుటచేత టీకాలకును రోగములకును సంబంధము పైకి కనబడదు కంటిలో మాత్రము తు, చ, తప్పకుండా కనబడును టీకాలు వేయగనే పుండ్లుపడి రసి, చీము కారిపోవును పుండ్లుపడి చీముకారిపోయిన వారి కండ్లకన్న పుండ్లుపడనివారి కనీనికలు మరీనల్లగాయుండును దీనికి కారణమేమంటే టీకాలు వేయగనే టీకారసములోని విషము రక్తముతో కలిసిపోతుంది రక్తమంతా కలుషితమగుతుంది మిగతారక్తమంతా కలుషితము గాకుండుటకై ప్రకృతి యీ

క్రొత్తమురుగును బయటకు నెట్టుతుంది ఇప్పుడు బయటకు వచ్చు చీముతో టీకాలలోని మురుగేగాక దేహములోని భాగములును చర్మమునకు సంబంధించిన భాగములును టీకాలు వేసిన తరువాత కనీనికరంగు నల్లబడుతుంది అందులో ముఖ్యముగా జీర ఉండడమును తెలియపరచు పాతమురుగు కూడా బయటకు వస్తుంది

దేహమంతా యిదివరకే రోగపదార్థముతో నిండి వుంటే క్రొత్తపాత మురుగులను ప్రకృతి బయటకు నెట్టలేదు లోపలనే నిలవఉంటుంది నిలిచిపోయి ప్రధాన అవయవముల సహితము పాడుచేస్తుంది చర్మముకూడా చెడిపోతుంది

ఒకతడవ టీకాలువేస్తే యింతగలభ జరుగుతుంటే శాస్త్రమను పేరుతో పదేపదే టీకాలువేయించుకొను పెద్ద మనుష్యులగతి చెప్పనక్కరలేదు టీకాలమురుగు యెక్కువగా చేరినకొలదీ దీనిని, నిరోధించుశక్తి, ప్రకృతి తగ్గిపోతుంది ఒకటి రెండు తడవలు పుండ్లుపడి చీముకారి, మూడు నాలుగు తడవలకు అసలే పుండ్లుపడవు తరువాత టీకాలు వేసినట్లుకూడా గుర్తులు కానరావు

చికాగోలో ఒకామెకు పది తడవలు టీకాలు వేసినారట పొంగలేదట పొంగని కారణముచేత మరొక పర్యాయము వేయించుకొంటేనేగాని బడులలోనికి రానీయమని నిర్బంధించారు ఈమె ఆపాదమస్తకము టీకారసముతోనే నిండిపోయినది. మురుగులేని భాగమే ఉండదు

పైన చెప్పిన విషయములను ఒక పర్యాయము సింహావ లోకనము చేద్దాము టీకాలు పడగనే పుండ్లుపడి చీము కారి పోయినయెడల దేహములో మురుగు తక్కువగ వుండి హాని కూడ తక్కువగనే యుండును పుండ్లు పడక వేసినవి వేసినట్లు గానె మానువారిలో టీకాల మురుగు లోపలనే వుండి చెప్ప నంత హాని జరుగును నిర్బంధించి టీకాలు వేసిన అన్ని దేశము లలోను కాలిక రోగములు ఎక్కువైనవి జీర్ణ మండలమునకు సంబంధించిన అవయవములు టీకారసముతో చెడిపోవుటచే జీర్ణకోశ వ్యాధులును, చిన్నప్రేవులకు సంబంధించిన వ్యాధు లును, గొంతులో పుట్టు వ్యాధులును శ్వాసనాళములకు సంబంధించిన వ్యాధులును, స్వరపేటికలో పుట్టు వ్యాధులును వచ్చును టీకాల వలననే గవదబిళ్ళలు, పాండువ, క్షయ రోగము, మొదలగు దుర్భర వ్యాధులు వచ్చుచున్నవి

## టీ కా ల వ ల న స ర్పి వ చ్చిం ది

1820 సం॥లో ఫ్రాన్సుదేశస్థుడు, బ్రెటోనూ సర్పి యొక్క పుట్టుపూర్వోత్తరముల కనుగొనెను ఈ రోగమైనను టీకాల విజృంభణము తరువాతనే వచ్చినది చాలామంది పరి శోధకులు సర్పి యిప్పుడున్నంత తీవ్రముగా పుట్టినపుడు లేదని వప్పుకొనుచునే యున్నారు మశూచికమురాకుండా కాపుదలకై టీకాలువేసిన అన్నిదేశములలోను సర్పి తీవ్రముగానే యున్నది టీకాలవలన ప్రజలలోని ధాతుశక్తి తగ్గిపోవుచున్నది టీకాలు వేసిన అన్నిదేశములలోను సర్పి ఉన్నదను మాటను మందు వైద్యులు వప్పుకొనక పోయినప్పటికినీ, సర్పి యిప్పుడు ఉన్నంత

తీవ్రవముగా నిర్బంధముగా టీకాలు వేయనిరోజులలో లేదని మాత్రము ఒప్పుకొనకపోరు

టీకారసము జీర్ణావయవములోని అమత్వాచయనము నందును, గొంతులోను స్వరపేటికయందును ప్రధానముగా చేరుకొనునని కంటిని చూచి చెప్పవచ్చును ఈ అవయవము లోని ధాతుశక్తి తగ్గిపోవును ధాతుశక్తి తగ్గిపోవుటచే టీకా రసము ఇచ్చట చేరును. లోపలిమురుగును బయటకు నెట్టివేయు స్వభావము ప్రకృతికి వున్నదిగాన రోగపధార్థము యెక్కువగా చేరినపుడు యీ అవయవములే జబ్బుపడును అందువలననే సర్పి వచ్చును టీకారసములోని మైక్రోజిమాలే సర్పిని కలిగించు సూక్ష్మజీవులగును

టీకాలు వేయకపోయినప్పటికినీ సర్పి వచ్చుట మనము చూచుచున్నాము నిజముచెప్పాలంటే సర్పియని నిర్ణయము చేసిన రోగములన్నియు సర్పికానేకావు ఇంతకన్న తీవ్రమైన జబ్బులే సర్పి వచ్చి బ్రతికారంటే నిజముగా అదృష్టమే అందరు రెండుమూడు తడవలైనా టీకాలు వేయించుకొనే యుంటారు జీవితకాలములో ఒక పర్యాయమైనా టీకాలు వేయించుకోని వారుండరు టీకాలు వేయించుకొన్నవారే యెక్కువమంది వుండుటచేత వారికి సర్పి వచ్చి వారు బయటకు విడుచుగాలిలో దోషము లుండుటచేతను యీ గాలినే టీకాలు వేసుకోనివారు పీల్చుటచేతను, టీకాలువేసుకోనివారికికూడా సర్పి వచ్చిందంటే, ఆశ్చర్యమేమీ లేదు మూడు నాలుగు తరముల వరకు యీ టీకారసముయొక్క ప్రతిఫలములు కనబడునని చెప్పవచ్చు

ఆరోగ్యవిషయ సూత్రములు అందరకు తెలియునని చెప్పుటకు వీలులేదు పెద్దమనుష్యులకు ఆరోగ్యవిషయము తెలియదనే చెప్పాలి ఇంత గడుసుగా యెందుకన్నారంటా రేమో ఒక చిన్నకథ చెబుతా వినండి చికాగోలో ఒక కోటీశ్వరుడు గలడు వానికి ఆ నగరములో ఒక డజనుకాఫీహోటళ్ళు గలవు ఆ కాఫీ దేవాలయములలో పనిచేయువారందరును విధిగా టీకాలు వేయించుకొనవలెనని యీాయనగారు నిర్బంధించారు టీకాలు వేసుకొననివారిని శిక్షించారు దేవాలయములకు వచ్చు అతిథులకు మాత్రము తెల్లపంచదార, మైదా పిండితో తయారుచేయబడిన తినుబండారముల నీయవలసినదే ఆ యజమాని బుద్ధిసూక్ష్మము టీకాలు వేయించుకొనకపోతే రోగము వస్తుందనువరకే పోయినదిగాని అంతకుమీారి పోలేదు టీకాలు వేసికొనకపోతే చనిపోయేవారు చాలా కొద్దిమందే తెల్లచక్కెరతోను, మైదాపిండి తోను, తయారుకాబడిన పదార్థముల తిని రోగములతో బాధపడేవారు చాలామంది ఉంటారు

## టీకాలవలన యెదో మజ్జాగత జ్వరము వచ్చింది

రెండు యేండ్ల క్రితము టెక్సాస్ నుండి ఒక మిత్రుడు జాబు వ్రాశాడు ఆ జాబులోని విషయమునే ఈక్రింద పొందుపరుస్తున్నాను

'ఆర్యా, మామిత్రుని కథను మీాకు తెలియజేస్తున్నాను వీరికి యిరువది సంవత్సరములు ఈ ఇరువది సం ల నుండి ఒక తడవకూడా జబ్బు రాలేదు చాలా బాగా ఆరోగ్య

ముగా నున్నాడు ఒక తడవ మాత్రము గవద బిళ్లలు లేచినవి మశూచికము వస్తుందేమోనను భయముతో టీకాలు వేయించుకొన్నాడు దీనివలన రక్తమంతా కలుషితమై మేదోమజ్జాగత జ్వరము వచ్చింది ఈ జబ్బుతో కాళ్లు చచ్చుపడెను మూత్రము జారీ అగుట లేదు కడ్డీవేసి తీయవలసి వచ్చింది ఎనిమా చేస్తేగాని మలము జారదు ఇచ్చటి మా వైద్యులందరును నిరాశ చెందిరి రోగిని కదలిస్తే ప్రాణాపాయముండునని యిచ్చటి మందు వైద్యులు చెప్పుచున్నారు ఈ రోగిని గూర్చి మీ అభిప్రాయమేమి? మీ ఆసుపత్రికి చేర్చమనెదరా?

కొన్ని వేల మైళ్ళు దాటి రావలసివచ్చుటచేతను కదల వీలుకాని పరిస్థితిలో నుండుట చేతను నాకు భయముతోచింది కదలిస్తే ప్రాణాపాయముఉండునని చెప్పినప్పటికిని-ఈ వైద్యమందు నాకెక్కువ నమ్మకముండుటచేత, రోగిని తీసికొని రమ్మని వ్రాశాను తీసుకొని వచ్చినారు అధోభాగమంతా చచ్చు పడిపోయింది కడ్డీవేస్తేగాని మూత్రము జారీ అగుట లేదు టీకా రసము వలననే యీరోగము వచ్చినప్పటికినీ మందు వైద్యులు యేమంటారంటే-మూడు నెలల క్రితము యీయనిపై గుర్రముమీదనుండి పడుట యీరోగమునకు కారణమంటారు – గుర్రము మీదనుండి పడుటచే యీరోగము వచ్చినదనుటలో రోగికేమీ నమ్మకము లేదు ఎందుకంటే-తాను గొడ్లకాపరి అగుటచే చిన్నప్పటినుండీ యింతకన్న పెద్ద దెబ్బలే తగులుచు వచ్చినవి. రోగము కాలికము కాకపోవుటచేత తరుణావస్థలోనే వుండుట

చేత త్వరలోనే నయమైనది రెండు నెలలైన తరువాత కాళ్ళు స్వాధీనమైనవి ఇంటికి పోవుటకు ప్రయత్నము చేసినాడు నా బలవంతము మీద యింకా కొన్నిరోజులుండినాడు రోగము పూర్తిగా నయమైనది సుఖముగా యింటికి వెళ్ళినాడు

నా అనుభవములు —అన్నిరోగముల వలెనే మశూచికముకూడా దేహములోపల మురుగు చేరనిది రాదు దేహము మీద కనుబడు పొక్కులన్నియు మురుగు బయటకువచ్చు త్రోవలే మశూచికముతో,బయటకు వచ్చుటకుఅనుకూలమగు, మురుగు అంతియూ బయటకు వచ్చును టీకాలు వేయించుకొనుట, మశూచికము వచ్చుట, అను రెండు రోగములలోను మశూచికమే కొరతగ్గది టీకాలవలన మురుగు లోనికి పోవును మశూచికము వలననో రోగపదార్థము బయటకు వచ్చును

ఇవన్నీ వ్యర్థ ప్రసంగములనీ, గాలిమాటలనీ మామిత్రులనవచ్చును స్వ విషయమును చెపితే నిజమని నమ్ముతారని తలచాను

వంశానుగతముగా నున్న రోగ ప్రవణతలు మాదంపతులలో పూర్తిగా నున్నప్పుడే మా పెద్దకుమారుడు విక్టర్ లిండ్లే పేరు కలిగాడు పుట్టినప్పుడు శిశువు 2½పౌన్లు ఉన్నాడు మామూలుగా ఉండవలసిన తూకము 6పౌన్లు) ఈ పిల్లవాడు బతుకుతాడని నాకెట్టి ఆశయులేదు కన్నులు మాత్రము నలుపు, నీలములు కలసిన రంగులో నుండెను చర్మము ద్వారా బయటకు వచ్చు రోగపదార్థమును మందులతోను, రసములతోను అణచివేయుటచేత తెల్లగుడ్డుమీద పొర యేర్పడినది

అయిదు, ఆరు సంవత్సరములు వచ్చువరకును యీపిల్ల వాడికి పిల్లలకు మామూలుగా వస్తూఉండే జబ్బులన్నీ వచ్చి పోతునే ఉండేవి వీటికి ప్రకృతి వైద్య చికిత్సా ప్రక్రియలనే చేసి నాము ఏమందులూ పోయలేదు టీకాలు వేయలేదు

ఒకరోజున ఒంటిమీద పొక్కులు కనబడినాయి మశూచికము అవునో, కాదోనని నిర్ణయించుటకు మందు వైద్యులను పిలిచితిని మశూచికమేనని వారు నిర్ధారణ చేసినారు.

దీనికి ప్రకృతివైద్య చికిత్సా ప్రక్రియలనే చేసినాము ఉపవాస ముంచినాము ఎనిమా చేసెడివారము జలచికిత్సా ప్రక్రియలను కూడా చేసినాము తడికట్లను తరచుగా కట్టినాము పోత బాగా పోసినది తడికట్లను కట్టుటచే జ్వరము తగ్గేఉన్నది ఏమీ ప్రమాదము లేకుండానే రోగక్రమము సరిగానే జరిగిపోయినది

నేను, నాభార్య, ఆమె చెల్లెలు యెట్టి భయమూ లేకుండానే ఆపిల్లవాడి వద్దనే ఉంటిమి మాకేమీ టీకాలు వేయలేదు ఆ పిల్లవానికి పరిచర్యలు చేసినప్పటికినీ యేరోగము వస్తుందను భయములేదు

ఈ తడికట్లవలన లోపలి మురుగంతయు మెత్తపడి చర్మముద్వారా బయటకు వచ్చింది ఎట్టి అభ్యంతరములు కలుగలేదు గాన రోగము సక్రమముగానే గడచిపోయినది దేహముమీద రెండు, మూడు మచ్చలు మాత్రము మిగిలి పోయినవి మిగిలినవన్నియు పోయినవి ఈ రెండు మచ్చలు కూడా తరువాత మాయమైనాయి లోపల మురుగు పోవుటతో

కళ్ళ రంగు కూడా మారిపోయినది మశూచికము వచ్చి నయమైన తరువాత చాలా ఆరోగ్యముగా నున్నాడు అప్పుడు అచట మశూచికము లేదు మశూచికము అంటుజాడ్యమే అయితే యీ పిల్లవాడికి యెచట నుండి వచ్చినది? ఆ పిల్లవానితోనున్న మిగిలినవారి కేమీ రాలేదు అయితే యీరోగము యెందువలన వచ్చిన దంటారేమో? మా సమాధానము యిది వంశానుగతముగా మాభార్య భర్తలకుగల రోగ ప్రవణతలే యీ పిల్లవానికిని కలిగినది లోపలి మురుగునంతనూ రోగము ద్వారా బయటకు పంపినది

రెండవ కుమారునికిని మరొక జబ్బు వచ్చిచది ఏడాది నిండక పూర్వమే మేదోమజ్జాగత జ్వరము వచ్చినది వెన్ను విరగ తీసికొని పోవుట యీ రోగముయొక్క సహజ లక్షణము లోగడ మాదిరిగానే యీరోగమును మందు వైద్యులచే నిర్ధారణ చేయించితిని ఆపిల్లవానికి వలెనే యీపిల్లవానికిని ప్రకృతి వైద్య చికిత్సా ప్రక్రియలనే చేసితిని తొమ్మిది రోజుల వరకును రోగము తీవ్రముగానే ఉన్నది రెండు చెవులనుండి చీమువచ్చుట మొదలు పెట్టినది నెత్తురు వచ్చేది పదకొండు రోజులైన తరువాత ఆహారము పెట్టినాము ఈలోపుగా పుల్లటి ఫల రసమును నీటితో కలిపి యిచ్చేవారము మాపెద్దపిల్లవానికిని అదే ఆహారమును యిచ్చినాము

నెలా పదిహేను రోజులదాకా చీమూ, నెత్తురూ అట్లనే వచ్చింది దాని నేమీ అభ్యంతర పెట్టలేదు ఎక్కువగా బయటకు వచ్చుటకే సాయము చేసినాము రోగము రాక

పూర్వము పిల్లవాడు కొద్దిగా మందముగా నుండేవాడు రోగము నయమైన తరువాత చురుకుగానే ఉన్నాడు పెద్దపిల్ల వాడు కూడా రోగము నయమైన తరువాత చురుకుగానే ఉన్నాడు

ఈ రోగాలకే మందులవాడితే, అంతులేనన్ని జబ్బులు వచ్చేవి ఆ జబ్బులకే మందులు పోస్తే, మితిలేని జబ్బులు వచ్చేవి వీటి ఫలితముగా రోగులు బ్రతకనే బ్రతకరు ఒకవేళ బ్రతికిరా అంటే పక్షవాతము, క్షయ తప్పకుండా రావలసినదే కొన్ని సంవత్సరములకు కూడా బయటకుపోని రోగపదార్థ మంతా కొన్ని రోజులలోనే బయటకు పోయింది

---

## ౧౪
# సర్పిమందు

సర్పినే విసర్పికూడా అనుట కలదు ముందెప్పుడో సర్పి వస్తుందని రాకుండా కాపుదలకై మందుతినుట కద్దు ఈ మందును ఆంగ్లమున "డి ఫ్తీరియా ఆంటి టాక్సిను" అంటారు. ఈ మందు పుట్టు పూర్వోత్తరములను, లాభ నష్టములను గూర్చి తెలుసుకొందాము

సర్పిరోగమునకు మందును మొదటలో జర్మను శాస్త్రజ్ఞుడొకడు కనుగొనెను తరువాత శాస్త్రజ్ఞులు యీ సర్పి మందువలన రోగము నయమగునా కాదా యని ఆలోచింప జొచ్చిరి పరిశీలించిన తరువాత యేమని నిశ్చయించు కొన్నా

రంటే యీ మందువలన సర్పి రోగము నయమగుట లేదనియు, ఈమందు వలన ప్రమాదకరమైన ప్రతిఫలములు కలుగుచున్న వనియు—జర్మనీలో యీమందుకుగల ఆదరణ తగ్గిపోయి నప్పటి కిని అమెరికాలో దీనియందుగల ఆదరణ అధికమైనది అందునూ చికాగోలో మరీ అధికముగా నున్నది ఈ మందు వాడువా రందరును దీని గుణముల వేనోళ్ళ పొగడుచున్నారు ప్రత్య క్షములో మాత్రము దీని గుణములు కనబడుటలేదు చికాగో లోని ఆరోగ్యశాఖవారు మందు వైద్యులకు పంపు లెఖ్ఖలను బట్టి చూస్తే యీమందును వాడినందువలన చచ్చినవారి సంఖ్యకన్న బ్రతికినవారి సంఖ్యయే తక్కువగా ను న్నది ప్రభు త్వపు లెఖ్ఖలను పూర్తిగా నమ్ముటకు వీలులేదు ఈ మందును వాడుటచే చనిపోవువారి సంఖ్య తగ్గునదీ, హెచ్చినదీ యిప్పుడు చెప్పలేము మిగిలిన అన్ని వైద్యములకన్న ప్రకృతి వైద్యము చేసిన యెడల సర్పిరోగము తప్పకుండా నయమగునని రోగము నయము కాక చనిపోవువారు చాలాకొద్దిమందే ఉందురను మాట మాత్రము నిజము

ఒక్క విషయమును మాత్రము మనము ముఖ్యముగా గమనించ వలెను

సర్పి రోగమునకు వాడు వివిధ మందు వైద్య ప్రక్రి యల వలన కలుగు ప్రతి ఫలితములను గూర్చి ఆలోచింతము

1 సర్పిరోగమును నయముచేయుటకు వాడు మందు విషతుల్య మగుటచే పక్షవాతము వచ్చుచున్నది ఈ మందు వలన హృద్రోగము కలిగి మరణము సంభవించ వచ్చును

2 సర్పి రోగమునకు ఈమందును వాడితే హృద్రోగములు, పక్షవాతము రావచ్చును బుద్ధి మాంద్యము కలుగవచ్చును జన్మావధిగా బాధపడు యితర రోగములును రావచ్చును

3 సర్పిని మందులతో అణచి పెట్టతే యీ ప్రతిఫలములు కలుగుచున్నవి అట్లా అణచిపెట్టకపోతే పై ప్రతిఫలములు కలుగవు ప్రకృతి వైద్యచికిత్సా ప్రక్రియలన్నినో రోగపదార్థమును అణచి పెట్టవు రోగపదార్థమును బయటకు పంపును తరువాత బాధలు కలుగవు రోగపదార్థమంతయు బయటకు పోవుటచే రోగము రాకపూర్వముకన్న వచ్చిపోయిన తరువాతనే దేహారోగ్యము బాగుండును సర్పి మందును వాడుటచే రోగము కుదిరినవారి కన్న కుదరనివారే యెక్కువగా గలరని అమెరికాలోని ప్రముఖులందరును ఒప్పుకొన్నారు సర్పి రాకుండా ఉండగలందులకు వాడిన మందువలన ఆరోగ్యవంతులు సహితము తమ వెనుకటి ఆరోగ్యమును పోగొట్టుకొని నానా యిడుమల పడుచున్నారని పై ప్రముఖులే సెలవిచ్చారు

ఈ విషయమై జర్మనీలో యిరువది సంవత్సరముల క్రితము ఆందోళన బయలుదేరినది ఈ మందుయొక్క గుణావగుణములను కనుగొనుటకు జర్మను ప్రభుత్వమువారు ఒక ఉపసంఘమును నియమించిరి ఆసభ్యులలో డాక్టరు లాంగరు హాన్సు ముఖ్యులు. విచారణముందు వీరు సర్పిమందును, టీకారసమును బీదల కందరకును ఉచితముగా పంచిపెట్టవలెనని

ప్రచారము చేసిరి విచారణ అనంతరము కూడా సర్పిమందును బెర్లినులోని బీదసాదలకందరకును ఉచితముగా పంచిపెట్టవలె నని తీర్మానించిరి

కొద్దిరోజులైన తరువాతనే డాక్టరుగారి వంటమనిషికి జబ్బుచేసినది గొంతులో పుండు పుట్టినది ఆసుపత్రికి పంపగా సర్పిఅని నిర్ధారణచేసిరి ఏదైనను పిల్లవానికి వంటమనిషి నుండి యీ జబ్బు అంటునేమోనని భయపడి యీమందును వాడారు నెత్తురు కక్కేని, హృద్రోగము వచ్చి ఆపిల్లవాడు ఇరువది నాలుగు గంటలలో చనిపోయెను

జర్మనీలో ఒక ఆచారమున్నది—ఫలాని మనిషి ఫలానా రోగముతో చనిపోయినాడు అంత్యక్రియలకు రమ్మనమని ఆనాటి దినపత్రికలలో ప్రచురిస్తారు ఈ ఆచారము ప్రకారము సర్పిరోగము రాకుండా కాపాడుటకై సర్పిమందును ఇంజక్టు చేయుటచే నా కుమారుడు చనిపోయాడని డాక్టరుగారు ప్రచురించారు

డాక్టరు పిష్టరుగారు బెర్లిను నగరములోని ప్రఖ్యాత మందు వైద్యులు వారు తమ కుమార్తెకు గొంతులో నొప్పిగా నున్నదని తెలియగనే భయపడి సర్పిమందును వాడేనారు ఈఇంజక్షను ఫలితముగా ఆమెకుతీవ్రమైన జబ్బువచ్చినది

సర్పిమందు యొక్క గుణావగుణములను గూర్చి ఆస్లరు పండితు డేమి చెప్పుతాడో తెలుసుకొందాము 'మందుల ప్రభావము' అను తనగ్రంథము 150 పేజీలో ఈ క్రింది విధముగా వ్రాశాడు

సర్పిమందువలన కలుగు ప్రతిఫలములలో పక్షవాతము ముఖ్యమైనది ఈ మందులవలన కలుగు ప్రతిఫలములను జంతువులలో ప్రత్యక్షముగా చూడగలము నూటికి యిరువది కేసులలో తప్పకుండా పక్షవాతము వచ్చింది రోగము తిరుగు ముఖము పట్టిన రెండు, మూడు వారములలో తప్పకుండా యిది ప్రత్యక్షమగును పక్షవాతము తీవ్రముగా రానవసరము లేదు తేలికగాను వచ్చిపోవచ్చును

ఈ మందువలన యే అవయవమైనను నిరుపయోగము కావచ్చును దృష్టాడులకు దెబ్బ తగిలిన కంటికి మెల్ల వస్తుంది హృద్రోగములు సామాన్యముగా వచ్చునవేను హృదయ మాగిపోయి మరణము సంభవిస్తుంది

ఇన్ని రోగములు యీమందువలన యెట్లా కలుగునను ఆశ్చర్యము కలుగవచ్చును దీనికి మా సమాధాన మేమంటే— గొంతులో నొప్పిపుట్టినంతమాత్రానే సర్పి వస్తుందని భయపడ నవసరము లేదు సర్పి రాకుండా మందును వాడ నవసరము అంతకన్న లేదు గొంతులో పుండు పుట్టినందువలన పక్ష వాతము రాకపోయి నప్పటికినీ, సర్పికి వాడు మందువలన పక్ష వాతము తప్పకుండా వస్తుంది ఆస్లరు పండితుడు ఉదహరించిన రెండు కేసులలోను ముందెప్పుడో సర్పి వస్తుందని భయపడి సర్పిమందును వాడినందువలన ఒక పిల్లవాడు చనిపోయినాడు మరొకపిల్ల తీవ్రమైన జబ్బుతో బాధపడినది ఆరోగ్యవంతులైన పిల్లలకే యీమందుల వాడినారు కారసముకన్న, సర్పి

రాకుండా ఉండుటకువాడుమందు హానికరమైనదని పైరెండుఉదాహరణలబట్టి మనము తెలుసుకొనగలము

మా ఆసుపత్రికి వచ్చు చాలామంది కాలికరోగులు రోగ చరిత్రను చెప్పమనగానే తమ రోగము సర్పితో ప్రారంభించినదని చెప్పెడివారు ఆ సర్పిని మందులతో నయముచేసినామని చెప్పెడివారు పక్షవాతపురోగులు, పిచ్చివారు, మందబుద్ధులు చాలామంది తమ రోగచరిత్రలను యీ విధముగనే చెప్పెడివారు

ఈమందుల వాడినట్లు రోగుల కనీనికలు చూడగనే తెలియవచ్చెడిది ఈమందువాడుటచే లేతరంగుగల కనీనికలు ముదురురంగు గలవిగా మారిపోయెడివి

మరొకరి రోగచరిత్రను చెపుతాను మా ఆఫీసులో పనిచేయువారిలో నొకరి కనీనికలు పదేండ్లవరకును నీలముగానే ఉండెను అప్పుడు యీమెకు సర్పిరోగము వచ్చినది ఏ మందు వాడారో గుర్తు లేదటగాని గొంతుకుమాత్రము పట్టువేశారట ఒంటికి చమురుమర్దన చేసినారు చాలాకాలము మందులు సేవించినది అప్పటినుండీ కనీనికలు గోధుమవన్నెగా మారి పోయినవి అయిడోఫారపు యెర్రనిమచ్చలు మెదడును తెలుపు ప్రదేశములోను, గొంతును తెలుపు ప్రదేశములోను కనుబడు చున్నవి సర్పిని యీ మందుతోనేగాక యే యితరమందులతో అణచి వేసినను కనీనికయొక్క రంగు దాదాపు ఒకటిగానేఉండును

ఒకామెకు అయిదునెలలు ప్రకృతివైద్యము చేసినందు వలన కనీనికల ముదురు గోధుమరంగు పోయి లేతనీలపురంగు

వచ్చినది కనీనికలోని మిగిలిన దోషములన్నియు పోయినవి సర్పి రోగమును ప్రకృతివైద్య పద్ధతులలో నయముచేసిన యెడల పక్షవాతము, పిచ్చి మొదలగు యేయితర జబ్బులును రావు ఇదే అభిప్రాయమును జర్మను ప్రకృతిశాస్త్రజ్ఞులందరును గత యేబదిసంవత్సరములనుండి చెప్పుచునే ఉన్నారు 'టీకాల వలన కలుగు అపకారము' అనే పుస్తకములోని డాక్టరు బెన్ని షన్ డీన్ గారి అభిప్రాయములను యీక్రింద పొందుపరుస్తున్నాను – టీకాలు వేసుకోవలెనని ప్రచారముచేయు ప్రకటనలును, టీకాలువేయువారును యిద్దరును మానవకోటికి చెప్పనలవిగాని హానిని చేయుచున్నారు తనపరిశోధనలకు మూలమైన ఒక రోగిచరిత్రను గ్రంథకర్త చెప్పుచున్నాడు – ది 15_6_1889 తేదీన యీగ్రంథకర్త కాలిఫోర్నియాలో ఒక నగరమునకు పదిహేనుమైళ్ళ దూరములో ఉన్నాడు అక్కడనే ఉండే ఒక భాగ్యవంతునికి అతిథిగానున్నాడు ఆ రైతుకు యేడుగురు పిల్లలు గలరు వీరి సేవకునికి అయిదుగురు పిల్లలు, భార్యయు గలరు వీరి కెప్పుడునూ టీకాలువేయలేదు. వారిలో ఆరుగురుకు మన డాక్టరుగారు టీకాలు వేశారు

కాపుభార్య వయస్సు 43 సంవత్సరములు
కాపు పెద్దకుమారుని వయస్సు 25 సంవత్సరములు
కాపు కుమారుని వయస్సు 8 సంవత్సరములు
కాపు కుమార్తె వయస్సు 6 సంవత్సరములు
సేవకుని వయస్సు 46 సంవత్సరములు
సేవకుని కుమారుని వయస్సు 12 సంవత్సరములు

మిగిలిన వారికి టీకాలు వేయలేదు 1 8 1890 తేదీన యీ రెండు సంసారములును కొండమీదకు వెళ్ళినారు సమీపములో యెచ్చటను సర్పిరోగము లేదు శుభ్రమైన గాలీ వెలుతురులు తగులుచోట్లు

ఆగష్టు 24 వ తేదీన యీపిల్లలలో కొందరకు గొంతు నొప్పి చేసినది ఈ కాపు 7 యేండ్ల కుమార్తెకును, 9 యేండ్ల కుమారునకును, 13 యేండ్ల కుమారునకును జబ్బు చేయుటచే స్వస్థానమునకు చేరిరి వైద్యుడు సర్పియని నిర్ధారణ చేసెను కాపుభార్యకును సర్పిరోగము వచ్చినది టీకాలు వేయని వారందరకును త్వరగానే నయమైనది కాపు 7 యేండ్ల కుమార్తె చనిపోయినది కాపు చిన్న కొడుకునకు ఒక సంవత్సరము వరకును రోగము నయము కాలేదు కాపు భార్య పక్షవాతముతో ఒక సంవత్సరము బాధపడినది కాపు రెండవ కుమారునికి సరియైన ఆరోగ్యము చేకూరనే లేదు

1893 సంవత్సరములో కాపు పెద్దకుమారుడు క్షయ రోగముతో చనిపోయెను 1900 సంవత్సరములో కాపు 57 వ యేట స్వరపేటికలో వ్రణము పుట్టి చనిపోయెను 1902 సంవత్సరములో సేవకుని 25 సంవత్సరముల కుమారుడు క్షయ రోగములో చనిపోయెను అంతర్వ్రణమువలన సేవకుని భార్య 63 వ యేట చనిపోయెను 1911 సంవత్సరములో సేవకుని 30 యేండ్ల కుమారుడు క్షయరోగముతో చనిపోయెను

కాపు పెద్దతనముతో చనిపోయెను మిగిలిన వారందరును ఆరోగ్యముగనే ఉన్నారు ఇంతవరకును టీకాలు

వేయించుకొనలేదు ఇప్పటికి బ్రతికిఉన్నవారికి యెవరికిని క్షయ రోగము రాలేదు చనిపోయినవారి పూర్వీకులలో యెవరికిని క్షయరోగము లేదు 1889 సంవత్సరములో టీకాలు వేసిన వారందరును చనిపోయిరి

పైన చెప్పినదానిని బట్టి క్షయరోగ నివారణోపాయములును, అంతర్జాతీయ పరిశోధనలును యెంత నిష్ప్రయోజనములో తెలియుచున్నది ఈ వ్యర్థ పరిశోధనలకు యేటా కొన్ని కోట్ల డాలర్లను యెందుకు తగలపెట్టుచున్నారో అర్థమగుటలేదు శాస్త్రమను పేరుతో అనేకకోట్ల జీవరాసులను హింసించుచున్నారు మానవజాతిని బాధపెట్టుచున్నారు ఇంత పని జరుగుచున్నను యీరోగాల వలన చచ్చువారు యేటా పెరుగుచునే ఉన్నారు తగ్గుటలేదు వీలు దొరకినప్పుడల్లా ఆరోగ్యశాఖవారు టీకాలు వేయించుకొన వలసినదని ప్రజలను నిర్బంధించుచునే ఉన్నారు ఈ నిర్బంధము అందరకును గలదు

— ప్రకృతి శాస్త్రజ్ఞులు చెప్పు మాటలనే మందువైద్యులు పరిశోధన పేరుతో ఒక్కొక్కదానినే కనుగొందురుగాక

మామిత్రులకు మనవి — సూక్ష్మజీవుల గూర్చిన్నీ మందుల గూర్చిన్నీ, నా అభిప్రాయములు పత్రికలద్వారా అందరకును తెలియుటచే మా మందు-వైద్య మిత్రులకు చాలా కోపము వచ్చినది చాలామంది వ్యతిరేకముగా వ్రాసినారు అందులో ఒక ప్రముఖుడు సర్పికి మందులు వాడవలెననియు, తనవాదనకు ప్రోద్బలముగా ఆస్లరు పండితుని సతీమణి అభిప్రాయములను, ఆండూసుగారి అభిప్రాయములను ఉదహ

రించాడు తన అభిప్రాయములను కూడా జోడించాడు మా మిత్రుని వ్రాతలనే యీక్రింద పొందు పరుస్తున్నాము

'నేనున్నూ, నా తోబుట్టువున్నూ ఆపత్రికకు (డా లిండ్లాహారు అభిప్రాయములను ప్రకటించు ప్రకృతివైద్య పత్రిక) చందాదార్లము లిండ్లాహారుగారి అభిప్రాయముల చదివి సర్పికి మందులు వాడుట మానినయెడల, ఆమె కుమారుడు మందు వాడనందువల్ల సర్పిజబ్బుతో చనిపోయినపుడు, యీ వ్యాసములుగల పత్రికను ఆమెకు అందజేసినందుకు చాలా విచారపడెదను డా లిండ్లహార్ గారి ఆవ్యాసములు చదివినవారందరును యిదే అభిప్రాయమునకు వత్తురని గట్టిగా నమ్ముచున్నాను'

ఈ ప్రముఖుడు ఆ స్లరుపండితుని అభిప్రాయములను సరిగా గ్రహించకపోవుటచేతనే యీ త్రోవకు వచ్చినాడు ఆస్లరుపండితుని అభిప్రాయములను సరిగా గ్రహిస్తే యీ వాదనకు రాడు

జర్మనీ లోని ప్రకృతి వైద్యము — ఏ రోగమైనను మందులు లేకుండానే ప్రకృతివైద్య చికిత్సాప్రక్రియలతో నయమగునని గత యేబదియేండ్లనుండి జర్మనీలోని ప్రకృతి శాస్త్రజ్ఞులు ప్రచారము చేయుచున్నారు వీరు యేకళాశాలలోను విద్యను అభ్యసించలేదు జలప్రక్రియలతోనే విషజ్వరము, సర్పి, మశూచికము, క్రిమికలోని జబ్బులు, మేదోమజ్జాగత జ్వరము మొదలగునవన్నియు నయము చేసినారు ఎన్ని అవాంతరములు వచ్చినను, జర్మను ప్రభుత్వము యెంత నిరర్బధించినను ప్రకృతి

శాస్త్రజ్ఞు లందరును మందూ, మాకూ లేని యీ ప్రకృతి వైద్యమునే నిరంతరము ప్రచారము చేసిరి ఈ ప్రభుత్వ నిర్బంధ ముల మధ్య ప్రకృతి వైద్యులు తమ ప్రచారమును నిరంతరము చేసి మానవకోటికి సేవచేయుచున్నారనగా, సామాన్యులు వీరి వైద్యపద్ధతులను ఆచరించి ఫలితములను పొందుచున్నా రనగా యిది అంతయు ప్రకృతివైద్యములోని గొప్పతనమే గాని వేరుగాదు మందువైద్యులు యేమి తప్పుచేసినను వారిని శిక్షించువారు లేరు ప్రభుత్వము వీరిని మందలించదు వారికి పారితోషికములు సమర్పించును

గాలి, నీరు, వెలుతురులతో నయముచేయు ప్రకృతి వైద్యులనే రచ్చకు లాగుతారు

ఆ ప్రముఖుడు యీవైద్య పద్ధతులలోని గొప్పతనమును కనుగొనలేదు మా అనుభవములను కూడా యీక్రింద పొందు పరుస్తున్నాను

ప్ర కృ తి వై ద్య ము — అ మె రి కా — ఈ పది హేను ఏండ్లనుండియు మా ఆసుపత్రికి అనేకవేల రోగులు వచ్చినారు వీరందరును చిత్రాతిచిత్రమైన రోగములతో బాధ పడినవారే వీరందరకును ప్రకృతి వైద్యములోని జలచికిత్సా ప్రక్రియలతోనే నయముచేసి పంపినాము ఒకరికిని ఒక తడవ కూడా శస్త్రముల వాడలేదు విషజ్వరము, మశూచికము, సర్పి, మేదో మజ్జాగత జ్వరము మొదలగు జ్వరములతో తీసికొను వారందరును ప్రకృతి వైద్యములోని మామూలు [illegible]ములతోనే నయము చేసికొని సలక్షణముగా యింటికి

చేరినారు ఈ పదిహేడు యేండ్ల మింజుమలే మేదో మజ్జాగత జ్వరముతోను, న్యూమోనియాతోను, సర్పితోను, బాధపడిన వారు ముగ్గురు మాత్రమే చనిపోయిరి మా మాటల నిజా నిజములను ఆరోగ్య శాఖవారికి మే మప్పుడు పంపిన లెఖ్ఖలనుబట్టి తెలుసు కొనవచ్చును

ప్రకృతివైద్యము గుడ్డి నమ్మకములమీద ఆధారపడి నదో, లేక శాస్త్ర సమ్మతముగా నున్నదో, మేము చెప్పిన వన్నియు అనుభవములేని పిచ్చిమాటలో, అనుభవముతో గూడిన సత్యవచనములో, ఇంతవరకు చదివిన మా చదువ రులే గ్రహింతురుగాక జర్మనీలో బయలుదేరిన యీ సిద్ధాంత ములు నేడు అయిరోపా ఖండము నందేగాక యావత్ప్రపంచము నందును వ్యాపించి మానవకోటికి చెప్పనలవిగాని సేవ చేయు చున్నవి మితిమీరి తినుటచే తను నియమ ప్రకారము జీవించక పోవుటచేతను రోగమువస్తుందను విషయము ఒ, న, మాలు రాని ప్రతివారికి విశదమే మా ఆసుపత్రికి వచ్చిన ఒక ఉత్త రము వ్రాసి యీ అధ్యాయమును పూర్తిచేస్తాను

'ఆర్యా, గత శీతాకాలములో మాదంపతులము మీ ఉపన్యాస ముల విన్నాము చాలా క్రొత్త విషయములనునేర్చుకున్నాము

గత నవంబరు నెలలో మా పిల్లవాడికి సర్పిరోగం వచ్చి నది సలహా యివ్వమని మీ ఆసుపత్రికి వ్రాశాను తడికట్లు, ఫలరసము, ఎనిమా, కశేరుకాసమీకరణము, చేయమని సమా ధానము వ్రాశినారు మందులు మాకులూ వేయవద్దని, హెచ్చరించినారు ।

తర్వాత కశేరుకాసమీకరణ చికిత్సకుని కొరకు చెప్పి పంపినాము వారు వచ్చి ఆరోగ్యశాఖవారిని పిలిపించిరి రోగము సర్పియని నిర్ధారణ చేసినారు సర్పిరోగమునకు వాడు మందులను, వాడమన్నారు మందును వాడుటకు, నా భార్య ఒప్పుకొన లేదు ఈ రోగము, మిగిలిన జనమునకు వ్యాపించునని, మమ్ములను జైలులో పెట్టినారు

ఈ జ్వరలక్షణములన్నియు, కనబడినవి 105 డిగ్రీల జ్వరము వచ్చినది తడికట్లతో జ్వరము తగ్గినది కశేరుకాసమీకరణ వలన రోగములో కూడా పిల్లవాడు సుఖముగా నిద్రపోయినాడు

మధ్యలో జ్వరము హెచ్చుగానున్నప్పటికినితడికట్లుతోనే తగ్గిపోయినది వారము దినము లగునప్పటికి రోగము తగ్గిపోయినది నాడి మాత్రము దుడుకుగా కొట్టుకొనుచుండెను ఈ వారము దినాలు ఫలరసమునే యిచ్చినాము ఎనిమా కూడా చేసినాము రెండువారములు జరిగిన తర్వాత, మామూలు భోజనము పెట్టినాము

ఆరోగ్యశాఖవారు పిల్లవానిని, అయిదు ఆరు తడవలు పరీక్షచేసి గాని రోగము నయమైనదని చెప్పలేదు రోగము నయమైన ఆరు వారములకుగాని, మమ్మును నిర్బంధమునుండి తొలగించలేదు

రోగము బాగా నయమైనది ఇతర రోగము లేవియు రాలేదు ఇన్నిదినాలు నా భార్యయే వెంటనున్నది ఆమెకు యే రోగము రాలేదు ఈ దినములలోనే, మాప్రక్క యింటి

వారి పిల్లకు ఇదేరోగము వచ్చినది సర్పికి వాడు మందునే వాడారు రోగము తగ్గిపోయినది అకస్మాత్తుగా వచ్చిన గుండె జబ్బుతో యీ పిల్ల పెందలకడనే చనిపోయినది ఏమీా లోపము లేకుండా మందుల వాడినారు ఆపిల్ల తల్లికి జబ్బు చేసినది గాని నయమైనది డాక్టరుగారి మందుఖరీదు 75 పిల్లింగులైనది ఈ ఉత్తరపూర్వకముగా మాకృతజ్ఞతను తెలుపుచున్నాను మీా యిష్టమువచ్చినట్లు ఉత్తరమును ప్రకటించుకోవచ్చు" హెచ్ వైట్

ఇటువంటి ఉత్తరములు లెక్కలేనన్ని వచ్చినవి ఇవన్నీ సత్యములేగాని, యిందులో అతిశయోక్తి యేమియులేదు పై కేసులో రోగినైనా చూడకనే వైద్యపద్ధతుల చెప్పితిని రోగము నయమైనది

సర్పిమందులవలన సర్పిరోగము నయమైనది గాని, ప్రతిఫలముతో పిల్ల చనిపోయినది సర్పిమందు వలన కలుగు హానిని చెప్పుటకు, యీనిదర్శనము ఒకటే చాలును వెనుక చెప్పిన దంతా సింహావలోకనముచేద్దాము ప్రకృతి వైద్యమువలన అన్ని రోగములు నయమగును నయమవుట ప్రత్యక్షముగా, మనము చూచుచున్నను మందువైద్యులు మాత్రము యీ సంగతి ఒప్పుకోరు నిజానిజములు, తెలిసికొనుటకైనా ఒక తడవ ఆచరణలో పెట్టరు జర్మనిలో మాత్రము యీ వైద్య ప్రక్రియలకు ఆదరణ హెచ్చుగానే ఉన్నది ప్రకృతివైద్యము చేయుటచే, సర్పిరోగము పోవుటయే గాక సర్పిమందు వాడితే వచ్చు తర్వాత రోగములునూ రావు అందరూ సుఖముగా ఉంటారు

౧౫

# శస్త్రచికిత్సవలన కలుగు ఫలితములు.

ఇంతవరకూ మందులతో రోగముల నయము చేయుట వలన కలుగు ఫలితముల తెలిసికొనినాము అప్పటికప్పుడు రోగములు కుదిరినప్పటికిని, మందులలోని విషముల వలన వచ్చు తరువాతి రోగములను, శస్త్ర చికిత్స వలన కలుగు తరువాత ఫలితములను తెలుసుకొందాము

ప్రతిపిల్లవానికిని సామాన్యముగా ఉండు రోగములలో టాన్సిల్సు ముఖ్యము వీటివెంట వచ్చినవి, గవద బిళ్ళలు ఈ టాన్సిల్సును మందు వైద్యులు ఆపరేషన్ చేతురు టాన్సిల్సును ఆపరేషన్ చేసినందువలన కలుగు ఫలితములను యిపుడు తెలుసుకొందాము

ఈ దేశములోని ప్రభుత్వమువారు పాఠశాలలోని బాలురను, బాలికలను, ఆరోగ్యము సరిజూచుటకు వైద్యులను పాఠశాలలకు పంపింతురు బాలబాలికలను పరీక్షచేసి యీవైద్యులు బాలబాలికలకును, వారి తల్లితండ్రులకును తగిన సలహానిత్తురు. బాలుల ఆరోగ్యమును సరిజూచుటకు, ప్రభుత్వమువారు, తల పెట్టిన యీ విధానము మంచిదేగాని, సలహానిచ్చు వైద్యులు మాత్రము, రోగ కారణమును సరిగా గ్రహించవలెను తగు సలహాల నివ్వవలయును. ప్రత్యక్షములో మాత్రము, యీ వైద్యులు రోగ కారణములను, సరిగా గ్రహించినట్లు, కనిపించుట లేదు. టాన్సిల్సు గొంతులో చెరిఒక ప్రక్కన ఉండును.

ఈ రెండునూ గ్రంథులు. తలలోనికి పోవు రక్తమును యీ గ్రంథులు శుద్ధిచేయును రక్తములోని మలినముల మ్రింగుటచే యివి ఉబుకును లావగును ఈ జబ్బు లేనివారు ఉండనేఉండరు టాన్సిల్సు ఉబికినవని, తెలియగనే, వాటిని తీసివేయవలె నంటారు మందు వైద్యులు ఆపరేషనుచేయవలెనని సలహానిత్తురు ఈ సలహాలు విన్న తల్లిదండ్రులు ఆపరేషనుల మంచిచెడుగు లను గూర్చి మమ్ముల ప్రశ్నింతురు మే మిక్రింది సమాధాన ముల వారికి చెప్పెదము

బహిష్కార్యావయవములలో టాన్సిల్సు ఒక భాగము దేహములోని మురికి, బైటకి పోవుటకు యీ టాన్సిల్సు బాగా సహాయపడును తరుణ తరుణాంతర్గత, కాలిక రోగములలో టాన్సిల్సు ఉబికినవంటే, యీ మురికితోట్లు, రోగపదార్థముతో నిండినవని మనము గ్రహింపగలుగుదుము ఈ గ్రంథులు నిర్వ హించగల పని కన్నా యెక్కువ పని వాటి నెత్తిన పడితే, అవి ఆ పనిని చేయలేక చచ్చుపడి పోవును

మనము తిను ఆహారపదార్థములోని లోటువలనను, వంశానుగతముగా కలుగు రోగములవలనను, దేహములోని రక్తము కలుషితమగును

ఇట్లు కలుషితమైన రక్తములోని దోషముల బయటకు నెట్టుటకు, అన్ని బహిష్కార్యావయవములతోబాటు యీ టాన్సిల్సు కూడా పని చేయును.

రోగపదార్థము యెక్కువగా తయారగుటవలన దానిని బయటికి పంపుటకు, బహిష్కార్యావయవములు యెక్కువగా

పని చేయుటచే చెడిపోవును బహిష్కరణ క్రియకు ఉపయోగ పడు ఈటాన్సిల్సును, అయిడో ఘారముతో అణచివేయుట గాని, కత్తులతో కోసివేయుటగాని హానికరము

ఇంటిలోని మురుగు సన్నని కాలువలద్వారా పోనపుడు, మురుగుపోగల పెద్దకాలువల కట్టింతుముగాని, మురుగును లోపలనే నిలువ ఉంచుకోనముగదా మందు వైద్యులు శస్త్రములతో మురుగును లోపలనే నిలువఉంచుచున్నారు గాని, బయటకుపంపు మార్గములను వెదకుట లేదు

ఆపరేషన్ చేయుటకు, మందు వైద్యమువారు, చెప్పు సమాధానమేమన, టాన్సిల్సు, గవద బిళ్ళలూ పెచ్చు పెరిగి, వాయునాళములగుండా వాయువు ప్రవహించుటకు అభ్యంతరములు కలిగించుచున్నవి వాయు ప్రవాహమునకు యిట్లు అభ్యంతరము కలుగుటచేత, ముక్కులద్వారా లోనికి వచ్చు గాలి చాలక రాత్రులందు నోటిద్వారా గాలిని పీల్చుదురు గాలిని నోటిద్వారా పీల్చుటచే, రొమ్ము క్రమముగా పెరుగదు ముఖములో మార్పులు కలుగును మతిభ్రమ కలుగును దైహిక, మానసిక శక్తులు స్తంభించిపోవును టాన్సిల్సును తొలగిస్తే, యీ ప్రతిబంధకము లేమీ రావు తేలికలోపోయే ఆపరేషనులకు, యెందు కింత గాభరాపడతారు ? అంటారు

ఆపరేషను చేసినందువలన బాధ అప్పటికి తప్పుట నిజమే అయితే తరువాత జరుగు గ్రంధమేమిటి ? ఆపరేషను తేలికగా జరిగిపోయినదని, రోగీ, వైద్యుడూ యిద్దరూ సంతోష పడ

వచ్చు తర్వాత జరుగు ఫలితముల తెలుసుకొంటే, వీరిద్దరూ విచారపడక తప్పదు

ఆపరేషనులవలన కలుగు ప్రతిఫలముల క్రొత్త రోగములుగా భావింతురేగాని, యీరోగముల కన్నింటికినీ సంబంధమున్నదని గ్రహింపరు పుండ్లు, వ్రణములు, కంతులు మొదలగువాని ద్వారా లోపలి మురుగంతా బయటికి పోవును ఇట్లు బయటికి పోవు మురుగును శస్త్రచికిత్సతో లోపలికే పంపివేయుచున్నాము లోపల చేరిన మురుగును, ప్రకృతి యెప్పటికప్పుడు బైటికి పంపివేసుంది ఆ త్రోవన కాకపోతే మరొక త్రోవన బయటకు పంపివేస్తుంది బయటికిపోవు త్రోవ మెందలకడనే దొరికినదా రోగి ధన్యుడే ఇదే తరుణరోగము త్రోవదొరకదా, లోపలకు నెట్టివేయబడిన మురికి అంతయూ మెతకగా ఉన్న అవయవముల దరిని చేరును మురుగు చేరుటచే యీ అవయవములు చెడిపోవును చెడిపోవుటచే స్వధర్మమును, నిర్వహించలేవు ఇదే కాలికరోగము కాలిక రోగములో దేహమునకు బైటనుండి సహాయం వస్తేతప్ప, రోగపదార్థమును వెలువరింపలేదు ఇల్లాగే జరిగితే మొదటికే మోసము వస్తుంది

టాన్సిల్సును తొలగించుటచేత, లోపలి మురుగు గవదబిళ్ళలదరిని చేరును ముక్కులోని ఆమత్వచము దరిని కూడా చేరును తాము భరించగల్గిన మురుగుకన్నా యెక్కువ మురుగు చేరుటచే యివియు ఉబికి చచ్చుపడిపోవును ఈ రెంటినీ తొలగించుటచే, వీటిద్వారా బయటకు వచ్చు మురుగు, ముక్కులోని ఆమత్వచము ద్వారా బైటకు వచ్చును

ముక్కులో కొయ్య గండలు పెరుగుటయు గలదు ఈ కొయ్య గండలవలన దేహమునకు అవసరమగు, ప్రాణవాయువు ముక్కులగుండా లోనికి రాకపోవుటచే, నోటిగుండా పీల్చ వలసి వస్తుంది ఈ ఆపరేషనుల వలన, బాధలు యెక్కువగు చున్నప్పటికినీ శాస్త్రజ్ఞులు మాత్రము, తమ మొండి పట్టుదలను, వదలుట లేదు కొయ్యగండలను కత్తెరవేయుటయు గలదు

మురుగు బయటకు పోవు మార్గములు పై విధముగా తీసివేయబడి, మూసివేయబడినపుడు, తయారగు మురుగు అంతయూ ఊర్ధ్వముఖముగా పోవునపుడు, తలలోను, అధో ముఖముగా పోయినపుడు, జీర్ణావయవములలోను పేరుకొనును ఏయే భాగములలో చేరితే ఆయా భాగములకు సంబంధించిన జబ్బులు కలుగును మెదడులో చేరినపుడు, నాడీ దౌర్బల్యము గాని, చపలత్వముగాని, బుద్ధిమాంద్యముగాని, పిచ్చిగాని కలుగ వచ్చును ఈ మురుగంతా మెదడులో కొన్ని కేంద్రములలో చేరినయెడల, అపస్మారము, ఉన్మాదము, హిస్టీరియా, భద్రి నాట్యము మొదలగు వ్యాధులు వస్తవి పిల్లలలో యీ మురుగంతయూ చెవులనుండి చీముగా బైటికివస్తుంది ముక్కు నుండి చీమిడిగా బైటకు రావచ్చు మురుగంతయు, నిలువఉండక యెప్పటికప్పుడు బైటకు వెళ్లిపోవుటచేతనే పిచ్చి, పక్షవాతము, మొదలగు దుర్భరవ్యాధులు పిల్లలకు వచ్చుటలేదు టాన్సి ల్సును, గవదబిళ్లలను, తొలగించుటచేతనే, చెవుల వెనుకనుండు మాస్టాయిడ్ గ్రంథులు చెడిపోవుచున్నవి చెవుడు వచ్చుచున్నది మా ఆసుపత్రికివచ్చిన అనేక కేసులలో యిటువంటి నిదర్శనములను

చూచినాము వీరందరికి టాన్సిల్సు తీసివేసినారు వీనిని నివారణ చేయుటకు, మందు వైద్యులు చేయువిధాన మేమన మత్తుమందునిచ్చి, తలను పగులగొట్టి, చెడిపోయిన భాగము లను తీసివేయుదురు మా ఆసుపత్రికి వచ్చిన కేసులలో ఒక దానిలో కూడా యీ విధానము అవలంబించలేదు ఇంత వరదాకా టాన్సిల్సు, గవద బిళ్ళలను తొలగించుట వలన కలుగు ఫలితములగూర్చి తెలుసు కొన్నాము పైరెండు మురికి తొల్లను, తొలగించుటవలన, వీటిద్వారా, వెలుపలికి పోవలసిన మురికి తలలోనికి పోయి మెదడులోని కేంద్రములలో చేరి చేయు గడబిడల గూర్చి తెలుసు కొన్నాము

అధోముఖముగ పోయిన యీ మురుగువలన జరుగు గలభానల గూర్చి తెలుసుకొందాము బయటకుపోవు మార్గము, దొరుకక బైటపడుటకు గాను యీమురుగు సమీా పములోనున్న బహిష్కార్యా వయవములలో అనగా శ్వాసా శయములలో చేరుతుంది శ్వాసనాళికలలోకూడా చేరుటగలదు రెండు ప్రదేశములలోనూ చేరుటచే, పురుగులుపుట్టి, శ్వాసాశ యవ్యాధులు, క్షయరోగములు కలుగుచున్నవి రక్తాభిష్యంద మువలనను, మితిమీారి పెరుగుటచేతను, ధ్వనివాహకములగు నర ములు చెడిపోవును క్షయరోగముతో చనిపోవుటయు గలదు నివారణోపాయములగు దేహములోకలిగినబాధలను,మందులతో అణచిపెట్టినను,శస్త్రములతోకోసివేసినను, మొదటికంటపోజాలవు యుక్తమగు ఆహారవిహారముల వలననేగాని, పూర్తిగ కుదరవు మందులతో అణచిపెట్టబడిన రోగములు కుదరకపోవుటయేగాక

తీవ్రరూపముతో మధల ప్రత్యక్షమగుచున్నవి రోగములను పూర్తిగా పోగొట్టుకొనవలెనంటే ఆహారవిహారములలోని లోప ములను సవరించుకొనవలెను పరిశుభ్రమైన గాలి పీల్చుట వలనను, ఎండలో తిరుగుట వలనను శీతలోదకప్రక్రియలను జరుపుట వలనను, గడ్డకట్టుకొని పోయిన రోగపదార్థము బహిష్కార్యావయవముల ద్వారా, బయటకు వెళ్ళిపోవును. మర్దన చికిత్స వలనను, కశేరుకాసమీకరణ చికిత్స వలనను, కండరములలోని లోపములను, ఎముకలలోని హెచ్చుతగ్గులను, సర్దుబాటు చేసుకొన వచ్చును

దేహములోని నిర్మాణశక్తికి అనుకూలముగా, మేము వ్రాసిన చికిత్సాప్రక్రియలను, జరిపినయెడల టాన్సిల్సును కత్తెరవేయ నవసరములేదు గవదబిళ్ళలూ – నోటితో గాలి పీల్చుట, మొదలగు లక్షణము లన్నియు పోవును

ఇవన్నియు గాలికబుర్లు కావు శాస్త్రసమ్మతమగు సత్యములు గత పదిహేడేండ్లనుండి మా ఆసుపత్రికి వచ్చు రోగులనందరిని, పై పద్ధతులతోనే నయముచేసినాము ఒక శస్త్రములనైన నుపయోగింపలేదు ఒకరైనా రోగము నయము కాకుండ, తిరిగిపోనూలేదు అనుమానమున్నవారు, మేము ఆరోగ్యశాఖవారికి ఆనాడుపంపిన లెఖలనుబట్టి నిజానిజము తెలుసుకోవచ్చును

# ౧౬

# ఆడువారు పడు బాధలు

ఆడువారు, దైహికముగా పడుబాధలు వర్ణనాతీతములు మగవారిజీవితముకన్న, ఆడువారిజీవితమంతయు యిడుమలతోనే గడచిపోవుచున్నది బాల్యములో నేమైనా సుఖముగా నుందు రేమోగాని, యుక్తవయస్సువచ్చి రజస్వలఅయినప్పటినుండియు, వీరిబాధలకుఅంతూపొంతూ లేదు ఋతురక్తమునెమైంయందురు మైం యెక్కువగుటయు, తక్కువగుటయు, అసలేకాకపోవుటయు గండు దేహములో తయారగు మురుగు, 27 దినాలకు ఒక పర్యాయము బయటకు పోవుచుండవలయును ప్రసవించునప్పుడు స్త్రీలు, అమితమైనబాధపడుటచే, ప్రసవము పునర్జన్మయందురు ముట్లుయెండిపోయినతర్వాతనూ, వీరిబాధ లిట్లేయుండును

ఆఫ్రికాఖండములోను, దక్షిణఅమెరికాఖండములోను నివసించు ఆదిమజాతిస్త్రీలలో యీబాధలెన్నటికినీ లేవు శీతోష్ణములలోని తేడాలవలన యీబాధలు కలుగునేమో విచారింతము శీతప్రదేశములో నివసించువారిలోను, ఉష్ణప్రదేశములో నివసించువారిలోను, యీబాధలు యింతగా లేవు ఆదిమనివాసులలో లేకపోవుటచేతనూ, నవనాగరికులమని పేరుపెట్టుకొన్నవారిలోనే యీబాధలు యెక్కువగా ఉండుటచేతను, ఆహారవిహారములలోని, లోపములవలననే యిన్నిబాధలుపొందుచున్నారని, తెల్సుకొనుచున్నాము అనాగరికులకన్నా నాగరికులలోనే యీజబ్బులు యింతగావచ్చుచున్నవని, బుద్ధిమంతులు యిప్పుడిప్పుడు గ్రహించుచున్నారు వీరి విజ్ఞానము సరియగు త్రోవలపోయి, యీ విజ్ఞానాభివృద్ధివలన ఆడువారి యిబ్బందులు తగ్గిపోవుగాక

రజస్వలలోనే ఆడువారికిబ్బందులు ప్రారంభమగును దేహములో తయారైన మురుగు, యిరువదియేడుదినములకు ఒక పర్యాయము యోనిద్వారా బయటకు వెడలుచుండవలయును కొంతమందికి యీమైల యెక్కువగావచ్చును కొంతమందికి తక్కువగావచ్చును మరికొంతమంది సంవత్సరమునకు రెండు పర్యాయములే బయటచేరెదరు పూర్వవయస్సులో నున్నప్పుడు రోగపదార్థము యెక్కువగా పేరుకొంటేనేగాని, బయటకు చేరకపోవుట సంభవించదు

క్రమప్రకారముగా మైల వెడలకపోవుటకు నాలుగు కారణములు గలవు (1) పిల్ల, తల్లిగర్భములో నున్నపుడు, తల్లిదండ్రులు చేసిన సంప్రయోగమువలన కావచ్చును (2) శిశువుగా నున్నప్పుడు, తల్లి పెంచిన విధానములోని లోపము కావచ్చును (3) బాల్యావస్థలో నున్నపుడు పిల్ల ఆహార విహారములలోని, లోపము కావచ్చును (4) తరుణ తరుణాంతర్గత రోగములను, మందులతో అణచిపెట్టి నయము చేసినందువలన కలిగిన ఫలితము కావచ్చును

ప్రకృతి సూత్రముల నతిక్రమించుటచేతనే యీరోగములన్నీ కలుగుచున్నవని, పాఠకులు యిదివరకే గ్రహించియుందురు దేహమునకు అవుసరమైన దానికన్న, పిండిపదార్థములను యెక్కువగా తినుట చేతనే, రోగము వచ్చుచున్నదను సంగతి, యింతవరకునూ చర్విత చర్వణముగా చెప్పుచునే ఉన్నాము రోగపదార్థము, బహిష్కార్యావయవములకు అడ్డుపడుటచే, బయటకు పోవలసిన మురుగంతయూ బయటకుపోదు.

చర్మము, మలకోశము, మూత్రకోశము నాసికారంధ్రములు, సరిగా పనిచేయవు ఇవి సరిగా పనిచేయక పోవుటవలన, మిగిలిన మురుగంతయూ, టాన్సిల్సువద్దనూ, గవదబిళ్ళలలోనూ, నాసికారంధ్రములోని ఆమత్వచములోను చేరుతుంది ఈ మురుగు అచ్చట చేరినందువలన,ఆఅవయవముు స్వధర్మమును నిర్వహించుటలో, లోపము చేసినవని కోపించి, శస్త్రవైద్యుు బహునేర్పుతో యీ అవయవముల తీసివేతురు

గొంతులోని శోష రసగ్రంధులలో చేరిన మురికినంతనూ, శస్త్రముల తో, తీసివేయుటయు గలదు దగ్గు, పడిశము, జలుబు మొదలగు రోగములు వచ్చుటచే అసహ్యించుకొని యీ చిన్నరోగములను, డ్రయిన్ గ్ (ఎండింపచేయు) పౌడరుల తో ఆపివేతుము దేహమును, శుద్ధిచేయుటయే ప్రకృతి పనిగాన, పైవిధముగా లోనికి గెంటివేయబడిన మురికిని, రహస్యావయవము ద్వారా బయటకు, పంపును దీనినే తెలుపగుచున్న దందురు ఆంగ్లమున దీనిని లుకోరియా అందురు గర్భాండమును ఫలవంతము చేయుటకును, దేహముతో నిలిచిపోయిన మలినముల బయటకు పంపుటకును ప్రకృతి యీ మైలను, బయటకు పంపును ఈ మురుగు ఉద్రేకలక్షణము గలదైన, బైటచేరిన రోజులలో ఆడువారు మంటలు, పోట్లు, తీపులను అనుభవింతురు మిగిలిన అన్ని అభిష్యందములలో మాదిరిగనే, తెలుపులో కూడా, దైహిక విషయములన్నియు, బయటకు వెడలిపోవును దేహములో, విషములు చేరితేగాని, అభిష్యందము, జరగదు కొంత పరిమితిగల మురుగునే, బహిష్కార్యా

వయవములు బయటకు పంపివేయును, అంతకన్నా యెక్కువ పరిమితికా తయారగు మురుగు, యీ త్రోవద్వారా బయటకు రాదు లోపలనే నిలవఉండును గాన దేహమనే యిల్లంతా, గలిజుగా నుండును

ఈ తెలుపు రోగమునకు, మందు వైద్యులు చేయు ప్రక్రియ లేమిటంటే, మందులు, శస్త్రచికిత్స యివిమాత్రము యేమిచేయుచున్నవి? బయటకు వచ్చు మురికినంతనూ, అణచి వేయుచున్నవి మందులు, యిట్లు, అణచిపెట్టుట, ఒకటేగాక మరొక నష్టమును గూడా, కలుగచేయుచున్నవి మందు వైద్యము వారి బీరువాలలో ఉన్న మందులన్నీ ఖనిజములతో, తయారు కాబడనవేను ఖనిజములలో, సేంద్రియలవణము లుండవు సేంద్రియలవణములు, దేహమునకు శక్తిని, పుష్టిని యిచ్చును ఖనిజములు దేహమునకు, విజాతీయములగుటవలన, శక్తి నివ్వకపోవుటయే గాక, అంతరవయవములలో, చేరుకొని బైటికి పోవు చేరిన అవయవమునే గాక, ప్రక్కన ఉన్న మిగిలిన అవయవముల కూడా, తినివేయును ఆయా, అవయవముల, స్వభావమును, లక్షణములను, యీ ఖనిజములు చెడగొట్టును ఇందువలన అవయవములలోని కుదిరిక తగ్గిపోవును అంతరవయవముల కన్నిటికిని, దగ్గిర సంబంధముండుట చేత, ఒకటి చెడితే, మిగిలిన అవయవములు, సహితము, చెడిపోవును రహస్యావయవములలోని కుదిరిక చెడితే సంసారసౌఖ్యము పొందుటకు వీలులేదు సంతాన నిరోధమునకు, యీ మందులన్నియు అపకారమునే చేయును మందుల నిరంతరము వాడుటచేతనూ,

సంతాన నిరోధమును, ప్రచారము చేయుటచేతను, జాతి అంతయు, కొద్ది సంవత్సరములలోనే నిర్వీర్యమైపోవును నిస్తేజమగును ప్రతి నెలా బైటకుపోవు మైలను, తెలుపు మొదలగు రోగములను, మందులతో అణచిపెట్టుటవలన గర్భకోశములోను, గర్భాండములలోను, గర్భనాళములలోను, తరుణ, తరుణాంతర్గత, కాలికరోగములు పుట్టుచున్నవి ఈ రోగములను మందులతో నయము చేయుచున్నారు శస్త్రముల నుపయోగించి అవయవముల తీసివేయుచున్నారు, ఇందువలన సృష్టి క్రమమే ఆగిపోవుచున్నది

చాలామంది స్త్రీలు పది పన్నెండు పర్యాయములు ఆపరేషను చేయించుకొని మా ఆసుపత్రికి వచ్చినారు ఇట్లా ఆపరేషనులు చేయించుకొంటే దైహిక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులన్నియు, క్షీణించిపోవును ఈమూడు శక్తులకును, అవినాభావ సంబంధమున్నది ఇట్లుండుటచే, యేఒక భాగమునకు నష్టము గలిగినా, రెండవ భాగమునకు కూడా, తప్పకనష్టము కలుగును ఈ బాధలు తప్పించుకొనుటకు యిరువది, ముప్పది, తడవలు ఆపరేషను చేయించుకొన్నవారును గలరు ఆపరేషను చేయించుకొనుటకు పూర్వము, తమబాధలు ఆ ఒక ఆపరేషనుతో అంతరించునని, భావింతురు ఆపరేషను చేసిన కొద్ది రోజులకే, బాధలు మొదలుపెట్టుతవి (అవయవముల కుదిరిక, ఆరోగ్యము,) ప్రతి ఆపరేషనుతోను అవయవములు, ఖాళీయగుచుండగా అంతరవయవములలో కుదిరిక యెట్లుండును? కుదిరికయే లేనపుడు, దానిమీద ఆధారపడు, ఆరోగ్యమెట్లుండును? తరుణరోగములను, కాలిక రోగములను, మందు

లతో అణచివేతురు కాయలు, కంతులు, గ్రంధులు, వ్రణ ములును పక్వము కానపుడే, మందులతో అణచివేతురు ఇవన్నియు మరల తిరుగపెట్టును ఇట్లు తిరుగ బెట్టినపుడు, శస్త్రముల నుపయోగించి తీసివేతురు ఈ శస్త్ర చికిత్సవలన కలుగు ఫలితమేమన ? జన్మావధి అంతరవయవములలోని, బాధలతో అవస్థపడవలసినదే ఆపరేషనుచేసి,తొలగించి వేయబడిన అవయవముల తిరిగి సృష్టింపలేము తరుణ కాలికరోగము లవలన అవయవములు చెడిపోయి చచ్చుపడి, మిగిలిన అవయవములకు అవరోధము కలిగినపుడు, ఆబాధను కలిగించిన యీ అవయవములను, తీసివేసినాములే, అనుకుంటే సమాధానముతో, మన సర్జనులు తృప్తి పడతారు

బోధపడుటకు వీలుగానంతగా, చెడిపోతే తప్ప యీ అవయవములను నన్నిటినీ, తీసివేయరాదనీ, యేరకమైన రోగము నైననూ, కుదర్చవచ్చుననీ, ప్రకృతివైద్యులు ప్రత్యక్ష అనుభవములతో చెప్పుచునే ఉన్నారు చెడినవస్తువుల, బాగుచేసుకొనుట యుక్తమో, కత్తిరవేసి తీసివేయుట యుక్తమో బుద్ధిమంతులగు మాచదువరులే గ్రహింతురు

గర్భాండములలో మంటలు పుట్టుటచేత ఒకామె, పరిశోర్థమై, మా ఆసుపత్రికివచ్చినది పెండ్లికాకపూర్వమే ఈమెభర్త సుఖసంకటములతో బాధపడినాడు మందువైద్యులు మందులతో ఈగనేరియాను అణచివేసినారు రోగము నయమైందని గట్టిగా నమ్మకము చెప్పగనే పెండ్లిచేసికొనినాడు పెండ్లిఅయినకొలది కాలముననే ఈమెకు యోనిలో మంటలుపుట్టినవి

ఈ మంట లె గర్భాండ ములలోనికిని వ్యాపించినవి మంటలు యెక్కువగుటచేత, గర్భాండముల తొలగిస్తేగాని, బాధతగ్గదన్నారు మందు వైద్యులు ఆమర్నా డే వాటిని తీసి వేయ నిశ్చయించుకున్నారు ఆపరేషను చేయించుకొనుటకు పూర్వము అయినా చూపించివద్దామని మావద్దకు వచ్చారు మాసలహా వినినతరువాత నయముచేయవలసినదని మాకు ఒప్ప చెప్పినారు అయిదు నెలలు జరుగునప్పటికే రోగము పూర్తిగా నయమైనది సుఖముగా యింటికి వెళ్ళినది ఆమెకు తరువాత కలిగిన ముగ్గురుపిల్లలు ప్రకృతిసూత్రములకు అనుగుణముగా పెరిగినారు ఈ పిల్లలు బాగా ఆరోగ్యముగాఉన్నారు కొన్ని సంవత్సరములు జరిగినతదుపరి ఆమె యీ క్రిందివిధముగా తన కృతజ్ఞతను తెలిపింది

ఆర్యా! ప్రకృతిసూత్రముల అవలంబించుటచేతనే, నారోగము పూర్తి గా కుదిరినది నేను సంపూర్ణఆరోగ్యమును సంసార సౌఖ్య మును అనుభవించుచున్నాను సంసారసౌఖ్యము అనుభవించు టకు వీలు లేకుండా చేయు, ఆపరేషనుబారినుండి నన్ను తప్పించి నందుకు జన్మావధి కృతజ్ఞురాలను ఆపరేషను జరిగితే యేమి అయ్యేది ఊహించుకుందాము గర్భాండము తీసివేసేవారు సృష్టిక్రమము జరుగుఅవయవము లే నామరూపములు లేకుండా పోయేవి పిల్ల లేపుట్టుటకు వీలు లేనపుడు తల్లిగా సౌఖ్యముల ననుభవించుటకు వీలు లేకపొయ్యేది ఆ సౌఖ్యములు పోవుటయే గాక ఆమెకూడా దైహిక మానసిక బాధల ననుభవింపవలసి వచ్చేది జీవితమంతా యిట్లా గడచిపొయ్యేది ఇవన్నీ తప్పుటకు

పోయి బ్రతికితే పిచ్చిఆసుపత్రిలో చేరవలసిఉండేది తాను అనుభవించిన సుఖములనుబట్టి యీబాధలనుండి యీామె వరొాక ఆంగ్లయువతిని కాపాడినది

ఈ పదునెనిమిదియేండ్ల అనుభవములోను కొన్ని వేలమంది స్త్రీలరోగములు కుదిర్చినాము అందరూ సుఖముగా యింటికి వెడలిపోయినారు ఒక్క కేసులోకూడా శస్త్రము నుపయోగించలేదు నయముకాకుండా ఒకరున్నూ తిరిగిపోలేదు

## అశాస్త్రీయముగా దుస్తుం ధరించుట వలననే, రోగములు వచ్చుచున్నవి

నేడు మానవకోటి పడు బాధలన్నియు, దుస్తులుసరిగా ధరించక పోవుటచేతనే, సంభవించుచున్నవని చెప్పవచ్చును అందునూ ఆడువారు, అనుభవించు బాధలన్నీ, దుస్తుల లోపమువలననే వచ్చుచున్నవని చెప్పవలెను

ఎత్తు మడమలుగల బూట్సులతోడుగుట వలన ఆడువారు చాలాబాధలు పొందుచున్నారు ఎత్తుమడమం బూట్సుల తొడుగుట వలన ముందుకు వంగబడి నడవవలసివస్తుంది సమమట్టముమీాదనుండు అంతరవయవములు, ముందుకు వంగబడును అందువలన, వాటిలో పదచ్యుతి కలుగును

పొగత్రాగుటవలనను, బ్రాంది సారాయి సేవించుట వలనను, మగవారు, పడుబాధలకు అంతులేదు చనువుగొన్న వ్వారైనను, బట్టంబిగించి నాయకట్టుట మానుటవలన కొంతలో కొంత అయినా జబ్బులుతగ్గిపోయినవి బిగించి కట్టుట

వలన దేహామంతటా జరుగు రక్తప్రసరణకు, అభ్యంతరము యేర్పడుచున్నది మంచీ, చెడురక్తములు ప్రవహించు వాహికలకు ఒత్తిడి తగులుచున్నది నాడీ ప్రవాహామునకును అభ్యంతరములు కలుగుచున్నవి దేహాములోని పై భాగమునకును, క్రింది భాగమునకును సంబంధము లేకుండా పోవుచున్నది నాయకట్టుటవలన కలుగు వత్తిడియే గర్భాండములలో కలుగు వ్యాధుల కన్నిటికినీ మూలము శిశువు బయటకు వచ్చు కూపక వివరణములోని లోపములకును, యీ నాయకట్టుట యే కారణము

రస, రక్త, నాడీ ప్రవాహాములకు అభ్యంతరము కలుగని విధముగా దుస్తులధరించవలయును నడుముకు బెల్టులను పెట్టి బిగించ నవసరము లేకుండా దుస్తులను కుట్టించుకొని ధరించవలయును స్వాభావికమైన, అవయవ సౌష్టవము కలిగినవా రందరును, బట్టల నాయకట్ట నవసరములేదు బట్టలు బిగింపుగా నుండుటకు బెల్టులను పెట్టనవసరములేదు

షోకిల్లాలు మాత్రము యిష్టమువచ్చినట్లుగా దుస్తులను ఆభరణములను ధరించవచ్చును

## గర్భరక్షకయంత్రములు

గర్భము జారిరాకుండుటకు వాడు గర్భరక్షక యంత్రము లన్నియు, నరముల బలహీనము చేయునే గాని రోగనివారణకు, యేమియు సాయపడవు జారిపోయిన గర్భమును, మిగుల జారకుండా యీ ఉంగరములు యెత్తిపట్టును దురలవాట్ల వలన నరములలో బలహీనత యేర్పడి, గర్భము మరీ జారిపోవును.

దురలవాట్లు కట్టుబడక నిరంతరము సాగుచుండుట చేతనే నరములు, నానాటికి శక్తిహీనములై యీ రక్షకయంత్రముల వలన ఉపయోగము లేకపోగా ప్రతిబంధకములై, నరములలో పోట్లను, మంటలను, వృద్ధిచేయును ఈ మంటలు యెక్కువగుట చేతనే, కాయలు, కంతులు, గ్రంధులు కలుగుచున్నవి శాస్త్రజ్ఞాన మెక్కువైనకొలది నీ యీ యంత్రముల వాడుక, యెక్కువగుచున్నది గర్భము జారకుండా, అక్కడనే, నిలబెట్టు, కృత్రిమోపాయములన్నియు, నరములలోని మంటలకును, వ్రణములకును, కారణములవుచున్నవి సంధిబంధనముల తగ్గించుట, గర్భమును ఆవరణగోడలకు, మేకు బందుచేయుట, నరములలోని బలహీనతవలన కలుగు చ్యుతిని తొలగించలేవు నరములు, శక్తిమంతిములగుటకు, పై పద్ధతు లేవియు సహాయపడవు ఏ అవయవములో, లోపమున్నదో గ్రహించి వాటికి అనుకూలపడు దేహపరిశ్రమ చేయుటవలనను, అసిపమీకరణమువలననూ, నరములలోని బలహీనత, తగ్గవలెనే గాని, మరొక మార్గమువలన కుదరదు

మర్దనచికిత్సవలన రోగములన్నియు కుదురునని అభిప్రాయపడినాను మొదటలో మా ఆసుపత్రిలో యీ చికిత్సాప్రక్రియలను చేయుచుండెడివారము, రాను రాను ఈప్రక్రియలతో అవసరము లేకయే మామూలు మార్గములవలననే రోగములన్నియు కుదురుచున్నవి మేము చెప్పువాక్యములలోని సత్యమును మా ఆసుపత్రికివచ్చి నయముచేసికొనిపోయినవారే నిర్ధారణచేయగలరు సామాన్యలోకజ్ఞానమైనను లేకయే

మందు వైద్యుల ప్రియబోధలకును స్నేహితుల ప్రియబోధలకును చెవియొగ్గి విని ఆపరేషనులు చేయించుకొనువారిగతి చెప్పనవసరము లేదు దేహములో పెరుకొన్న రోగపదార్థపుబరువువలన గర్భము తనస్థావరమునుతప్పి ముందు వెనుకలకు వచ్చుటగలదు యథాస్థానములోనుంచుటకు మందు వైద్యులు ఆపరేషను చేతురు అయినతర్వాత పైకి క్రిందకుగాని ముందు వెనుకకుగాని కదలకుండుటకును స్వస్థానములోనే నిలబడి పోవుటకును ఆవరణగోడలకు అంటింతురు జారకుండా అంటించుట చేత ముందు వెనుకలకు కదలుస్వభావముగల యీ అవయవములోని కదలికలకు మోసము వచ్చును చాలా కేసులలో యీ గర్భము అంటించినచోట ఉండక వెనుకటిస్థానమునకు జారిపోవును ఉండవలసినస్థానములో మాత్రము ఉండదు ఒకవేళ కొన్ని కేసులలో యీ గర్భము అంటించినచోట్ల ఉన్న యెడల గర్భవతియైనపుడు ఆ స్త్రీపడుబాధలు వర్ణనాతీతములు గర్భకోశమునకుగల సంకోచ, వ్యాకోచములు అంటించబడిన గర్భప్రదేశమునకు లేకపోవుటచేత గర్భస్రావము కలుగుటయు గర్భముపోవుటయు కలుగును గర్భస్రావము కాకపోయినను గర్భములోనిశిశువు క్రమముగా పెరుగదు గర్భస్రావమగునపుడునూ, యమబాధ పడవలసినదే గర్భస్రావము కాకపోయినా శిశువు బైటకు వచ్చువరకునూ ఆ స్త్రీ యమబాధల ననుభవింపవలసినదే ఆపరేషనువలన యీమొకుగల దురలవాట్లేమియు పోలేదు వంశానుగతముగావచ్చు రోగప్రవణతలేమియు తగ్గలేదు, మందులలోని విషములు మాయము కాలేదు ఏమిజరిగినదంటే ఆపరేషనుచేసి, అవయవముల తీసి

వేసినందువలన ఆ అవయవమునకు సంబంధించిననరములు బల హీనములగును రోగపదార్థము బలహీనమైన అవయవములదరిని చేరును మంటలు, పోట్లు కలుగును పుంస్త్వపడును కంతులు కలుగును అందువలననే ఒకఆపరేషను చేయించుకొన్న వెంటనే మరొక ఆపరేషనును చేయించుకొనవలసి వస్తుంది జననేంద్రియ ములలో యే కొద్దిభాగమును తొలగించినా మెదడునకు తప్ప కుండా దెబ్బతగులును గడియారములోని అవయవముల లోని పొందికమాదిరిగనే దేహములోని అంతరవయవముల లోనూ పొందికగలదు ఏ ఒకచిన్నముక్కను తీసివేసినా (అవ యవమును) దేహము మొత్తమంతా చెడిపోవును నాడీమండల మంతయు ఒకటే సమస్తపదార్థముగాని అతుకులపోవుకాదు మెదడుమాదిరిగనే జననేంద్రియములుకూడా చాలా సున్నిత ముగానుండును ఈరెంటికినీ చాలా దగ్గరసంబంధమున్నది ఒకటివినా రెండవది లేదు ఇంతసంబంధ ముండుటచేతనే జననేం ద్రియములలో నేచిన్నముక్క తీసివేసినా మెదడునకు తీవ్ర మైన దెబ్బతగులును మతిభ్రమణముకూడా కలుగవచ్చును నాడీదౌర్బల్యము, అతికోపము, కాకిచెమ్మలు, పిచ్చి మొద లగు రోగములన్నియు ఆపరేషనువలన కలుగు ఫలితములే

కళాశాలలోని అధ్యాపకులకును విద్యార్థులకును యీ విషయము లేఖయు క్రొత్తకావు వారిలోవారు నిత్యమును సంభాషించుకొనుమాటలేను రోగులకుమాత్రము క్రొత్త కథలను చెప్పుదురు వారిఅనుమానములన్నీ లోపలఅణచిపెట్టు కొని వింతవింత కథలను చెప్పుదురు చచ్చుపడిన అవయవము లను భాగములను తొలగించుటచేత మిగిలిన అవయవము

లకు యిబ్బంది లేకుండాపోవును ఈ అవయవములు పోయినందు
వలన మిగిలినభాగములకుగాని మొత్తమునకుగాని యేమాత్రపు
దెబ్బకూడాతగలదు అను వింతవాదమును చెప్పెదరు పాప
పుణ్యములు, నోరువాయాలేని అమాయికజనమంతా యీ
ప్రచారం నూటికినూరుపాళ్ళూ నిజమని నమ్మెదరు ఇవన్నీ
ప్రచారవాక్యములని యెరుగరు

ఈ ప్రకరణమంతా యీ గ్రంథముయొక్క మొదటి
ముద్రణలోని భాగమే యధాతథంగాఉంచినాను శస్త్రచికిత్స
కులు యీ భాగమునంతనూ ఒప్పుకొన్నారు అతిశయోక్తు
లేమియు లేవన్నారు ఇప్పుడిప్పుడు మాత్రము, గర్భాండముల
తొలగించుట మానినారు బఠానీగింజంత పరిమాణము గల
యీ అవయవమును తొలగించుటవలననే నాడీ దౌర్బల్యము
ధాతుక్షీణము పిచ్చి మొదలగు దుర్భర రోగములు వచ్చు
చున్నవని గ్రహింప గలిగినారు ఇంతచిన్న నాళరహితగ్రంథినే
తొలగిస్తే యింత గలభా జరుగుతుంటే పెద్ద అవయవములను
తొలగిస్తే యేమి మణిగేదీ చెప్పలేము లోపమున్నదని అవ
యవముల తొలగించుట మంచిదో, లోపముల సవరించు
కొనుట యుక్తమో, బుద్ధిమంతులై గ్రహించండి

## ముట్టులెండిపోవుట — తత్వము ఫిరాయించుట

ఏబది సంవత్సరములు దాటిన తరువాత, తత్వము మారి
తప్పకుండా, బాధల ననుభవింపవలయునని ప్రతి స్త్రీయు,
భయపడుచున్నది ముట్టు లెండిపోయినపుడును, తత్వము ఫిరా
యించినపుడును స్త్రీలు పడు బాధల చూచి, తమ గతికూడా,

యిట్లాగే ఉండునని ప్రతిస్త్రీయు భావించుచుండును ఈ మార్పు వలన, దైహికబాధలే గాక, మానసిక, ఆధ్యాత్మిక బాధలు కూడా, పొందవలయును

వయస్సుమీరిన స్త్రీకి వచ్చు రోగము ఫలానాయని డాక్టరుగారు నిర్ణయించ లేక, తత్వము ఫిరాయించుటచేత కలిగిన దను కుంటె సమాధానము చెపుతారు ఇట్లయితే నలుబది, యేబది సంవత్సరములు మీరిన వయసుగలవారికి వచ్చు ప్రతి రోగమును, దీనిక్రిందనే జమకట్టవచ్చు రోగికూడా, అందరకూ వచ్చు, తప్పని రోగమే, తనకూ వచ్చినదని, తృప్తిని చెప్పుకొనును

ఈ జబ్బులనుండి స్త్రీ జాతి యిట్లా బాధపడవలెనా? తెలుసుకొందాము మన పూర్వులందరునూ, యీ బాధల ననుభవించలేదు ప్రపంచములోని అన్ని భాగములలో నివసించువారును యీ యిడుముల పడుచున్నారేమో తెలుసు కొందాము

ఆదిమ నివాసులలో యీ బాధలు మచ్చునకైనా, కానరావు పనిపాటలు చేసికొని, సుఖముగా, జీవించువారిలో యీ బాధలేవియు లేవు కూటికీ, గుడ్డకు కలిగిన భాగ్యవంతుల లోనే యీ బాధలు గలవు కాని నిరుపేదలలో లేనేలేవు

## తత్వము మారునపుడు వచ్చు బాధలకు కారణమేమిటి?

స్త్రీ బైట చేరినపుడు యోనిద్వారా మైల బయటకువెళ్ళి పోవును ప్రతినెలా యిట్లు బయటకు మైల వెడలి పోవలెను నాలుగు బహిష్కారావయవముల ద్వారా బయటకు పోవు

మురుగే ఆనాడూ బయటకు పోవును ప్రకృతి సూత్రములకు అనుకూలముగా మనఆచారవ్యవహారములుండి ఆసూత్రములకు అనుకూలముగా స్త్రీ దేహము, పెంచబడితే, ముట్లు యెండి పోయినపుడు, యిన్నిబాధలు పడనవసరము లేదు మనము తిను, ఆహారములోని లోపములవలననూ, కాఫీ, టీ, బ్రాంది విస్కీ సారాయి మొదలగు పానీయాల వలనను' శరీర శాస్త్ర మునకు, అనుకూలముగా దుస్తుల ధరించక పోవుటవలననూ, మందువైద్యములోని లోపమువలననూ, చర్మము, మలకోశము, మూత్రకోశము చచ్చుపడిపోయి స్వధర్మమును నిర్వర్తించలేక పోవుచున్నవి అనుక్షణమును బహిష్కార్యావయవములు పని చేయుచుండుటచేతనూ ప్రతినెలకూ బయటకుపోవు, మలిన పదార్థము మైలద్వారా బయటకు వెడలిపోవుచుండుటచేతను యెట్టి ఒడిదుడుకులు లేక దేహ యంత్రము సాగిపోవుచున్నది

ముట్లుడిగిపోయినపుడు మురుగు బయటకుపోవు ఒకత్రోవ కట్టుబడిపోయినది ఈ మైల బయటకుపోక లోపలనే నిలచి పోవును ఈ త్రోవ కట్టుబడుటచేత మిగిలిన అవయవములకు పనియెక్కువగును పని యెక్కువగుటచే అవికూడా చచ్చుపడి పోవును అందువలన మురుగు మరింత నిలబడిపోవును రక్త ములో కలిసి మురుగుకూడా ప్రవహించుచుండును ఈ చెడు రక్తమే మెదడులోకి పోవుటచే ఉద్రేకము కలుగును, అపుడు ప్రలాపములు పలుకుదురు స్తబ్దత కలిగినపుడు మందమతు లగుదురు నాడీమండలము కంపించుటచే నాడీవ్యాధులును కలుగవచ్చును మానసిక నైతిక ప్రవర్తనలలో మార్పు వచ్చును జననేంద్రియములు చచ్చుపడిపోవును

## ఈబాధల తప్పించుకొనుట యెట్లు?

బయటకుపోవలసినమురుగు బయటకుపోకపోవుటచేతనే యీ బాధలన్నీకలుగుచున్నవని మన మిదివరకే తెలుసు కున్నాము లోపల తయారగు మురుగు బహిష్కార్యావయవ ములద్వారా బయటకుపోవుటకు సావకాశముల కల్పిస్తే లోపల యేమీ నిలువయుండదు లంతా బైటకేపోతుంది ప్రకృతి వైద్యమువారి వైద్యప్రక్రియలన్నియు యీ మురుగును బైటకే పంపును గాలి, వెలుతురులు, ఆతపస్నానములు, జలచికిత్సా ప్రక్రియలు, గొంగళిచుట్టు, మర్దనచికిత్స, మానసికచికిత్స మొదలగునవన్నియు, మొద్దుబారినచర్మమును సున్నితపరచి స్వేదప్రక్రియను జరుప చర్మమును సిద్ధపరచును ఏ అవయవ ములకు పరిశ్రమ అవసరమో తెలిసికొనిచేసిన దేహపరిశ్రమ ఆ యా అవయవముల బాగుపరచును హానికలిగింపనివి దేహము లోని ధాతుశక్తికి అనుకూలముగా పనిచేయు హోమియోపతీ మందులు మూలికలు దేహయంత్రమును బాగుచేయును

పై చికిత్సాక్రమమును యుక్తమెరిగి ప్రయోగించిన యెడల యెట్టి ఒడిదుడుకులురావు ఏ బాధలు కలుగవు తత్వ మేమీ ఫిరాయించదు మారదు ఈ పద్ధతుల నుపయోగించి మా ఆసుపత్రిలో అనేక కేసుల కుదిర్చినాము.

## ముట్లు యెండిపోయినపుడు మందు వైద్యము వారిచికిత్సా క్రమము ఏమిటి?

రోగలక్షణములబట్టియే వారు వైద్యము చేతురుగాన రోగముయొక్క పుట్టుపూర్వోత్తరములగూర్చి వారి కేమియు

సంబంధముండదు ప్రతినెలా బయటకుపోవు మురుగు బయ
టకు పోక లోపలనే, నిలిచిపోవుటచే, బహిష్కార్యావయవ
ములు యెట్లు తమసహజశక్తినికోలుపోయి మందగతినిపొందునదీ
లోగడనే చదివినాము సహజశక్తిని కోల్పోయిన బహిష్కా-
ర్యావయవములను స్వేదవర్ధకములు,మూత్రవర్ధకములు మలవర్ధ
కములు, బలవర్ధకములు అగు మందులతో ఉద్రేకపరతురు
ఈ మందులన్నియు పై అవయవములలో తాత్కాలికముగా
ఉద్రేకపరచును క్రియా ప్రతిక్రియల సూత్రము ననుసరించి
దేహము మరింత నీరసపడును బాధలను తగ్గించుటకు వాడు
ఉపశమన ఔషధములన్నియు నొప్పి తెలియకుండా చేయుటకు
సాయపడునేగాని నొప్పినేమియు తీసివేయలేవు

ఆరోగ్య వంతుని హృదయము నిమిషమునకు72పర్యాయములు
స్పందించును ఇంతకన్నా యెక్కువగాస్పందించుచున్నప్పుడు,
తక్కువస్పందింపచేయుమందులును, తక్కువగా స్పందించుచు-
న్నప్పుడు, ఎక్కువగా స్పందింప చేయుటకు మందుల నిత్తురు

ఈరోగలక్షణములన్నియు ఒకే రోగ పదార్థమునుండి
పుట్టినవని గ్రహింపకయేలక్షణమునకాలక్షణమునుప్రత్యేకముగా,
తీసుకొని, వడిగానున్న వాటికి మందగతిగా నడచుమందులును,
మందగతిగా నున్నవాటికి, ఉద్రేకపరచు మందులను, వాడుదురు
ఒకరోగికి పదిలక్షణములుంటే యీపది లక్షణములను అణచి
వేయు మందులను యిత్తురు ఈ మందులవలన, లక్షణము
లన్నియు తాత్కాలికముగా, అణగిపోవును

రోగముయొక్క విషానికి, మందుల విషములు కూడా,

తోడగును ఈ రెండువిషములు కలిసి, రక్త ప్రవాహమునకు, అడ్డుపడును రస, విష, పాషాణ గంధకాదులతో తయారైన, మందులు సేవించుటవలన, ఉన్నగోడు కూడా చెడి రోగము మరింత తీవ్రమగును తలనొప్పి, కీళ్ళనొప్పులు, వెన్ను పాములో పోట్లు, ఏకాకిగా నుండగోరుట, ముక్కోపము, మతిచాంచల్యము, పక్షవాతము, మూర్ఛ మొదలగునవన్నీ సూక్ష్మముగా కనుపడి క్రమేపీ వృద్ధిపొందును మందు వైద్యులు మందులతోను శస్త్ర చికిత్సకులు శస్త్రములతోను, రోగికి బుద్ధిచెప్పెదరు ఈ త్రోవన పోయిన యెడల, దేహములోని రక్తమాంసములు ఇంటిలోని ధనమూ ఖాళీ యగును అలవాట్లు పోకపోవుటచే రోగములు మామూలుగానే ఉండును

ఏబదియేండ్లు దాటిన ప్రతిస్త్రీయు, యీ యిబ్బందుల ననుభవించుటచే, మిగిలిన వారందరును, యీబాధలు తప్పవని నిర్ధారణ చేసికొనుచున్నారు

అన్ని తరుణ రోగముల మాదిరిగనే యీ తరుణ రోగమును, మందువైద్యమే కాలిక రోగముగా మార్చివేయుచున్నది తరుణ రోగములను, నయముచేయుట అనుపేరుతో మందులతో అణచివేయుట చేతనే, కాలిక రోగములు వచ్చుచున్నవి ఏమాత్రము లోకజ్ఞానముగల వారికైననూ, ప్రకృతి వైద్యములోని గొప్పతనము తెలియును మామూలు, ప్రక్రియలతోనే రోగములు నయమవుచుండగా, యింతధనమును, శక్తిని ప్రజలు వ్యర్థముచేసుకొనుచున్నారు.

# ౧౭
# అంతర్వ్రణము

1909 సంవత్సరములో, ప్రకృతి వైద్యమునుగూర్చి ప్రచారముచేయుపత్రికలకు కొన్నివ్యాసములు వ్రాసినాను ఆవ్యాసములు, ప్రకృతి వైద్యతత్వమును సరిగా తెలుపుటచే ఆభాగములనే యథాతథంగా ఈపుస్తకములో చేర్చుచున్నాను

## అంతర్వ్రణము పుట్టు పూర్వోత్తరములు

అంతర్వ్రణమునుగూర్చి మేలూరు మాగజిన్, జులై సంచికలో, బర్టన్, జె హెన్‌డ్రిక్, ఇట్లు వ్రాసిరి అప్పటివరకూ వ్రణమునుగూర్చి శాస్త్రజ్ఞులకు, తెలిసిన విషయమునంతనూ హెన్‌డ్రిక్కు, క్రోడీకరించిరి వీరు అంతర్వ్రణమును గూర్చి చాలా పరిశోధనలను చేసినారు వీరు చెప్పినదంతయు ప్రమాణముగానే గ్రహింపవలయును

ఈవ్యాసకర్త అభిప్రాయములును, మాఅభిప్రాయములును చాలావరకు కుదురును మందువైద్యములో, అద్వితీయుడగుటచేత వారివ్రాతలనే యెత్తివ్రాయుచున్నాను 254 పేజీలో యీగ్రంథకర్త ఇట్లు చెప్పినాడు "మందువైద్యశాస్త్రము పుట్టి ఆరువేల సంవత్సరములు గడచినప్పటికినీ, అంతర్వ్రణమును గూర్చి పరిశోధనలు, జరుగలేదు ఆరు సంవత్సరములనుండి, యీరోగమునుగూర్చి అనేకపరిశోధనలు జరిగినవి క్రొత్తవిషయములు బయట పడినవి ఇంత జరిగినప్పటికిని వ్రణబాధితులకు కుదుర్చుమార్గము దొరకలేదు ఈశాస్త్రపరిశోధనలవలన ఒక్కరినికూడా రోగమునుండి కాపాడలేకపోయినాము"

ఈ గ్రంథకర్తగారి అభిప్రాయములబట్టి, మందులు, శస్త్రచికిత్స, యక్సురే, రేడియము వేయుట, మంచుగడ్డతో నయము చేయుట మొదలగుమార్గములవలన. వ్రణబాధ తగ్గలే దని తెలియవచ్చుచున్నది అంతర్వ్రణమంటే, మళ్ళీమళ్ళీ పుట్టు స్వభావముగల వ్రణమనియు, మొదటికంటా చావదనియు మందువైద్యుల నిఘంటువులన్నీ చెప్పుచున్నవి మందువైద్య విద్యార్థులందరును, పై విధముగానే నిర్వచింతురు అధ్యాపకుల కును, విద్యార్థులకును, యీ సత్యము తెలుసును తమవద్దకు వచ్చు రోగులకుమాత్రము, వింతకథలను చెప్పుదురు శస్త్ర చికిత్సవలన వ్రణములు పుట్టవను గ్యారంటీ యేమీలేదు శస్త్ర చికిత్సకులు రోగులకుచెప్పు మాటలన్నియు శుద్ధ అబద్ధములు, శస్త్రముల నుపయోగించుటవలననే చిన్నపుండ్లు పెద్దపెద్ద వ్రణ ములవుచున్నవి హెన్‌డ్రిక్కు, శస్త్రముల నుపయోగించుట వలననే చిన్నపుండ్లు వ్రణములగుచున్నవని తమ గ్రంథములోని 264 వ పేజీలో వ్రాసినారు. అంతర్వ్రణములను కత్తులతో ఉద్రేకపరచిన వెంటనే పెద్దవగుచున్నవి

చిన్ననెత్తురు గడ్డమీదుగా సిల్కుదారమును లాగిన యెడల, పెద్దవ్రణముగా మారినట్లు డా॥ లాబ్ కనుగొనిరి శస్త్ర చికిత్సచేసిననూ, అదేఫలితము కలుగుచున్నది మొదటగా పుట్టిన చిన్నగ్రంథులను శస్త్రములతో తొలగించుటవలననే పెద్దవ్రణము లు పుట్టుచున్నవని మనము నిత్యమునూ చూచుచునే ఉన్నాము

పైమాటలను డా సెన్ కూడా ఒప్పుకొన్నవే ప్రపంచ యాత్ర పూర్తిచేసిన తరువాత డాక్టరు సెన్ చెప్పిన మాటలే

యిందుకు నిదర్శనములు చాలా మంది స్త్రీలు, అందక త్తెలము కావలెనను అభిప్రాయముతో, మొటిమలను, తీసివేయించు కొనుచున్నారు కత్తులతో కోయించుకొనుచున్నారు సౌంద ర్యోపాసకులైన వైద్యులచేత వీటిని తీసివేయించరాదు మొటిమ లను విద్యుచ్ఛక్తి సహాయముతో తీసివేయుటచేతనే వ్రణములు పుట్టుచున్నవి ఇట్లా పుట్టిన వ్రణములతో బాధ పడినవారిని, చాలామందిని నేనెరుగుదును మొటిమలను గిల్లుటయు తప్పే, ఇందువలనను వ్రణములు పుట్టుచున్నవి

చిన్నకత్తులవలననే యింతగ్రంథము జరుగుచున్నది శస్త్ర చికిత్సకు ఉపయోగించు, పెద్దకత్తులవలన యేమిజరుగుచున్నదో యెవరికెరుక చిన్న నెత్తురు గడ్డలను కత్తులతో తీసివేయుటవల ననే, పెద్దవ్రణము కలిగినట్లు మాఆఫీసు రికార్డులు చెప్పుచున్నవి

తరుణరోగములను, మందులతోనూ, శస్త్రములతోనూ అణచివేయుటచేతనే, కాలికవ్యాధులు వచ్చుచున్నవను విషయ మును, డా సెక్ విస్మరించారు మందు వైద్యశాస్త్రము పెరిగి పోవుచున్నది దీనిఫలితముగా క్రొత్త క్రొత్త మందులను కను గొనుచున్నారు మందులతోనూ, కత్తులతోను ఎక్సు రేలతోనూ టీకాలతోనూ, రసవిష పాషాణాదులతోను, తరుణరోగములను, అణచిపెట్టుచున్నారు

ఇట్లా అణచిపెట్టుటవలననే అగ్నిమాంద్యము, నాడీ దౌ ర్బల్యము, పిచ్చి, కాళ్లు చేతులు చచ్చు పడిపోవుట వ్రణములు, సుఖరోగములు, క్షయ, పాండువ, రక్తక్షీణము మొదలగు దుర్భరవ్యాధులన్ని వచ్చుచున్నవి తరుణరోగములను, మందు

లతో అణచిపెట్టుటవలననే కాలిక రోగములన్నీ వచ్చుచున్నవను ప్రధానసూత్రమును, డా॥ సెన్ విస్మరించాడు మేము పైనచెప్పిన అభిప్రాయముల మనసులో పెట్టుకొని, డాక్టర్ సెన్ తన అనుభవముల పరిశీలిస్తే మందుల షాపులు యెక్కువగా నున్న చోట్లనే రోగము లెక్కువగా నున్నట్లును, ఆరోగములతోనే అచ్చటి జనులు యెక్కువగా బాధపడుచున్నట్లును, తెలుసుకొనగలరు ఈ అభిప్రాయములనే నాఉపన్యాసముల అన్నిటిలోనూ వ్యక్తపరచాను ఇదే అభిప్రాయమును పైగ్రంథకర్త 255 పేజీలో వ్యక్తపరచినాడు 'ముప్పది అయిదు సంవత్సరములు దాటిన స్త్రీలలో, యెనిమిది మందిలో ఒకరు వ్రణములతో బాధపడుచున్నారు వ్రణబాధితు లందరిలోనూ, అమెరికన్లు, యెక్కువగా నుందురు మానవుల బాధించు రోగములలో వ్రణము నికృష్టమైనది ఈ వ్రణబాధితులు, యేటేటా పెరిగిపోవుచున్నారు క్షయరోగములతో బాధపడువారి సంఖ్య తగ్గుచున్నది ఈలెఖ్ఖలనుజూచి మందువైద్యమువారే, తబ్బిబ్బుపడుచున్నారు ఇంగ్లండులోనూ యీవ్రణబాధితులు యెక్కువగా గలరు పురుషులలో నూటికి తొమ్మిదిమంది వ్రణములతో బాధపడి చనిపోవుచున్నారు ఇవన్నియు ప్రభుత్వపు లెఖ్ఖలనుబట్టి చెప్పుచున్నవేగాని అతిశయోక్తులు మాత్రముకావు లెఖ్ఖలు దొరుకక పోవుటచేత, అమెరికాలో యెట్లున్నదీ సరిగా చెప్పుటకు వీలు లేదు ఇంగ్లండు అమెరికాలోని జీవనపద్ధతులు ఒకటిగానే ఉండునుగాన, యీ రెండుదేశములలోనూ మందులయందలి ఆదరణ అధికముగనే ఉండునుగాన యిచ్చట వ్రణబాధితులు యెక్కువ

గా నేఉందురు అమెరికాలో వ్రణబాధితులు ఎక్కువగా కలరంటే మనమేమీ ఆశ్చర్యపడనక్కరలేదు మన విజ్ఞానమును, సంపదను చూచుకొని గర్వపడుచున్నాము ఈ విజ్ఞాన, సంపదలవలననే వ్రణములుపుట్టుచున్నవనుసత్యమును మరచిపోవుచున్నాము

పాశ్చాత్య నాగరికతకు, చదువుసంధ్యలు, గవర్నమెంటు పద్ధతులు, పారిశుద్ధ్యమను పేరుతో మందులపాపులు, ప్రధాన లక్షణములుగా నున్నవి ఏదేశములలో పైవిషయములు వ్యాప్తి నొందునో ఆయా దేశములలోని ప్రజలు నాగరికులమని భావించుచున్నారు ఏదేశములో, పై నాగరికతాలక్షణములు వ్యాప్తిలో నున్నవో, ఆదేశములలోనే వ్రణములు యెక్కువగా నున్నవి తూర్పుఖండములలో ఆసియా, ఆఫ్రికాలలో యీరోగములు లేనేలేవు నాగరికత యెక్కువగానున్న, అయిరోపా ఖండములోనే, యీరోగములు యెక్కువగా నున్నవి పశ్చిమ ఖండములలోను, అనాగరిక దేశములని, మనమనుకొను, మెక్సికో షోన్ ప్రాసు, పనామాలలోనూ యీవ్రణ బాధితులు లేనే లేరు అమెరికా, కెనడా దేశములలోని ప్రజలే యీ వ్రణములకు గురియగుచున్నారు

అయిరోపా ఖండములోని జాతులలో రష్యనులుగాని, హాంగరీ దేశస్థులుగాని, ఇటలీ దేశస్థులుగాని, స్పెయిన్ దేశస్థులుగాని, యీ రోగములతో బాధపడుట లేదు నాగరికులమనుకొను జర్మనులును, ఫ్రాన్సు దేశస్థులును, స్వీడన్ దేశస్థులును, నార్వే దేశస్థులును, యీవ్రణములతో బాధపడుచున్నారు ఇంగ్లండులో కూడా తూర్పుభాగములలో పేదప్రజల

కన్న భాగ్యవంతులు కాపురముచేయు, హామ్‌ప్‌స్టెన్, మార్
లైలుబోర్న్ చెలసా మొదలగు భాగములలోనే యీవ్రణములు
వ్యాప్తిలోనున్నవి న్యూయార్కులో కూడా అనాగరికులుండు,
ప్రదేశములలోకన్న, నాగరికులును, భాగ్యవంతులును, నివసించు
ప్రదేశములలోనే యీరోగము వ్యాప్తిలోనున్నది మిగిలిన భాగ
ములలోకన్న యీప్రదేశములలోనే, క్షయ, సన్నిపాతము, సర్పి,
శ్వాసాశయ వ్యాధులు ఎక్కువగా నున్నవి ఏకారణముచేతనో
గాని బాగా చదువుకొని, సిరిసంపదలతో తులతూగువారిలోనే
యీవ్రణములు యెక్కువగా నున్నవి వ్రణములగూర్చి పెక్కు
పరిశోధనల చేసిన డా॥ సెన్ కూడా, యిదే అభిప్రాయమును వెలి
బుచ్చాడు

"ప్రపంచములోని యేభాగములోని, నిగ్రోలైనా ఒకటి
గానే ఉన్నారు వీరందరు సంపూర్ణ అవయవ సౌష్టవము గలిగి
ఉన్నారు సముద్రతీరవాసులు, స్థూలకాయులు, వీరిలో మూర్ఛ
లతో బాధపడువారుగాని, వికలాంగులుగాని, లేనేలేరు వీరు
చాలా అనాగరికులు అందువలననే వీరు వ్రణములతో
బాధపడుట లేదు

ఇదేగాక చాలారోగములు వీరిలో లేనేలేవు శ్వేతజాతు
లున్నచోట్లనే క్షయరోగమున్నది

మిగిలిన అన్నిరోగముల వలెనే యీరోగమూ నాగర
కత వలననే వచ్చుచున్నది. అనాగరికులలో యిది లేనేలేదు
గ్రీన్‌లాండులో నివసించు ఎస్కిమోలలో యీరోగము లేక

పోవుటచేత వాతావరణము వలన యీరోగము వచ్చుట లేద నియు, వాతావరణములోని మార్పులవలన యీరోగముకుదుర దనియు, తేలుచున్నది

ఆఫ్రికా ఆస్ట్రేలియాలలో నివసించు ఆదిమజాతులుగాని, ఉత్తర దక్షిణధ్రువములలోనుండువారిలోగాని యీ వ్రణములు లేనే లేవు

దేహములో పేరుకొన్న మలినపదార్థములనన్నిటినీ ప్రకృతి తరుణరోగములద్వారా బయటకు పంపివేయుచున్నది రోగ పరిణతనుకలిగించు రోగపదార్థమే బయటకుపోవు చు గాన, రోగము రానేరాదు మనముమాత్రము యెట్టి అభ్యంతరము లను కల్పించరాదు

ఐరోపాఖండములోని అనాగరిక దేశములలో గొర్రెల కాపరులే వైద్యముచేయుదురు వీరి వైద్యప్రక్రియలు మామూలు గానే ఉండును ప్రార్థనలు మాత్రము తప్పకజరుగును చాలా ప్రమాదావస్థలోగాని మందులవాడరు మందులతో రోగముల అణచివేయుట పాపమందురు చిన్నరోగములకు వారేమీ మందులవాడరు జలచికిత్సాప్రక్రియలనే వాడుదురు ఋతు వులలోదొరకు మూలికలను నిలవచేసికొని ఆమూలికలతో రోగముల నయముచేసికొందురు

భాగ్యవంతులయిండ్లలో కాస్తకునూ, కూస్తకునూ, వైద్యుల పిలుతురు జలుబుచేసినా, వైద్యుని పిలువవలసినదే, మందులవాడవలసినదే, ఎక్కడో రోగమున్నదని, ముందుగనే మందులవాడుటయు గలదు జీవనపద్ధతులలోని లోపములను,

సారాయి, బ్రాందీ, విస్కీ మొదలగు, పానాలు, పొగాకులోని నికోటయినను విషమున్నూ, టీకాలున్నూ టీకాలలోని విషముల విరుగుడుకు వాడు మందులున్నూ శరీరములోని రక్తమును, విషపూరితము చేయుచున్నవి ఈ విషమును బైటకునెట్టుటకు ప్రకృతిచేయు ప్రయత్నములన్నియు మందులతో అణచిపెట్ట బడుచున్నవి తరములకొద్దీ యీమందులవాడితే రోగములన్నీ వంశానుగతముగా వచ్చును అందువలననే నాగరికులంటే వ్రణములకు ప్రేమ అవి వారివెంటనేపడును పైగ్రంథకర్త 256 పేజీలో యిట్లుచెప్పినారు 'నాగరికప్రదేశములలోని కుక్కలను జాగ్రత్తగా పరిశీలిస్తే పుండ్లులేనికుక్కలు లేనేలేవు

మిగిలిన అన్నిజంతువులకన్న కుక్కలకే యెక్కువగా రోగములు వచ్చుచున్నవి మానవులు తిను కృత్రిమాహారముల నన్నిటిని కుక్కలుకూడతిని, మానవులవలె బాధపడుచున్నవి భాగ్యవంతులయిండ్లలో కలుగు ప్రతిచిన్నరోగమునకును, ఘన వైద్యులెట్లు రావలయునో అట్లాగే భాగ్యవంతులయిండ్లలో పెరుగు కుక్కలకువచ్చు ప్రతిచిన్న రోగమునకును, పశువైద్య నిపుణులు రావలసినదే రోగము ) అణచిపెట్టవలసినదే పైగ్రంథ కర్త 257వ పేజీలో యిట్లు చెప్పుచున్నాడు

మందు వైద్యశాస్త్రమునంతనూ, తల్లక్రిందులుచేయు టకే ప్రకృతి వ్రణరోగమును కల్పించినది ప్రకృతిసూత్రములను విస్మరించి "మందువైద్యశాస్త్రము పాపఫలితముల ననుభవించు చున్నదనుట సమంజసముగా నుండును '

ఇంతవరకూ చెప్పినదానినిబట్టి, ముఖ్యసూత్రములను, మనము మరచిపోరాదు. మందువైద్య శాస్త్రమునంతనూ,

ప్రకృతియే తల్లక్రిందులు చేయుచున్నది ముందెప్పుడో సర్పి రాకుండుటకై అనేకవేలమంది, పిల్లలకు మందులు వాడు చున్నారు మందులను సేవించినవారందరును, వీరందరకూతప్పకుండా వ్రణములుపుట్టును క్షయరోగమునుండి, అనేకమందిని కాపాడుచున్నారని ప్రచారము చేయుచున్నాము నిజమేమంటే అంతకన్నా యెక్కువబాధపొందుటకే, వీరందరినీ క్షయరోగము నుండి కాపాడుచున్నాము

వ్రణము అంటుజాడ్యముకాదని, పై గ్రంథకర్తయే నిర్ధారణచేసిరి సరిఅయిన ఆరోగ్యముగలవారి దేహములలోనికి యీ రక్తమును, ప్రవేశపెట్టినప్పటికిని ప్రతివారికిని యీ రోగము వచ్చుటలేదు

వ్రణముల పరిశోధించు ప్రయోగశాలలలో వంశాను గతముగా వ్రణములు వచ్చునదీ లేనిదీ, తెలుసుకొనుటకుగాను, ముందుగా ఎలుకలమీదను చుంచులమీదను ప్రయోగమును చేతురు ఈ జంతువులు యెక్కువగాను, చవకగాను దొరుకును మానవులు, అంతచవకగా దొరకరు

హెన్‌డ్రెక్కు 264 వ పేజీలో ఇట్లు చెప్పిరి 'మొదట్లో యీవ్రణనెత్తురును' పది పన్రెండు యెలుకలలో చొప్పించి చూచినారు వాటిలో యేఒక్క యెలుకకును, వ్రణములు పుట్టలేదు డజనులోపుగా చేసినారు కాబట్టి యే ఒకఎలుకకును యీ రోగమురాలేదు రాకపోవుటచే, అప్పటి శాస్త్రజ్ఞులు వ్రణములు, వంశానుగతముగారావని నిర్ధారణచేసినారు డజను ఎలుకలమీదగాక, వందలకొలదీ ఎలుకలమీద యీప్రయో

గము చేస్తే ఫలితములు తప్పకుండా కనపడేవి లండనులోని ప్రయోగశాలలలో నాల్గువందల యెలుకలకు యీ వ్రణపు నెత్తురును చొప్పించి; నను ఒకయెలుకకు, కూడా, యీరోగము రాలేదు

మరొక ప్రయోగశాలలలో 1600 యెలుకలకు యీ నెతురును వాడిరి 1250 యెలుకలకు యీరోగమురానేలేదు మిగిలిన 350 యెలుకలకు యీరోగమువచ్చినది వీటి పుట్టు పూర్వోత్తరముల జాగ్రితగా పరిశోధించిరి

పైన చెప్పినదానినిబట్టి రోగమువచ్చుటకు, దేహములో అనుకూలమగు పరిస్థితులనే రోగప్రవణత యనెదము క్షయ రోగసూక్ష్మజీవులు వ్రణరోగ సూక్ష్మజీవులు వృద్ధిపొందుటకు, వాటికి అనుకూలమగు ఆహారముండవలయును ఈపరాన్న భుక్కులుజీవించుటకు తగుఆహారముండవలయును ఈ రోగపదార్థ ములవసరమే లేకుండా, రోగసూక్ష్మజీవులు వాటంతటవియే వృద్ధి పొందితే చెడురక్తము చొప్పించిన అన్నిటిలోనూ, యీరోగము రావలెగదా,అన్నిటికీ రోగమువచ్చుటలేదు గాన రోగమువచ్చు టకు, రోగజీవులకన్న రోగపదార్థమే ముఖ్యమని తేలుచున్నది

రోగము వచ్చుటకు యీరోగపదార్థము ముఖ్యమని తేలినదిగాన యీరోగపదార్థమును తొలగించిన వెంటనే, వ్యాధి నివారణ అవునని మనం సులభముగానే ఊహించగలము రోగ జీవులు బ్రతుకుటకు, అనుకూలమగు పరిస్థితి ఉండదుగాన వాటం తటవియే నశించిపోవును దేహములో పేరుకొన్న విషపదార్థ మును తొలగించిన, దేహములోని కణములకు యెట్టి ఉద్రేక ము కలుగదు

మందులతోగాని, శస్త్రములతోగాని, రోగమును నివారించుటవలన, ఉపశమనము మాత్రమే అగునుగాని, నిర్మూలము మాత్రముకాదు వంశానుగతముగా వచ్చు చెడురక్తమువలననే కాయలు కంతులు గ్రంధులు పుట్టుచున్నవి

మూలకారణముల నన్నిటినీ అట్లనే ఉంచి, పైఫలముల తొలగించిననూ ఉపయోగములేదు వ్రణములు వంశానుగతముగా వచ్చుటచేత, దేహములో పేరుకొన్న రోగపదార్థము, వలననే యిది వచ్చుచున్నదని తేలుచున్నది ఇందుకు మరియొక కారణముకూడా గలదు మానవ దేహము కణముల సమూహము, కణము అణువుల సమూహము, అణువు మైక్రోజిమాల సమూహము, మైక్రోజిమా,ఎలెక్ట్రానుల సమూహము మానవ దేహమునకు యేలక్షణములుండునో కణమునకును ఆలక్షణములుండును కణమునకు యేలక్షణములు గలవో ఆలక్షణములే అణువునకూ గలవు చివరకు యెలక్ట్రాను నకును ఆలక్షణములన్నీ ఉండును పురుషుని శుక్లము, స్త్రీశోణితము కలిస్తేగాని బిందు వేర్పడుట లేదు పైలక్షణములే పురుషుని శుక్లాణువునకును, స్త్రీశోణితాణువునకును, ఉండును తండ్రి వ్రణములతో బాధపడితే కొడుకునకుకూడా, వ్రణములరోగప్రవణత ఉండును. మృత్యువుకూడా యీ రోగమును అభ్యంతర పెట్టలేదు పై గ్రంధకర్తగారే యిట్లు చెప్పుచున్నారు

## వ్రణము వంశానుగతము

వ్రణము వంశానుగతముగా వచ్చునా లేదాఅనువిషయం పరిశోధనలతో నిరూపించుతాము డాక్టరు బైజరు హార్వార్డు

వైద్యపార శాలలో కొన్ని పరిశోధనలు జరిపినారు వారిపరిశోధనా ఫలితములనే యీ క్రింద పొందుపరుస్తున్నాను

డాక్టరు ఒకరోజున, పెద్దనెత్తురుగడ్డతో బాధపడుచున్న ఒక ఆడయెలుకను చూచినారు సామాన్య ఆరోగ్యముగల ఒక మొగయెలుకతో దానిని జతపరిచినారు ఈఆడయెలుకకు నూరు పిల్లలు పుట్టినవి ఎలుకలలో 5 నెలలకుగాని వ్రణములు పుట్టి నట్లు తెలియదు మామూలుగా యెలుకలకు వచ్చు రోగము లతో యీనూటిలోనూ ముప్పది అయిదు చనిపోయెను ఈ ముప్పది అయిదు యెలుక పిల్లలునూ, అయిదు నెలలు, నిండక పూర్వమే చనిపోయెను మిగిలిన 65 లోనూ యిరువది యెలు కలకు వ్రణములుపుట్టెను ఈవ్రణములతోనే యివి చనిపోయెను లండనులోని వ్రణ పరిశోధన శాలలో పరిశోధనలు జరిపిన డాక్టరు బాష్ ఫర్డు అనుభవప్రకారము, 2500 యెలుకలలోనూ ఒక దానికే యీ రోగము వచ్చుచున్నది బాష్ఫర్డు అభిప్రాయ ములు సమంజసములుగా కనబడుట లేదు ఎందుకంటే యింత కన్న యెక్కువమందికే వ్రణములు కలుగుచున్నవి వ్రణము లతో బాధపడిన తల్లియెలుక రోగమే పిల్లలకు వచ్చినదని చెప్పుటకు వీలులేదు కాని తల్లియెలుక రోగిష్ఠిదగుటచేత పిల్ల యెలుకలకు కూడా రోగప్రవణత ఉండునని చెప్పవచ్చును

తల్లి దండ్రులు క్షయరోగములతో పీడింపబడితే వీరి <u>సంతానమునకుకూడా ఆరోగమే రావలెనను నియామకము లేదు</u> <u>రోగము వచ్చుటకు అనుకూలమగు రోగప్రవణత మాత్రము</u> <u>తప్పకుండా ఉండును</u>

ఇప్పుడిప్పుడు వెలువడు మందు వైద్యశాస్త్రగ్రంధము లన్నియు, తల్లిదండ్రులరోగములే పిల్లలకు రావలెను నియామకము లేదనియు, రోగము వచ్చుటకు అనుకూలమగు రోగప్రవణత ఉండుననియు, నిర్ధారణచేయుచున్నవి

మానవదేహము వివిధకణముల సమూహమగుటవలన దేహమునకు యేలక్షణములుండునో, కణమునకును ఆలక్షణము లుండును దేహము ఆరోగ్యముగా ఉంటే, కణముకూడా, ఆరోగ్యముగా ఉండును దేహము అనారోగ్యముగా ఉంటే, కణముకూడా అనారోగ్యముగా ఉండును

తల్లిదండ్రుల శుక్రశోణితములతోనే బిందువు యేర్పడుటచే తల్లిదండ్రులకుగల రోగములు అదేరూపములో రాకపోయినప్పటికినీ, రోగప్రవణత మాత్రము తప్పకుండా వచ్చును రోగప్రవణత ఉండుటచేత, మంచి మొక్కలకన్న కలుపుమొక్కలు త్వరగాపెరుగును గాన రోగములువచ్చుటకు యెక్కువగా సావకాశములు గలవు

హోమోపతీ వైద్యశాస్త్రమునకు సారూప్య ఔషధ శాస్త్రము అనిపేరు డాక్టర్ హానమన్ యీ వైద్యశాస్త్రమునకు పితామహుడు తండ్రిరోగములు కొడుకునకు రా నవసరం లేదని ముందుగా యీ మహాశయుడే చెప్పెను పిల్లలను పీడించు గజ్జి, తీట, చుండు, కర్పాణి, చీడ మొదలగున వన్నియు వంశానుగతముగా వచ్చి అంతర్గతమైన గండమాల రోగముయొక్క రోగప్రవణతలే నని యీ మహాశయుడే చెప్పెను

ఈ గండమాలరోగముకూడా వారిపూర్వీకులు బాధ పడిన కుష్ఠురోగ ఫలితమే నని చెప్పినారు

మొదటలోవచ్చిన కుష్ఠురోగమునే, తరములకొద్దీ మందులతో అణచిపెట్టుటవలన, అంతర్గతమైనదనియు, గజ్జి, తీట, చుండు, కర్బాణి యేనుగగజ్జి చీడ మొదలగునవన్నియు ఈ అంతర్గతరోగముయొక్క తరుణరూపములే. క్షయవ్రణము, నెత్తురుగడ్డ, మొదలగునన్నియు, అంతర్గతరోగముయొక్క కారిక స్వరూపములని సుప్రసిద్ధ హోమోపతీవైద్యుడగు హానిమానుగారు వ్రాసిన కారికరోగముల స్వభావములు అను గ్రంథమున తమ అభిప్రాయముల వ్రాసియున్నారు నూరుసంవత్సరముల వరకు మందువైద్యులు హానెమన్ సిద్ధాంతముల ఒప్పుకొనలేదు హేళనచేసినారు హోమోపతీవైద్యులును యీ సిద్ధాంతముల నమ్మలేదు కంటిని చూచినయెడల వంశానుగతముగా వచ్చు రోగములన్నియూ మనకు తెలియును హానిమన్ సిద్ధాంతముల కన్నిటికినీ యిప్పుడుప్రమాణములు కనబడుచుండుటచే నిజమని యిప్పుడు నమ్ముచున్నాము

చర్మరోగముల అణచిపెట్టుటచే కంటిలోని కొన్నిభాగములలో మచ్చలు కనబడును మందులరంగులు కనీనికరంగును బట్టి, యీ మచ్చలరంగులు మారుచుండును మందులతో తమకువచ్చినరోగముల అణచిపెట్టుటవలన మూడురకములైన విషములు చేరుచున్నవి ఒకటి – వంశానుగతముగా వచ్చి అంతర్గతమైయున్నవిషము రెండు – సూక్ష్మజీవులలోని విషము మూడు – పుండ్లును మాన్పి పరాన్నభుక్కులను చంపుటకు

వాడిన మందులలోని విషము ఈ విషములు కంటిలో ఏ భాగముచేరినదీ కంటినిచూచి చెప్పగలము

ఈ పరాన్న భుక్కులలోని విషమునే హోమియోపతీ వైద్యులు సోరినమ్ అంటారు సూక్ష్మజీవులను మందులతో వేటాడి చంపుటచే దేహములో మూడువిషములు చేరుచున్నవి వంశానుగతముగావచ్చు విషములు, రక్తప్రవాహములో కలిసి, దేహమునకు హానికలుగకుండా ప్రకృతియే ఆ రోగవిషములను చర్మముద్వారా బయటకు పంపును రోగపదార్థమునుండి పుట్టిన సూక్ష్మజీవులకు రోగపదార్థమే ఆహారమగును

క్షయరోగముతో పీడింపబడువారి కనీనికలను, చూస్తే ఊపిరితిత్తులను తెలుపు భాగములలో మచ్చలు కనబడును. కాలేయములోని వ్రణములతో బాధింపబడువారి కనీనికలను చూస్తే కాలేయమును తెలుపు ప్రతినిధి భాగములలో మచ్చలు కనబడును

వ్రణరోగప్రవణతకు గజ్జియే మూలమైనట్లు కనబడుచున్నది మా ఆసుపత్రిలో చాలామందికి వ్రణరోగములను నయము చేసితిమి చికిత్సాకాలములో వారు ఒకటిరెండు తడవలు గజ్జితో బాధపడినారు ఆపాదమస్తకము గజ్జిలేచినది కొంతమంది కొన్నిరోజులే బాధపడినారు వారములకొలదీ బాధపడినవారు గలరు నివారణమార్గములకు మేమెట్టి అభ్యంతరముల కల్పించము ఆతపస్నానములతోను, జలప్రక్రియల తోను, (హానిలేని హోమియోపతీమందులతోనూ) వాటికి సాయపడి, రోగపదార్థమును బయటకు పంపుచున్న చర్మరోగములను

పోగొట్టుటకు చన్నీటినే రాయుదుముగాని, సబ్బునీటినివాడము. సబ్బునీటిని వాడినందువలన సూక్ష్మజీవులుచచ్చిపోవును ఆసూక్ష్మ జీవులలోని విషము రక్తముతో కలిసిపోవును సూక్ష్మజీవులు తినుటకు ఆహారము దొరకనియెడల వాటంతట అవియే నశించి పోవును వ్రణరోగముయొక్క వంశానుగతతత్త్వమునుగూర్చి పైగ్రంథకర్తయే 264 వ పేజీలో నిట్లు చెప్పిరి

“వ్రణరోగములతో బాధపడు కుటుంబములను మనము నిత్యముచూచుచునే యున్నాము చరిత్రప్రసిద్ధమైన నెపోలియన్ కుటుంబమువారు వ్రణములతో బాధపడి పరాసువీరు డగు నెపోలియన్ జీర్ణాశయవ్రణముతో చనిపోయెను అతని తండ్రియు, సోదరుడును, తోబుట్టువులును వ్రణములతోనే చనిపోయిరి పెద్దకుటుంబములన్నియు వ్రణములతో బాధ పడుట మనము చూచుచున్నాము కుటుంబములోని కొంతమందికి వ్రణములవస్తే, మిగిలినవారందరికిని అదేరోగము అదేరూపములో రావలయును నెపోలియన్ కుటుంబమువా రందరును జీర్ణాశయవ్రణముతో బాధపడుటయే యిందుకు నిదర్శనము ఇందువలన వ్రణము వంశానుగతముగా వచ్చు చున్నదని ధృవపడుచున్నది ”

నెపోలియన్ జీవితచరిత్రను వ్రాసిన చరిత్రకారు లందరును జీవితకాలములో నెపోలియన్ గజ్జితో నెక్కువగా బాధపడినా డని వ్రాసినారు గజ్జికనబడినపుడు బైటకు రాకుండా మందు లతో నెప్పటికప్పుడు అణచిపెట్టెడివారట తర్వాత వచ్చిన వ్రణమునకును ఈగజ్జికిని సంబంధము కనబడుచున్నది

## ప్రకృతివైద్యము ఈరోగమును నయంచేయునా?

మందువైద్యమువారు తమపురాతన సిద్ధాంతముల వదలు కొని, నూతన సిద్ధాంతములప్రకారమే, నడచిన యెడల మానవ కోటికి విపరీతమైన సేవచేయుదురు ధనప్రాణ నష్టములు లేకుండా మానవ జీవితములు సుఖముగా నడచిపోవుచు దేహమును కుళ్ళి పోకుండా కాపాడు మందులతోను, జ్వరము రాకుండా కాపాడు మందులతోను, శరీరములోని విషమునకు విరుగుడు మందులతోను టీకా రసులతోను, శస్త్రచికిత్సలతోను నేటి మందు వైద్యశాస్త్రమంతా నిండిఉన్నది

సూక్ష్మజీవుల వలన కలుగు అన్నిరోగములను మందు లతో తక్షణమే నయముచేయగల మనుకోవడము వట్టి భ్రమ మందువైద్యమువారు ఈ మూలసూత్రమును ఇప్పుడు గ్రహించినారు టైఫాయిడు జ్వరము, సర్పి, క్షయ మొదలగు రోగములు మందులతో నయము కావు దేహములోని ప్రకృ తియే యీ రోగముల కుదుర్చును

పై వ్రాతల వ్రాసిన మన గ్రంథకర్తయే ఆ పేజీదిగువలో ఈ క్రింది విధముగా వ్రాసిరి ప్రకృతివైద్యమునుండి మందు వైద్యములోనికి దూకినారు

పైనిర్ణయము సర్వేసర్వత్రా ఉపయోగించదు కొన్ని అపవాదములును గలవు చలిజ్వరమునకు క్వైనాయునూ, ఉపదంశమునకు పాదరసమునూ అత్యద్భుతముగా పనిచేయును ఈ రెండురోగములునూ, జంతుసంబంధమైన సూక్ష్మజీవులవలన

వచ్చుచున్నవి శాకసంబంధమైన సూక్ష్మజీవులవలన ఈ రోగములు వచ్చుట లేదు

క్వయినా చలిజ్వరమునున్నూ, పాదరసము ఉపదంశమునున్నూ యెన్నటికినీ కుదర్చవు విషపుమందులు, రోగముల నెందుకు కుదర్చలేనిదీ గతఅధ్యాయములో మాపాఠకులు చదివియే ఉందురు మందులతో రోగములు కుదరక పోవుటచే హెన్‌డ్రిక్కుగారు పైన చెప్పిన సూత్రమునకు అపవాదములు లేనే లేవు డాక్టర్ హెన్‌డ్రిక్కు పొరపాటుబడినాడని చెప్పసాహసించినాము దేహములోని మురుగును, ప్రకృతియే తరుణరోగములద్వారా బయటకు పంపి వేయును

ఈతరుణరోగములను మందులతో అణచివేయుటవలన కాలికరోగములు కలుగుచున్నవి రోగముల అణచిపెట్టుటకు వాడుమందులన్నిటిలోనూ, పాదరసముతో తయారుకాబడిన మందులు మరింతహానిచేయును చచ్చుబడిపోవుట, పక్షవాతము మొదలగునవన్నీ యిట్లు పాదరసపుమందులవలన వచ్చినవేను డా హెన్‌డ్రిక్కు 265వ పేజీలో నిట్లు చెప్పిరి 'దేహములోని సహజ నిరోధకశక్తివలననే అన్నిరోగములు కుదుర్చును

విజాతీయమైన మందులవలన హానికలుగకుండా, ప్రకృతియే మందులను ఎదుర్కొనును ఏశక్తితో దేహము మందులతో పోరాడుచున్నదో ఆశక్తినే సహజనిరోధకశక్తి అందుము. తనకు సాధ్యమైనంతవరకు మందులతో ఈ శక్తి పోరాడుచునే ఉండును ఎప్పటినుండియో దాచిపెట్టిన మూలబలమును వెచ్చించి అయినా పోరాడును

గ్రంథకర్తగారి యీఅభిప్రాయములు కూడా ప్రకృతి వైద్యమునకు, అనుకూలముగానే ఉన్నవి ఈక్రొత్త సిద్ధాంతములకు ప్రకృతివైద్యమని నామకరణము చేయుటచేతనే యీ వైద్యములోని గొప్పతనము తెలియుచున్నది

వైద్యునివలన రోగమేమియు కుదరదు ప్రకృతివల్లనే సర్వరోగములును కుదురును అభ్యంతరముల తొలగించుటయే మనము చేయదగ్గపని కొద్దిగాచెడిన అవయవముల ప్రకృతియే బాగుచేయును వైద్యుడుచేయున దేమీలేదు అయితే, ఆధ్యాత్మికవాదులతో ఈ సందర్భములో శృతికుదురుతుంది గదా అని మీరడుగవచ్చును కాని ఒకభేదము మాత్రము గలదు ఆధ్యాత్మిక వాదుల వాదనప్రకారము భగవంతుడే (చెడిన అంతరవయవముల బాగుచేయును) ఆపనిని పూర్తిచేయును ఇక మన వాదన ప్రకారము హానిలేనివిధముగా ప్రకృతిచేయు పనికి సహాయము చేయుదము మందుల నుపయోగించుట చేతనే సర్వరోగములును నయమగునను మందు వైద్యమువారి అతివాదమునుగాని, సర్వరోగములును భగవంతునివలననే నయమగు నను ఆధ్యాత్మికవాదుల మిథ్యావాదననుగాని ప్రకృతి వైద్యము ఒప్పుకొనదు ఈ రెండు అతివాదములను సమన్వయ పరచునదియే ప్రకృతి వైద్యము

దేహములో ఆహారవిహారముల వలనను, వంశానుగతముగా వచ్చినవియు అగు విషముల తొలగించి శుద్ధిచేయుటకు ప్రకృతిచేయు ప్రయత్నమే తరుణవ్యాధియని, యిదివరకే

చదివినాము ప్రాణశక్తివలననే సర్వరోగములు కుదురుననికూడా మనము తెలుసుకొన్నాము

మందువైద్యులు రోగమను దైహికబాధనే ప్రకృతి వైద్యులు దేహమును శుద్ధిచేయుటకు ప్రకృతిచేయు నివారణ ప్రయత్నము అనుచున్నారు

పై గ్రంధకర్తగారే 265 వ పేజీలో నిట్లు చెప్పినారు బయటనుండివచ్చు సూక్ష్మజీవులవలన రోగము వచ్చుచున్నది 'ఈ రోగజీవులను నిరోధించుటకు దేహములో ప్రతిజీవులు తయారవును ఈ ప్రతిజీవులు అందరిదేహములలోను ఉండును రోగమువచ్చినప్పుడు యీ ప్రతిజీవులు రోగజీవులను చంపి వేయును సర్పిని కలిగించు సూక్ష్మజీవులు దేహములో ప్రవే శించగనే యీ రోగజీవులను చంపుటకు ప్రతిజీవులను దేహము అప్పటికప్పుడే తయారుచేయును రోగము నయముకాగానే, దేహములో యీ ప్రతిజీవులు యెక్కువగానుండును అందు వలననే ఒకతడవ వచ్చి నయమైన అంటువ్యాధి మళ్ళీరాదు

పైన చెప్పినదంతయు మందువైద్యమువారి సూక్ష్మజీవి సిద్ధాంతమును తెలుపుచున్నది

అన్నిరోగములును సూక్ష్మజీవుల వలననే వచ్చుచున్న వని మందువైద్యమువారు అభిప్రాయపడుచున్నారు ఇక ప్రకృతి వైద్యమువారి అభిప్రాయ మేమన సర్వజీవపదార్థములోనూ మై క్రోజిమాలుండును ఈ మైక్రోజిమాలు దేహములో తయారగు పరకునే తిని జీవించుచుండును టీకారసపుమురుగు పేరుకొని నప్పుడును, ఆమురుగే మైక్రోజిమాలకు ఆహారమైనపుడును సర్పి

రోగజీవులుగా మారును దేహములో కలుగుమంటలును ఈ రోగజీవులనుండియే వచ్చుటచేత రోగపదార్థములోని సూక్ష్మజీవులు నశించిపోవుటచేత మంటలు తగ్గిపోవును బయటనుండి సూక్ష్మజీవులు వచ్చుటయును ఆజీవులను దేహములోని తెల్ల కణములు చంపుటయునూ, వట్టిభ్రమయేగాని నిజముముకాదు

జ్వరములు, మంటలు, చక్రరోగములు అన్నియు రోగ పదార్థము బయటకుపోవుటకు సహాయపడు మార్గములే లోపలిమురుగంతా బయటకుపోవుటచేత లోపల నేమియు నిలవ ఉండదు మురుగు లేకపోవుటచేత, మురుగుపోవుటు సూక్ష్మజీవులు ఆహారము లేకపోవుటచే పుట్టవు ఒకవేళ పుట్టినను వృద్ధి పొందవు

ఒక ఉదాహరణముచెప్పిన ఈ విషయము బాగుగా అర్థమగును

పంచదారనీటిలో కొద్దిగా కల్లుమడ్డి వేసినయెడల పంచదారనీరు సారాయిగా మారిపోవును పంచదార సారాయిగాను అంగారక్షారముగాను మారిపోయినతరువాత పులియుట మానును

కల్లుమడ్డిలోని సూక్ష్మజీవులకు ఆహారము లేకపోవుటచేత అట్లనే నిలబడిపోవును ఈ జీవులనే వేరొక పంచదార నీటిలోపోసిన బాగుగా వృద్ధిపొందును

మందువైద్యులు చెప్పినట్లు సూక్ష్మజీవులు దేహమునకు హానిచేయవు

ప్రకృతిలోని అన్నివస్తువులమాదిరిగనే సూక్ష్మజీవులును దేహమునకు మేలుచేయును

గృహములను శుభ్రపరచు పూచికలకట్టలోని పూచికలను శుభ్రము చేయుచున్నవను నేరమునకు తీసివేయుట యెంత తెలివిగలపనియో దేహములోని రోగపదార్థమును తిని వేసి మురుగు బాగుచేయుటకు జన్మించిన సూక్ష్మజీవులను చంపుటకూడా అంత తెలివిగలపనే

దేహములోని బహిష్కార్యా వయవములు కొంతపరిమితిగలమురుగునే బైటకుపంపును వాని శక్తికిమించిన మురుగు లోపలనే పేరుకొనును మనము మురుగుపేరుకొను అలవాట్లను మాననియెడల మురుగు అట్లనే పేరుచుకొనుచునే ఉండును

పంచదారనీటిలోనే కల్లుమడ్డిజీవులు వృద్ధిపొందును పంచదార లేని నీటిలో యీ జీవులు వృద్ధిపొందవు మురుగులో పుట్టే సూక్ష్మజీవులు శుభ్రమైనరక్తములో వృద్ధిపొందవు

## సహజనిరోధమునకు ఆధారములేవి ?

ఏరోగమునైనను దేహమే నిరోధించగలదని లోగడనే చదివినాము దేహములో సహజముగానే యీ నిరోధకశక్తి ఉండును నిరోధకశక్తి వృద్ధిపొందుటకు నాలుగు ప్రధానకారణములు గలవు

అవేవన ? (1) మనము తినే ఆహారము సరిగా జీర్ణమై బయటకు పోవలసినమురుగు వెడలిపోయినయెడల నిరోధకశక్తి వృద్ధిపొందును

(2) దేహములో ఉండవలసినధాతువులు సరిఅయిన పాళ్లలో ఉండి నరములన్నియు శక్తిమంతములుగానున్న యీ నిరోధకశక్తి యెక్కువగును

(3) దేహములోని కణములకును, అవయవములకును నాడీశక్తి సరిగా ప్రవహించుచుండినయెడల రోగనిరోధకశక్తి వృద్ధిపొందును

(4) మానవుని దైహిక, మానసిక, నైతికశక్తులకు పరస్పర సమన్వయమున్నయెడల నిరోధకశక్తి వృద్ధియగుచు

266 వ పేజీలో హెన్రిక్కు ఇట్లు చెప్పిరి కొన్ని వ్రణములు ఎలుకలు చనిపోవువరకును పెరిగినవి కొన్నివ్రణములు తగ్గుటయు గలదు కొన్నివ్రణములు పెరిగి తగ్గిపోవుటయు గలదు కొన్నివ్రణములు సూక్ష్మదర్శినీయంత్రమునకును కనబడనంత తగ్గుటయు గలదు

నయమైనపుడు పుట్టినచోట గుర్తుకూడా లేకుండా మిగిలినచర్మములో కలిసిపోవును చిన్నవ్రణములు త్వరగా మాయమైనవి

## వ్రణములునూ నయమగును

వ్రణములు పుట్టగనే చావవలెనని భయపడవలసిన పని లేదు వ్రణమువలన దేహమునకు హాని లేకుండా ప్రకృతే తాపాడును చెడుపదార్థమునంతనూ బయటకు పంపివేయును. ప్రకృతివలననే వ్రణములు నయమగుటచేత ఈ రోగము కుదరని రోగముల జాబితాలో చేరదు ప్రకృతివలన రోగము ఎట్లు నయమగునది చెప్పలేము

ఈసంగతి మానవమాత్రులకు అందని విషయము మన గ్రంథకర్త మందువైద్యమునకు అందలేదుగాని ప్రకృతివైద్యము

వలన వ్రణరోగము ఎట్లు కుదురునదీ ప్రకృతివైద్యులకు తెలియును అన్నిరోగముల మాదిరిగనే వ్రణరోగమున్నూ రోగ పదార్థము వలననే వచ్చుచున్నది రోగపదార్థము బయటకు పోవుటకు వసతుః కల్పించగనే ఆహారము లేక రోగజీవులు వాటంతటవియే చనిపోవును రోగపదార్థము పోవునుగాన రోగము పోవును

మామూలు చికిత్సాప్రక్రియలతోనే వ్రణరోగములు నయము చేయవచ్చునని ప్రకృతివైద్యులు కొన్నిసంవత్సరముల నుండి చెప్పుచునే ఉన్నారు

ఈవ్రాతలచూచి మందువైద్యులు నన్ను అపహాస్యము చేసినారు (ఇప్పుడిప్పుడు) వెలువడు మందువైద్య గ్రంథము లన్నియు (వ్రణములు నయమగునని చెప్పుచున్నవి)

శస్త్రచికిత్సతప్ప వేరుమార్గము లేదని నమ్మిన చాలా మంది రోగులు ఆపరేషనులకు బలి అయినారు

నిన్న నేడూ వెలువడు మందువైద్య గ్రంథము లన్నియు ఈ రోగమును కుదరనిరోగముల జాబితాలో నుండి తీసివేయుచున్నవి

బయట సహాయము లేకనే ప్రకృతియే యీరోగమును కుదుర్చుననియే చెప్పుచున్నవి

ప్రకృతియే రోగము నయము చేయగలిగినపుడు రోగ పదార్థమును బయటకు పంపుమార్గములు ప్రకృతికి తోడైనప్పుడు వ్రణములు ఇంకా త్వరగా నయమవును వ్రణరోగము

నయముచేసుకొన్నవారు గజ్జితో బాధపడుట మే మెరుగుదుము ఒకరికి మశూచికము వచ్చినందువలన క్షయరోగము నయమై నది ఈకేసులో మశూచికముతో రోగపదార్థమంతయు బయ టకు వెడలిపోవుటచే క్షయరోగము నయమైనది

268 పేజీలో గ్రంధకర్త యిట్లు చెప్పిరి

కుక్కలకు పుట్టిన వ్రణములు నయమగును

మానవమాత్రులలో నిది సాధ్యముకాక పోయినప్ప టికినీ కుక్కలలో తప్పకసాధ్యమగునని లామీలా లాబరేటరీ లోని వైద్యులు ప్రయోగ ఆధారములతో నిర్ధారణ చేసినారు

ఈలాబరేటరీలో తొమ్మిది కుక్కలను వెంటవెంటనే వ్రణము నుండి నయముచేసినారు మొదటలో కొన్ని కుక్క లకు ఈ రసమును ఎక్కించినారు

వాటిలో కొన్నింటికి వ్రణములే పుట్టలేదు కొన్నిటికి పుట్టినవి వ్రణములు పుట్టని కుక్కలను ఆరోగ్యముగలవిగా భావించినారు వ్రణములు పెద్దవైన తరువాతనే వ్రణములు పుట్టిన కుక్కలలోని నెత్తురును తీసివేసి ఆరోగ్యవంతమైన కుక్కలలోని నెత్తురును పైకుక్కలలోనికి చొప్పించినారు

వ్రణములతో బాధపడిన కుక్కలన్నియును కొత్తనెత్తురు చేరుటచే ఆరోగ్యవంతములైనవి దీనివలన రెండువిషయము లను మనము తెలిసికొనవచ్చును

(1) వ్రణములు పుట్టిన కుక్కలలోని నెత్తురునంతనూ బయటకు తీసివేయుటచే నెత్తురుతోపాటు రోగముకూడా పోయినది

ఆరోగ్యవంతమైన కుక్కలలోని నెత్తురును రోగిష్టికుక్కలలోనికి చొప్పించుటచేత వ్రణములు నయమై రోగిష్టికుక్కలునూ ఆరోగ్యవంతములైనవి

(2) మిగిలిన అన్నిరోగముల వలెనే యీ వ్రణములున్నూ దేహములోని మురికివల్లనే వచ్చుచున్నవి దేహములోని రక్తమంతా చెడిపోతేనేగాని ఒక మూలవ్రణము పుట్టదు

వ్రణము పుట్టిన ప్రదేశములోనే చెడిపోయి మిగిలిన దేహమంతా బాగా ఉండదు దేహమంతా వ్యాపించియున్న చెడురక్తమును అంతనూ, శుభ్రపర్చవలయునేగాని కొంత బాగుచేసినందువలన ఉపయోగము ఆవంతయూ లేదు

## ప్రకృతి వైద్యమే మార్గమును చూపినది

వ్రణరోగముతో బాధపడు కుక్కలలోని నెత్తురును తీసివేసి ఆరోగ్యవంతమైన కుక్కలలోని నెత్తురును లోనికి చొప్పించి వ్రణరోగముల నయముచేసిన సందర్భములో హెన్ర్డిక్కు ఇట్లు చెప్పుచున్నారు

"చెడురక్తమును తీసివేసి మంచినెత్తురును చొప్పించి రోగమును నయముచేయుపద్ధతి కుక్కలలో సాధ్యమైనదిగాని, మానవమాత్రులలో కష్టమే ఈపద్ధతితో కుక్కలకు పుట్టిన

వ్రణములు నయమగుట వలన మానవమాత్రులలో సాధ్యము కాకపోయినప్పటికినీ మనమొక విషయమును గ్రహింప వచ్చును వ్రణములు అసాధ్యమైన రోగములు కావనియు, నివారణీయములే అనియు తెలుసుకొనగలము

ప్రకృతి సిద్ధాంతముం ప్రకారము చెడురక్తమును దేహ మునుండి తొలగించి మంచిరక్తమును దేహములోనికి చొప్పించ నవసరము లేదు

చెడురక్తములోని మాలిన్యములు పోవుటతో రక్తము న్నూ పరిశుభ్రమవును మంచిరక్తము దేహమంతటా ప్రవహిం చుటచే ఆరోగ్యము చేకూరును ఇట్లు ప్రత్యక్షముగా కొన్ని కేసులను నయము చేసినాము వ్రణములతో బాధపడిన రోగులు మాఆసుపత్రిలో చికిత్సనుపొంది సుఖముగా ఇంటికి పోయి నారు ఇట్లు రోగమునయమై సుఖముగా యింటికి వెళ్లిన ఒకామె చరిత్రను చెప్పెదను వ్రణరోగము ప్రారంభదశలో ఉండ గనే చాలా తేలికగా కుదురును ముదిరిపోయినపుడు, అంతరవ యవములు నష్టమైపోవును గాన రోగము కష్టసాధ్యము ముదిరి పోయినప్పటికిని కుదిరిన ఒక కేసు చరిత్రను చెప్పెదను

ఆరేండ్లక్రితము మా ఆసుపత్రికి పోలిష్‌జాతి స్త్రీ వచ్చినది ఆమెతంమీాద కుడివైపున పెద్దవ్రణము లేచినది అందమునకు లోపమువచ్చుచున్నదని శస్త్రచికిత్సను చేయించినది పుండు అప్ప టికిమాత్రము మానినది వెంటనే పెద్దపుండుపడినది దీనిని మళ్ళీ శస్త్రచికిత్స చేయించినది నయమైనదికాని వెనుకటిదానికన్న పెద్దది తయారైనది, చర్మముతో మాసిక వేసి నయముచేయ

చూచినారుకాని నయముకాలేదు రెండుపర్యాయములు వెంట వెంటనే శస్త్రచికిత్సను చేసినారు మాంసము కుళ్లకుండ ఉండ గలందుకు వాడవలసిన మందులనన్నిటనీ వాడినారు కుళ్లి పోయిన మాంసమునంతనూ కాల్చి తీసివేసినారు మా చికిత్సా కాలములో నిట్లు కాల్చివేయుటచే చిట్టెము కట్టన (యెముక లోపలనుండి బయటకువచ్చినది) నాల్గుతడవలు ఆపరేషను చేసినతరువాత వ్రణము బాగా పెద్దదైనది రోగము నయము కాదని పెద్దఆసుపత్రివారు పంపివేసినారు అయిదునెలలు మా ఆసుపత్రిలో చికిత్సనుపొందినతరువాత తలమీదివ్రణము నయ మైనది పుండు మానినతరువాత మాంసమునుతిని, కాఫీని త్రాగట ప్రారంభించినది తినిన కొద్దిరోజులకే పుండ్లు చీము కారుట మొదలుపెట్టనవి ప్రకృతివైద్యము చేయుటచే మాని నవి మళ్లీ మాంసమును తినెను, వెనుకటిఫలితమే కలిగెను అప్పటికి బుద్ధివచ్చి యిక మాంసము తినలేదు పుండ్లు కన బడుటలేదు తర్వాతను పెండ్లిచేసుకొన్నది ముగ్గురు పిల్లలు కలిగిరి ఆరోగ్యముగానే ఉన్నారు

నేను ఈ వ్యాసమును 1909 సంవత్సరములో అప్పటి ప్రకృతిపత్రికకు వ్రాసినాను ఆరోజులలోనే లండనునగరనివా సులైన డాక్టర్ రాస్ తనపరిశోధనాఫలితముల తెలియజేసినాడు వ్రణములు ఆగంతుకముగా వచ్చునవికావనియు మాంసము అరగక దేహములో మిగిలిపోయిన మురుగుచేతనే వ్రణములు కలుగుచున్నవనియు తనపరిశోధనాఫలితముల తెలియచేసినాడు

ఒకరోజున డాక్టరు చిత్రమైన విషయమును కనుగొని వారు జీవకణమును యనిలిన్ డైతో కలుపుటచేత శతధా భిన్నమైనది ఏవస్తువుతో కలియుటచే ఈ మాదిరిగా భిన్నమగునని తలచగా జంతుమాంసముతో కలిసినను జీవకణములు శతధా భిన్నమైనవి జీవకణములు శాకసంబంధమైన కణములతో కలిసినపుడు ఇట్లు భిన్నము కాలేదు అట్లాగే నిలబడినవి

మూలముజోలికిపోక పైకి కనపడు వ్రణములను శస్త్రచికిత్సచేసిగాని యక్సరే సహాయముతోగాని, మరి యే యితర మార్గముంతోగాని, నయముచేసిన యెడల ఆవ్రణములే మరియొకచోట ప్రత్యక్షమగును అందువలననే మందువైద్యగ్రంధములన్నియు ఒకతడవ చావక మళ్ళీ మళ్ళీ పుట్టునవి వ్రణములని నిర్వచనము చేసినవి

డాక్టరుగారి పరిశోధనాఫలితముగా క్రొత్త విషయములను తెలిసికొనినాము మాంసము తినుటవలననే వ్రణములు కలుగు చున్నవి

మానవుల జీర్ణయంత్రములు జంతుమాంసమును జీర్ణముచేయుటకు అలవాటుపడి ఉండకపోవుటవలన అరగక మిగిలిపోయిన జంతుమాంసము ప్రేగులలో నిలువఉండి మురుగును ఈమురుగే రక్తప్రవాహములో కలసి దేహమంతటా తిరుగుచుండును

దేహములోని మురికిని హానిచేయకుండా బైటికి నెట్టివేసి దేహమును శుద్ధిచేయుట ప్రకృతిస్వభావము ఈ మురికిని మెతక

ద్వారా బైటికి పంపివేయును ఇదియే వ్రణము అయితే మాంసమును తినువారే వ్రణములతో బాధపడుట లేదు శాకాహారులును వ్రణములతో బాధపడుచునే ఉన్నారు

వ్రణములతో బాధపడువారిలో శాకాహారులు చాలా కొలది మందియే ఉందురు శాకాహారులును వ్రణములతో బాధపడుటకు మరొక కారణము గలదు వంశానుగతముగా వచ్చినగండమాల మొదలగు రోగముల వలన శాకాహారులు వ్రణములతో బాధపడవచ్చు, మాంసకృత్తు ఎక్కువగా ఉన్న శాకముల తినుటవల్లనూ వ్రణములు కలుగును వ్రణరోగమును పూర్తిగా నిర్మూలము చేయవలెనంటే నియమితాహారము తినుటయేగాకమిగిలిన వైద్యప్రక్రియలనన్నిటిని యధావిధిగా చేయవలెను ఈ రెంటిలో నే ఒకటి చేసినను చాలదు నిశ్శేషముగా వ్యాధిప్రవణత పోగొట్టవలెనంటే రెండునూ అవసరమే. మానవదేహములలోను జంతుదేహములలోను ఈ మురుగు కొలదిగనో గొప్పగనో తయారగుచునే ఉండును

బహిష్కార్యావయవములు ఎప్పటికప్పుడు తయారైన మురుగును బైటకు పంపుచుండిన యెడల లోపల నేమియు నిలువదు మురుగు నిలవఉంటేమాత్రం అనేక రోగములకు కారణభూతమగుచున్నది

## రేడియము వైద్యము వలన వ్రణములు నయమగునా ?

రేడియముతో వైద్యముచేయుటవలన అనేకరోగములు కుదురుచున్నవి దినపత్రికలన్నియు రేడియము ప్రతాపమునే

వేనోళ్ళ పొగడుచున్నవి పత్రిక లెకాక, పాశ్చాత్య వైద్యులును ఈ రేడియమ్ గుణగణములను పొగడుచునే ఉన్నారు

షూమ్నగరు అను పాశ్చాత్యవైద్యుడు రేడియము వైద్యమువలన రోగములు అత్యద్భుతముగా కుదురుచున్నవని తెలుపుచున్నాడు రేడియము కిరణములతో వ్రణములను, నలుబదియెనిమిది గంటలలోనే, నయముచేసినట్లు ఘనవైద్యులు చెప్పుచున్నారు

ఇంతమంది యిన్నివిధములుగా రేడియము గుణములను ప్రస్తుతించు చున్నప్పటికిని రేడియము వైద్యమువలన కలుగు నష్టములు చెప్పువారును లేకపో లేదు

వ్రణములు పెరిగి పెద్దవైన తరువాత రేడియము కిరణములతో నయము చేసుకొనుటకన్న పుటుకలోనే శస్త్రచికిత్సతో నయము చేసికొనుట మంచిదని చెప్పువారును గలరు వ్రణములతో బాధపడువారు రేడియం గుణములను ప్రస్తుతించువారి మాటలు విని రేడియము కిరణములతో వ్రణముల కుదుర్చుకొని అప్పటికి, తాత్కాలిక శాంతిని పొందుచున్నారు. రోగముయొక్క మూలము పోకపోవుటవలననూ అలవాట్లు మానకపోవుటవలననూ తిరగబెట్టు స్వభావముండుటవలన వ్రణములు మరల పుట్టినపుడు యమబాధల ననుభవించుచున్నారు

రేడియము వైద్యము కనుగొని యెక్కువకాలము కాకపోవుటవలన, రేడియము వైద్యము యొక్క గుణావగుణముల గూర్చి యిప్పుడు చెప్పుటకు వీలులేదు ఈ వైద్యఫలితములను,

మరికొంతకాలము పరీక్షించినగాని చెప్పలేము సందేహాస్పద ముగానున్న యీ రేడియము వైద్యముతో ప్రాణరోగములను కుదుర్చుకొనుటకన్న, నిస్సందేహముగా ప్రమాద రహితమై, అందరునూ అవలంబింపతగినంత సులువుగల ప్రకృతివైద్యపద్ధతులతో తమవ్యాధులను నయము చేసికొనుట తేలికయగు ఉత్తమపద్ధతిగదా!

పదిసంవత్సరములక్రిందట యక్సురేవైద్యమునుగూర్చి విపరీతమైన ప్రబోధము కలిగినది ప్రపంచములోని అన్నిభాగ ములలోను యక్సురేవైద్యశాలలు బయలుదేరినవి

ప్రతిదినము న్యూసుపత్రికలు యక్సురేవైద్యము నుగూర్చి వింతప్రచారముచేసినవి

కొద్దిరోజులకే ఈ యక్సురేవైద్యపుపస తెలిసిపోయినది యక్సురేవలన వ్రణములు నయముకాకపోవుటయేగాక పుట్టుచున్నవని ధృవపడినది

యక్సురేవైద్యముమాదిరిగనే రేడియము వైద్యమువల నను, నష్టములు ఎక్కువగానున్నవనిచెప్పుటకు నిదర్శనములు పెక్కు కనబడుచున్నవి

మానవదేహములో విద్యుచ్ఛక్తిగలదు ఈవిద్యుచ్ఛక్తి వేగము 3 వోల్టులు

రేడియములోని అణువుల గమనవేగము ఇంతకన్న కొన్నివందలరెట్లు ఎక్కువగుటవలన మానవదేహములో రేడి యమును చొప్పించగానే ఆవేడికి నరములన్నియు కాలి పోవును.

రేడియం అణువులగమనవేగమునకు మానవదేహము లోని కణములన్నియు నశించిపోవును మానవదేహములోని విద్యుచ్ఛక్తి తక్కువవేగముగలదైనప్పటికిని తప్పకుండా ఉప యోగకారి కాగలదు యక్సరేతో నయముచేసికొనినందువలన కలుగు భవిష్యత్ దుష్ఫలితములు కొన్నిసంవత్సరములకుగాని తెలియవు

గత పదియేండ్లనుండి యక్సరేవైద్యమువలన కలిగిన దుష్ఫలితములచూపుటకు ప్రమాణములు గలవు వ్రణము లను యక్సరేతో నయముచేసినప్పటికీ మానక మరల వ్రణ ములు కలిగినవి నిరంతరము యక్సరే కిరణములతో సంప ర్కముఉండుటచేత అడిసన్‌గారి అనుయాయుడు చనిపోయెను

యక్సరేవైద్యముతో వ్రణములు నయమైనవారల నెరుగను గాని బాధలుపడినవారిని చాలమందిని ఎరుగుదును

మా ఆసుపత్రికి వచ్చిన ఒకామె చరిత్రమును చెప్పెదను. దేహములో నెక్కడో కలిగిన బాధకు యక్సరే వైద్యమును చేసినారు

చేసినతర్వాత వ్రణముల మాదిరి కంతులుపుట్టినవి ఇందు వలన రక్త మాంసము లన్నియు, ఉడికిపోయినవి బాధలుపడలేక ఆత్మహత్య చేసుకొనినది

యక్సరే కిరణములకన్న, రేడియంకిరణములు మరీ దారుణమైనవి

రేడియం కిరణములను, మానవదేహములోనికి చొప్పించి నపుడు వ్రణప్రదేశములోని కణములేకాక చుట్టుపక్కలఉన్న కణములన్నియు మాడిపోవును

రేడియం కిరణమువేడికి అవయవములు సహితము మాడిపోవుటయు గలదు ఈ రెండువైద్యములవలన కలుగు దుష్ఫలితములు కొన్నిసంవత్సరములకుగాని తెలియవు

ఇప్పటికైనా రేడియం వైద్యమువలన నష్టముల తెలుపుటకు ప్రమాణములు లేకపోలేదు

న్యూయేజి అను పత్రిక డిశంబరు సంచికలో గొప్ప కిమ్మతుగల వైద్యము అను శీర్షిక క్రింద వెలువడిన యీ క్రింది వ్యాసమును ఎత్తివ్రాయుచున్నాను రేడియమునకు విచిత్రమైన గుణములు గలవు రేడియముతో వ్రణరోగములను ఎక్కువగా కుదిర్చినట్లు డాకర్ ఆబిచెప్పుచున్నాడు

కీళ్ళజబ్బులును, క్షయరోగములును, ఈ రేడియము వైద్యముతో కుదిరినవని చెప్పువారునూ గలరు

## రేడియము వైద్యము వలన కలుగు నష్టములు

రేడియము కిరణములతో శాస్త్ర ప్రయోగముల, జరుపుటచే, డాక్టర్ జాన్ ఎడ్వర్డు తనయెడమచేతిని కోలుపోయినాడు క్లియరన్సుడాలీ అను మరియొక వైద్యుడుకూడా, రేడియము కిరణముల వలననే చనిపోయెను

చికాగోలోని ఫర్గుసు అను వైద్యుడును, రోచష్టరులోని వైగలును ఈ రేడియము కిరణములవలననే చనిపోయిరి

ఒకలక్ష యేబది వేల టన్నులు బొగ్గు చేయగల పనిని, ఒక టన్ను రేడియము చేయగలదు ఇంతేగాక యింకా విచిత్రమైన లక్షణములుగూడా గలవు

ఇంతవరకు చెప్పినదేమంటే ప్రమాదమైనట్టిన్నీ సందేహాస్పదమైనట్టిన్నీ యక్సురే రేడియముల మానవులకు కలుగు రోగములను కుదుర్చుటకు ఉపయోగింపనేరాదు రోగము ప్రారంభదశలోగాని ముదిరినతర్వాతగాని రోగము నయమగుటకు రాజబాటగలదు రాజబాటయనగా శస్త్రచికిత్స యని భ్రమపడరాదు ప్రకృతిసూత్రముల ననుసరించుటయే యీరాజమార్గము వ్రణములు ఆగంతుకముగా వచ్చునవికావు.

కోసివేసినయెడల పోవునవియు కావు దేహముయావత్తు చెడురక్తముతో నిండినగాని, వ్రణములు పుట్టవు రక్తములోని మురుగు (దేహమందలి రోగపదార్థము) మూలకారణమునకే వైద్యముచేస్తేగాని వ్రణరోగప్రవణత మొదటికంటూపోదు.

---

## ౧౮

## కాలిక రోగుల గతి యేమి ?

### ప్రకృతివైద్యమువలన ఆలస్యముగా రోగములు కుదురును

నేడు ఎవరినోట వినవచ్చినను ప్రకృతివైద్యముతో రోగములు ఆలస్యముగా కుదురుతవి ఎందుకింతకాలము వృథాగా వేచిఉండటము అనుచున్నారు వైద్యములోని మాహాత్మ్యమును గొప్పతనమును ఒప్పుకొంటారుగాని కాలవ్యవధిని భరింపలేమంటారు

రోగములు ప్రకృతివైద్యముతో త్వరగా కుదురునదీ ఆలస్యముగా కుదురునదీ యీఅధ్యాయము లో తెలిసికొందాము ఆయుర్వేదము,ఆలోపతీ,యునాని,హోమోపతి సిద్ధసాధ్య మొదలగు వైద్యపద్ధతులతో రోగము నయమగుకాలముకన్నా ప్రకృతివైద్యము తో త్వరలోనే రోగములు కుదురును

త్వరలోనే రోగములు నయమగుతుంటే యీ మాట యెట్లువచ్చినదని మీరడుగవచ్చును అన్ని వైద్యపద్ధతులును రుచిచూచినతరువాతనే రోగులు చివరకు ఈపద్ధతిలోనికి వచ్చుచున్నారు నేడో రేపో చావుకు సిద్ధమైనవారే ప్రకృతి దరికి (ఇక యేవైద్యపుఆశ లేక) (మందులతో శరీరము గుల్లబారి) డాక్టరు (ఫీజులతో మందుఖరీదులతో ధనము లేక) చేరుచున్నారు

ఏమాత్రము గుణ మగుపించినను మందువైద్యములను వదలరు యావజ్జీవితము మందులనుసేవిస్తూ ఉంటారు

ప్రకృతివైద్యము చెయ్యాలిఅంటే మనోనిగ్రహముండాలి తనకు ఇదివరలో అభ్యాసమైన దురలవాట్లన్నియు వదలివేయాలి తనరోగము ప్రకృతివైద్యముతో తప్పకుండా నయమవుతుందను గట్టినమ్మకముండవలెను నమ్మకముండుటయే చాలదు ప్రకృతిసూత్రముల కనుకూలముగా చికిత్సచేయవలెను ఇవన్నీ బాధలని భయపడి నియమనిగ్రహము లేని మందువైద్యపద్ధతులలోనికి పోవుదురు

మందు వైద్యములో నమ్మకమున్నంతవరకు ప్రకృతి వైద్యముజోలికి రారు

తమ దురభ్యాసముల మానుకొనజాలరు వీని అన్నింటి కన్నా చన్నీటినిచూచి పెక్కుమంది గాభరా పడుదురు

నీటివైద్యమువలననే కాలికరోగములన్నియు నయమగును ప్రకృతివైద్య పద్ధతులవలనగాక, మరి యితరవైద్య పద్ధతులవలన రోగములు కుదిర్చినయెడల మన ఆసుపత్రులకు కూడా వేనకువేలు జనము వచ్చెడివారే వ్యాపారము లాభసాటిగానే ఉండేది

ఇంతకూ చన్నీటివలన భయపడవలసినదేమైనా ఉందేమో తెలుసుకొందాము

చన్నీరంటె యింతభయపడవలసిన పనిలేదు రోగుల మనసుల కష్టపెట్టు చికిత్సా పద్ధతులతో రోగులనయము చేయరాదు అట్లుచేయుట ప్రకృతి వైద్యపద్ధతిలోనికి రాదు

రోగిపరిస్థితులను, పరిసర వాతావరణమును మార్చుటయే వైద్యుడు చేయవలసినపని మొదటలో చన్నీటిస్నానమును, వేడినీటి స్నానమును చేయుచు, తరువాత క్రమేపీ చన్నీటి స్నానమును చేయవలెను

చన్నీటి ఉపయోగమును రోగికి నచ్చచెప్పవలయును. చికిత్సా ప్రక్రియల నన్నిటిని రోగి ఖులాసాగా చేయవలెను గాని నిర్బంధముగా చేయరాదు చన్నీటితో సంబంధము కలిగిన కొలదీ గుణము కనుగొనిన కొలదీ చన్నీటిని వదలిపెట్టలేరు ఒప్పించుట చాలాకష్టమైనప్పటికినీ కాలము గడచినకొలదీ పిలవా పెట్టకుండానే తనంతటతానే రోగి పరుగెత్తును చన్నీటి స్నానమనిన ఉత్సాహము మరింత కలుగును

<u>వ్యాపారమునకును, ప్రకృతి వైద్యమునకును, ఎట్టి సంబంధమును లేదు</u>

వ్యాపారము వృద్ధిచేసి డబ్బు సంపాదింపవలెనంటే నీటి వైద్యమును వదలిపెట్టవలసినదే చన్నీరనగానే రోగులు భయపడు చున్నారుగాన ప్రకృతివైద్యమునుండి జలచికిత్సా ప్రక్రియలను తొలగించితే బాగుంటుందని మామిత్రులు చాలామంది సలహా యిచ్చినారు మిగిలిన అన్ని ఆసుపత్రులవలెనే మాఆసుపత్రికిని జనము చాలామంది వస్తారన్నారు

ధనమును చూచుకొని జలచికిత్సా ప్రక్రియలను వదిలివేస్తే మూలసూత్రములనే వదలిపెట్టినవార మగుదుము మూలచ్ఛేదము చేయుటయేగాక ప్రకృతి వైద్యములోని, ముఖ్యభాగమగు జలచికిత్సను కనిపెట్టిన ఫాదర్ నీపుకు అన్యాయముచేసినవార మగుదుము అన్ని రోగములును జలచికిత్సా ప్రక్రియలతోనే నయముకాగలవని ఫాదర్ నీపు నిదర్శన పూర్వకముగా చూపించెను రోగమును కూకటివ్రేళ్లతో రూపుమాపవలెనంటే జలచికిత్సాప్రక్రియలను ప్రయోగింపవలసినదే

కశేరుకా సమీకరణ శాస్త్రజ్ఞులును, అస్థిసమీకరణ శాస్త్రజ్ఞులును, జలచికిత్సా ప్రక్రియలయందు మేము చూపు ఆదరణకు మమ్ము అపహాస్యముచేయుట గలదు మిగిలిన యే ప్రక్రియలతోను రోగనిర్మూలనము కాదని వారందరును యెరిగిన విషయమేను

కాలికరోగములు ఆలస్యముగా కుదురును

ఆరోగులు అంతకాలవ్యవధిని భరించలేరు గాన వెళ్ళి పోవుదురు ఇటువంటి కాలికరోగులచేత్ని ఆసుపత్రియొక్క ప్రతిష్ఠను పాడుచేయవద్దని మాకు సలహానిత్తురు

కొన్ని (అలోపతి) ఆసుపత్రులలో రోగులను రెండునెలల కన్న ఎక్కువకాలముంచరు

పైనచెప్పిన సలహాలు కొంతవరకు అనుసరణీయములే గాని, సర్వేసర్వత్రా ఉపయోగించ వీలులేదు

కాలికరోగములు రెండునెలలకు పూర్తిగా నయముకావు. పూర్తిగా నివారణ అవుటకు ఎక్కువకాలము పట్టును ఈ మధ్యలో వచ్చునవన్నియు స్వాస్థ్యసంకటములే ఇవికూడా రోగ పదార్థము బయటకు పోవుటకు సహాయపడును లా, ఇఫ్ క్రైసిస్ ఉన్నదను విషయము వైద్యునకు తెలియకపోతే రోగము నయమైనగనియే ప్రతిపర్యాయము వైద్యుడు చెప్పుచుండును రోగియు నమ్ముచుండును

రోగలక్షణములు కనపడగనే రోగము నయమయుకాలేదని మరొక వైద్య శాస్త్రములంతురు ఆ వైద్యునియందుగాని వైద్య పద్ధతియందుగాని పూర్తిగా నమ్మకము లేకపోవుటచే రోగము పూర్తిగా నయముకాకమునుపే ఆ వైద్యమును వదలిపెట్టును అస్థిసమీకరణమువలనగాని కశేరుకాసమీకరణమువలనగాని అన్ని రోగములును కుదరవు కొన్ని రోగములుమాత్రమే కుదురును

దేహమునకు శ్రమలేకుండా ఉండవలెనంటే అస్థిసమీ కరణముగాని కశేరుకా సమీకరణముగాని చేయవలసినదే వీటి వలన తాత్కాలిక ఉపశాంతులుమాత్రమే కలుగును రోగ

మును మొదటికంటూ పెల్లగించవలె ననినయెడల నియమ నిగ్రహ ములతోకూడిన ప్రకృతివైద్యములోని అన్నిచికిత్సాభాగ ములను చేయవలసినదే ఒకప్రక్రియ ఉపయోగించకపోయిన యెడల మరొకప్రక్రియఅయినా తప్పకుండా ఉపయోగించుము రోగం నిర్మూలమవును మరి యేరూపములోను తిరిగి తల యెత్తదు

## రోగమునకు మూలకారణమును తొలగించవలయును

రోగముయొక్క బాహ్యచిహ్నములను మందులతో అణచిపెట్టినంతమాత్రాన రోగము నిర్మూలముకాదు రోగ లక్షణములలో ఒకటి కనబడనంతమాత్రాన సమూలముగా రోగముపోయినదని తలంచరాదు

రోగముఉన్నదీ పోయినదీ కనీనికనుబట్టి చెప్పవచ్చును కనీనికానిదానము నిత్యమునూ అభ్యసింపవలసినదేగాని గారడీగా వచ్చేదికాదు ఫలానా అవయవములోని లోపమువలన రోగమువచ్చినదని కనీనికను చూచిచెప్పగలము దేహమునకు హానికలిగించు రోగపదార్థమును జ్వరరూపముతో ప్రకృతి బయటకునెట్టివేయునని లోగడనే చదువుకొన్నాము

నిరంతరము జరుగు అపచారమువలన రోగపదార్థము పేరుకొని పోవుటచే ఈ రోగపదార్థపు మురుగును ప్రకృతి (బహిష్కార్యావయవముల) ద్వారా బయటకు నెట్టివేయలేక చచ్చుపడిపోవును

మురుగును (బహిష్కార్యావయవములు) పూర్తిగా బయటకు నెట్టివేయలేక పోయినను ప్రయత్నము మాత్రము

(స్వల్పముగా) చేయుచుండును సంవత్సరములుగ డచినకొలదీ రోగము కాలికమగున దందుము వంశానుగతముగావచ్చు రోగ ప్రవణత యెక్కువగుటచేతను, ఆరోగపదార్థపు మురుగును ప్రకృతి బైటకునెట్టివేయలేక పోవుటచేతను రోగము కాలికముగా మారవచ్చును

ఆహారములోని లోపమువలనగాని, సేవించిన మందుల వలనగాని, పేరుకొనిన రోగపదార్థమును బైటకునెట్టివేయలేక పోయినపుడును రోగము కాలికమగును దేహమునకు హానికలిగించు శస్త్రచికిత్సల చేయించుకొన్నందువలన కలిగినఫలితముల నెట్టివేయలేక పోవుటచేతనూ రోగము కాలికమగును

వంశానుగతముగా వచ్చునట్టి రోగప్రవణతలను స్వార్జితమైనట్టి రోగపదార్థపు మురుగును పూరిగా బయటకు పోయినపుడే రోగము నాంతముగా నయమై ఆరోగ్యముగలుగునని భావించవలయును అంతకులోపుగా రోగము పోయినదని తలచుట శుద్ధ వెర్రితనము

ఆహారవిహారములలో మార్పులు వచ్చుటచేతనూ, ప్రకృతివైద్య ప్రక్రియలు జరుపుట చేతను రోగలక్షణములు కనబడక పోవచ్చు వంశానుగతముగావచ్చు రోగప్రవణతలను, నిర్మూలము చేయవలెనంటే ఇంకా యెకువకాలము పట్టగలదు కనీనికలో రోగము కనబడుచున్నప్పటికినీ రోగిమాత్రము తాను ఆరోగ్యవంతుడననే భావించును

రోగము పూర్తిగా నిర్మూలము కావలెనంటే స్వాస్థ్య సంకటములు వచ్చి పోవలెను

చికిత్సాకాలములో నివన్నియు వచ్చిపోవును ప్రతి స్వాస్థ్య సంకటముతోను రోగపదార్థము లోని కొంతభాగమే బయటకుపోవును స్వాస్థ్యసంకటము రాగానే గాభరా పడరాదు

అంతవరకు చేయుచున్న ప్రక్రియలనే అప్పుడుకూడా చేయవలెను

స్వాస్థ్య సంకటములు కలుగగనే ప్రకృతివైద్యము తనకు పనికిరాదనియు రోగము తిరగబెట్టిన దనియు గాభరా పడరాదు

దేహమునకు తట్టుకోగల సామర్థ్యమున్నపుడే ప్రకృతి రోగపదార్థపు మురికిని స్వాస్థ్యసంకటముద్వారాబయటకుపంపును

కొంతమంది రోగులు అంటారుగదా! రోగపదార్థము నంతనూఒక్కసారిగా బయటకు పంపితే రోగము పెందలకడనే నయమై సుఖముగా నింటికి పోవచ్చునుగదా! ఎందుకింత ఆలస్యమంటారు దీనికి మాసమా ధాన వేమంటే త్వరలో నయం చేయాలని ఒక్కుమ్మడిగా రోగపధార్థము నంతనూ బయటకు పంపితే యీ ఒత్తిడికి దేహము తట్టుకోలేదు

అందువలన దేహమునకు అపాయమువస్తుంది తీరని అపకారము జరుగుతుంది కొంతకాలవ్యవధితోగాని రోగపదార్థము బయటపడను

కాలవ్యవధిని తగ్గించి పెందలకడనే పూర్తి చేయాలి అను కొనుటకూడా ప్రకృతివైద్యములోని మందువైద్యసిద్ధాంతమేను ఈ భావమును మనస్సులోపెట్టుకునే ప్రకృతివైద్యులుగాని, రోగులుగాని చికిత్సాక్రమమును ప్రారంభించరాదు

రోగము నిర్మూలమైనతరువాత మనకు అనుకూలమైన మార్గమున పోవచ్చును చికిత్సాక్రమము నంతనూ తూ-చా తప్పకుండా ఆచరింపవలయును

## మందువైద్యులు రోగముకుదరదని చెప్పినంతమాత్రమున కాలి రోగులగతి అంతేనా? వారిని వదలవలసినదేనా?

మొండిరోగములతో పీడింపబడువారిని మాఆసుపత్రిలో చేర్చుకొనుటచే మా సహోధ్యాయులు మామీద కినుక వహిస్తున్నారు ఆసుపత్రి పరువుప్రతిష్ఠలను పాడుచేసున్నామని తీవ్రముగా విమర్శిసున్నారు శల్యావశిష్టులయిన కాలికరోగులను మేము ఆసుపత్రిలో చేర్చుకొనుమాట మాత్రము నిజమే మా ఆసుపత్రి ఉన్నతస్థితిలోనికి వచ్చుటకు మాకు సంతోషకరమే మందువైద్యము వారు నయముకాదని వదలివేసిన రోగులను మనముకూడా వదలివేస్తే రోగులేమీ మిగలరు నూటికి తొంబదిమంది బైటికి పోవలసినదే మిగిలిన వారికే మనము వైద్యముచెయ్యాలి మన ఆసుపత్రికి రోగులు రారని మాత్రము ఈ కాలికరోగులను చేర్చుకొనుటలేదు

ఎటువంటి మొండిరోగములతో బాధపడు రోగులచేర్చుకొన్నప్పటికీ, నయము కాకపోయినవారు ఒక్కరునూ లేరు నెలలు, సంవత్సరములకొద్దీ ఔషధముల సేవించినప్పటికినీ, నయముకాని మొండిరోగములతో బాధపడువారు అన్నిఆశలు వదలుకొని మా ఆసుపత్రికి చేరిన రోగులునూ, రోగములు నయమయి ఇంటికి సలక్షణముగా వెడలినారు

మొండిరోగములజోలికి పోవుట నిజముగా సాహసమే తరుణరోగములనే నయముచేసిన నింతకన్నా పేరు ప్రఖ్యాతులు వచ్చుమాట నిజమే

ప్రకృతి వైద్యము, తరుణరోగములను అత్యద్భుతముగా కుదుర్చుననుమాట నిజమేను మొండిరోగములు నయము చేయుటలోనే మన ధైర్యసాహసములు, వైద్యముయొక్క గొప్పతనము కనపడును

మందు వైద్యములో కాలికరోగములకు కుదరని రోగములూ అని అర్థము ఈ రెండుశబ్దములు సమాన అర్థకములే పర్యాయ పదములు

రోగలక్షణములను మాత్రమే కుదర్చవలయునని మందు వైద్యము వారి అభిప్రాయము ఆలక్షణములైననూ మందులతో అణచివేయుట వలన లోపలనే రోగము నిలవఉండి కాలికరూపముతో బయట బయటపడుచున్నవి దేహమునకు హాని కలిగించు రోగపదార్థము నంతనూ రోగ రూపములతో ప్రకృతి బయలుకు పంపివేయును రోగములన్నియు దేహమును శుద్ధిచేయుటకు ప్రకృతి చేయు ప్రయత్నములేను

ఎప్పుడైతే రోగము తరుణరూపమును వదలుకొని కాలికముగా మారునో ఆనాడే రోగము కుదరదని గ్రహింపవలయును రోగము కుదరదని వైద్యుడు గ్రహింపగనే వృత్తినిగాని, వాతావరణమునుగాని, మార్చమని రోగులకు సలహా చెప్ప వలయును అని మందు వైద్యగ్రంథములన్నీ చెప్పు విషయము లే.

దేహమును శుద్ధిచేయుటకు వచ్చు రోగము లన్నిటినీ మందులతో నణచివేయుటవలన రోగపదార్థము లోపలనే మిగిలి కాలికరూపమును పొందుతున్నదంటే ఆశ్చర్యపడనవసరము లేదు మందు వేయకుండా ఊరుకుంటేయింత గ్రంథము జరగనే జరగదు

## మొండిరోగములు ఎట్లా నయమగుచున్నవి?

ఎటువంటి మొండిరోగమైనా యెట్లానయమగుచున్నదని ఆశ్చర్యము కలుగవచ్చును రోగములయొక్క పుట్టుపూర్వోత్తరముల (మూలకారణముల) గూర్చి, మందువైద్యమువారి అభిప్రాయములకు ప్రకృతివైద్యమువారి అభిప్రాయములకు సంబంధము లేదు ఎట్టి అనుకూలము లేదు మన వైద్యపద్ధతులలోని గొప్పతనమువలననే యీ మొండరోగములు కుదురుచున్నవి

కర్కటవ్రణము,క్షయ,మూర్ఛలు,పక్షవాతము మూత్ర వ్యాధులు, పిచ్చి, వంధ్యాత్వము, కుష్ఠు, మధుమేహము మొదలగు రోగములన్నియు ప్రకృతివైద్యమువలన కుదరగలవని అంటే మందువైద్యులు అపహాస్యముచేస్తారు నిజానిజములు తెలిసికొనుటకైనా వారు ఓపికపట్టరు ప్రకృతి సిద్ధాంతముల పఠింపరు మందువైద్యులందరును పైరోగములు నయముకావనియే వదలిపెట్టిరి జన్మావధీ యీరోగములతో బాధపడవలెననియే నిశ్చయించారు

ఆ రోగములు ప్రకృతివైద్యచికిత్సాప్రక్రియలతో నయమవుట ప్రత్యక్షముగా చూచుచుండియు, మందువైద్యులుగాని, రోగులుగాని ప్రకృతివైద్యచికిత్సాప్రక్రియలను ఎందుకు అవ

లంబించుట లేదో అర్థముకాదు ఇంతకన్నా గత్యంతరము లేక పోవుటచేతనైననూ, యీపద్ధతులను అవలంబించ వలసినదే రోగము నయమై పరాశ్రియము లేకుండాపోవలెగాని నెలలుకొద్దీ చేస్తేనేమి, ంవత్సరములకొలదీ చికిత్సను పొందితే నేమి, జీవిత మంతా బాధపడుటకన్నా ఒకటిరెండు సంవత్సరములలో వెలిపోవుట మంచిదికదా!

మొండిరోగములు నయమగుటవలన మాయుత్సాహము వృద్ధి అగుచున్నది గాని యేమియు తగ్గుటలేదు ఎన్నోసంవత్స రములనుండీ బాధపడుతూ ప్రకృతివైద్య చికిత్సాప్రక్రియలతో నయముచేసుకొన్న ముగ్గురికథను చెప్పెదను

ఒకటి—ఎం రోకాలమునుండి కర్కటకవ్రణముతో బాధ పడుచూ ఒకడు ప్రకృతివైద్యచికిత్సాపద్ధతులను అవలంబించు టతో రోగవిముక్తుడైనాడు

రెండు—సుఖసంకటూలతో బాధపడు మరొకరోగియు ప్రకృతివైద్యప్రక్రియల నవలంబించి రోగవిముక్తుడయినాడు

మూడు—మరొకనికి క్రిమికను తొలగించారు గర్భాండ ములుకూడా తీసివేసినారు మా ఆసుపత్రికి వచ్చుటకుముందు మరొకఆపరేషనుకు సిద్ధముచేసినారు వైముగ్గురును ఇచ్చట ఉండలేక ఒకటిరెండుతడవలు ఆసుపత్రిని వదలివెళ్లినారు

వేరే గత్యంతరములేక మళ్లీతిరిగివచ్చారు రోగములు నయమై కులాసాగా యింటికిచేరినారు

కొన్నిరోగములు త్వరగాకుదిరి మరికొన్ని రోగములు ఆలస్యముగాకుదురుటవలన కాలికరోగులు తమరోగములు త్వరగాకుదరవని ఆలస్యముగుతవని భయపడుచున్నారు

పైఅనుమానములన్నియును, భ్రమజనితము లేగాని నిజములుగావు ప్రకృతివైద్యచికిత్సాపద్ధతులను అనుసరిస్తే అన్నిరోగములునూ కుదురును కుదరనిరోగము యొక్కటియూ లేదు రోగము ముదిరిపోతే నేవైద్యముపట్టను పట్టినట్లు కనబడను మనకుదృష్టాంతములు కనబడకపోవుట వైద్యపద్ధతులలోని లోపమెన్నటికినీకాదు రోగనిర్ణయమెట్లు చేసేది, వైద్యముఉపయోగించినది యెట్లుతెలుసుకొనేది, కాలికరోగము నెట్లునయము చేసేదీ ముందుఅధ్యాయములో తెలుసుకొందాము

---

౧౯

# రోగనిర్ణయము - నివారణము.

రోగమును నిరూపించుటలోను, నివారణముచేయుటలోనూ మందువైద్యమువారి పద్ధతులకును, ప్రకృతివైద్యమువారి పద్ధతులకును, ఎట్టి సంబంధము లేదు వేటికవి వేరేను.

రోగమును నిరూపించుటకును, చికిత్సించుటకును, ఎట్టి సంబంధమును లేదు రెండునూ వేరువేరు ఘట్టములు. మందు వైద్యమువారు రోగమును నిర్ణయించుటే ప్రధానముగా భావింతురు రోగనివారణచేయుటను వారంత ప్రధానముగా భావింపరు అందువలననే రోగము వచ్చుటకు కారణము లేవియో యని వారు తీవ్రముగా విచారింతురు

ఎముకలలోని లోపము వలన రోగమువచ్చినదో, కండరముల లోని సంకుచితత్వమువలన రోగము వచ్చినదో, అవయవ ములలోని బలహీనతవలన రోగము వచ్చినదో, మానసిక దౌర్బల్యమువలన రోగమువచ్చినదో యని తీవ్రముగా విచార పరీక్షలు చేతురు వీరి విజ్ఞానము ముఖ్యముగా శరీరమును కోతకోయుటకే ఉపయోగించును గాని మరెందుకును కాదు తాము చెప్పిన హాంశముల నన్నిటిని శవమును కోసినతర్వాతనే సరిచూచుకొనవలయును ఇవన్నియు మనిషి బ్రతికియుండగా నిర్ధారణ చేయుటకు సాధ్యముకాదుగాన చచ్చినతరువాతనే ఉపయోగపడుచున్నవి

మందువైద్యశాస్త్రమునకు సంబంధించిన వైద్యశాలలు వియన్నాలో, నెక్కువగా కలవు ఈవైద్యశాలలవలన వైద్యుల విజ్ఞానము వృద్ధియగుచున్నదేగాని, రోగులకు ఏవిధమైన ఉప యోగము కలుగుటలేదని వియన్నాలోని ఆయా విద్యాలయ ములలోని ప్రధాన ఆచార్యులే ఒప్పుకొనుచున్నారు

ప్రకృతివైద్యమువారికి రోగనిరూపణ అంత ప్రధాన విషయముకాదు నివారణయే ముఖ్యము అన్ని రోగములును ఒకే కారణమువలన వచ్చుచున్నవని వీరి నిశ్చితాభిప్రాయము ఒకే కారణమువలన అన్నిరోగములు వచ్చుచున్నవిగాన ఒకే చికిత్సతోనే అన్నిరోగములు కుదురుచున్నవి రోగము వచ్చుటకు వెనుక చెప్పిన మూడు ప్రధాన కారణములు కనబడుచున్నవి ఈ మూడులోపములను సవరించుట వలననే, అన్నిరోగములును నివారణ అవుచున్నవి పరీక్ష చేయించుకొనుటకు సిగ్గుపడు

రోగులను పరీక్షతో పని లేకయే మూడు లోపములను సవరిం
చుటచే నెట్టిరోగములైననూ నయమగుచున్నవి

నిరూపణకన్న నివారణకే యెక్కువ ప్రాధాన్య మిచ్చు
చున్నపుడు మా వైద్యమిత్రులు పరిహసించుచుందురు ప్రకృతి
వైద్యము శాస్త్రసమ్మతముకాదనియు, ప్రయోగ ఆధారము
లేదనియు గర్హింతురు ఇది వారి పొరపాటు ఎందుకంటే
అన్నిరోగములను ఒకేమూలకారణమునుండి పుట్టుచున్నవని
వారు తెలుసుకొనలేకపోయినారు రోగము మరీ ముదిరిపోయి
యెముకలలోనికి మూలుగు సహితము హరించిపోయినపుడే, యే
వైద్యము వలననున్నా ఏమిన్నీ ఉపయోగముండదు ధాతుశక్తి
కోలుకోనేనంతగా తగ్గినపుడే యేవైద్యమున్నా యేమీ చేయ
లేదు దేహములోని అంతరవయవములు బాగుచేయుటకు వీలు
గానంతగా చెడిపోయినపుడే ప్రకృతి యేమియు సహాయము
చేయలేదు అంతరవయవములలో కాయలు కంతులు గ్రంథులు
పెరిగిపోయి రక్త ప్రసరణమునకు, అభ్యంతరము కలిగినపుడు
ప్రకృతి యేమిన్నీ సహాయం చేయలేదు

రోగనివారణ చేయుటంత ప్రధానము కాక పోయినప్ప
టికిని నిర్ణయము చేయుటయును కొలది అవసరమే రోగనిర్ణ
యము చేయుటవలన రోగ పదార్థమువలన అంతరవయవములు
ఎంతవరకు చెడినదో షుమారుగా చెప్పవచ్చును రోగనిర్ణ
యము వైద్యునికన్నా రోగికి బాగా ఉపయోగపడును చికిత్స

ప్రారంభించుటకు పూర్వము, తరువాతనూ అంతరవయవముల స్థితి యెట్లున్నదో తెలుసుకొని రోగి చికిత్సకు అభిముఖుడుగా నుండును అందువలన రోగము త్వరగా కుదురును

## ప్రకృతివైద్యమువారి రోగనిర్ణయ పద్ధతి

ప్రకృతివైద్యముయొక్క మూలసూత్రములకు వ్యతిరేకము కానంతవఱకు అన్ని వైద్యములలోని గొప్పతనమును అన్నిశాస్త్రములలోని గొప్పతనమును అన్ని మతములలోని గొప్పతనమును స్వీకరించుటయే ప్రకృతివైద్యతత్త్వము పాత మందువైద్యపద్ధతులవలనను నవీనవైద్యపద్ధతులవలనను, రోగముల నిర్ణయింపవచ్చును రక్తమును, మూత్రమును, పురీషమును, కళ్లెను, పరీక్షచేసి రోగములు చెప్పవచ్చును రోగి వయసుకు మించిన పొడుగుగాని, బరువుగాని ఉండరాదు. పొడుగులోగాని, బరువులోగాని తక్కువఉండుటయు రోగమేను ఏలోపమువలన నేరోగము వచ్చినదియు సులభముగా చెప్పగలము అన్ని ఆధునిక పద్ధతులవలనను రోగముల నిర్ణయించుట వలన నేలోపమువలన నేరోగమువచ్చినదీ, సామాన్య జ్ఞానము గలవానికైననూ తెలియును బుద్ధిమంతులకు సూక్ష్మాంశము లనూ తెలియును లోపముల సవరించుకొనుటవలన రోగములు నయమగునని రోగికితెలిసిన యెడల చికిత్సకు హృదయపూర్వకముగా సహాయపడును అందువలన రోగము త్వరగా నయమగును ప్రకృతివైద్యమువారు, మందువైద్యమువారి ప్రాతక్రొత్త పద్ధతులతో రోగమును నిర్ణయించినప్పటికినీ, రోగనిర్వాచనమూ

మాత్రము వేరుగా నుండును మందువైద్యమువారి రోగనిర్ణయ పద్ధతు లేగదా అని రోగనిర్వచనమును వారికి అనుకూలముగానే ఉండునని తలచుటకు వీలు లేదు

ఇంతవఱకును మందువైద్యమువారి పాత క్రొత్త పద్ధతులనుగూర్చి తెలుసుకొన్నాము ఇకను ప్రకృతి వైద్యము వారి రోగనిర్ణయ విధానమునుగూర్చి తెలుసుకొందాము రోగనిర్ణయమునునిదానమం'దురు ఇంతవఱకూ వెలువడినశాస్త్ర మునుబట్టి మూడువిధములగు నిదానములు గలవు

(1) ముఖవైఖరీవిద్య —ముఖమును అర్థాత్, తలనుబట్టి రోగపదార్థమున్నస్థానమును అనగా రోగమును చెప్పుట

(2) కశేరుకా నిదానము —వెన్నుపామును చూచి రోగ ములను చెప్పుట ఈభాగమును చెప్పుగ్రంథములు ఆంగ్లమున పెక్కుగలవు ఆంధ్రమున ఒకటియూ లేదు

(3) కనీనికా నిదానము,— నల్లగ్రుడ్డులోని కనీనికను చూచి రోగమును చెప్పుట వివరములు కావలసినవారు కనీ నికా నిదానము అను గ్రంథమును చదువ వలయును మానవ దేహములోని లోపములన్నియు కనీనికలో కనపడును నిదాన భాగము లన్నిటిలోను ఈవిధానము చాలా ఉత్కృష్టమైనది ప్రతి సూక్ష్మతరతమ భేదములను చెప్పవచ్చును మందులవలన జరుగు అపకారములు అన్నియూ, తూచా తప్పకుండా చెప్ప గలము ఈభాగము వైద్యునకేగాక సామాన్య లోకజ్ఞానము గల ప్రతివానికిని ఉపయోగపడును

ఒక పద్ధతి వలననే రోగమును నిర్ణయించుట కష్టము రెండుమూడు పద్ధతులతో ధృవపడనిది రోగమును నిర్ధారణ చేయరాదు పైనచెప్పిన మూడువిధములగు నిదాన శాస్త్రము లందు ఆరితేరినవారు రోగిని వేరువేరుగా పరీక్షించినప్పటికినీ వారి నిర్ణయములు మాత్రము ఒకటిగానే ఉండును మూత్రమును, రక్తమును, కళ్ళెను పరీక్షచేసి, లాబరేటరీలో చెప్పు ఫలితములతో పైవారు చెప్పిన నిర్ణయములు సరిపోవలెను నాలుగు అయిదు పద్ధతులతో రోగమును నిర్ణయించుటవలన యెన్నడునూ పొరపాటు ఉండదు దాదాపుగా అన్ని కేసులలోనూ సరిపోవును

---

## ౨౦

# కాలిక రోగముల నివారణ చేయు మార్గములు

ఆగంతుకముగాను, తీవ్రముగాను ఉండి కొద్దికాలము మాత్రమే నిలవఉండునవి తరుణరోగములని మందువైద్యులు నిర్వచించినారు వారి అభిప్రాయము ప్రకారము దీర్ఘకాలము ఉండునవి యెప్పటికప్పుడు అరగ పెట్టునవి కాలిక రోగములు ప్రకృతివైద్యమువారి నిర్వచనము యింకా విపులముగా ఉండును

వంశానుగతముగా వచ్చు రోగప్రవణతలను జగన్మాత మాగు ప్రకృతి తరుణరోగములద్వారా బయటకు నెట్టివేయును

ఈ రోగ ప్రవణతలును స్వార్జితముగా సంపాదించుకొన్న రోగపదార్థమునకు తోడై పెరిగిపోయినపుడు తరుణ రోగముల ద్వారా బయటకుపోదు బయటకు పోకపోవుటచే లోపలనే పేరుకొని పోవును మిగిలిన అవయవముల సహితము పాడు చేయును కాలికరోగములలో దాదాపుగా దేహమంతయు రోగపదార్థాక్రాంతమయి యుండును

రోగనిర్ణయములో మందువైద్యులకును ప్రకృతి వైద్యులకును తేడాగలదు వంశానుగతముగా వచ్చు రోగ ప్రవణత వలన గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి, యేనుగగజ్జి మొదలగు చర్మరోగములను మందువైద్యులు కాలికరోగములుగ నిర్ణయింతురు ప్రకృతివైద్యము ప్రకారము ఇవన్నియు పితృయమైనట్టియు, వంశానుగతముగా వచ్చునట్టియు, రోగపదార్థపు బహిర్గతరూపములు ఇవన్నియు తరుణరూపము లేను

బయటకువచ్చు రోగపదార్థమును యెన్నడును అణచి వేయరాదు రోగపదార్థము బయటకు పోవుటచేత లోపల యేమియుమురుగు నిలవదుగాన చర్మవ్యాధులురావు వచ్చిననూ రోగపదార్థము అంతరించగనే వాటంతటవియే పోవును మూలవ్యాధినిగూర్చి ప్రకృతివైద్యమువారి అభిప్రాయమును మందువైద్యమువారి అభిప్రాయమును తెలుసుకొందాము మూలవ్యాధి రోగచిహ్నములను కాలికరోగములనియే మందు వైద్యుల అభిప్రాయము ప్రకృతివైద్యమువారంటారు రక్త ప్రసరణము బాగుగా లేకపోవుట చేతనూ, అజీర్ణముండుట చేతనూ, మూత్రపిండములు సరిగా పనిచేయక పోవుటచేతనూ,

ఊపిరితిత్తులు చర్మము సరిగా పనిచేయక పోవుటచేతనూ యీ కాలికరోగములు వచ్చుచున్నవి ఈదుర్గుణములను తొలగించి దేహమును శుద్ధిచేయనిదే కాలికరోగములు పోవు తాత్కాలికముగా ఉపశాంతి కలిగిననూ మూలముమాత్రము నిలిచియే ఉండును లోపలి దుర్గుణములవలనబయటకు పొడుచుకొనివచ్చిన కాయలను కత్తెరలతో కోసివేయుట వలన గాని, 2 లోపలనే నిర్బంధించుట గాని ప్రమాదకరము లేను

పై ఒకటిరెండు మార్గములు బయటకు పోవుమురుగును లోపలనే నిలవ ఉంచుటకు సహాయపడును మూలవ్యాధిని అణచి పెట్టుటవలన పక్షవాతమూ, పిచ్చి, క్షయ, కర్కాట వ్రణము, మొదలగు దుర్భరవ్యాధులు వచ్చినట్లు అనేక కేసులలో నిర్ధారణ చేసినాము

రోగపదార్థము రక్తమాంసాది ధాతువులలో చేరి ఆచెడురక్తమే దేహామంతటా వ్యాపించినపుడే గాని కాలిక రోగములు రావు మంటలు పోట్లు కలుగును అపుడే రోగమును కాలికమైనదందుము అతిసారము, రక్తాభిష్యందము, చర్మ వ్యాధులు పుండ్లు మొదలగునవన్నియు, యీ కాలికరోగముల ఫలితము లే

ప్రకృతి సూత్రముల కనుగుణముగా తరుణ రోగముల నివారణ చేసినట్లయితే రోగపదార్థమంతా పోయి దేహము శుద్ధి అగును

విష ఔషధములతోను, జ్వరనివారిణులతోను, కఫనివారిణులతోను, తరుణ రోగములను అణచి పెట్టితే రోగమంతా

లోపలనే నిలవ ఉండిపోయి కాలికరోగమునకు పునాది అగు చున్నది శస్త్రచికిత్స చేసినను యీ ఫలితములే కలుగును

నవనాగరికుల బాధించు రోగములన్ని యిట్లావచ్చినవేను

ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో ఉండే నీగ్రోలలో కాలిక రోగములు లేకపోవుటచేత ఆదిమనివాసులలో యీరోగములు మచ్చుకైనా లేవని చెప్పాలి

ధృవప్రాంతములలో ఉండు యస్కిమోలు యీ దీర్ఘ రోగములతో బాధపడుటలేదు ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించువారిలో ఉపదంశము, సవాయి, మొదలగు సుఖరోగములుగాని కర్కటవ్రణము, క్షయ, పక్షవాతము, మొదలగు దీర్ఘరోగములుగాని లేనేలేవు వీరిలో యీరోగములు లేకపోవుటకు కారణమేమన ప్రకృతిచేయు యత్నములను మందులతోను శస్త్రచికిత్సలతోను అణచివేయుట యీ ఆదిమనివాసులు నేర్చుకొనలేదు ఈ ప్రయత్నములను మందులతో అణచి పెట్టుట యిప్పటి నవనాగరికులు నేర్చుకొన్నారు గనుకనే యీదరిద్రవ్యాధులతో యెక్కువ బాధపడుచున్నారు

## కణము

కాలికరోగములో దేహములోని వివిధ అవయవముల యొక్కయు, కణములయొక్కయు పరిస్థితిని తెలుసుకొందాము కోటానకోట్ల జీవకణముల సమూహామే మానవదేహమని మనమిదివరకే చదివినాము జీవకణము చాలా సూక్ష్మముగా నుండును. ఈ జీవకణములను, మానవనేత్రముతో చూడ

లేము సూక్ష్మదర్శనీ యంత్రముతో అనేక వేల రెట్లు పెరిగి నపుడే చూడగలము మానవదేహ మెట్లు ప్రాణవాయువును స్వీకరించి, ఆహారమును జీర్ణము చేసుకొని, మలినపదార్థముల బయటకు వెడలగొట్టునో అట్లాగే కణమును ప్రాణవాయువును స్వీకరించును ఆహారపదార్థముల జీర్ణింపచేసికొనును మలిన పదార్థముల బయటకు పంపివేయును ప్రతికణము, యేదో ఒక పనిని చేయుచునే ఉండును గాని, ఖాళీగా ఉండునది ఒకటియు లేదు కొన్ని కణములు, జీర్ణక్రియను జరుపును మరికొన్ని రక్తమును ప్రవహింపజేయును ఇంకా కొన్ని బహిష్కరణ క్రియను జరుపును ప్రతికణమునకును అవసరమగు ఆహారము చేరి, లోన మురుగు నిలవఉండనియెడల బాగుగా ఆరోగ్యము ఉండును అవసరమగు ప్రాణవాయువు చేరకపోయి నను కణము సరిగా పనిచేయలేదు శక్తి లోపించును కణముల శక్తిలోపించుటచేత కణములసమూహామే మానవుడగుటచేత మానవుడును శక్తిహీనుడగును మానవుడు సంపూర్ణ ఆరోగ్యవంతుడుగా ఉండవలెనంటే, కణములన్నీ ఆరోగ్యవంతముగా నుండవలెను అవయవములన్నీ బాగా పని చేస్తూఉంటేనేగాని మానవదేహము ఆరోగ్యముగా ఉండదు

దేశములోని ప్రజలు అన్నవస్త్రములకు లోపము లేకుండా ఉన్నట్లయితే దేశము సుభిక్షముగా నుండును దేశములోని సంఘములు ఒకటితో మరొకటి పోట్లాడుచుండిన యెడల దేశమంతా అల్లకల్లోలముగా నుండును ప్రభుత్వములు ధనమును సంపాదించుటే ప్రధానముగా భావించక

తమ ప్రజలకు అన్నవస్త్రములు లోపము లేకుండా అన్నివసతులు కల్పించినయెడల తగాదాలు ఉండవు అందరికి సమానముగా పరిశ్రమను విభాగించి, విశ్రాంతిని నిచ్చినయెడల పోట్లాట లేవియు ఉండవు

మందువైద్యమువారి నివారణ మార్గములకును ప్రకృతి వైద్యము వారి నివారణ మార్గము కును తేడా యిచ్చుటచేగలదు మందువైద్యమువారు రోగలక్షణములనే ప్రధానము గభావించి వాటిని అణచివేయుటకే, తమ శక్తి నంతనూ ఉపయోగింతురు రోగమూలముతో వీరికెట్టి సంబంధమును లేదు దానిజోలికే పోరు ప్రకృతి వైద్యమువారిన్ననో రోగులను ఆరోగ్యసూత్రములను అవలంబింప జేతురు రోగి పరిసరములు నన్నిటిని మార్చివేతురు ఆరోగ్యసూత్రముల విధిగా అవలంబింపజేయుట చేత లోపలమురుగు పేరుకొనదు మురుగుపేరుకొనక పోవుటచేత రోగమురాదు నిలవఉండుటకు సావకాశములేదుగాన రోగమూ మాయమగును

ఏసుక్రీస్తు చెప్పినట్లు ఒక చెంపమీద కొట్టితే రెండవ చెంప వప్పగింపవలయును

గాంధీమహాత్ముని అహింసా సిద్ధాంతము ప్రకారము దౌర్జన్యమును దౌర్జన్యముతో అణచివేయరాదు అహింస తోనే ఎదుర్కొనవలెను

అట్లాగనే రోగమనే దౌర్జన్యమును ఆరోగ్యసూత్రములనే అహింసతోనే ఎదుర్కొనవలెను మందులనే దౌర్జన్యముతో రోగమనే దౌర్జన్యమును అణచి వేయరాదు

దురలవాట్లవలననూ, కరుణరోగములను మందులతో అణచి పెట్టుట వలననూ, అరిగని పదార్థములన్నియు రక్తము తోకలిసి సన్నని కేశనాళికల ద్వారా, ప్రవహించునపుడు అడ్డుపడును రక్తప్రవాహామునకు అడ్డుపడుటచే రక్తము తుదల కంటా పోదు రక్తము తుదలకంటా ప్రవహించకపోవుటచే చివరలు చచ్చుపడిపోవును

ఈవిషయములో కశేరుకాచికిత్సకులకును, ప్రకృతి చికిత్సలకును తేడాగలదు వెన్నుపూసలోని యెగుడు దిగుడు వలన అన్ని రోగములును వచ్చుచున్నవని కశేరుకాచికిత్సకుల అభిప్రాయము వెన్నుపూసలోని యెగుడు దిగుడువలననే రోగము రావచ్చు, అయితే వెన్ను పూసలలోని యెగుడు దిగుడులు మాత్రము యెందుకు వచ్చినవి? వెన్ను పూసలు ముందు వెనుకలకును, పైకి క్రిందకును పోవుటచేత నాడీశక్తి దేహామంతటా సరిగా ప్రవహించదు అందువలననే రోగములు వచ్చుచున్నవని కశేరుకాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు నరములలోని బలహీనతకును, నాడీశక్తి సరిగా ప్రవహించకపోవుటకునూరోగపదార్థమే కారణమని ప్రకృతిచికిత్సకుల అభిప్రాయము

## కణముల ధర్మములు

దేహము ఆరోగ్యముగా ఉండాలంటే, కణములన్నీ ఆరోగ్యముగా ఉండాలి కణములు ఆరోగ్యముగను చలాకీ గాను ఉండాలంటే కణములకు కావలసిన సరుకులు నిరంతరము అందుతూ ఉండాలి కణములకు కావలసిన సరుకులు ఆహారము

ప్రాణవాయువు రెండునూ రక్తమునుండియే లభించును దేహములో శుద్ధరక్తము ప్రవహించుధమనులును, మురికి రక్తము ప్రవహించుసిరలును రెండును దగ్గరగానే ప్రవహించుచుండును కణములకు కావలసిన ఆహారము ప్రాణవాయువు, రెండునూ ధమనులలో ప్రవహించు శుద్ధ రక్తమునుండి చేరును ధమనులలో ప్రవహించు రక్తము బాగా ఉన్నంతవరకు కణములును ఆరోగ్యముగాను చలాకీగాను ఉండును

కణములు ఆరోగ్యముగా ఉండవలెనంటే కణములకు కావలసిన ఆహారము, ప్రాణవాయువు ధమనులనుండి చేరుటయే గాదు మరొకవిషయముకూడా గలదు కణములలో తయారగు మురుగు ఎప్పటికప్పుడు బయటకు వెడలుచుండవలెను

కణములలో తయారగు మురికి మెరురక్తము ప్రవహించు సిరలగుండా ప్రవహించి హృదయములోనికి పోయి, అచ్చట ప్రాణవాయువుతో కలిసి శుద్ధిపొంది, ధమనులద్వారా దేహములోని అన్ని భాగములలోనికిని పోవును

ఇంటిలో తయారగు మురికి బయటకు పోకుండా లోపలనే నిలవ ఉంచితే దుర్గంధము యెట్లుపుట్టునో అట్లే దేహములో తయారగు మురికికూడా బయటకుపోక లోపలనే నిలబడిపోయిన దుర్గంధము పుట్టును. హృదయము స్తంభించిపోవును

కణములు బాగా ఆరోగ్యముగా ఉండవలెనంటే నాడీ కేంద్రమునకును, కణములకును గల సంబంధము సరిగా అవిచ్ఛిన్నముగా ఉండవలయును కణములకు కావలసిన అవసరములను, నాడీకేంద్రములద్వారా వెన్నుపామునకును అచ్చటినుండి

చిన్న మెదడునకును తెలియచేయుటకు చిన్నమెదడునుండి వచ్చు ఆదేశములను వెన్నుపాముద్వారా కణములకు అందచేయుటకును రెండురకములగు నాడీప్రవాహము లుండును

కణములకు ఆహారము కావలసి వచ్చినపుడు వాంఛను నాడీకేంద్రములగుండా వెన్నుపాముకును, వెన్నుపాముద్వారా చిన్న మెదడునకును తెలియును

అట్లాగే మెదడునుండివచ్చు ఆదేశములు, వెన్నుపాము నుండివచ్చి నాడీకేంద్రముల ద్వారా కణములకు చేరును కణములకు గలుగు బాధలన్నియు మెదడునకు తెలియును వాటికి మెదడు చెప్పు పరిహారములన్నియు, తిరిగి కణములకు చేరును ఈబాదలు వాటికగు పరిహారములకును, (రిఫ్లెక్సుఆర్కు) అనిపేరు

ఈ ఉదాహరణ వలన బాగా విశదము కాగలదు దేహము తగుమాత్రము వేడినే భరింపగలదు కాలినవస్తువు చేతికి తగిలిన దనుకొనుడు బాధను వ్రేళ్లచివరనుండు కణములు, వెన్నుపామునకును, అచ్చటనుండి మెదడునకును తెలియ చేయును ఈ బాధనుండి తప్పించుకొనుటకు ఆవస్తువును వదలివేయమని, ఆదేశము మెదడునుండి వ్రేళ్లచివరనుండు కణములకు వచ్చును అప్పుడే చేతిని వెనుకకు లాగుటకు శక్తికూడా వచ్చును ఇదంతయును కనురెప్పమాత్రములోనే జరుగును

దేహములోని మారుమూల అవయవములకును మెదడునకును సంబంధముండును సంబంధము లేనపుడు కణములవాంఛలను మెదడు గుర్తించలేదు మెదడు ఆదేశములు, కణములకు అందవు. అప్పుడు వేటికవి అగును పక్షవాతము వచ్చి

చచ్చుపడి పోయినపుడు చచ్చుపడిన భాగమునకు, ఎంత దెబ్బతగిలినను, మెదడునకు తెలియదు మెదడునకు తెలియకపోవుటచే ఏ పరిహారమును చేయలేదు సూదిగుచ్చినా బాధ తెలియదు

అడవులలోనికి పోయినపుడు త్రోవతప్పినప్రయాణీకుడు తనతోటి జనమును కనుగొనలేక యెన్ని బాధలుపడునో అన్ని బాధలును నాడీకేంద్రములతో సంబంధములేని కణములునూ అనుభవించును ప్రధాన కేంద్రములతో సంబంధము లేని సైనికపటాలములు ఎట్టి బాధలుపడునో అట్టిబాధలనే నాడీకేంద్రములతో సంబంధములేని కణములును అనుభవించును ప్రతిదినమును మనము తినిన పదార్థములలో అరగక మిగిలిన భాగములు కణములకును, ప్రధాన కేంద్రములకును మధ్యనుండు నాడీప్రవాహమునుఅభ్యంతర పెట్టును సారాయి మొదలగు పానాలు చుట్ట, బీడి, సిగరెట్ మొదలైన పొగత్రాగే సాధనములును ఈ అభ్యంతరములనే యెక్కువ చేయును ప్రధాన కేంద్రములకును, కణములకునుసంబంధము లేకపోవుటచే వేటిగతి వాటిదే అగును

దేహము ఆరోగ్యముగా ఉండవలెనంటే, నిత్యమునూ స్నానము చేయవలెను స్నానకాలమందు శరీరమును బాగా రుద్దుకొనవలయును చర్మముమీది మురికి అంతా పోవును. వస్తికర్మతో దేహములోని అంతరవయవములనుకూడా అప్పుడప్పుడు శుద్ధి చేసుకొనుచుండవలయును

అరగక మిగిలిపోయిన పదార్థమంతయు రక్తములోనుండి ప్రాణవాయువు, ఆహారము, కణములకు అందకుండా అడ్డు పడును కణములలోని మురుగు శోషరసవాహికలలోనికి చేర కుండాను ఈ రోగపదార్థపు మురుగే అభ్యంతరము గలి గించును ఈ రెండు విధములగు అభ్యంతరములే గాక, మరొక విధమగు అభ్యంతరమును గలదు నాడీకేంద్రము లకును, కణములకును మధ్యగల నాడీప్రవాహమునకును అడ్డు పడును కణములు ఈ అభ్యంతరముల తప్పుకొని పోలేవు అందువలన వేటిగతి వాటిదగును పరిస్థితులు సరిగా లేనపుడు తెలివి తేటలు గలవారైనను, సామాన్య పనుల సహితము ఎట్లు చేయలేడో, అట్లాగే కణములు సమర్థములైనప్పటికినీ, అరగని పదార్థములు, అడ్డుపడుటచేత, ఏమియును చేయలేవు

రోగపదార్థము మధ్య ఏర్పడనంతవరకు కణములకును ప్రధాన కేంద్రములకును ఎట్టి అభ్యంతరములును ఏర్పడవు అభ్యంతరములు కలిగినపుడే రోగము కాలికమగును కాలిక రోగములో కణములకును, ప్రధానకేంద్రములకును, ఎట్టి సంబంధము ఉండదు అరగని పదార్థములు ఎక్కువగా పేరుకొని అభ్యంతరములు ఎక్కువగుటచే, తమలో తయారగు మురుగును కణములు ఎప్పటి కప్పుడు బయటకు పంపలేవు. ఈ క్రిందవ్రాసిన ఉదాహరణవలన పై విషయము బాగా బోధపడగలదు ఒకడు గనుల త్రవ్వుచుండగా, గని పై భాగము విరిగి నెత్తిన పడినది మరొకరి సహాయము లేకుండా నెత్తిన పడిన బరువును అతడొకడే తీసివేయలేడు అట్లాగే కాలిక రోగములలో కూడా కణములకు సహాయముచేస్తేనేగాని అవి

సమర్థములుగావు తమపనిని తాము నిర్వహింపగల సామర్థ్యము వచ్చువఱకును వాటికి పరుల సహాయము కావలెను

ఈ సహాయము ఏరూపములో ఉండవలెనను సందేహము కలుగవచ్చును మనమిచ్చు ఆహారములో క్రమముంచవలయును కణమునకు ఏ పదార్థము అవసరమో గుర్తించి ఆ పదార్థమునే యివ్వవలెను దేహమునకు హాని కలిగించు వస్తువులను, ఘనరూపములోగాని ద్రవరూపములో గాని యివ్వరాదు దేహమునకు అవసరమైనపదార్థముకన్నా యెక్కువగా తినుటచేత, జబ్బుపడిన కణములు ఆ తినిన పదార్థమును జీర్ణము చేయలేక, మరీ చెడిపోవును

శాకముల తినుటవలననే దాదాపుగా అన్ని కాలికరోగములును పోవును కూరలు రక్తములోని భాగముల నన్నిటిని సమముగా నుంచును ఎక్కువ తక్కువలు ఏమియు నుండవు

వంశానుగతముగా రక్తములో నిలబడి పోయిన దోషముల నన్నిటిని, బయటకు పంపివేయగలవు కాలికరోగములలో దేహములోని అన్నిపనిముట్లు చెడిపోయియే ఉండును చెడని భాగము ఉండనే ఉండదు ఆ అవయవములు మళ్లీ బాగుపడవలె నంటే, యెక్కువకాలము పట్టును అందువలననే, కాలిక రోగములు ఆలస్యముగా కుదురును దురలవాట్లన్నియు సంపూర్ణముగా వదలివేయవలెను మలవిమోచనకరములైన పదార్థములనే యెక్కువగా తినవలయును కాలిక రోగములు అప్పుడు త్వరగా కుదురును

కాలిక రోగములతో బాధపడువారు మాంసాహారములను విధిగా మానవలెను శాకాహారమునే జీర్ణము చేయ

లేని కణములు మాంసాహారమును అసలే జీర్ణము చేయలేవు జీర్ణము చేయలేక పోవుటచే, మలిన పదార్థము మరింత పేరు కొనును మలిన పదార్థము మరింతి పేరుకొనుటచే కణములు మరింత చెడిపోవును

ఇంతవరదాకా తినవలసిన ఆహారమును గూర్చి తెలుసుకొన్నాము. లోగడచేసిన అవకతవకలవలన రక్తములో కలిగిన లోపములను, దేహమునకు హానిలేనిపద్ధతులలో నెట్లు పోగొట్ట వలసినది తెలుసుకొందాము

రక్తములోని దోషముల పోగొట్టుటకు చన్నీటిస్నానము బాగా ఉపయోగించును చన్నీటి స్నానము వలన రక్తము బాగా కదలబారును రక్తము దేహమంతటా యుక్తమగు వేగముతో ప్రవహించును మొద్దుబారిన చర్మము బాగాసున్నితమగును చర్మము సున్నితమగుటవలన రక్తములోని దోషములు చర్మమునుండి స్వేదరూపముతో బయటపడును రక్తములోని దోషములు పోవుటచే శుద్ధరక్తము దేహమంతటా ప్రవహించును ఎట్టి అభ్యంతరములు లేకపోవుటచే కణములకు ఆహారము ప్రాణవాయువు నిరభ్యంతరముగా అందును అందువలన మారుమూలల నుండు కణములు అన్ని బాగా చలాకీగా నుండును

రక్త ప్రసరణము బాగుగా నుండుటచేతనూ, చర్మము సున్నిత మగుటవలనను, రక్తములోని దోషములు స్వేదరూపముతో బయటపడును చన్నీటి స్నానము వలన రక్తములోని శ్వేత కణములు సంఖ్యయెక్కువైనట్లు లెఖ్ఖలతోసహా చెప్పవచ్చును చన్నీటి స్నానమునకు పూర్వమున్న శ్వేత కణముల

సంఖ్యకన్నా, తర్వాతనుండు ఎర్రకణములసంఖ్య యెక్కు
వగా నుండును ఎట్లుఎక్కువైనవని ఆశ్చర్యము కలుగవచ్చును
చన్నీటి స్నానమువలన ఎర్రకణములు క్రొత్తగా పుట్టలేదు
ఇదివరకు మారుమూలలనున్న యెర్రకణములు ఉద్రేకమును
పొంది మిగిలినవాటితో బాటు తిరుగును స్నానమునకు
పూర్వ మీకణము లన్నియు చలనములేక మొద్దుల మాదిరిగా
పడియుండును చన్నీటి స్నానమువలన వీటికి చలనము కలిగి తిరు
గుచుండును ఈఎర్రకణముల సంఖ్య రెట్టింపగుటకూడాగలదు

దేహములోని దోషములు అనగా రక్తములోని దోష
ములను కండరములలోని దోషములను, నరములలోని దోష
ములను సహితము పోగొట్టుటకు మరొక మార్గము కలదు.
అదియే మర్దనశాస్త్రసమ్మతముగా మర్దనచేసినయెడల కండర
రములలోని దోషములు, నరములలోని దోషములు, పెంకివేయ
బడుటచే బయటకువచ్చి రక్తముతోకలసి ప్రవహించునపుడు
చర్మముద్వారా చమటగా బయటకు వచ్చును కొన్ని శోష
రస వాహికలగుండా బయటకు పోవును మలినములన్ని బయ
టకు పోవుటచేత శుద్ధరక్తము, దేహమంతటా ప్రవహించును.
అన్ని కణములకు, ఆహారము బాగుగా లభించును అన్ని అవ
యవములు బాగుగా పనిచేయును

కాలికరోగములలో, దేహములోని ప్రతిచిన్న అవయవ
మునకును, దెబ్బ తగులునని యిదివరకే చెప్పినాము రోగ
పదార్థము చేర్కొనుటచేత, రక్తము సమానవేగముతో,
తిన్నగా ప్రవహించదు ఇరుకయిన సందులనుండి రక్త ము
ప్రవహించవలసి వచ్చుటచేత, రక్తము వేగము యెక్కు

వగును చివరలదాకా ప్రవహించదు అందువలననే చివరలు చల్లగానుండును కాలికరోగములలో వెన్నుపాములోని పూసలు యథాస్థానములో నుండవు ముందు వెనుకలకు జరుగును ముందు వెనుకలకు జరుగుటచేత నాడీశక్తి సరిగా ప్రవహించదు వెన్నుపూసలు పైకిక్రిందికి జరిగినను ఈ అభ్యంతరమే కలుగును వెన్నుపూసలను సరిచేయించుకొనవలయును

గాలీ వెలుతురును చర్మమునకు ధారాళముగా తగులనిసే మొద్దుబారిన చర్మము బాగా సున్నితమగును రక్తము ప్రసరణము బాగుగా నుండును చెమట పోయును దోషములు పోవుటచే కణములును, దేహమును ఆరోగ్యముగా నుండును వీటి అన్నింటికన్న దేహపరిశ్రమము ముఖ్యము దేహమునకు చెమట పట్టునట్లుగా పని చేసినయెడల సుఖమైన నిద్ర కలుగును

అలసిపోయిన అవయవములకు విశ్రాంతి బాగా లభించును ఏ అవయవములో లోపమున్నదో గ్రహించి, ఆ అవయవములకు సంబంధించిన పరిశ్రమచే చేసినయెడల ఆ అవయవములోని దోషములు పోయి దేహము ఆరోగ్యవంతముగా నుండును

దేహపరిశ్రమ చేయునపుడు ప్రాణవాయువును ఎక్కువగా పీల్చుదుము అగ్నిసదృశమగు ప్రాణవాయువు లోపల నిలవఉన్న రోగపదార్థమును దహించివేయును శుభ్రమైన గాలిని యుక్తమయినరీతిని పీల్చువారికి సాధారణముగా, రోగములురావు మంచిగాలిని పీల్చుటచే ఊపిరితిత్తులలో

వివిధమైన మలినములును, పెరుకొనవు విటి అన్నింటికన్నను, మరొక ముఖ్యవిషయము కలదు రోగికి భయము, దిగులు, కోపము, అసూయ మొదలగున వేమియు కలుగజేయరాదు ఎట్టి కల్లోలము, ఉద్రేకము ఆవేశములు కలుగకుండా ఉంచవలయును భయమువలన కణములన్నియు ముడుచుకొనిపోవును కొన్నికణములు చిట్లిపోవుటయు గలదు కణములు ముడుచుకొనిపోవుటచే కణమునకుకావలసిన ప్రాణవాయువు, ఆహారము సరిగా లభించదు కణములలోని మలినములు పూర్తిగా బయటకుపోవు ఆరోగ్యముండదు నాడిశక్తి సరిగాప్రవహించదు పైకారణములవలన కణము ఆరోగ్యముగా నుండదు

సంతోషము ఉత్సాహము వలన కణములు బాగా వ్యాప్తి చెందును కణములకు కావలసిన ఆహారము ప్రాణవాయువు బాగుగా లభించును తయారగు మలినములు త్వరగా బయటకు వెడలును

ఇంతవరకూ చదువుకొన్న దానినిబట్టి, మనము తెలుసుకొన్న దేమంటే, కాలికరోగముల నయము చేసుకొనవలెనంటే, రోగపదార్థమును పేరుకోనీయరాదు రక్తములోని భాగముల నన్నింటిని క్రమముగా నుంచవలయును అన్నిధాతువులు క్రమముగానే ఉండవలయును మంచిరక్తము ప్రవహించు ధమనులును చెడురక్తము ప్రవహించు సిరలును ఎట్టి అభ్యంతరమును లేక ప్రవహించు చుండవలెను కణములకును నాడీకేంద్రములకును మధ్య నెట్టి అభ్యంతరములును ఉండరాదు నాడిశక్తి సరిగా ప్రవహించు చుండవలయును, కాలిక రోగ

ముల నయము చేయునపుడు ఈ క్రింది విషయములను జ్ఞప్తి యందుంచుకొనవలెను

1 ధాతుశక్తిని దుర్వ్యయ పరచకూడదు ఈ వ్యయమును సాధ్యమయినంతవఱకు తగ్గించవలయును

2 జీర్ణశక్తి బాగుపడునట్లును వృద్ధి అగునట్లును చేయవలయును

3 దేహములో పేరుకొన్న మురుగు బయటకు పోవు వసతుల కలుగజేయవలెను

4 వెన్నుపూసలలోని లోపములను సరిచేయవలయును

5 ఉద్రేకము, ఆవేశములు లేకుండా మనస్సును సరిఅయిన స్థితిలో నుంచవలయును

---

## ౨౧
## మార్పు

రోగము ప్రారంభించినది మొదలుకొని నయమగు లోపల అనేక మార్పుల పొందుతుంది అనేక విధములుగా మారుతుంది ఒకేరీతిగా మాత్రము ఉండదు అయితే యీ మార్పుల వలన గుణములు కలుగవచ్చును దోషము కలుగ వచ్చును

కాలిక రోగమును చికిత్సించు కాలములో అప్పుడప్పుడు జ్వరము వచ్చును ఈ జ్వరము కలిగినందు వలన గుణములు కలుగును దోషములు కలుగును వీనిని సంకటము లందుము ఈ సంకటములు రెండు విధములు

రోగపదార్థమును బయటకు నెట్టివేయగల సామర్థ్యము ధాతుశక్తికి కలిగినట్లయితే రోగపదార్థము బయటకు వెళ్లిపోయి ఆరోగ్యము కలుగును ఈ సంకటములను, అపుడు స్వాస్థ్య సంకటము లందుము

రెండవవి రోగసంకటములు ఈ రోగసంకటములవలన దేహమునకు, ఆరోగ్యము కలుగుటకు బదులు, అపకారము జరుగును రోగనిరోధకశక్తి బలహీనమై, రోగపదార్థపుబలము పెరిగిపోయినపుడు ఈ రోగ సంకటములు కలుగును

## రాబోవుఆపదలకు—ఈరోగసంకటములు చిహ్నములు

స్వాస్థ్య సంకటములన్నియు దేహములోపలి రోగ పదార్థమును బయటకు పంపివేయును ఎప్పటికప్పుడు వచ్చు జలుబు, రక్తాభిష్యందము, పుండ్లు, బొబ్బలు, వ్రణములు, అతిసారము గ్రహణి మొదలగునవన్నియు, లోపలచేరిన రోగపదార్థమును బయటకు నెట్టుటకే సహాయపడును

స్వాస్థ్యసంకటములు, రోగసంకటములు రెండునూ ఒకే విధముగా నుండును సామాన్య మనిషికి ఈ రెంటికిని పెద్ద తేడా కనబడదు ప్రత్యేకముగా చూచినగాని యీ తేడాను కనుగొనలేము పైకిమాత్రము ఈ రెండునూ ఒకటిగానే కన బడినప్పటికనీ ఆంతరంగిక పరిస్థితులలో రెంటికిని పెద్ద తేడా గలదు

ప్రకృతి సూత్రములకు అనుగుణముగా సంచరించిన తరుణరోగములు తక్కువగానే వచ్చును వచ్చినవైనను ఏమి యు అపకారమును చేయవు

## స్వాస్థ్య సంకటములు

కాలికరోగముల చికిత్సాకాలములో కలుగు స్వాస్థ్య సంకటములవలన దేహామునకు ఉపకారము జరిగేదీ అపకారము జరిగేదీ విచారించుదాము కాలికరోగములలో కలుగు స్వాస్థ్య సంకటములవలన, దేహామునకు ఉపయోగము కలుగును తన దురలవాట్లను మానుకోగల మనోనిగ్రహాముండి, స్వాస్థ్యసంకటములవలన దేహామునకు, అపకారముకలగకుండా కాపాడుకోగల ధాతుశక్తి ఉన్నట్లయితే, స్వాస్థ్యసంకటముల వలన దేహామునకు ఉపకారమే కలుగుతుంది

దేహాములోని అంతరవయవములు బాగా చెడిపోయి నపుడు, స్వాస్థ్య సంకటములవలన ఉపయోగము కలుగదు. అంతరవయవములు చెడిపోయినపుడు హానికలుగును

చాలామందిరోగులు ఈ స్వాస్థ్యసంకటముల చూచి భయపడుదురు రోగము పెరిగిపోయినదని గాభరా పడుదురు తట్టుకొనగల సామర్థ్యము దేహామునకు ఉన్నపుడే స్వాస్థ్యసంకటములు కలుగును గాని సామర్థ్యము లేనపుడు స్వాస్థ్యసంకటములు రావు

మలకోశముద్వారాను, మూత్రపిండముల ద్వారాను, చర్మముద్వారాను, ఊపిరితిత్తుల ద్వారాను, బయటకు పోలేని మురుగే దేహాములో పేరుకొనును గడ్డకట్టును బయటకు పోక లోపలనే పేరుకొనినపుడే, కాలికరోగములు వచ్చును ప్రకృతి వైద్యములోని చికిత్సాపద్ధతులతో నయము చేయవలెనంటే రోగపదార్థమును రోగరూపముతో బయటకు పంపు ప్రకృతికి

మనము సహాయము చేయవలెను చికిత్సాకాలములో కలిగిన స్వాస్థ్యసంకటమువలన రోగపదార్థము బయటకు వెళ్లిపోవును కరుడుగట్టిన రోగపదార్థమంతయు విశ్లేషణము పొందును బయటకు పోవును

బహిస్స్రావావయవములు బాగా పనిచేయునపుడు అనుక్షణము తయారగు మురుగు లోపల నిలవక బయటకే వెళ్లి పోవును బయటకు పోవుటకు వీలుకానంతగా గట్టిపడితేనే గాని అందులోనుండి మంటలు పుట్టవు అప్పుడు సూక్ష్మ జీవులు పుట్టును

స్వాస్థ్యసంకటములు కలిగినపుడు మందులతో అణచి పెట్టక యెట్టిఅభ్యంతరములును కలిగించక వాటిని ఉచితరీతిని వదలిపెట్టిన యెడల దేహమునకేమీ హాని చేయక రోగ పదార్థమును తీసివేయుటచే మేలే చేయును స్వాస్థ్యసంకటములు కలిగినపుడు కత్తులను ఉపయోగించరాదు మందులు పోయ రాదు మంచుగడ్డ కట్టరాదు దేహమునకు హాని కలిగించు ఏ వైద్యమునూ చేయరాదు

మందులతో అణచిపెట్టితే స్వాస్థ్యసంకటములే రోగ సంకటములుగా మారిపోవును స్వాస్థ్యసంకటములు కలిగినపుడు అపచారములు చేయకుండా ఊరుకొనుటయే ఉత్తమమైనపని

స్వాస్థ్యసంకటముల తీవ్రతను తట్టుకొనగల సామర్థ్యము దేహమునకు ఉన్నప్పుడే ప్రకృతి స్వాస్థ్యసంకటములు కలుగ చేయునని మనమిదివరకే చదివినాము ప్రకృతి తనశక్తి నంత నూ ఉపయోగించి, స్వాస్థ్యసంకటములు ద్వారా రోగపదార్థ మును బయటకు పంపివేయును ఇంత ప్రయత్నముతో బయ

టకు వచ్చిన రోగపదార్థమును మందులతో అణచివేసినపుడు మరొక పర్యాయము రోగపదార్థమును, బయటకు నెట్టివేయు సామర్థ్యము ప్రకృతికి లేకపోవును సామర్థ్యము లేకపోవుటచే రోగసంకటములుగా మారిపోవును రోగసంకటముల వలన మరణమును పొందవచ్చును

మందులకును, స్వాస్థ్య సంకటములకును సంబంధము లేదు

స్వాస్థ్యసంకటములగూర్చి యింతగా చెపితే మాయందు వైద్య మిత్రులకు మాపై కోపము వస్తుంది వారికి క్రింది సందేహములు కలుగవచ్చును

"చన్నీటి ప్రక్రియలవలన రక్తములో కలుగు ఉద్రేకమునకును మందులవలన రక్తములో ఉద్రేకమునకును ఏమీ తేడా లేదు" దూరదృష్టితో విచారించిన మందుల నుపయోగించినందువలన రక్తములో కలుగు ఉద్రేకమునకును చన్నీటి ప్రక్రియలవలన రక్తములో కలుగు ఉద్రేకమునకును, విపరీతమగు తేడా ఉన్నట్లు తెలియగలదు స్వాస్థ్యసంకటములు కలిగి రోగపదార్థము బయటకు పోవుటయేగదా మనకు కావలసినది! రోగపదార్థమును నాలుగుత్రోవలా పంపవలెగదా ఈ నాలుగు త్రోవలా పంపుటకు, అయిదు ఆరు రకముల మందులు వాడితే త్వరగా వెళ్లిపోతుంది అలోపతీ వైద్యములో స్వల్పకాలము లోనే రోగపదార్థమును బయటకు పంపివేయుటకు, అనుకూలపడు మందులుగలవు రసభస్మము కాలేయముమీదనూ ప్రేగులమీదనూ, చాలాచురుకుగా పనిచేయును మరొకవిషయము కద్దాక్షా ఉన్నది" సామాన్యజనమునకు అర్థముకాని భాషలో వ్రాయుట దర్జాగా ఉంటున్నది అందరికీ తెలియునట్లు వ్రాస్తే

యేమీ మజాగా ఉండదు డబ్బూరాదు అన్నిరోగములు జలప్రక్రియలవలననూ గాలితోనూ కుదురునని చెపితే మన దగ్గరికి ఎవరునూరారు మనకు డబ్బూరాదు ఈధోరణిఅంతా పైకిమాత్రము చాలాసబబుగానే తోస్తుంది అంతానిజముగానే ఉంటుంది ఓపికతో విచారిస్తే యిదంతా యుక్తివాదనేగాని, సత్యముకాదని వెంటనే తెలుస్తుంది

రసభస్మముకాలేయముమీదపనిచేయుననుట భ్రమయే గాని నిజముకాదు నిజము చెప్పాలంటే కాలేయమే రసభస్మముమీద పనిచేయును

విరేచనమగుటకు వాడుమందులును, మూత్రము తెంపుగా అవుటకు వాడుమందులునూ, చెమట పోయుటకు వాడు మందులును విషములే ఇవన్నీ విషములగుటవలననే దుష్ఫలితములు కలుగుచున్నవి మందులలో విషములు లేకపోతే యీఫలితములు కలుగనే కలుగవు పైపనులకు వాడు మందులన్నీ ఖనిజములతోనే తయారు చేస్తారు

మానవదేహములోని రక్తముతో ఈ ఖనిజములు కలిసిపోవు సారూప్యమును పొందవు ఖనిజములలోని అణువుల గమనము మానవదేహములలోని రక్తముతో కలిసిపోదు ఈ మందులు విజాతీయములగుటచే ప్రకృతి వీటిని బయటకు పంపుటకు ప్రయత్నము చేయును బయటకు నెట్టుటకుగాను బహిష్కార్యావయవములు తీవ్రముగా పనిచేయును

బయటకు పంపు ప్రయత్నములో, దేహములోని ప్రాణ ప్రదములగు ద్రవములును బయటకు పోవును మందులతో బాటు ప్రేగులలోని సరుకంతయూ బయటకు వెడలిపోవును

మందులతో క్రిములను కడిగివేయుట, క్రిములను ఉద్రేకి పరుచుటేగాని మరేమీకాదు కణములలోని లోపములు అట్లనే నిలవ ఉండును

## మందులవలన గలుగు అపకారము

ఏ మందు వేసినను రెండు ఫలితములు కలుగును వీటినే క్రియాఫలితము, ప్రతిక్రియాఫలితము అందుము క్రియా ఫలితముగా చలవచేసిన యెడల, ప్రతిక్రియా ఫలితముగా వేడి చేయును క్రియాఫలితముగ వేడిచేసిన యెడల, ప్రతిక్రియాఫలితముగా చలవచేయును క్రియాఫలితమునకు, ప్రతిక్రియాఫలితము వ్యతిరేకముగా నుండును క్రియాఫలితముకన్న ప్రతిక్రియాఫలితము ఎక్కువకాలము నిలవ ఉండును క్రియాఫలితముగా ఉద్రేకము కలిగితే, ప్రతిక్రియాఫలితముగా నీరసము కలుగును క్రియాఫలితముగా నిరసము కలిగితే ప్రతిక్రియాఫలితముగా ఉద్రేకము కలుగును

మందుల వాడి ఉద్రేకము కలుగచేస్తే ప్రతిక్రియాఫలితముగా నీరసము కలుగును నిరంతరమును మందులు వాడితే నిస్సత్తువ యెప్పటికప్పుడు పెరుగు చుండును

మొదటిలో ఒక మోతాదు సరిపోతే కాలము గడచిన కొలదీ రెండు మూడు మోతాదులు కావలయును మందుల పరిమాణము పెరిగినకొలదినీ, నిస్సత్తువ పెరిగి అంతరవయవములు చెడిపోవును

ఈ మందులన్నీ దేహమనే యింటిలోని బయట వరండాలను మాత్రమే కడుగును గాని, యింటిలోనికి పోనేపోవు.

కణములజోలికి పోకపోవుటచే, కణములలోని మురుగు, అచ్చటనే నిలబడిపోవును దేహములోని మురుగును కడిగివేయాలంటే కణములలోని మురుగును కడిగి వెయ్యాలి

రక్తమును, అవయవములను మందులతో ఉద్రేకపరచినందున, ఏమిన్నీ ఉపయోగము లేదు ఉపకారము లేకపోగా అపకారమే మిగిలిపోతుంది

దేహములోని ధాతువులకు, శక్తినిచ్చి, కణములలోని, మురుగును బయటకు నెట్టుటకు ప్రకృతికే సహాయము చేయవలయును ఉద్రేకమును కలిగించు మందులను మాత్రము సేవించరాదు

దేహమునకు అవసరమైన పదార్ధమును అవసరమైనంత వఱకే తినినయెడల అరగని పదార్ధ మేమియు పేరుకొనదు పేరుకొనకపోవుటచే, కణములలో తయారగు మురుగు, నిరభ్యంతరముగా బైటకు వెళ్లిపోవుచుండును ఎట్టిరోగములునూ రావు మందులతో అవసరమేమీ లేదు

ప్రకృతి వైద్యమునకును, మందు వైద్యమునకును ప్రాతిపదికలోనే తేడాగలదు

రోగముతో, రోగపదార్ధము పోవును గాన ప్రతిరోగము దేహమునకు ఉపకారమే చేస్తుందంటారు ప్రకృతి వైద్యులు దేహము అస్వస్థతగా ఉంటుంది గనుక రోగమువలన దేహమునకు హాని కలుగుతుందంటారు మందువైద్యులు

చన్నీటివలన కలుగు ఉద్రేకమే మందుల వలననూ కలుగునని మందువైద్యులు చెప్పవచ్చును గాని, చన్నీరు

అప్పుడుగాని ముందుగాని హానిలేనిది మందులన్ననో హాని కరమునైనవి

క్రియాప్రతిక్రియల ఫలితముల ననుసరించి ఉద్రేకమును కలిగించుటకు వాడు ప్రతిమందువలననూ, నీరసమే కలుగు చున్నది ఆ నీరసమే మిగిలిపోవుచున్నది కల్లు, సారాయి, బ్రాందీలను సేవించినవారికి క్రియాఫలితముగా ఉద్రేకము కలుగును ప్రతిక్రియాఫలితముగా నీరసము కలుగును

చన్నీటిస్నానమువలన కలుగు ఫలితములకును, మందుల వలన కలుగు ఫలితములకును ఎట్టిసంబంధమును లేదు చన్నీరు దేహామునకు తగలగనే రక్తము లోనికిపోవును చర్మ తలమునందు రక్తము ఉండదు గాన రక్తము లేనిసంగతిని జ్ఞాననాడులు మెదడునకు తెలియచేయును మెదడు చర్మ తల మునకు, రక్తమును పంపమని ధమనీచాలకను ఆజ్ఞాపించును ధమనీచాలక ఆపనిని పూర్తి చేయును ఇదంతయూ రెప్పపాటు లోనే జరుగును చన్నీటిని ఉపయోగించినందువలన క్రియా ఫలితముగా నిస్సత్తువ కలిగినది ప్రతిక్రియాఫలితముగా ఉద్రేక ము కలుగును ప్రతిక్రియాఫలితము ఎక్కువకాలము నిలుచు ను గాన, ఉద్రేకమును ఎక్కువకాలము నిలుచును మందు లను సేవించినపుడన్ననో క్రియాఫలితముగా ఉద్రేకము కలు గును ప్రతిక్రియాఫలితముగా నీరసము కలుగును క్రియాఫలిత ముకన్న ప్రతిక్రియాఫలితము ఎక్కువకాలము నిలవఉండును గాన నీరసమే యెక్కువకాలము నిలుచును

చన్నీటి స్నానమునలన ఉత్సాహాము ఎక్కువైతే, మందులను వాడినందువలన నీరసము యెక్కువగును

ఇదేగాక మందులవలన మరొక అపకారముకూడా జరుగును ఈ బాధలను తొలగించుటకే మరల మందులు వాడుచున్నాము గాని, మూలమును తీసివేయువఱకు మూలకారణము అట్లనే నిలిచి ఉంటుంది తలనొప్పిని తగ్గించుటకు అమృతాంజనము, కణతలకు రాయుచున్నాము తలనొప్పిమాత్రము పోవుచున్నది ఏకారణముచే తలనొప్పి వచ్చుచున్నదో ఆకారణము మాత్రము అట్లనే నిలవ ఉంటున్నది

ఎనిమాచేసి మలమును తోడివేయుటయు కృత్రిమమార్గములద్వారా దేహమునకు చెమటపట్టించుటయు రోగమును సహజముగా నివారణచేయుమార్గములు కావు మందులు చేయునంత అపకారమును పైనచెప్పిన చికిత్సాప్రక్రియలు చేయకపోయినప్పటికినీ వీటివలననూ దేహమునకుకొద్దిఅపకారము జరుగును ఇంతకన్నా తక్కువహానికరములగు సాధనలు దొరుకువఱకును ఈ విధానములను అవలంబింపవలసినదే ఇవే సహజమార్గములని చెప్పువారందరును పొరబడుచున్నారనియే చెప్పవలెను నీరు ఎక్కించినందువలన పెద్దప్రేగులోని కుదింపు సడలిపోవును దానిలోని బిగివి తగ్గిపోవును

కృత్రిమమార్గములద్వారా చెమటను పట్టించినందువలన చర్మములోని పటుత్వము తగ్గిపోవును రోగులు భరింపగలిగిన ఎండలో వ్యాయామము చేయుటమాత్రము కృత్రిమమార్గములలో చే దు దేహమునకు చెమటను బట్టించు కృత్రిమమార్గములు చర్మమునకు దగ్గరలోనున్న మురుగునే బయటకు పంపును దేహములోని కణములలోని మురుగు బయటకు వచ్చుటకు పైమార్గము లేవియు సహాయపడవు టర్కిష్

రష్యన్ బాత్ లు రెండునూ కృత్రిమమార్గములుగాన ఆచరణ యోగ్యములుకావు

డా॥ లహమన్ సుప్రసిద్ధ మందు వైద్యులు వీరికి ప్రకృతి వైద్యములో చాలా అనుభవముకలదు వీరి పరిశోధనా ఫలిత మును ఈ క్రింద పొందుపరుస్తున్నాము

దేహములోని మలములు కొన్ని చెమటరూపముగా బయటకుపోవును కాయకష్టము చేసినపుడు చెమట బాగా పోయును ఈ చెమటతో ద్రవరూపమగు మురికి బయటకు పోవును ఘనరూపమగు మురికికూడా, బయటకుపోవుట గలదు ఇది మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము- చెమట ఆరి పోగానే ఒళ్లంతయూ గరుకుగానుండును

దేహపరిశ్రమచేసినపుడు కలిగిన చెమటయొక్క గుణ ములను గూర్చి ముచ్చటించుకొన్నాము ఇకను కృత్రిమమార్గ ముల ద్వారాపోసిన చెమటయొక్క గుణములనుగూర్చి తెలుసు కొందాము

చెమట పోయుటకు రెండు మూడు విధములగు మార్గ ములుగలవు వేడి యెక్కువగా నున్నచోట ఉన్నా చెమట పోయును గాలి రానిచోటఉన్నా, చెమటపోయును తలుపులు కిటికీలు మూసివేసిన గదులలో ఎక్కువకాలం ఉన్నా చెమట పోయుటగలదు దేహపరిశ్రమచేసినపుడు కలిగిన చెమట స్వభా వము వేరు ఈకృత్రిమ మార్గములద్వారా కలిగినచెమట స్వభా వము వేరు రెంటిలక్షణములలోనూ పెద్దతేడాగలదు ఈ రెంటి కీని యెట్టి సంబంధమున్నులేదు ఈక్రింది ఉదాహరణము వలన ఈ తేడా బాగా తెలియగలదు

ఒక మనిషి భరించగలిగిన యెండలోఉండి కాయకష్టము చేసినపుడు చెమట పట్టును కొంత తూకముగల ఆచెమటలోని నీటిభాగమును తీసివేసినపుడు మలినములు మిగులును సహజ మార్గముద్వారా చెమటను పట్టించినపుడు అన్ని మలినములు బయటకిరావు లహమాన్ గారు అనేక పరిశోధనలు చేసినపిదప తమయొక్క నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చినారు

(1) చెమటను పట్టించుటయును, రోగపదార్థమును బయటకు పంపివేయుటయును రెండునూ వేరు వేరుమార్గములే

(2) కృత్రిమ మార్గములతో చెమటను పట్టించినందు వలన రావలసినంత మురుగు బయటకురాదు

(3) దేహములోని అవయవములను ఉద్రేకపరచి మలినమును బయటకు పంపవలసిన పనిలేదు మురికిని బయటకుపంపుటకు దేహమును నిర్బంధపరచరాదు దేహము సమర్థమైనపుడు ప్రకృతియే యీ మురుగును బయటకు పంపును

ఉపవాసముకూడా కొన్ని కేసులలోనే విధించవలయును అన్ని కేసులలోను, అన్ని సమయములందును, ఉపవాసముంచరాదు ఉపవసించకూడని కేసులలో ఉపవాసముంచుట వలన, నష్టము కలుగును

ఈ నష్టములగూర్చి వేరే అధ్యాయములో తెలుసుకొందాము

## ప్రకృతివైద్యములోమాత్రము రోగులు చచ్చుటలేదా?

ప్రకృతివైద్యములోను రోగులు చనిపోవుచున్నారు అందరునూ బ్రతుకుటలేదు అయితే ఒకపెద్దచిక్కుమాత్రము ఉన్నది రోగము పుట్టగానే ఎవరునూ ప్రకృతిని ఆశ్రయించరు.

మొదటలో ఈ పద్ధతులన్నియు చాలా గందరగోళముగా నుండును కట్టుదిట్టములలో ఉండవలెగాన ఈ వైద్యము జోలికి ఎవరును రారు ఎన్ని అవకతవకలుచేసినా ఒకమందు ఉండ మ్రింగితేచాలు తప్పులన్నీ అప్పటికి కొట్టుకుపోతవి తరు వాత నేమిజరుగుతుందో వీరికేమీ పనిలేదు మందులవలన అప్పటికి తాత్కాలికముగా మాత్రము ఉపశాంతి కలుగుతుంది

మందువైద్యము తరువాత కనుపడునది భూతవైద్యము వీరందరూ గారడీచేసి రోగమును పోగొట్టుతామంటారు ఒక రక్షరేకుతోనే రోగము పోతుందిగదా అని ఆత్రోవకు పోతారు భూతవైద్యాలు విధించునది మడేగాని (శౌచము) ఆహార విహార ములలో మార్పులురావలెనని వారు చెప్పరు

ఆహార విహారముల లోని లోపములవలన రోగమువచ్చిం దని ఆలోపముల సరిచేస్తే ఆరోగము పోతుందని వీరికి తెలియదు

ఈ రెండువిధాల చెడిపోయి రోగము మరింత ముదిరి పోయినపుడే ప్రకృతివంకకు చూస్తారు మరొకమార్గములేక యీ త్రోవకు వస్తారు అప్పటికి ఒంట్లో సత్తువ, యింట్లో సత్తువ ఉడిగిపోతుంది ఇంతపాడైపోయినప్పటికీ ప్రకృతిని ఆశ్ర యిస్తే మొండిరోగాలైనా పెందలకడనే కుదురును

ధాతుశక్తి తగిపోయి, అంతరవయవములు మరీ చెడి పోయిన కేసులలో తేలిపోవుటయు గలదు

ఒకేచికిత్సామార్గమును నమ్మక అన్నివైద్యములలోని ఆచరణయోగ్యములగు మార్గములద్వారాను, దేహములోని ప్రాణశక్తికి హానిలేనివిధమున వైద్యము చేయుదురుగాన ప్రకృతివైద్యముతో చాలారోగములు కుదురును స్వల్పపరి

మితిగల రోగములే కుదరవు ఇంతవరకూ చెప్పినదానినిబట్టి రోగము వచ్చుటకూడా అవసరమేనని తేలిపోయినది అప్పు డప్పుడు వచ్చిపోకపోతే మనము విశ్వసించలేము

రాకరాక పెరుపెట్టుకొనివస్తే మొదటికే మోసము తెస్తుంది రోగమువలన దేహమునకు యెంత ఉపకారము జరు గునో యుద్ధమువలన జాతికి అంత ఉపయోగము కలుగును కార్మిక యజమానులమధ్య సమ్మెలును అవసరమే వీనివలన కార్మికులకు ఉపయోగము కలుగుతుంది మత యుద్ధములు కూడా యిటువంటి నివారణోపాయములే బాగా విచారిస్తే భూకంపాలుకూడా అవసరమేమోననిపిస్తుంది పునర్జన్మమున కును, (లా ఆఫ్ క్రైసిస్) కున్నుగల సంబంధమునుగూర్చి ఇమాన్యుయెల్ స్వీడెన్ బర్గు యిట్లా చెప్పారు

"కోరిక లేనిది జన్మ లేదు కోరికలసాధించుటకే జన్మ ఉన్నది మరొక పనికికాదు కోరికే ఉండాలిగాని యీ జన్మలో కాకపోతే, మరొకజన్మలోనైనా పూర్తిఅగును పాతరూపము పోయి కొత్తరూపమువచ్చుటే చావు"

స్వాస్థ్యసంకటమువలన రోగపదార్థము బయటికిపోయి ఆరోగ్యము కలుగును స్వాస్థ్యసంకటములవలన దేహమునకు ఉపకారమే కలుగుతుందిగాని, దేహమునకు అపకారమేమీ కలుగదు

## ౨౨

# మందులవలన జరుగుపని

మందులయందు సామాన్యజనమునకుగల ఆదరణ తగ్గిపోయినని కాలములోనే విచిత్రమైనమార్పు వచ్చినది జనులలో కలిగిన ప్రబోధమువలన జర్మనుప్రభుత్వమువారు, మందులను వదిలిపెట్టి ప్రకృతిమార్గములకు రావలసివచ్చినది ప్రకృతి వైద్యపద్ధతులనే సైనికనావికాశాఖలలో ప్రవేశపెట్టిరి ఆంగ్లము మాతృభాషగాగల అన్ని దేశములలోను, ప్రకృతివైద్యమునందే అభిమానము యెక్కువైనది మందులను నిరసించుచునే ఉన్నారు ఆస్లరుపండితునివాక్యములే యిందుకు నిదర్శనములు అమెరికా విజ్ఞానసర్వస్వములో ఆస్లరుపండితుడు మందులనుగూర్చి యీ క్రిందివిధముగా వ్రాసెను

కొత్తవైద్యపద్ధతిలో మందులవాడుకయే లేదు సామాన్యజనమునకు శాస్త్రకూ కూస్తకూ మందులసేవించుట అలవాటయినది మందులను మ్రింగకపోతే ఒకతకమేమోనను భయము కూడా యేర్పడినది మానసికకల్లోలములు లేకపోయిన దాదాపుగా అన్నిరోగములును కుదురును మందుల సేవించకపోయినప్పటికినీ ఆకాలములోనే ఆరోగములు కుదురును మందులయందున్న వ్యామోహామువలన సామాన్యజనులు వానిని మానలేకుండా ఉన్నారు మందువైద్యులు తాము అయిదు ఆరు సంవత్సరములు కష్టపడి చదివినది మరువలేకుండా ఉన్నారు ప్రాచీనపద్ధతులవలననే రోగములన్నీ కుదురునని, "కొత్తవైద్యము చెప్పుచున్నది శరీరపరిశ్రమ చేయుటవలనను, ఆహారములో

మార్పులవలనను మర్దనచికిత్సవలననే, అన్ని రోగములును కుదురును

టైఫాయిడ్ జ్వరము సామాన్యపద్ధతులతో కుదురుట మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము పందొమ్మిదవ శతాబ్దము చివరభాగమువరకును సన్నిపాతజ్వరమునకు తీవ్రాతి తీవ్రమైన మందుల పోసినారు

పాదరసము, సౌవీరముల నిర్భయముగానే వాడేవారు కాని యేమియు గుణము కనపడేదికాదు ఇరువదవ శతాబ్దములో మందులవాడుట మానినారు శుభ్రముగా స్నానము చేయించి గాలి వెలుతురులలో పడుకొన బెట్టుచున్నారు ప్యారిస్ వియన్నా నగరములలో జరిగిన పరిశోధనా ఫలిత ముగా ప్రపంచములో యీ మార్పువచ్చినది హోమోపతీ వైద్యమున్నూ యిందుకు సహాయకారి అయినది మందుభాగము చాలా సూక్ష్మముగా నుండుటచే హోమోపతీ మాత్రలలో మందుభాగము లేక పోయినందువలన రోగులు చనిపోవుట లేదు మందు వైద్యము వారి మందుయు మ్రింగుట వలనరోగము లేమియు నయముగుటలేదు ’

ఆస్లరుగారికి మందువైద్యములో అత్యద్భుత మయిన పాండిత్యము కలదు రెండు మూడు విశ్వవిద్యాలయములలో పేరు అధ్యాపకులు ఆంగ్లభాష వ్యాప్తిలో నున్నంతవరకు, వీరి గ్రంథములు విద్యార్థులు చదువుచునే ఉందురు పాతమందు వైద్యపద్ధతుల పట్టుకొని దేవులాడే మందువైద్యులకు వీరిగ్రం థములు త్రోవచూపగలవు ప్రకృతివైద్యము వారి సిద్ధాంత

ములు ఆచరణయోగ్యములు కావని హేళన చేసేవారికి, నీయీ గ్రంథము కనువిప్పు చూపగలదు

విశేష పాండిత్యముగల కొద్దిమంది మందు వైద్యులే ఆస్లరుగారి అభిప్రాయమును తెలుసుకొనగలరు. మందు వైద్యులు, తమవద్దకు వచ్చురోగులకు సామాన్య ఆరోగ్య సూత్రముల తెలియజెప్పి, రోగముల నయముచేసిన యెడల, తమకు యిప్పుడువచ్చుధనము రాదు ప్రాక్టీసు పడిపోవును మందులయందు ఆదరణ తగ్గవలెనంటే జనసామాన్యమునకు మందుల వలన కలుగు నష్టము అపకారములు తెలియవలెను వీరి జ్ఞానము అభివృద్ధి కావలెను ఆస్లరుగారి వ్రాతలనుబట్టి మందులవలన రోగములు నయమగుతవి అనే నమ్మకముచేతనే రోగము నయమగు చున్నదిగాని, మందులు తినుటవలన యేమాత్రము రోగములు కుదురుట లేదని మనకు తెలియు చున్నది

ఆస్లర్ పండితుని వ్రాతలలో ఒకవిచిత్రమున్నది ప్యారిస్, వియన్నా నగరములలో జరిగిన పరిశోధనా ఫలితముగా, సన్నిపాత జ్వరమునకు మందులవాడక జల ప్రక్రియలతోనే నయము చేయుచున్నారని ఆస్లరు చెప్పుచున్నాడు వీరు తప్పుత్రోవల పడినారనిచెప్ప సాహసించుచున్నాము ఎందుకంటే ముప్పది సంవత్సరముల క్రితమే ప్రకృతిశాస్త్రజ్ఞులు యీ అభిప్రాయముల వెలిబుచ్చినందుకే ప్రభుత్వములు వారిని నిర్బంధించిరి ప్రీస్నిట్జ్, బిలు, కూనే, ఫాదరునీపు మొదలగు వారందరును మామూలు ప్రక్రియల వలననే రోగములు కుదురునని చెప్పినందుకే శిక్షను ఆయాప్రభుత్వములు వేసినవి మానవ ద్రోహు

లని ప్రచారము చేసినారు కొంతకాలము జరిగిపోయిన తరువాత బెర్లినులోని సుప్రసిద్ధమందు వైద్యుడగు (బ్రాన్ డట్ జల ప్రక్రి) యను గూర్చి తమ అభిప్రాయములను వెలిబుచ్చినారు

సన్నిపాత జ్వరము యీ జలప్రక్రియవలననే కుదురునని తెలియచెప్పినాడు వీరి అధికారముద్ర పడుటకో మిగిలిన మందు వైద్యులందరును యీసిద్ధాంతముల శిరసావహించి యీ జల ప్రక్రియను వాడుట మొదలుపెట్టినారు

మందులతో టైఫాయిడ్ జ్వరమును నయముచేసినపుడు నూటికి యేబదిమంది చనిపోయేవారు జలప్రక్రియతో నయముచేసినపుడు నూటికి అయిదుగురుమాత్రమే చనిపోయిరి

జలప్రక్రియలవలన సన్నిపాతజ్వరము నయమైనట్లు మాంస సంతానిక సర్పి, మశూచికము, మేదో మజ్జాగత జ్వరము ఆమా శయ వ్రణము, మొదలగు తరుణరోగములన్నీ కూడా యీప్ర క్రియల వలననే కుదురునని తెలిసికొనలేకున్నారు మామూలు జలప్రక్రియవలననే యీరోగములు కుదురునపుడు జ్వరనివా రిణులు కఫనివారిణులు సన్నిపాత భైరవులతో పనిలేదు

హోమోపతీమందులలో మందుభాగము చాలా సూక్ష్మ ముగానుండును గాన రోగముల నివారింపలేదని మందువైద్యులు దురభిప్రాయపడుచున్నారు వీరి అభిప్రాయము అర్థరహితము నిరాధారము మానవదేహముసూక్ష్మాతిసూక్ష్మకణములసమూ హామని మన మిదివరకే చదివినాము ఈ కణములను మైక్రోబి మాలసమూహములు అట్టి సూక్ష్మమైక్రోబిమాలమీద మందు లలోని సూక్ష్మభాగము పనిచేయుననుటలో ఆశ్చర్యమేమీ లేదు

అప్లరుచెప్పినట్లు మందులవలన రోగములు కుదరక పోయినప్పటికినీ అపకారముమాత్రము యెక్కువగానే ఉన్నది అలోపతీవైద్యములో చాలా తీవ్రవిషములున్నవి ఇంత తీవ్ర విషములు మరేవైద్యములోనూ లేవు దేహములో యేయే మందుచేరినదీ కనీనికను చూచిచెప్పగలము కొన్నిలోహములు వాటికి అనురాగముగల అవయవములలో చేరును లోహములు తాముచేరిన అవయవములనేగాక పరిసర అవయవముల నన్నిటిని పాడుచేయును ఇట్లా పేరుకొన్న ఖనిజరూపమగు లోహములు పరిసర అవయవములను పాడుచేయుటవలన కాలిక రోగములు పుట్టుచున్నవి

రాజాధిరాజుల ఆరోగ్యమును యెప్పటికప్పుడు సరిచూచు వైద్యశేఖరులందరును మందుల ప్రతాపమునుగూర్చియు శస్త్రముల ఉపయోగమునుగూర్చియు నొక్కివక్కాణించినారు అంతనిర్మొగమాటముగా మాటలాడుట ఆ వైద్యశేఖరులకే చెల్లినదిగాని మరొకరెవరునూ యింతనిర్భయముగా మాటలాడ లేరు పాతమందువైద్యపద్ధతులలోని లోపములను తెలుసు కొన్నవారెవరునూ యిట్లు మాట్లాడరు సంపాదన తగ్గునేమో నని భయముచేతను యింతనిర్మొగమాటముగ మాటలాడ వచ్చును మందులవాడుటవలన సన్నిపాతజ్వరము కుదరదనియు మామూలు జలప్రక్రియలవలననే అది కుదురుననియు ప్రకృతి వైద్య నిపుణులగు బిల్జుకుహునేలు ముందుగా తెలియచెప్పి నారు ఈ మార్పునకు మందువైద్యులు యెట్టి సహాయమును చేయలేదు మీదుమిక్కిలి అవరోధములకూడా కల్పించినారు అమెరికాజర్మనీలలో కొత్తవైద్యమునకు ఉన్నప్రచారమువలననే

సన్నిపాత జ్వరమును మందు లేమియు చేయలేవనియు, గాలీ, నెలుతురులతోనే కుదురుననియు అచ్చటి మందువైద్యులు తెలుసుకొని తమ పాత సిద్ధాంతముల మార్చుకొనిరి మందుల వలన ఆవంతయు ఉపయోగము లేదు అని ఉన్నసంగతి ఉన్నట్లు చెప్పినందుకు ఆస్లరు పండితునికి కృతజ్ఞులము అన్ని మందులు అపకారులే అని చెప్పుటలో ఈ పండితుడు అతివాది అనే చెప్పాలి అన్నిమందులు అపకారమునేచేయవు అన్నిమందులూ ఉపకారమును చేయవు అపకారము చేయుమందులు గలవు ఉపకారముచేయుమందులు కలవు అన్నిమందులు అపకారమునే చేయును రక్తములోని భాగములను యథాప్రకారము ఉంచి నరములకు శక్తినిచ్చు మందులన్నీ ఉపయోగకారులే మందుల తోనే రోగములు నయమగుననిచెప్పుట మందులు లేకపోయినా రోగము కుదురునని చెప్పుట రెండు అతివాదములే మందులతో విసిగి వేసారిపోయినవారే ఈ రెండవవాదనను యెత్తుకొందురు

## మందులగూర్చి ప్రకృతివైద్యమువారి అభిప్రాయము

మందులలో 2 రకము లున్నవి దేహమునకు అపకారము చేయునవి, దేహమునకు ఉపకారముచేయునవి దేహములోని నిర్మాణశక్తికి వ్యాఘాతము కలుగజేయుని తరుణరోగములను స్వాస్థ్య సంకటములను అణచిపెట్టని మందులు దేహమునకు ఉపకారము చేయుచు దేహములో ఎప్పటికప్పుడు తయారగు మురుగును విడగొట్టి వాటికి అనుకూలమగు త్రోవలద్వారా బయటకు పంపుటకు సహాయపడు మందులను ఉపయోగకారులే ఈ మందులు ఘనరూపమగు మలినములను, మూత్రస్వేదములు గాను, వాయురూపమగు మలినములు ఊపిరితిత్తులద్వారాను

వెలికిపోవుటకు వీలుపడును మలినములను పైన చెప్పినవిధముగా విడగొట్టలేని మందులన్నీ అపకారమును కలుగజేయునవే తరుణ రోగములలోకన్నా కాలికరోగములలో దేహములో రోగ పదార్థమెక్కువగా పేరుకొనును దేహములో తయారైనమురుగు బయటకు పోవుటకు సహాయపడు లోహములు తక్కువగును రక్తములోని రక్తభాగము తగ్గుటచేత పాండురోగములు వచ్చుచున్నవి రక్తములోని యినుము తగ్గిపోవును ఈ యినుమే ఊపిరితిత్తులలోని కుటికలలో ప్రాణవాయువును యెప్పటికప్పుడు స్వీకరించు చుండును ఇదే నరములలోనికి పోయి బలము నిచ్చును రక్తములో యినుముతగ్గుటచేత, రక్తము ప్రాణవాయువును స్వీకరింపదు నరములు శక్తిహీనములగును, రక్తములోని గంధకభాగముకూడాతగ్గిపోవును దేహములో తయారగు (మురుగు) బొగ్గుపులుసుగాలి, గంధకముతో కలిసి బహిష్కార్యావయవములద్వారా బయటకుపోవును గంధక భాగము తగ్గిపోవుట చేత రక్తము ఊపిరితిత్తులలోని ప్రాణవాయువును తీసికొనదు ఎక్కువ ప్రాణవాయువు ఉన్ననేగాని, దేహములో తయారగు బొగ్గుపులుసుగాలి బైటికిపోదు మందువైద్యమువారు చెప్పునట్లు రక్తములోనియినుము భాగము తగ్గిపోవుటవలన పాండురోగములు వచ్చుటలేదు

రక్తములోని గంధకభాగము తగ్గుటచేతనే పాండురోగము వచ్చుచున్నది ఇనుము గంధకము యెక్కువగానున్న సేంద్రియములగు ఆహారపదార్థములుగాని దేహములోని

నిర్మాణశక్తికి హానికలిగించనిమందులుగాని తినినయెడల పాండు రోగములు నయమగును

ఆమవాతము కీళ్ల వాతము,కొన్నిరకములగు మధుమేహము మూత్రిక్లామ్లము యెక్కువగా చేరుటచేతనే వచ్చుచున్నవి పప్పుపదార్థములు యెక్కువగా తినుటచేత అరగనిమురుగు లోపలనే నిలచిపోవుచున్నది

రక్తములోని క్షారసంపద తగ్గిపోయినపుడును యీ రోగములు రావచ్చును

రక్తములోని గంధకము మెగ్నీషియము,లిథియము, పొటాషియము, మొదలగు లోహములు జీర్ణక్రియలో తయారగు ఆమ్లములను విడగొట్టి, బహిష్కార్యావయవములద్వారా బయటకు పంపును దేహములో తయారగు ఆమ్లమునకును, రోగములకును చాలాదగ్గరసంబంధమున్నది ఆమ్లము యెక్కువగుట వలన వచ్చినరోగములన్ని క్షారసంపద యెక్కువగానున్న ఆహారపదార్థములు తినుటవలన పోవును నరములు, కండరములు బాగా బలముగా ఉండవలెనంటే పొటాషియము, భాస్వరములు సేంద్రియరూపములో యెక్కువగాగల ఆహారపదార్థముల తినవలయును

ధాతుశక్తిని మితముగానే ఖర్చుచేయవలెను అనవసరముగా దుర్వ్యయము చేయరాదు సేంద్రియలవణములుగల ఆహారపదార్థముల తినినయెడల ధాతుశక్తి దుర్వ్యయము కాదు. తోటకూర, పొన్నగంటి, బచ్చలి, ఆకుకూరలలోను బీర, సొర, దోస, దొండ, పొట్ల మొదలగు కాయకూరలలోను, నారింజ, బత్తాయి, కమలా, ఆపిల్ మొదలగు పండ్లలోను, ఈ సేంద్రియ

లవణములు యెక్కువగా ఉండును పాండురోగుల రక్తములో యినుము తక్కువగా నుండును యినుము తక్కువగా ఉన్నది గదా అని ఖనిజరూపమగు యినుమును ప్రవేశపెట్టరాదు ఖనిజములు దేహమునకు విజాతీయములగుటచేత ఖనిజరూపమగు లోహము రక్తముతో కలియదు సారూప్యమును పొందదు దేహములో యేమూలనో పేరుకొనును సేంద్రియలవణములు గల ఆహారము మితముగా తిననపుడే మంచిగుణము కలుగును అజీర్ణరోగులుకూడా యీ సేంద్రియలవణములుగల ఆహారమునే పుచ్చుకొనవలయును మితముగా తినినపుడే సేంద్రియ లవణములుగల ఆహారము మందుగా ఉపయోగించును రక్తములో యేభాగము లోపించినదో తెలుసుకొని ఆభాగమును పూర్తిచేయు సేంద్రియలవణము లుగల ఆహారపదార్థములనే తిని నపుడు రోగములు రావు వచ్చినరోగములైననూ తేలికగానే తగ్గిపోవును అందువలననే ప్రకృతిచికిత్సకులు ఆహారమునకు ప్రాముఖ్యమిత్తురు నిత్యకృత్యములలో మానవులకు అవసరమైన సేంద్రియలవణము లన్నియు కాయలలోను, పండ్లలోను, కూరగలలోను ఉన్నవి ఎక్కడికోపోయి ఖనిజములను వెతికికొని రావలసినపని లేదు

చాలా తరములనాడే మానవులు ప్రకృతినుండి విడివడి నారు ప్రకృతితో సంబంధము లేకుండా చేసుకొన్నారు జగన్మాతయగు ప్రకృతి ఆదేశముల విస్మరించినారు నిత్యమూ నిరంతరమూ అపచారము చేయుటచేత, మన జీర్ణయంత్రములును చెడిపోయినవి పాటవము తగ్గిపోయినది

ఆకుకూరలలోను పండ్లలోను కాయకూరలలోను సేంద్రియ రూపములో లవణములన్నియు ఉన్నవి ఆకుకూరలలో క్యాబేజి ముఖ్యము వీని కోరసము పిండుటకు ప్రత్యేకమగు పనిముట్లు గలవు ఒకతడవే పిండి యీరసము నిలవ ఉంచుకొనక యేరోజున కారోజు యీరసమును పిండుకొనవలయును

## మందులు

మనము తిను ఆహారము పులిసి విపాకమునొంది జీర్ణమగును ఆహారము సరిగా జీర్ణమైననే గాని మనకు శక్తిలభించదు సరిగాజీర్ణమగుటకు కొన్నిద్రవములు కావలయును ఈ ద్రవములన్నియు దేహములోనే తయారగునని వెనకటి శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడినారు

నవీన పరిశోధనలనుబట్టి చూచినయెడల మనము తిను ఆహారపదార్థములలోని మైక్రోజిమూలవలననే విపాకము కలుగుచున్నది గాని దేహములో తయారగు ద్రవముల వలన విపాకము కలుగుట లేదు

మనము తిను ఆహార పదార్థములు ప్రాణవంతములును సేంద్రియ లవణములతో కూడినవి గాను ఉండవలయును

హోమియోపతీ మందులలోను ప్రమాదకరమైన మందులు గలవు ఆమందులలోను నిరపాయకరమైన మందులనే వాడవలయును నిరపాయకరమైన మందులనగా, దేహములోని నిర్మాణ శక్తికి అనుకూలముగా ఉండునవి రక్తభాగములను సరిగా ఉంచునట్టి మందులు దేహములో తయారగు మురుగును బయటకు పంపుటకు అనుకూలపడు మందులూ రక్తములో లోపించిన ధాతువులను పూర్తి చేయు మందులనే వాడవలెను రోగనిరో

ధక శక్తిని వృద్ధిచేయు మందులను వాడవచ్చును ఇట్లు చెప్పు చున్నామని మందులన్నింటిని వాడమని మాఅభిప్రాయము అని మాచదువరులు అపోహపడకుందురుగాక చెమటను కలిగించు మందులు చెమటను వారించు మందులు, కఫము ను కలిగించు మందులు, కఫమును వారించు మందులు, మూత్రమును వృద్ధి చేయు మందులు, మూత్రమును వారించుమందులు, మలవిమోచనము చేయుమందులు, మలమును స్తంభింపజేయు మందులు, ఇవన్నీ విషౌషధము లేను కాన అపాయకరములు

## నిర్జీవఖనిజములు–విషపూరితఖనిజములు

భూమిలోనుండి త్రవ్విన లోహములతో మందుల తయారుచేయవచ్చునా రాదా అను విషయములో వాదోపవాదములు గలవు శాస్త్రవేత్తలు యెవరికితోచిన అభిప్రాయమును వారు సెలవిచ్చారు వాడవచ్చుననుటకును వాడరాదనుటకును చాలా ఆధారము లున్నవి అలోపతీవైద్యమువారు భూమినుండి త్రవ్విన ఖనిజములతో మందుల తయారుచేయవచ్చుననే అభిప్రాయపడినారు అమలులోనున్న ఆయుర్వేదవైద్యులును ఇదే అభిప్రాయపడినారు ఖనిజములగు లోహములు లేని అలోపతీ మందులుగాని ఆయుర్వేదమందులుగాని లేనే లేవు

ఇనుము, గంధకము, పాషాణము, అయోడిన్ మొదలగు ఖనిజరూపమగు లోహములు లేని అలోపతీమందులుగాని ఆయుర్వేదమందులలో పాదరసము, తామ్రము, ఇంగిలీకము మొదలగు ఖనిజములగు లోహములు లేని ఆయుర్వేదమందులు

లేవు రెండు వైద్యములవారు పాదరసమును రసరా జనిపిలుతురు ఒక్క పాదరసమునుండె కోట్లకొలదీ మందులు తయారు చేతురు

భూమిలోనుండి త్రవ్విన లోహములనుండి మందులు వాడినందువలన కలిగిన ఫలితములను వీరు ప్రత్యక్షముగా చూడ లేదు వీరు ప్రత్యక్షముగా చూచినట్లయితే ఖనిజములను మందులుగా వాడరు మానవదేహమునకు కావలసిన ధాతువు లన్నీ సేంద్రియరూపములో కూరలలోను పండ్లలోను గలవు లోపించిన ధాతువులను ఖనిజరూపమగు లోహములతో పూర్తి చేయనవసరము లేదు సేంద్రియరూపములో గల కూరలతో గాని, పండ్లతోగాని పూర్తి చేయవచ్చును

ఖనిజములు దేహమునకు విజాతీయము లగుటవలన రక్త ముతో కలిసిపోవు దేహములో యేదో ఒకమూల చేరును ఏమూలచేరినదీ కనీనికనుచూచి చెప్పగలము దేహావసరము నకుమిూరి కూరలుగాని, పండ్లనుగాని, తినినయెడల అవి దేహ ములో చేరుకొనవు బయటకు వెళ్లిపోవును

ఈ ఒక్కసూత్రమునుబట్టే సృష్టిలోని యేవస్తువులు మానవునకు అవసరమో యేవి తినవచ్చునో యేవి తినరాదో తెలుసుకొనవచ్చును రక్తములో తక్కువైన లోహభాగమును ఖనిజములతో పూర్తిచేసినయెడల దేహమునకు శక్తి రాక పోవుటయేగాక ఆయాలోహములు వాటికి అనురాగముగల అవయవములలో చేరుకొనును ఆయాఅవయవములు తెలుపు కనీనికలోని భాగములలో కొన్నిరంగులు కనబడును చేరుకొనని యెడల ఆయాస్థానములలో ఆరంగులు కానరావు

రక్తములో యినుము తక్కువగానున్నదని ఖనిజరూప

మగు యినుమును దేహములోనికి ప్రవేశపెట్టినట్లయితే ఆ యినుము జీర్ణాశయములో పేరుకొనును చిన్న ప్రేగులలోను పేరుకొనవచ్చును జీర్ణాశయమును తెలుపు కనుపాపచుట్టూ నుండు మొదటిఆవరణలో తుప్పురంగు కనపడును దేహమునకు అవసరమైన లోహములలో సోడియము ఒకటి ఇదికూడ సేంద్రియరూపములోనే తినవలయును సేంద్రియరూపములో కూరలలోను పండ్లలోను గలదు రక్తములో సోడియంభాగము తగ్గినదిగదాయని సోడాఉప్పును తినినయెడల కనీనిక వెలుపటి ఆవరణచుట్టూ తెల్లనిఉంగర మేర్పడును సోడియం లవణములు పొటాషియంలవణములు కనీనిక వెలుపటి ఆవరణలో చేరును వెలుపటిఆవరణలో తెల్లనిఉంగర మేర్పడును దేహములో గంధకము తక్కువైనదని ఖనిజరూపమగు గంధకమును ప్రవేశ పెట్టినయెడల చిన్నప్రేగులలోను జీర్ణాశయములోను గంధకము పేరుకొనును జీర్ణాశయమును తెలుపు కనీనికలోని ఒకటవ ఆవరణలో పసుపురంగు కానవగును

అయోడిన్ను ఖనిజరూపములో సేవిస్తే, కనీనికలోని వివిధ భాగములలో యెర్రని మచ్చలు కానవగును

భాస్వరమును ఖనిజరూపములో సేవిస్తే యే అవయవ ములోనైనా చేరవచ్చును ఆ అవయవమును తెలుపు ప్రతినిధి స్థానములో, తెలుపు, పసుపు కలిసిన రంగుగా కానవచ్చును మామూలుగావాడుకునే ఉప్పుయెక్కడ పేరుకొన్నదీచెప్ప లేము

ఈ శాస్త్రములో ప్రవీణు లెవరునూ ఏ అవయవములో ఉప్పు పేరుకొన్నదీ చెప్ప లేరు

ఉప్పు భూమినుండి త్రవ్విన వస్తుసమ్మేళన మైనప్పటికిని

యీఉప్పుఫలానారంగులో ఫలానా అవయవములో కనబడు నని చెప్పలేము రక్తములో ఉప్పదనము యెక్కువగా ఉండు టచే మనము తినిన ఉప్పు దేహామునుండి మలముగా గాని, మూత్రముగాగాని తేలికగనే వెళ్లిపోవచ్చును లేదా ఉప్పుసోడియం క్లోరెడ్ అగుటంవలన,సోడియంగాను క్లోరిన్‌గాను విడిపోవచ్చును విడిపోయి మిగతా వాటితో కలిసి పోవచ్చును ఖనిజములన్నిటి లోనూ ఉప్పునే విస్తారముగా వాడుదుము జంతువులు కూడా తాము తినువస్తువులలో ఉప్పుతక్కువైనపుడు చవిటినేలను నాకు టయు గలదు మానవులెట్లు ప్రకృతి మార్గములను విస్మరించి దురలవాట్లకు లోబడినారో అట్లే వీరు పెంచు జంతువులన్నీ వాటికి సహాజముగా ఉండవలసిన అలవాట్లను వదలిదురలవాట్లకు లోనైనవి గుర్రములకు పొగాకు పెట్టుట అలవాటుచేస్తే పది పది హేనుమంది త్రాగే, తినే పొగాకున్ను ఒక్క గుర్రముతినగలదు

ఒంటికి ఉప్పుకూడా కొంతవరకు అవుసరమే అవసరము గదా అని మితిమీరి తినరాదు ఉడకబెట్టినపుడు ఆయా పదా ర్థములలోని లవణములు క్రిందికి దిగిపోవును అందువలననే పచ్చిగానున్నపుడు ఉప్పగా నున్నకూరలు ఉడక బెట్టిన తరువాత అంత ఉప్పగా నుండవు ఉప్పగా నుండవుగనుక ఉడకబెట్టిన కూరలలో కొద్దిగా ఉప్పువేయువలెను

సముద్రముమీద ప్రయాణముచేయు నావికులకు స్కర్వీవ్యాధి యెక్కువగా నుండెడిది కూరలు పండ్లు యెప్పటి కప్పుడు దొరకకపోవుటవలన మురిగిపోయి వాసనపుట్టకుండా ఉప్పులో ఊరవేసిన మాంసపుముక్కలనే వారు తినెడవారు పళ్ళచిగుళ్ళ వెంట నెత్తురుపడుచుండెడిది కండరములలోని పటు

త్వము తగ్గిపోయెడిది ఒళ్లునొప్పు లుండెడివి పండ్లను, కూరలను తినుట మొదలుపెట్టగానే ఆ వ్యాధి అంతరించినది మానవ దేహమునకు కావలసిన లవణములన్నీ సేంద్రియరూపములో కూరల లోను, పండ్లలోను ఉండును గాన మానవకోటి ప్రమాదరహితమైనవాటినే స్వీకరించవలయును

భూమిలోనుండి త్రవ్విన లోహములను మందులుగా వాడుట మానవలయును

దేహములో తయారగు మురుగు యెప్పటికప్పుడు బయటకుపోవు వసతులను కలుగచేస్తే లోపల యేమీ నిలవవుండదు

లోపల పేరుకొన్నట్లు కనీనికలో గుర్తులేమీ కానరావు పచ్చికాయలలోని జీవసత్తులు పోషకద్రవ్యమును రక్తములో తేలికగా కలిసిపోవును దేహములోని నాల్గుబహిష్కారావయవముల ద్వారాను తేలికగా బయటకు పోవును ఎండు ధాన్యములలోని జీవసత్తులు, పోషకద్రవ్యముు కొంత కష్టము మీదగాని రక్తముతో కలిసిపోవు సారూప్యమును పొందవు కొంతశ్రమ చేస్తేగాని బయటకు పోవు ఖనిజములగు లోహములు దేహమునకు విజాతీయములగుటవలన రక్తముతో కలియవు దేహమునకు పుష్టి నివ్వవు మందులుగా మానవ దేహములోనికి ప్రవేశపెట్టబడిన ఇనుము అయోడిన్ మొదలగు ఖనిజములు, బాగా పరిశ్రమ చేసినా బయటకు పోవు పాషాణము, గంధకము మొదలగు ఖనిజములతో తయారు చేసిన మందులును దేహమునుండి బయటకుపోక లోపలనేపేరుకొనును మానవుల జీర్ణయంత్రములన్నియు ఫలములను, శాకములను మాత్రమే జీర్ణము చేయగలవు ఫలములలోగాని, శాకములలో

గాని అరగక మిగిలిపోయినదే అధోముఖముద్వారా బయటకు వెళ్ళిపోవును ప్రకృతి ఉద్దేశము కూడ అదే కావచ్చును తన సంతానము తాను నిర్దేశించిన ఫలములను భుజించుటకును, అవియే జీర్ణమగుటకును అనుకూలమైన అవయవములనే యేర్పర చినది ఖనిజములు మానవదేహమునకు అనవసరములు గనుకనే మానవుల జీర్ణయంత్రములు వాటిని జీర్ణము చేసికొనలేవు వీలుగాదు గనుకనే నాలుగు త్రోవలలో యే ఒక త్రోవనైనా బయటకు పోవ వీలులేదు గాన లోపలనే పేరుకొనును ప్రాణ వంతమైన దేహములో నిర్జీవమైన ఖనిజములు ఉండవు అదీకాక ప్రకృతి ఉండనీయదు పేరుకొనినవి ఊరుకొనవుగనుక చేరిన చోట హంగామా మొదలుపెట్టును ప్రకృతి వైద్యమునకుకూడా లొంగని మొండిరోగములన్నీ మందులు పేరుకొనుట వలన వచ్చినవేను పోపులు మసాలాలు పిండివంటలు మొదలగు కృత్రి మాహారములు తినుటచేత అరగక మిగిలిపోయిన మురుగైనా ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడు అయినా బయటకు వెళ్ళి పోతుంది అట్లా బయటకు పోని మురుగువలన వచ్చేరోగాలైనా కుదురవచ్చును లోపల పేరుకొన్న ఖనిజముల వలన కలిగే రోగాలు మాత్రము యెన్నటికీ కుదరవు ఏవైద్యము వలనను నయము కావు

మల, మూత్ర, స్వేద, నాసికా రంధ్రములు నాలుగున్నూ మనము తినిన ఆహారము జీర్ణమగునపుడు కలుగు మురుగును బయటకు పంపివేయగలవు కాని ఈ ఖనిజములను బయటకు పంపలేవు

గండమాలతో బాధపడువారు మాంసముగాని, కాఫీ, టీ, బ్రాంది, మొదలగు పానీయాలను సేవించినట్లయితే క్షయ రోగము వస్తుంది కర్కటవ్రణము కలుగుతుంది పైదురలవాట్లను మాని లోపల చేరిన మురుగు బైటకుపోవు వసతుల కల్పిస్తే ఆదుర్భరవ్యాధులేమీ రావు లోపలదాగిఉన్న రోగాలుకూడా చాలా తేలికగానే కుదురును

పాదరసము, పాషాణము, క్వైనైను మొదలగు ఖనిజములు మెదడులోను, వెన్నెముకలోను, దేహములోని కుటికలలోను, నరములలోను, కండరములలోను పేరుకొనును పేరుకొన్న అవయవములను పాడుచేయ మొదలుపెట్టును ప్రకృతివైద్య చికిత్సా ప్రక్రియలవలననూ యీరోగములు నయముకావు.

మానవుల దేహములో తక్కువైన లోహములన్నీ ఖనిజములతో చేసిన మందులుపోస్తే త్వరగా పూర్తిఅగునను మాట నిజమే కాని అవి దేహామునకు విజాతీయములగుటచే రక్తములో కలియక పోయినందున దేహమునకు యేమాత్రమూ శక్తినివ్వలేవు దేహములోని అంతరవయవములలో, యేదో ఒకమూలన పేరుకొని యుండును

సృష్టిలో అనికరకములగు ఫలముల్ను గలవు తన దేహములోని రక్తములో యే లోహము లోపించినదో తెలిసికొని, ఆయాలోహముగల పండ్లనేవాడవలయును రోగము రాకుండా కాపాడుకొనుట మంచిదిగాని, వచ్చిన తర్వాత చూచుకుందాములే అని అనుకొనుటకన్న బుద్ధిమాలినపని మరొకటి లేదు.

దేహములోని రక్తముతక్కువై తేగాని పాండురోగము రాదు కడుపులో నొప్పిగా ఉన్నదిగదా అని సోడాఉప్పు తింటే ఉపయోగము లేదు

వాపులకు టించర్ అయొడిన్ రాచి ప్రయోజనము లేదు. గజ్జికి రసముమందు రాస్తేను గుణములేదు ఈ మూడులోపాములు వాటికి అనుకూలమగు అవయవములలో పేరుకొనును జగన్మాతయగు ప్రకృతిని ర్దేశించిన ఆహారము వదలిపెట్టి కృత్రిమ ఆహారముం స్వీకరించుటచేతనే మన జీర్ణయంత్రములు నానాటికి బలహీనములై చెడిపోయినవి ఈ అపచారమే నిరంతరము జరుగుచుండుటచేత ఈ ఆహారమును జీర్ణముచేయుటకుకూడ ఉద్రేకముకలిగించు పదార్థములే అవసరమైనవి

కూరలు కొత్తవి యేరోజుకారోజు వండుకొని తినుట మంచిది నిలువసరుకును వాసనకూడా చూడరాదు మందులు చేయుపని ఆహారమే చేయునపుడు మందులవాడ నవసరమే లేదు

---

## ౨౩
## హోమోపతీ

నేడు ప్రచారములోనున్న మందులన్నిటిలోను హోమోపతీవైద్యము ఉత్తమమైనది

ఆలోపతీమందులు దేహమునకు చేయు అపకారము మరేమందులును చేయవు

హోమోపతీమాత్రలలో మందుభాగము చాలాకొద్దిగా నుండును అసలు లేనేలేదని చెప్పవచ్చును అంతసూక్ష్మముగా ఉండుటచేత ఈమందులునిరుపయోగమని చెప్పువారును గలరు.

హోమోపతీమందును తయారుచేయుట మందుపరిమాణమునకు పదిరెట్లు పరిమాణముగల పాలపంచదారను కలుపుదురు ఈ రెంటినీ సన్నికల్లులోవేసి యిరువదినిమిషముల పాటు నూరుదురు

ఆ మందు శక్తి అందురు వచ్చినమందులో కొద్దిపరిమాణమును తీసికొని దీనికి పదిరెట్లు పాలపంచదారను కలుపుదురు ఈ రెంటినీ వెనుకటిచూదిరిగనే సన్నికల్లులోవేసి యిరువదినిమిషములకాలము నూరుదురు ఆమందు శక్తి 2× అందురు మూడవ పర్యాయముకూడా దీనిలో కొలదిపరిమాణము గల మందును తీసుకొని దానికి పదిరెట్లపరిమాణముగల పాలపంచదారను కలిపి యీ రెంటినీ సన్నికల్లులోవేసి వెనుకటిమాదిరిగనే యిరువది నిమిషములు నూరుదురు అప్పుడు తయారైన మందుశక్తి 3× ఇట్లాగే 50 × వరకు శక్తిగలమందును తయారుచేయవచ్చును ఈ 50 × పాలపంచదార మాత్రలలోని మందుభాగము చాలాకొద్దిగా ఉండును ఒకటివెంట యేబదిసున్నాలుపెట్టి ఆ వచ్చినసంఖ్యతో ఒకటిని విభాగించినయెడల యెంతవచ్చునో అంతభాగమే మందు ఉండును మందుశక్తియెక్కువైనకొలదినీ పాలపంచదారబదులు సారాయి వాడుటయు గలదు

హోమోపతీ మందువైద్య సిద్ధాంతములు చాలా విచిత్రముగా నుండును ఆరోగ్యవంతుని దేహములో ఒకమందు వేసినందువలన యేలక్షణములు కలుగునో రోగికి ఆమందులు యిచ్చినందువలన ఆలక్షణములే తగ్గిపోవును ఈవిషయమునే ఉదాహరణ పూర్వకముగా ఆలోచించుకొందాము బెల్లడోనా మందును పెద్దమోతాదుగా ఆరోగ్యవంతునికియిస్తే తలనొప్పి,

జ్వరము, ప్రలాపము, గొంతు యెండిపోవుట, మొదలగు లక్షణములు కలుగును చర్మము కందుటయు గలదు ఇవన్నీ మాంస సంతానిక లక్షణములు ఈ లక్షణములు గలవని తెలియగనే హోమోపతీ వైద్యుడు 6× మందు శక్తిగల పాలపంచదార మాత్రను తప్పకుండా యిచ్చును పై లక్షణములన్నియు వెంటనే తగ్గిపోవును

అయితే అలోపతీ మందు వైద్యమునకును, యీ వైద్యమునకును, పెద్ద తేడా లేనట్లుగానే కనపడును రెండు సిద్ధాంతములలోను ఒకటే మందు వాడుచున్నారనికూడా తోచవచ్చును. రెండు వైద్యములలోని మందులలో మందు భాగములో మాత్రము చాలా పెద్ద తేడా ఉన్నది

మాంస సంతానిక రోగమునకును అలోపతీమందు వైద్యమువారును బెల్లడోనామందునే యిత్తురు పది, యిరువది, బొట్లమందును ప్రతి 3 ఘంటలకును యిత్తురు హోమోపతీ వైద్యమందన్ననో 6 × మందును యిత్తురు ఈమందులోని మందుభాగముకన్నా అలోపతీ వైద్యములో మందులోని మందు భాగము నలుబదివేలరెట్లు యెక్కువగా ఉండును ఇంత తీవ్రమైన అలోపతీమందును వేయగనే దేహములోని అవయవములన్నియు వాటిపనిని తాత్కాలికముగా మానుకొనును ఎక్కడి అవయవములు అక్కడ స్తంభించిపోవును మందు వైద్యగ్రంథములన్నియు ఈవిషయమును ఏకకంఠముగా ఒప్పుకొన్న వేగాని యిందులో ఆవంతయూ అతిశయోక్తి లేదు

అవయవముల వ్యాపారము స్తంభించి పోవుటవలన, కుటి కలనుండి బయటకు రావలసిన మురుగు బయటకు రాక అచ్చ టనే నిలిచి పోవును

హోమోపతీ పంచదారమాత్రిలలోని మందుభాగము చెప్పలేనంత సూక్ష్మముగా నుండును ఈసూక్ష్మభాగము కుటి కలలోని మైక్రోజిమాలను ఉద్రేకపరచును అలోపతీమందుల లోని మందుభాగము యెక్కువగుటవలననే కుటికల వ్యాపారము స్తంభించిపోవును

దేహములో పేరుకొన్న రోగపదార్థమును బయటకు పంపుటకు ప్రకృతిచేయు ప్రియత్నమే తరుణరోగమని మనము లోగడనే చదువుకొన్నాము మనముచేయు ప్రక్రియలునూ, ఉప చారములునూ, ప్రకృతికి సహాయము చేయునవిగానే ఉండవల యును అపచారము చేయునవిగా మాత్రము ఉండరాదు మందుభాగము సూక్ష్మాతిసూక్ష్మ మగుటవలన, హోమోపతీ పంచదార మాత్రలునూ ప్రకృతికి సాయమునే చేయును మందు భాగము విపరీతముగా ఉండుటవల్ల అలోపతీమందులు దేహము నకు చెప్పలేనంత అపకారము చేయును

## ప్రకృతి సూత్రములకును హోమోపతీ వైద్యమునకును గల సంబంధమును విచారిద్దాము

హోమోపతీవైద్యమును సుప్రసిద్ధుడగు హానిమన్ కను గొనెను ఈవైద్యసిద్ధాంతముల ప్రకారము ఆరోగ్యవంతునిలో రోగమును కలుగచేయు మందులే రోగిలో రోగలక్షణములను తీసివేయును

క్వైనైను వలన దేహామునకు జరుగు అపకారములను పరిశోధించుచున్నపుడు హానెమన్‌కు యీసిద్ధాంతములు తట్టెను ఈసిద్ధాంతమే హోమోపతీ వైద్యమునకు మూలమైనది,

హానెమన్ గాని అతని అనుయాయులుగాని పై సిద్ధాంతమును అను శాస్త్రసమ్మతముగా నిర్వచించలేకపోయిరి రోగమును కలిగించు మందు రోగలక్షణముల నెట్లు తీసివేయునో సరిగా చెప్పలేదు సుప్రసిద్ధుడగు హానెమన్ తన "ఆర్గనన్" అను పుస్తకములో కూడ దీనికి గతిని కల్పించలేదు అందువలననే అలోపతీ వైద్యమిత్రులు హోమోపతీ వైద్యమునుగూర్చి వికటాట్టహాసమును చేస్తున్నారు హోమోపతీ వైద్యసిద్ధాంతమును శాస్త్రసమ్మతముగా నచ్చచెప్పితేనేగాని నమ్మమంటున్నారు హోమోపతీమందులు వాడకపోయినను రోగములు కుదురు ననుచున్నారు

## ప్రకృతి సూత్రములకును హోమోపతీ వైద్య సూత్రములకును గల సంబంధమును విచారిద్దాము

ప్రకృతి వైద్యమునకు మూడు ప్రధాన సూత్రములు గలవు అవేవన,

(1) ప్రతితరుణరోగమువలనను దేహమునకు మేలేగాని, కీడేమియు కలుగదు రోగపదార్థమును బయటకుపంపుటకు ప్రకృతిచేయు ప్రయత్నమే తరుణవ్యాధి రోగపదార్థములోపల ఉన్నదని చెప్పునట్టివే బహిర్లక్షణములు రోగపదార్థము బయటకు పోవుటవలన దేహమునకు మేలే కలుగును మనమిచ్చు మందుకూడా రోగలక్షణములను వృద్ధిచేయును అనగా రోగ

పదార్థమును బయటకు పంపుటకు ప్రకృతికి సహాయముచేయును రోగపదార్థము లోపల ఉండియే అవయవమును బాధించునది బహిర్లక్షణములబట్టి తెలియునుగాన ఆ లక్షణములను వృద్ధి చేయుమందునే ఉత్తమముగాన రోగపదార్థము బయటకుపోయి దేహమునకు మేలే కలుగును

2 హోమోపతీ మందులు అలోపతీ మందులమాదిరిగా తరుణరోగములను అణచి వేయవు కాదుమిక్కిలి రోగపదార్థము బయటకు పోవుటకే సహాయపడును నివారణ చేయును గాని, అణచివేయవు

(3) మానవదేహము అనేకకణముల సమూహ మగుట వలన, కణములకు యేలక్షణములుండునో దేహమునకు ఆవేలక్షణము లుండును కణము ఆరోగ్యముగా ఉంటే దేహమూ ఆరోగ్యముగా ఉండును కణము అనారోగ్యముగా ఉంటే, దేహమూ అనారోగ్యముగా ఉండును కణము ఆరోగ్యగాము ఉండవలెనంటే దానిధర్మముల నిర్వర్తించుటకు శక్తివంతముగా ఉండేటట్లు చూడవలెను బహిష్కార్యావయవములను ఉద్రేక పరచినందువలన ఉపయోగ మేమియు లేదు విరేచనకారులు, స్వేదకారులు, మూత్రమును జారీచేయు మందులు నిరర్థకములే జీర్ణయంత్రములను ఉద్రేకపరచి జీర్ణావయవములలో యేమీ నిలువ లేకుండా చేసినందువలన యేమీ ఉపయోగము లేదు ఈమందులన్ని జీర్ణావయవములనే శుద్ధిచేయును గాని కణముల లోనికి పోనేపోవు కణములలోని మురుగు అచ్చటనే నిలవ ఉండును.

కణములలో తయారగు మురుగు బహిష్కార్యావయవములద్వారా బయటకు వచ్చును మురుగు కణములలో తయారగునేకాని యీ బహిష్కార్యావయవములలో తయారుకాదు బహిష్కార్యావయవముల ఉద్రేకపరచినంతమాత్రమున లోపలి మురుగు బయటకు రాదు వీటిని ఉద్రేకపరచినంతమాత్రమున ప్రాణవాయువు కుటికలలోనికి పోయి బొగ్గుపులుసగాలి బయటకు పోదు పులిసిపోయిన పదార్థమంతా విశ్లేషము పొందదు మొండివగు కాలికరోగములతో బాధపడుచున్నపుడు దేహములోని కణములు తమలో తయారగు మురుగును బయటకు నెట్టివేయలేవు అటువంటి పరిస్థితులలో రోగలక్షణములకు సరిపోయిన హోమోపతీమందు కణముల నుద్రేకపరచి వానిలోని మురుగును బయటకు నెట్టుటకు సహాయపడును వంశానుగతముగా వచ్చిన గండమాల రోగప్రవణత ఉండి దేహమంతా రోగపదార్థము నిండి ధాతుశక్తి తగ్గిపోయినయెడల రోగ పదార్థము బయటకురాదు ధాతుశక్తి తక్కువగుటవలన రోగపదార్థమును ప్రకృతి బయటకు నెట్టివేయలేదు అటువంటి పరిస్థితులలో సన్నికల్లులోవేసి మర్దనచేసిన గంధకము చాలా కొద్దిగా మ్రింగినయెడల స్వభావసిద్ధమైన లక్షణముల కలుగ చేయును చర్మరోగములు కలుగవచ్చును కుతిక వాపులు రావచ్చును. వ్రణములు పుట్టవచ్చును రక్తము కారిపోవచ్చును

## మందుల పరిమాణము

మానవదేహాలోముని కణములను కణములలోని మైక్రోబిమాను ఉద్రేకపరచవలెనంటే మందు యెంత కావలయును?

పెద్దల కివ్వవలసిన మందు మోతాదును పిల్లలకు ఇస్తే దేహవ్యాపారము స్తంభించిపోయి చనిపోవుదురు పెద్దల కిచ్చు మందుమోతాదు అరగ్రైను అయితే యేడాది పిల్లలకు గ్రైనులో పండ్రెండవ భాగమే యివ్వవలెను పెద్దలకు యివ్వవలసిన మందు మోతాదు, పిల్లలకు యివ్వవలసిన మందు మోతాదు యీవరుసలో ఉంటే అనేకకోట్ల కణముల సమూహమైన మానవదేహములోని కణములకు ఎంతపరిమితిగలమందు మోతాదు అవసరమో బుద్ధిమంతులగు మాచదువరులే గ్రహింతురుగాక కణములోని సూక్ష్మభాగమైన మైక్రోజిమాకు యెంత మందు కావలెనో మీరే ఊహించుకోండి

హోమోపతీ పంచదారమాత్రలలోని మందుభాగము చాలా కొద్దిగా నుండును గాన మానవదేహములోని కణముల మీదనూ కిణములలోని మైక్రోజిమాలమీదనూ పనిచేయును వాటిలో తయారగు మురుగును బయటకు నెట్టుటకు వాటికిశక్తి నిచ్చును పెద్దలకు యివ్వవలసిన మందుమోతాదు పిల్ల కిచ్చిన యెడల యెట్లు దేహక్రియ స్తంభించిపోవునో అట్లే యెక్కువ మందులు పోసిన యెడల కణములకు శక్తి కలుగక పోవుటయే గాక వాటివ్యాపారమంతా స్తంభించిపోవును అలోపతీ మందులన్నీ యీపనినే చేయుచున్నవి కొద్దీ గొప్ప రోగముల కన్నిటికినీ పెద్దపెద్ద మోతాదులలో మందులు పోయుటవలన దేహక్రియలన్నీ స్తంభించిపోవుట వలననూ రోగలక్షణములు అణచివేయబడుచున్నవి

న్యాయశాస్త్రముకూడా నేరముయొక్క తీవ్రతను బట్టి శిక్ష విధించును కొద్దినేరమునకు కొద్ది శిక్ష వేయును పెద్ద నేర

మునకు పెద్దశిక్ష ఉండును అంతర్జాతీయ ధర్మముల ననుసరించి అన్నిరకములగు నేరములకును ఒకేశిక్ష లుండవు

నేరము యెందుకు చేయవలసివచ్చిందో గ్రహించి పరిస్థితులను మార్చివేయు లేక సంఘము, ప్రభుత్వము కూడా అధోగతిలోపడి నేరములను, నేరస్థులను యెక్కువ చేయుచున్నారే గాని తక్కువేమీ చేయుట లేదు

## మోతాదుల పరిమాణము

పెద్దమోతాదులుగా మందుల సేవించినందువలన ఆవంతయు ఉపయోగము లేదు పెద్దమోతాదులో మందుభాగము యెక్కువగా నుండును పవర్ మాత్రము తక్కువగానే ఉండును మందుపరిమాణము యెక్కువైనకొలదీ శక్తి తక్కువగా నుండును మందు పరిమాణము తక్కువగా నున్నయెడల శక్తి యెక్కువగా నుండును పాల పంచదారను సన్నికల్లులో వేస్ యెక్కువగా నూరిన యెడల మందుశక్తి యెక్కువగును 3 x మందులోకన్నా 6x మందులో మందు భాగము యెట్లా తక్కువగానుండునదీ లోగడనే చదివినాము

మనకంటికి కనబడు స్థూలపదార్థముకన్నా సునిశితశక్తులు మరింత తీవ్రముగా నుండునని రసాయనశాస్త్రము భౌతిక శాస్త్రమునూ ఒప్పుకుంటూనే ఉన్నవి పైశాస్త్రముల పరిశోధనల వలన హోమోపతీ సిద్ధాంతములునూ, మందులునూ హాస్యాస్పదము లగుట లేదు అర్థవంతము లగుచున్నవి.

మందులు యిచ్చువానినిబట్టి హోమోపతీ మందులశక్తి యెక్కువగును రోగులయందు అతనికిగల అవ్యాజప్రేమయే

రోగమును నివారణ చేయును అతనెప్పుడునూ మందుల నడు గంటనీయడు యెప్పటికప్పుడు సీసాలను మందులతో నింపు చుండును, సునిశితశక్తులు ఉన్నట్లయితే హోమోపతీ మందులు తప్పకుండా పనిచేయవలసినదే ఈసునిశిత శక్తులవలన కణము లును, కణములలోని మైక్రోబిజమాలును త్వరగా శక్తివంతము లగును అలోపతీ వైద్యముమాత్రము క్రియాఫలితమునే ప్రధా నముగా భావించును క్రియాఫలితముకన్న ప్రతిక్రియాఫలితమే యెక్కువకాలము నిలుచును అందువలననే మందులతో అణచి వేయబడిన తరుణరోగములన్నియు తీవ్రాతితీవ్రమైన మొండిజాతి కాలికరోగములుగా ప్రత్యక్షమవుచున్నవి ఏలక్షణముల నణచి వేయుటకు యీ మందులు వాడుచున్నారో ప్రతిక్రియా ఫలిత ముగా ఆ లక్షణములే ప్రత్యక్షమగుచున్నవి

అలోపతీ వైద్యమునకును హోమోపతీ వైద్యమునకును మూలసూత్రములలోనే తేడాఉన్నది రోగలక్షణములను వృద్ధి చేయుమందులనే హోమోపతీ వైద్యులు యిచ్చుటచేత రోగము తాత్కాలికముగా వృద్ధిఅయినట్లు కనపడును ప్రతిక్రియా సూత్రమునను సరించి రోగలక్షణములు తగ్గిపోయి రోగపదార్థము బయటకు పోవును మొదటలో రోగము యెక్కువైనట్లు కనపడి ననూ వెంటనే రోగము తగ్గిపోవును హోమోపతీ మందులు ప్రతిక్రియాఫలితమునే ప్రధానముగా భావించును ఇదియే హోమోపతీ వైద్యసిద్ధాంతమునకు మూలము

జగన్మాతయగు ప్రకృతి రోగపదార్థమును బయటకు నెట్టివేసి దేహమును సదా ఆరోగ్యవంతముగా కాపాడుచునే ఉండును. అపచారములు చేయక వదలిపెట్టిన ప్రకృతియే సర్వ

రోగములను కుదుర్చును హోమోపతీమందులు ప్రకృతికే సహాయము చేయును అలోపతీ మందులన్ననో తరుణరోగము లను అణచివేసి తీవ్రాతితీవ్రమైన కాలికరోగములుగా ప్రత్యే క్షము చేయించుచున్నవి

అర్థశాస్త్రము ప్రకారము చూచినను హోమోపతీ మందులవలన ఉపయోగమే కలుగుచున్నది తక్కువ ఖర్చుతో యెక్కువలాభమును పొందుట అర్థశాస్త్ర సాంప్రదాయముగాని యెక్కువ ఖర్చుతో యెక్కువలాభమును సంపాదించుట అర్థ నీతికాదు అలోపతీ మందులన్నిటిలోను మందుభాగము యెక్కు వగా నుండును శక్తిమాత్రము చాలతగ్గిఉండును హోమోపతీ వైద్యమందన్ననో మాత్రలలోని మందుభాగము చాలా కొద్దిగా నుండును శక్తిమాత్రము చాల ఉండును హోమోపతీ మందులు సూటిగా కణములలోనికి చేరి వాటిని ఉద్రేకపరచి శక్తివంతములు చేయును అలోపతీ మందులన్ననో మందు భాగము యెక్కువగా కలిగియుండుటవలన దేహక్రియల నన్ని టినీ స్తంభింపచేయును

హోమోపతీ మందులవలన ఆర్థికలాభమేగాక మందు భాగము తక్కువగుటవలన దేహమునకు యెట్టి నష్టమునూ కలు గదు. ధాతుశక్తి వ్యయముకాదు నిర్మాణశక్తి వృద్ధియగును

హోమోపతీ వైద్యమునకును, ప్రకృతి వైద్యమునకును దగ్గర సంబంధమున్నది ప్రకృతి వైద్యము మాదిరిగనే హోమోపతీ మందులునూ రోగమును నిర్మూలము చేయుటకే ఉపయోగించును తరుణ రోగములను అణచివేయు మందు

భాగము తక్కువగానుండి శక్తి యెక్కువగా నున్న హోమో పతీ మందులన్నీ మొండిరోగముల కుదుర్చుటకు బాగా సహాయము చేయును

జలప్రక్రియల నుపయోగించియు మర్దన చికిత్స జరిపియు యుక్తమగు వ్యాయామము చేసిననేగాని యే మొండిరోగమును కుదరదు

ధాతుశక్తి తగ్గిపోక అంతరవయవములు బాగుపడుటకు వీలుకానంతగా చెడకపోతే తప్ప క్షయ కర్కటవ్రణము చచ్చు, మూర్ఛలు-పిచ్చి- వంధ్యాత్వము కుష్ఠు మొదలగు దుర్భర వ్యాధులన్నీ ప్రకృతివైద్యముతో కుదురును

అంతరవయవములు బాగుచేయుటకు వీలుకానంతగా చెడిపోతే ప్రకృతివైద్యముతోనే కాదు మరేవైద్యముతోనూ రోగాలు కుదరవు అన్నిరోగములు ప్రకృతివైద్యమువలన నయమగును రోగి వైద్యుడు చెప్పినట్లు చేయవలెను ఏదో చేసినామని తృప్తిపడరాదు ఆహారవిహారములలోని మార్పువలననే సర్వరోగములు కుదురునని గట్టినమ్మకము ఉండవలయును నమ్మక ముండుటయేగాక వైద్యుడు భగవంతుని దూతయని నమ్మి అతను చెప్పినదంతా తప్పక చేయవలయును అట్లు చేయకపోతే రోగము కుదరదు చెప్పినట్లు చేసే యెటువంటి మొండిరోగమైనా కుదురును చెప్పినట్లు చేయనివారికి వచ్చే యెంత కొద్ది రోగమైనా కుదురునను నియమము లేదు

## ౨౪

# సహజాహారము

రసము రక్తము, సరియైన భాగములలో ఉండవలెనంటే మనము తిను ఆహారము సరిగా నుండవలెను ఇప్పుడు తిను ఆహారములలో విపరీతమైన మార్పు కావలయును ఆహారము లోని మార్పే గాక, జీర్ణావయవములలోని పటుత్వమును బట్టి కూడా ఉండును బలిష్ఠమైన ఆహారమును జీర్ణావయవములు జీర్ణము చేయలేవు గాన జీర్ణావయవ పటుత్వమును బట్టి ఆహారము తినవలయును దేహ క్రియకు అవసరమైన శక్తి నిచ్చి, పాటవము తగ్గిన కండరములకు శక్తి నిచ్చి మరల శక్తివంతములు చేయుటకును, దేహక్రియలలో తయారగు ఆమ్లములను విడగొట్టి, బహిష్కార్యావయవముల ద్వారా బయటకు పంపుటకు వీలుగాను ఉండవలెనంటే ప్రకృతి సిద్ధ మైన ఆహారమునే తినవలయును

డాక్టరు లిండ్లహారు పాలను సహజాహారముగా పేర్కొను చున్నారు వీరి అభిప్రాయము ప్రకారము శుద్ధ రక్తమునకు గల లక్షణము లన్నియు పాలకు గలవు పసి పిల్లలకు పాలు తప్పకుండా ఇవ్వవలయును మనకు పాలిచ్చు జంతువు లన్ని యు విధిగా సహజాహారమును తినేవిగా ఉండవలెను ఆ జంతువులుకూడా ఆరోగ్యవంతములుగా ఉండవలెను

ఏ ఆహారమైనను పాలలోఉన్న గుణములు అన్నీ కలిగిన ప్పుడే సహజాహారమగును ఏ గుణము లోపించినను సహజాహా రము కానేరదు

ఏ కాలేజీలలోను యీ శాస్త్రమునుగూర్చి చెప్పనే చెప్పరు ఆహారశాస్త్రము చాలా అప్రధానమని భావిస్తారు మందువైద్యమువారు యెంతసేపుచెప్పినను యుక్తమయిన ఆహారమును తినమనే చెప్పెదరు గాని యేది యుక్తమయినదో ఎందువలన యుక్తమయినదో చెప్పరు బలహీనముగా ఉంటే బాగా బలము గలుగగలందులకు బలిష్ఠమయిన మాంసమును, కోడిగ్రుడ్లను తినమని చెప్పెదరు

ఆహారమును శాస్త్రసమ్మతముగా పరిశోధిస్తే బలకరములని మందువైద్యమువారు చెప్పు మాంసము, కోడిగ్రుడ్లలో దేహమునకు శక్తినిచ్చు పదార్థమేమియు లేదనియు హానికలిగించునవే యెక్కువగా కలవని చెప్పవచ్చు

మనము తినిన ఆహారములో అరగక మిగిలిపోయిన పదార్థమువలననే దాదాపుగా అన్నిరోగములు వచ్చుచున్నవి దేహములో తయారైన మురుగును విడగొట్టి నాలుగుత్రోవలా బైటకు పంపగల ఆహారమునే యుక్తపరిమితిలో తినవలయును లోపల తయారవుచున్న మలినములను కణములు బయటకు పంపలేకపోయినపుడే కాలికరోగములు వచ్చుచున్నవని లోగడనే చదివినాము

ఎప్పటికప్పుడు దేహక్రియలలో తయారగు జాతీయమైన మురుగునే బయటకు పంపలేని కణములు విజాతీయమైన మాంసములోని మురుగును అసలే బయటకు పంపలేవు బయటకు పోకపోవుటచేత అక్కడనే నిలవఉండును మాంసాహారమును మానని కాలికరోగులు యే ప్రక్రియచేసినా ఉపయోగము

ఆవంతయూ లేదు చెరుపే జరుగును కసువును ఊడ్చి బయట పారవోయవలెనుగాని లోపల ఉంచుకొనముగదా! శాకాహారము, ఫలాహారము యావజ్జీవితము సాధ్యము కాకపోయినప్పటికీ కాలికరోగములు నయమయ్యేవరకైనా మాంసాహారమును విధిగా మానవలయును

---

## ౨౫
## ఉపవాసము

రసరక్తములను సరిఅయినపాళ్లలో ఉంచవలెనంటే యుక్తమయిన ఆహారమును తినుటయే అవసరముకాదు బహిష్కరణక్రియకూడా క్రమముగానే జరుగవలెను ఆ మురుగును బయటకుపంపుటకు నాలుగు అయిదు విధానములుగలవు

ఉపవాసము, జలచికిత్స, మర్దనచికిత్స, శరీరవ్యాయామము, గాలి వెలుతురులలో తిరుగుట మొదలగునవన్నియు యిందుకు తోడ్పడును పైనచెప్పినవిధానము లన్నిటిలోనూ, ఉపవాసము ముఖ్యమైనది ఉపవాసమువలననే సర్వవ్యాధులు కుదురునని చెప్పువారును గలరు

ఉపవాసము రెండువాయలకత్తి పరిస్థితులనుబట్టి ఉపవాసమువలన ఉపకారము జరుగుతుంది అపకారమూ జరుగగలదు

ఉపవాసమువలననే సర్వరోగములును కుదురుననుట సిద్ధాంతములోమాత్రము గొప్పదేగాని ఆచరణమాత్రము వేరువిధముగా నున్నది సర్వేసర్వత్రా ఉపవాసమువలన గుణము

కనబడుటలేదు ఉపవాసమువలననే సర్వరోగములును కుదురు నని వాదించు అతివాదు లందరును ఉపవాసమువలనకలుగు నష్టములను విస్మరించుచున్నారు ఉపవాసముంచకూడనివారిని ఉపవాసముంచినయెడల ధాతుశక్తి తగ్గిపోవును రోగనిరోధక శక్తి తగ్గును అందువలన రోగపదార్థము పేరుకొనును ప్రకృతికి సామర్థ్యములేకపోవుటచేత రోగపదార్థము వెడలింపబడదు

బాగాబలిసి క్రొవ్వెక్కినవారికి ఉపవాసమువలన ఉపయోగమేకలుగును రక్తములోను, నరములలోను కండరముల లోనుగల మాలిన్యములు ఉపవాసమువలన పోవచ్చును

వేడితత్వముగలవారికినీ, రోగనిరోధకశక్తి తగ్గిపోయిన వారికినీ, ఉపవాసమువలన ఉపయోగ మేమీకలుగదు రోగము యెక్కువగునేకాని యేమియు తగ్గదు

ప్రాజ్ఞుల సలహాలేకుండా ప్రతివారినీ ఉపవాసముంచి నానా యిడుమలబడువారిని మనము నిత్యమునూ చూచుచునే ఉన్నాము ఇట్లు ఉపవాసముంచుటవలన వారు రోగకాలము నందేగాక తరువాత కాలమంతాకూడా వీటిఫలితముల ననుభవించుచున్నారు

## ఉపవాస మెప్పుడు అవసరము

పశు వాంఛలు, దురాలోచనలు, దుర్బుద్ధులు గలవారు ఉపవాస మున్నా యిబ్బంది లేదు ఉపవాసము వీరల మనో నిగ్రహమునకును, ఆత్మాభివృద్ధికిని తోడ్పడును శరీర వ్యాయామ మన నేమో తెలియని బలిసిన వారలు ఉపవాస మున్నా యిబ్బందిలేదు ఇటువంటి స్థూలకాయులు, దినము

నకు రెండు పూటలు భోజనము చేయుటకు బదులు, ఒకపూట చేయవచ్చు ఎట్లాగయినా తత్వాన్నిబట్టి, రోగి స్వభావమును బట్టి గూడా ప్రకిృయలు మారుచుండును

ఉద్రేక స్వభావులకును, వేడితత్వము గలవారలకును ఉపవాసము వలన కీడే కలుగును మేలేమియు కలుగదు వయసునకు ఉండవలసిన బరువుకన్న, తక్కువబరువు గలవార లకు ఉపవాసము లేమీ లాభముచేయవు వీరైననూ తరుణ రోగములలోనూ, స్వాస్థ్య సంకటముల ద్వారా రోగపదార్థము బయటకు పోవునపుడును ఉపవసింపవలెను ఇటువంటివారు సాధారణముగా దుర్బలులుగాను, బలహీనులుగాను ఉంటారు వీరి చుట్టూ ఉండవలసిన తేజశ్చక్రము ఉండదు

ఉపవాసకాలమునందు జీర్ణావయవములకు యేమియు పనిఉండదుగాన మానసికశక్తులు వృద్ధిపొందును నైతికశ కి కూడా వృద్ధిపొందును మానసికశకులు వృద్ధిపొందుటవలన అతీంద్రియజ్ఞానము వృద్ధిపొందును గీనిని మందువైద్యులందరు నాడీదౌర్బల్యము, ప్రలాపము, ఉన్మాదము మొదలైన పేర్లతో పిలుస్తారు

ఉపవాసమున్నపుడు యేకాకిగా ఉన్నను దిగులుపెట్టు కొన్నయెడలను, మనోవేదనను పొందినయెడలను హానికలుగును పసిపిల్లలకు పెట్టినట్లు బ్రతిమాలిపెట్టేగాని వీరు అన్నమును తినరు ఎవరెవరో తనవద్దనుచున్నారని చెప్పుదురు అలోపతీ వైద్యులు వీటిని సంధి ప్రలాపము లందురు వేడితత్వము గలవార

లను యెక్కువకాలము ఉపవాసముంచుట మహాపాపము వీరికి యెప్పటికప్పుడు కూరలను, ఫలరసమును ఇచ్చుచునే ఉండవలయును

## కాలికరోగములు-ఉపవాసములు

చాలామందిరోగులు ఉపవాసముందురుగాని, ఆ ఉపవాసమయినా యుక్తకాలమువరకూ ఉండరు దేహములోని కణములలోపల తయారైన మురుగును బయటకు పంపివేయు కాలములో ఆహారమును తీసికొనరాదు యుక్తకాలమురానిదే ఉపవాసమును ప్రారంభింపరాదు దేహము అందుకు తయారు కానిదే ఉపవసించినయెడల సేంద్రియలవణములు శీల్చివేయబడును బహిష్కార్యావయవములు సరిగా పనిచేయవు స్థూలకాయులును, దేహము బాగా కండ (పెట్టి) లెక్కిమదించిన వారలును ఉపవసించినా ఇబ్బంది లేదు వేడితత్త్వముగలవారిని ఉపవాసముంచరాదు

అరగక మిగిలిపోయినపదార్థములు మురిగి పులియుట చేతనే అన్నిరోగములునూ పుట్టుచున్నవి కీళ్ళరోగములో రోగపదార్థము కీళ్ళలో పేరుకొనును నరములలో పేరుకొనుటయు గలదు రక్తనాళములు బిరుసెక్కినవిఅంటే రోగపదార్థము, సిరలలోను, ధమనులలోను పేరుకొంటుంది పక్షవాతము, మూర్ఛ మొదలగు వ్యాధులలో రోగపదార్థము మెదడులోనూ, నరములలోనూ పేరుకొంటుంది దేహములో ఉండవలసిన భాగముకన్నా క్షారసంపద తగ్గిపోతే ఆమ్లములు బయటకు పోలేవు లోపలనే పేరుకొనిపోవును క్షారసంపద తగ్గిపోవుట

యెక్కువగాగంటే,—మనము తిను పదార్థములలో— అరగకనే మిగిలిన పిండిపదార్థములు పులిసి ఆమ్లములు తయారగును ఈ ఆమ్లములను విడగొట్టి బహిష్కార్యావయవములద్వారా బయటకు పంపుటకు క్షారములు అవసరము ఆమ్లములు, క్షారములు కలిసి ననేగాని లవణములు తయారుకావు లవణములు ద్రవరూపములో ఉంటేనేగాని, మూత్రముద్వారా బైటకుపోవు మిగిలిన ఘనపదార్థములు మలరూపముగా బయటకుపోవును ఆమ్లములు పెరిగిపోతేనేగాని రోగమురాదు రోగమువచ్చినపుడు క్షారసంపద యెక్కువగానున్నపండ్లను, కూరలను పెట్టమనుటలోని అంతరార్థమిదే

సేంద్రియ లవణములు తగ్గిపోవుటచేతనే, దాదాపుగా అన్ని రోగములును వచ్చుచున్నవి ఆమాశయములో పేరుకొన్నవని చెప్పు రాయి, రప్ప, అన్నీకూడా, రక్తమును క్షారవంతము చేస్తేనేగాని కరిగి తగ్గిపోవు రక్తములోని క్షారసంపదను వృద్ధి చేయవలెనంటె పండ్లు, కూరలు యెక్కువగా తినవలయును పండ్లలోను, కూరలలోను గల సేంద్రియ లవణములు రక్తముతో కలిసిపోవును

దేహమునకు కావలసిన క్షారసంపద ఉపవాసకాలమున లభించదు గాన దేహమునకు నష్టమే కలుగును అందువలననే కొంతకాలము పండ్లు కూరలు తిని, దేహమును సిద్ధపచిననే గాని ఉపవాస ముంచరాదు దీర్ఘోపవాసముల వలన ధాతుశక్తి తగ్గిపోతుంది రోగనిరోధకశక్తి తగ్గిపోతుంది ధాతుశక్తి పెరిగి, కణములు, అవయవములు, పుష్టివంతమైననే గాని

దేహములో రాసాయనికముగా తయారగు మలినములు బయటకు పోవు

జీర్ణావయవములలో, లోపముంటే బుద్ధి సరిగా పని చేయదు బహిష్కరణక్రియ ప్రధానముగా జరుగు కాలములో ఆహార మిచ్చి జీర్ణావయవములకు పని కల్పించరాదు

బహిష్కరణక్రియ జరగవలసివచ్చినపుడె రోగము వచ్చును అప్పుడు ఆహారమిచ్చి జీర్ణయంత్రములకు పనికల్పించ రాదు

స్వాస్థ్యసంకటములన్నీ సాధారణముగా సహజాహార మును తినుట మొదలుపెట్టిన ఆరువారములకు జరుగును. స్వాస్థ్యసంకటములు కలుగుచున్నప్పుడు రోగపదార్థము బయటకు పోవునుగాన భోజనముచేసి జీర్ణావయవములకు పనికలుగచేసిన యెడల బయటకువచ్చు త్రోవలన్నియు మూసివేయబడును బయటకువచ్చు త్రోవలు మూసుకొనిపోవునుగాన స్వాస్థ్యసంక టములవలన ఉపయోగము కలుగదు మీదుమిక్కిలి హానియే కలుగును, తరుణరోగలక్షణములు కనబడగనే విధిగా భోజనము మానవలెను ఫలరసములు నీటితో కలిపి త్రాగవలెను అవసర మైతే కొన్నిదినములుగాని, వారములుగాని ఉపవాస ముండాలి

కొన్నిరోజులక్రితము ఒకమనిషికి సన్నిపాతజ్వరము వచ్చి నది చలిజ్వరలక్షణములుకూడా కనబడినవి ఏడువారాలదాకా ఆమెకు ఫలరసమును నీటితో కలిపి యిచ్చినాము రోగలక్షణ ములు తగ్గినతరువాతకూడ కొన్నిరోజులదాకా ఆహారము పెట్టక విశ్రాంతినిచ్చాము మామూలు నియమములతో ఆహా

రమును పెట్టినాము ఆరువారములు జరుగునప్పటికి వెనుకటి కన్నా బలమెక్కువైనది

ఏయేరోగాలలో యెన్నిరోజులు ఉపవాసముంచవలనసిదీ వేరొకగ్రంధములో చదువుకొందాము ఉపవాసమువలన భయ మేమీలేదు ఉపవాసమువలన యెట్టిభయమున్నూ లేదు ఉప వాసమనే పేరుచెప్పగనే అనేకులు భయపడుదురు ఉపవసించు వారిని అనేకమందిని నిత్యమున్నూ చూచుచునే ఉన్నాము నలభైరోజులు మొదలుకొని తొంభైరోజుల వరకున్నూ, ఉపవ సించినవారిని చాలామందిని మనమెరుగుదుము ఒకవేళ యెవ రైనా ఉపవాసకాలములో చనిపోయినవారు ఉపవాసమువలన చనిపోవుటలేదు ఉపవాసమంటె వారిలోకలుగు భయమువలన చనిపోయియుందురు మానసికభయమే యిందుకు కారణమై ఉంటుంది

దైహిక దుర్బలవాట్లను మాన లేనిది మానసిక, నైతిక, శక్తులను వృద్ధిచేయుకొనిననూ ప్రయోజనము లేదు మానసిక, నైతిక శక్తులను వృద్ధిచేసికొనినప్పటికినీ దైహికదురలవాట్లను మానలేనివారు పడుపాట్లను మనము ప్రత్యక్షముగా చూచు చునే ఉన్నాము అమెరికాలో ఒక కవయిత్రి ఉండేవి ఆమెకు విశేషమైన తెలివితేటలు గలవు రెండుమూడు దురలవాట్లు మాత్రము ఉండేవి ఎంత తెలివితేటలు కలిగినప్పటికిని దురల వాట్లనుమాత్రము వదులుకొనలేకపోయింది అందువలననే చాలాపెందలకడనే చనిపోయినది

ఎన్ని శాస్త్రములు చదివినా, వేదాంతగ్రంథముల అధ్యయనముచేసినా మనోనిగ్రహము అప్రయత్నముగా రాదు క్రమముగా అభ్యసిస్తేనే వస్తుంది మనోనిగ్రహమే ఆత్మోపబ్ధికి సహాయపడుతుంది

---

౧౩

# ధాతుశక్తి వృద్ధిచేసికొనుట

ధాతుశక్తి తగ్గిపోవుట రోగలక్షణమని యిదివరకే చదివియున్నాము ధాతుశక్తి దుర్వ్యయముకాకుండా కాపాడుట యెట్లని మనకు వెంటనే తోస్తుంది బాగా బలకరమైన ఆహారముల తింటే దుర్వ్యయమైన ధాతుశక్తి పెరుగుతుంది బలవర్ధకములు రక్తశుద్ధికరములు అగు మందులన్నియు ధాతుశక్తిని వృద్ధిచేయునని మందువైద్యులు చెపుతారు రోగులుకూడా బలవర్ధకములయిన ఆహారము తింటే పుష్టివస్తుందని తలుస్తారు కొన్ని వందలసంవత్సరములనుండే యీ బలవర్ధక ఔషధముల కొరకే వైద్యవరులందరును వెతుకుచున్నారు ఆయుర్దాయమును పొడగించుటకును, వీరందరును నిరంతరము పరిశోధనల జరుపుచునే ఉన్నారు వీరి ప్రయత్నములన్నియు వ్యర్థమగుచున్నవి

మేముచెప్పుసమాధాన మేమంటే ధాతుశక్తి దేహమంతటా క్రమముగా ప్రవహించకపోవుటచేత రోగము వచ్చుచున్నది క్రమముగా ప్రవహిస్తే రోగము రానేరాదు

రోగపదార్థమును బైటకునెట్టివేయు ప్రయత్నమే తరుణ వ్యాధి మశూచికము, టైఫాయిడ్, కలరా మొదలగు తరుణ వ్యాధులన్నియు యీకోటిలోనివే రోగపదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతిచేయు ప్రయత్నములే

కాలికరోగములలో దేహమంతా రోగపదార్థముతో నిండుటచేత ధాతుశక్తి తగ్గిపోవును ప్రకృతి రోగపదార్థమును బయటకు నెట్టివేయలేదు రోగపదార్థము అడ్డుపడుటచేత ధాతుశక్తి దేహమంతా సరిగా వ్యాపించదు స్వాస్థ్యసంకటములు రావు రోగనివారకశక్తులకును, రోగపదార్థమునకును, జరుగు పోరాటములో ధాతుశక్తి అనగా నివారణశక్తులదే పైచేయి అయినప్పుడు రోగముకుదురునని చదివినాము ఎక్కువ కాలము జీవింపదలచినవారు ధాతుశక్తిని వృద్ధిచేసుకోవాలి

వైద్యవరులునూ, సామాన్యప్రజయూ బలవర్ధకములునూ, పుష్టివర్ధకములునూ, అగు ఆహారములవలన ధాతుశక్తి వృద్ధికాదని తెలిసికొనిననాడు సత్యమును తెలుసుకోగలుగుతారు టానిక్కులు బలవర్ధకౌషధములు మొదలగునవన్నీ కూడా ప్రాణశక్తిని వృద్ధిచేయలేవని తెలుసుకొంటారు ఇవ్వే ప్రాణశక్తిని కలుగచేసేటట్లయితే ప్రాణికోటిఅంతా జరామరణాలు లేక బ్రతికిఉండెడివారే మనతాతతండ్రులు యిప్పటికినీ పడుచువారుగా ఉండెడివారే భాగ్యవంతులు ధనమును వెదజల్లిఅయినా తమప్రాణముల కాపాడుకొనెడివారే

ప్రాణశక్తిని, దానినుండిపుట్టిన ధాతుశక్తికిబలము నిరోధకశక్తి మొదలగువాటికినీ గల సంబంధమును మరొక పుస్తకములో చదువుకొందాము

విశ్వవ్యాప్తమైన విశ్వశక్తియే మనలోని ప్రాణశక్తికి మూలము ఈశక్తినుండే మిగిలిన శక్తులన్నీ పుట్టినవి తీగలలో నుండి ప్రవహించి గ్లాసుబల్బులో ప్రకాశించు విద్యుచ్ఛక్తికిని బల్బులోని గ్లాసునకును యెట్టిసంబంధము గలదో అట్టిసంబంధమే దేహమునకును ప్రాణమునకును గలదు బల్బుయొక్క గ్లాసును తీసివేసినంతమాత్రమున విద్యుచ్ఛక్తి ఆగిపోదు స్థూలశరీరము పడిపోగానే ఆత్మ సూక్ష్మదేహములోనికి ప్రవేశించును స్థూలశరీరమునకును, సూక్ష్మశరీరమునకును యెట్టిసంబంధము లేదు ఇది ఆధ్యాత్మికవాదులు చెప్పుమాటగాదు ప్రత్యక్షముగా జరుగుమాటయే, గారడీ కాదు

స్థూలదేహము పడిపోయినతరువాత జీవుడు బ్రతికిఉండు మాటయే నిజమైతే జన్మరాహిత్యమే సాధ్యమైనయెడల సూక్ష్మశరీరము తప్పకుండా ఉండవలసివచ్చుచున్నది దేహమునకు ఆత్మకును సంబంధమే లేకపోతే బ్రతికిఉండవలెనంటే ఆహారపానీయములు యెందుకని సందేహము కలుగవచ్చును దీనికి మేము చెప్పుసమాధానమేమంటే ఆహారపానీయములు దేహమును సరియైన స్థితిలోనుంచి ధాతుశక్తిని అంతటా సరిగా వ్యాపింపచేయును

నరములను, కండరములను బాగుచేయుటకును పుష్టివంతములు చేయుటకును, ఆహారము అవసరమే దేహయంత్రమును నడుపుటకు ఆహారము వంటచెరుకుగా ఉపయోగపడుతుంది బొగ్గుకు అగ్ని తగిలితేగాని ఎట్లా నిప్పుగామారదో అట్లాగనే ఆహారమనే అంగారముకూడా ప్రాణశక్తివలననే నిప్పుగా మారు

చున్నది ప్రాణశక్తి లేకపోయినపుడు ఎంత బలకరమైననూ నిరుపయోగమే

అంతేగాక మనము తినిన ఆహారము పచనమై జీర్ణ మగుటకును కొంతధాతుశక్తి వ్యయమగును లోపలతయారగు మురుగు బయటకు పోవుటకును ధాతుశక్తి వ్యయమగును. దేహమునకు అవసరమైన ఆహారముకన్న యెక్కువతినినయెడల దానిని పచనముచేసి జీర్ణముచేయుటకును, జీర్ణముకానిదానిని బయటకు పంపివేయుటకును కొంతధాతుశక్తి వ్యయమగును అంటే అవసరమునకు మించి తినిన ఆహారమువలన ధాతుశక్తి వృద్ధికాకపోవుటయేగాక దుర్వ్యయమునూ అగుచున్నది ఈ సూత్రమును కనుగొన్నవారు బలవర్ధకములగు ఆహారములు పుష్టి నీయవనియు ఆహారపదార్ధములు యెక్కువగా తినినంత మాత్రమునచే ధాతుశక్తి వృద్ధికాదనియు ముమ్మాటికిని నమ్ముదురు ఒకటిరెండుపూటలు ఉపవసించునంతనే కొంప మునగదనియు తెలుసుకొందురు

యుక్తమగు ఆహారమువలననే దేహతత్వము బాగుపడును ధాతుశక్తి బాగుండును నాడీశక్తి క్రమముగా ప్రవహించును మారుమూలనుఉన్న ప్రతిచిన్నకణమునకును నాడీశక్తి సరిగా అందును అందువలన యేమూలకూడా రోగపదార్ధము పేరుకొనదు ఎక్కువతక్కువలు ఉండవు ఆహారమునకును ధాతుశక్తికినిగల సంబంధము యింతవరకు యేప్రసిద్ధగ్రంథము లోనూ లేదు ప్రాణశక్తి అనగా, ధాతుశక్తినిగూర్చి కూలంకషముగా వ్రాసినవారు యింతవరకు ఒక్కరునూ లెరు ఇప్పుడు

అమలులోనున్న వైద్యసిద్ధాంతము, రోగచికిత్సావిధానము లన్నియు, ప్రాణశక్తిమహిమను కొద్దిగనే చెప్పినవి కొంతమంది ఆహారపదార్థముల స్వభావమునే ప్రధానముగా భావించి దానిని గూర్చియే యెంతో చెప్పిరి ఇంకాకొంతమంది శస్త్రచికిత్సను గూర్చి చెప్పిరి ఒలచికిత్సకుడుమాత్రము చన్నీటి వేడినీటి స్నానములవలన ప్రాణాధారద్రవముల ఉజ్జీవింపచేస్తాడు అస్థి సమీకరణశాస్త్రజ్ఞులు ఎముకలను, కండరములను సరిచేసి ధాతుశక్తిని సరిగా ప్రవహింపచేస్తాడు మానసిక శాస్త్రజ్ఞుడు మనసునే ప్రధానముగా భావించి దానికే చికిత్స చేయా లంటాడు

ప్రకృతి వైద్యములో, దైహికమానసిక శక్తులకు రెంటి కినీ ప్రత్యేకముగా యేఒక భాగమునకును హానిలేకుండా ఉండు పద్ధతిలో చికిత్సా ప్రక్రియలు గలవు మందులతోను, శస్త్ర ములతోను అవసరము లేదు మామూలు పద్ధతులవలననే దాదా పుగా అన్నిరోగములునూకుదురును అవసరమునకు మీరి తినిన ఆహారము వలన ధాతుశక్తి దుర్వ్యయమగునన్న - చిన్నసూత్ర మును పాఠకజనము తెలుసుకోనలేదు సరిగదా వైద్యవరులును తెలిసికోనలేరు గాలి రాకుండా బొగ్గులు యెక్కువగా పోస్తే కుంపటియెట్లామండదో అట్లనే అవసరమునకుమిగిలినఆహారమును తినిన యెడల యీ అరగని పదార్థము దేహములో మిగిలి పోవుటచేత నాడీశక్తి తిన్నగా ప్రవహించదు గడియారములో మన్ను పేరుకొన్న యెడల అందులోని చిన్నచక్రములు సరిగా తిరగవు. అట్లనే అరగని పదార్థమంతా కణములలోను, నరముల లోను పేరుకొని ధాతుశక్తి సరిగా ప్రవహించుటకు అడ్డుపడును.

ఎప్పటికప్పుడు దేహమునుండి కొంత పరిమితి గల ధాతుశక్తి మాత్రమే తయారగును మనముచేయు వ్యయము కూడా తయారగును బట్టియే ఉండవలయును తయారుకు మిగిలినట్లుగా ధాతుశక్తిని వ్యయము చేసినయెడల నరములు బలహీనము లగును నాడీదౌర్బల్యము కలుగును నరములలో మంటలు చిమచిమలు కలుగును దేహములో తయారగు ధాతుశక్తిని బట్టియే వ్యయమును సమకూర్చుట వైద్యుడు చేయవలసినపని మందులవలన యేమి జరుగునదీ యిదివరకే చదువుకొన్నాము, మందులవలన ప్రాణశక్తి వృద్ధిపొందదు మానవయంత్రమును గడియారముతో పోల్చవచ్చును రెంటికినీ చాలాపోలిక లున్నవి గడియారములోని చక్రములు ప్రతిక్షణము తిరుగుటవే అరిగిపోకుండా ఉండగలందులకు బ్రేకులు ఉన్నవి అట్లనే దేహములోకూడా ధాతుశక్తి దుర్వ్యయమైపోకుండాను హెచ్చు తగ్గులు లేకుండా కాపాడుటకును బ్రేకులు ఉన్నవి

చలననాడులు జ్ఞాననాడులు పైపనులను చేయును జ్ఞాన నాడులు, చలననాడులు ఒకదానివెంట మరొకటి ఉండును

దేహక్రియలలో తయారగు మూత్రికామ్లము, ఆక్సాలికామ్లము, అంగారక్షారము మొదలగు ఆమ్లములన్నీ ధాతుశక్తి దుర్వ్యయముకాకుండా చేయును దేహములో రోగపదార్థము పేరుకొన్నపుడు సన్నని కేశనాళికలకు అడ్డపడును అడ్డపడుట చేత నాడీశక్తి సరిగా ప్రవహించదు మెదడు సరిగాపనిచేయదు నాడీమండలము కంపించిపోవును అలసట యెక్కువగుటచేత విశ్రాంతి కోరును ధాతుశక్తి తక్కువైనకొలదీ విశ్రాంతి తీసుకొనవలెనను కోరిక హెచ్చును ఉద్రేకమును కలిగించు

మందులు, అందుకు అనుకూలపడు ఆహారపదార్థములు, దేహాయంత్రములోని బేరికులను తీసివేసి విధి విరామము లేకుండా దేహము పనిచేయునట్లు చేయును ఈక్రింది ఉదాహరణమువలన యీవిషయము బాగుగా విశదము కాగలదు

ఒకమనిషి రోజంతా పని చేయుటచే అలసిపోయి విశ్రాంతిని కోరును రాత్రిపూట శయనించును అలసటచెందిన తరుణములో ఆమనిషి ఒకరోగితోబాటు రాత్రెల్లా కూర్చొన వలసి వచ్చినదనుకొనుడు, కాఫీ, టీ, బ్రాందీలలో దేనినైనా ఒక కప్పు సేవించిన ఆరాత్రెల్లా, నిరాఘాటముగా మేలుకొనగలడు అయితే యీశక్తి యెల్లా వచ్చింది? కాఫీ, టీ, బ్రాందీలలో ఉన్నదా అను సందేహము వెంటనే తోస్తుంది

ఈశక్తి వచ్చుటకు రెండు నావకాశము లున్నవి, ఒకటి అతను సేవించిన పానాలలోనైనా యిది ఉండాలి అతనిలో ఉన్న మూలబలము అనగా, ఎముకలలో ఉంగే మూలుగును ఖర్చు చేసుకొనైనా అతను మేలుకొని ఉండాలి మనకు తెలిసినంతవరకూ కాఫీ, టీ, మొదలగు పానాలలో కాఫిన్, థియోబ్రోమిన్ అనే విషము లున్నవి కాని ధాతుశక్తికి సహాయపడు మహత్తరమైన శక్తి అందులో యేమియులేదు ఈ పానాలు కొత్తశక్తిని యివ్వలేకపోగా ఎముకలలో ఉండు మూలుగును ఖర్చుచేసి దేహతత్వమును కంపింప చేయును ఈవిషయములన్నీ నాడీమండలమునకు పడు బేరికులను తీసివేయును ఈ ఎముకలలోని మూలుగు ఖర్చుతో దేహాయంత్రము, విధి విరామము లేకుండా తిరుగును అత్యావసర సమ

యములలో ఉపయోగించుకొనుటకుగాను, ప్రకృతి నిలవచేసు కొనిన మూలుగు, యీవిధముగా దుర్వినియోగ పడుచున్నది ఈ నష్టమునకు దేహయంత్రము యెన్నిరోజులు తట్టుకోగలదు? బలిష్ఠమయిన దేహమైతే కొన్ని సంవత్సరాలు తట్టుకోగలదు తక్కువ రకమగు దేహమైతే వెంటనే యెగిరిపోతుంది

ఆ రాత్రివరకే గాక మరునాడు నిత్యకృత్యములకు కావలసిన ధాతుశక్తి కూడా ఆ మూలుగునుండే ఖర్చుఅగును ఒకప్పుడు పానముతో యింత గ్రంథము జరుగుచున్నపుడు నిరంతరము తాగుకాఫీవలన యెంత అపకారము జరుగునదీ చెప్ప పనిలేదు

నిద్రవలనకలుగు సుఖము మరేమందువలనగాని ఆహారమువలనగాని కలుగదు అదేగనిగా రాత్రిపూట నిద్రపోగొట్టుకుంటే త్వరలోనే నాడీదౌర్బల్యము పిచ్చిపుట్టుతుందంటే ఆశ్చర్యమేమీ లేదు గాఢనిద్రలో తేజశ్చ్రకము పోతుంది మళ్ళీ నిద్రలేవగనే తేజశ్చ్రకము వస్తుంది

కాఫీ, టీ మొదలగు పానాలవలన కలుగు దైహికమార్పులు ——ఈ క్రింది బొమ్మవలన విషయము బాగుగా విశదము కాగలదు మామూలు పరిస్థితులలో ఒకమనిషిలో ఇరువదినాల్గు గంటలలో కొంతపరిమితిగల ధాతుశక్తి వెలువడును ఆ మామూలు ధాతుశక్తిని అ ఆ అనుకొందాము

ఇ అనుచోట ఉద్రేకముకలుగచేయు పానాన్ని సేవించాడు ఈ పానము నాడీమండలమును స్తంభింపచేస్తుంది తాత్కాలికముగా ఉద్రేకము కలుగుతుంది మామూలు స్థితిలో ఉండక ఉద్రేకము కలిగి ఈ అనుచోటకు పోవును

ఆ పానమువలన కలిగిన ఉద్రేకము తగ్గగానే మామూలు పరిస్థితిలో నుండక నీరసముకలిగి ఉ అనుచోటకు పడిపోవును పానమువలన కలిగిన తాత్కాలిక ఉద్రేకము తగ్గిపోగానే అత్యవసరపరిస్థితులలో ఖర్చుచేయుటకుగాను ప్రకృతి యెముకలలో నిలవచేసుకొన్న మూలుగు ఖర్చుతోవచ్చుటచే క్రియాప్రతిక్రియల సూత్రము ననుసరించి మామూలుకన్న క్రిందకు పడిపోవును ధాతుశక్తి తగ్గిపోవుటచే నీరసము కలుగును పానముచే ఉద్రేకము కలుగునని భ్రమపడి యీపర్యాయము మరింతయెక్కువగా సేవించును మూలుగు యింకా కొంత నిలవ ఉండుటచే ఉద్రేకము కలుగును ఊ అనుచోటకు పోవును క్రియాప్రతిక్రియల సూత్రము ననుసరించి ఋ అను చోటులో క్రిందకుపడిపోవును పానముల సేవించువారు మామూలు పరిస్థితులలో యెప్పుడునూ ఉండరు

ఉద్రేకముగానైనా ఉంటారు నీరసముగానైనా ఉంటారు. వారి చర్యలన్నీ సంధిగ్ధముగానే ఉంటవి

ఇట్లాగే కొంతకాలము జరుగునప్పటికి నాడీదౌర్బల్యము, నరములలో చిమచిమలు పుట్టుతె సామాన్య ఆరోగ్యవంతులనే యీ పానాలు యింత యిబ్బందిపెట్టుతుంటే యీ పానాలవలనగాని, మందులవలనగాని, రోగులలో యేమి జరుగేదీ చెప్పలేము

ఇప్పుడు మావైద్యమిత్రులకు సందేహము కలుగవచ్చు, వీరు చెప్పేవి కొన్ని నిజముకావచ్చు కానీ అన్నీ నిజమని చెప్పుటకు వీలులేదు చావపోయేవాడికి యేమందైనా పోయాలి

గాని, యేమీ లేకుండా ఊరకనే ఉంచుతారా? మందుపోయక పోతే త్వరగా చస్తాడుగదా!

ఈ మాటలు నిజముగానే కనబడుతవి బాగా ఆలోచిస్తే వీటిలో యేమీ నిజము లేనట్లు మీకే తోస్తుంది ఏమైనా ధాతుశక్తి నిలవఉంటే దానిని ఉద్రేకపరచుటే మందులుచేయునవి మందులలో ధాతుశక్తి యేమీ లేదు మందులు ఉద్రేకపరచనియెడల నిలవఉన్న ధాతుశక్తి ఆ మనిషిని తక్కువ వ్యయముతో యింకా కొంతకాలము జీవింపచేస్తుంది ఈ మందులవలన క్రొత్తశక్తి చేరకపోగా ఉన్న మూలుగు అంతా ఒకతడవే దుర్వ్యయమై పోతుంది కొంతకాలము నిలవఉండవలసినది ఒక్కతడవే భగ్గుమంటుంది రోజుకు రూపాయిచొప్పున వాడుకుంటే నూరు రూపాయిలు ఖర్చుచేయడానికి నూరురోజులు పట్టుతుంది రోజుకు పదిరూపాయిలు చొప్పున ఖర్చుచేస్తే పదిరోజులలోనే సంచీ ఖాళీ అవుతుంది

ఆరోగ్యవంతుని హృదయము నిముసమునకు 70 తూరులు కొట్టుకొనును రోగియొక్క హృదయము తక్కువగా స్పందించును

ధాతుశక్తినిబట్టి ప్రకృతి వ్యయము చేయుచుండును ఇంతవరకు చెప్పిన దానినిబట్టి, ఉద్రేకము కలుగచేయు మందులను మేము నిషేధించామని తలంచవద్దు ఒకప్పుడు వాటికినీ అవసరముగలదు ఎలక్ట్రిక్‌షాక్ తగిలి ప్రాణమునకే మోసము కలిగినపుడు ఉద్రేకము కలుగచేయు మందులను తప్పకుండా వాడవలసినదే లేనియెడల మొదటికే మోసము

వస్తుంది పైషాక్‌తో స్తంభించిపోయిన ప్రాణశక్తికి యీమందులవలన ఉద్రేకము కలుగుతుంది ఈ సావకాశమును తీసుకొని చీటికిని మాటికిని మందులను సేవించరాదు

## మందులవలనకలుగు మానసికోద్రేకము

మందుల సేవించినందువలన దైహికముగా యెన్నిమార్పులు కానగునో మానసికముగా అన్ని మార్పులూ కానగును బ్రాందీ విస్కీలవలన న్యాయాన్యాయ విచక్షణ, బుద్ధి సూక్ష్మము, వివేచన విచక్షణ మొదలగువన్నీ నశించును నోటికి వచ్చినట్లు ప్రలాపముల పల్కుదురు యుక్తాయుక్త విచక్షణ మేమీ ఉండదు పరువు, మర్యాదలు మొదటలోనే నాశనమగును ఎంతవద్దని వారించిననూ ఆప్రలాపములే వచ్చుచుండును

తక్కువ మోతాదులతో సేవించినపుడు యీపానాలు ఉద్రేకము కలుగచేసినట్లునూ ఉత్సాహవంతముగాను కనబడునుగాని వాటినే వదలక నిరంతరము సేవిస్తూ ఉంటే నాడీమండలము స్తంభించిపోతుంది తాత్కాలికముగా కలుగు ఉద్రేకమునకే ఆశపడతారుగాని దానికిగాను జరిగిన ధాతుశక్తినష్టమును గ్రహించరు ఈపానాల సేవించుటవలన దైహిక మానసిక, నైతిక శక్తులన్నీ నశించిపోవును

వివేచన మొదలగు లక్షణములన్నీ మెదడులోని ముందు భాగమున ఉండును సృష్టి అంతటిలోనూ మానవుడు ఉన్నతస్థానమాక్రమించినాడు జలచరములగు చేపలలో మజ్జాముఖము కొద్దిగా పైకి ఉబికి ఉండును సృష్టిలోని చరాచర కోటినంతను

నాలుగు భాగములుగా విభజింపవచ్చును 1 ఫలభక్షకములు 2 తృణభక్షకములు 3 మాంస భక్షకములు 4 సర్వభక్షకములు 4వ విభాగమగు సర్వభక్షక జంతువులలో పెద్దమెదడు చిన్నమెదడు మజ్జాముఖము అను మూడు భాగములు లేక మజ్జాముఖమే కొద్దిగా ఉబికి ఉండును ఇదే క్రమముగా పెరిగి పోయి ఫల భక్షకములలోనికి వచ్చునప్పటికి మూడున్నూ ప్రత్యేక విభాగములగును

పెద్దమెదడు చిన్నమెదడు, మజ్జాముఖము అను మూడింటిలోను, మజ్జాముఖము చాలా చిన్నది ఇందుండియే మజ్జానాడులన్నీ ఆరంభమగుచున్నవి రక్తప్రసరణమునకు అవసరమైన నాడులన్నీ యిచటనుండే బయలుదేరును దేహములోని జంతువేడిమిని కాపాడు నాడులన్నీ యిచటనుండే బయలుదేరును దైహికముగా యేమీ మార్పులు రాకుండా చిన్నమెదడు కాపాడును

జ్ఞాననాడులు, చలననాడులు రెండునూ పెద్దమెదడు నుండియే బయలుదేరును కండరములకు అవసరమగుశక్తి అంతయు యిచటనుండే బయలుదేరును యుక్తాయుక్తవివేచన మొదలగు బుద్ధిసూక్ష్మము యిచటనుండియే బయలుదేరును ఇంతవరకు చదివినదానినిబట్టి మొదటి మూడుతరగతులలో కన్న నాలుగవతరగతి జంతువులలోని మెదడు ముందుకు పెరిగినదనియు అందువలననే మానవుడు యింత తెలివితేటలు గలవాడుగా నున్నాడనియు మనము తెలుసుకొంటాము సాధారణ

బ్రాందీ మొదలగు నిషాదవస్తువుల సేవించినందువలన మొదటగా సున్నితమైన వివేచనాశక్తికి దెబ్బతగులును తరువాతనే మిగిలిన భాగములకు దెబ్బతగులును వీటికి దెబ్బతగులుటవలననే మనోనిగ్రహము, గౌరవము, పెద్దలయెడలభక్తి వినయము మొదలగు లక్షణములన్నియు నశించిపోవును తరువాత మతి మరుపు కలుగును తరువాత అవాకులు చవాకులు పుట్టును సారాయి, బ్రాందీ మొదలగు పానాలను సేవించినపుడు హృదయమాగిపోవుటయు సంభవించును

## యోగనిద్ర

రోగికి వైద్యునియందు పరిపూర్ణమైన విశ్వాస ముండవలయును వైద్యుడు చెప్పిన ప్రక్రియల చేసినయెడల తనరోగము పూర్తిగా నిర్మూలమగునని భావించవలయును అచంచలమగు విశ్వాసముతోనుండి చికిత్సాప్రక్రియల నన్నిటిని జరిపినయెడల రోగము త్వరలోనే రూపు మాసిపోవును నమ్మకము లేకపోతేమాత్రము రోగము నయముకాదు

ఆహారముగాని, పానీయములుగాని ధాతుశక్తిని పెంపొందించి, ప్రాణశక్తిని వృద్ధిపొందించలేవు ఆహారము దేహతత్వమును సరియైనస్థితిలోమాత్రము ఉంచును సహజమైన ఆహారము తినినకొలదీ దేహములోని కణములు ఆరోగ్యవంతములుగా నుండును లోపల యేమాత్రము మురుగుకూడా ఉండదు నరములు, కండరములు పుష్టిగా నుండును.

౨౭

# ముష్టిమైథునము

ధాతుశక్తి యెట్లా దుర్వ్యయమై పోయేదీ యీఅధ్యాయములో తెలుసుకొందాము ముష్టిమైథునమువలన ధాతుశక్తి దుర్వ్యయమై పోవును యుక్తవయసు వచ్చిన బాలురలో యీఅలవాటు యెక్కువగా నున్నది దైహిక, మానసిక నైతికశక్తులు వృద్ధి కావలసిన తరుణములో యీవాపిష్టి అలవాటు బాలురవెంట పడుట దరిద్రమనక తప్పదు తెలివి తేటలకును, పుంస్త్వమునకును, దగ్గర సంబంధమున్నది పురుషునకు సంబంధించిన ద్రవములు పైవిధముగా దుర్వ్యయమై పోయిన యెడల వీరి దేహములు వృద్ధిపొందవు దేహము వృద్ధిపొందక పోవుటచే మానసిక, నైతిక శక్తులునూ వృద్ధిపొందవు పై దురలవాట్లతో ధాతుశక్తి తగ్గిపోవుటచే రోగ నిరోధకశక్తి తగ్గిపోవును నిరోధకశక్తి తగ్గుటచే మానసిక, నైతిక శక్తులునూ కుంటుపడును ఈ దురలవాట్లవలన యిన్ని యిబ్బందులు కలుగుచున్నవి, ఇన్ని యిబ్బందులు కలుగుచున్నను ఈవిషయమును మాత్రము రహస్యముగానే ఉంచుచున్నారు బాలురకుగాని బాలికలకుగాని యీవిషయమై చెప్పుటలేదు ఈవిషయమునకుసంబంధించిన శాస్త్రమునంతనూ ప్రజలును ప్రభుత్వమునూ రహస్య పరచినారు వెలువడ నీయుటలేదు ఎవరైనా సాహసించి చెప్పిన యెడల సిగ్గులేనివారని పరిహాసించుచున్నారు నాగరికులమని భ్రమపడువారిలో యీయిబ్బంది చాలా

యెక్కువగా నున్నది మత ప్రచారకులు యీమాటనే యెత్తు
కొనరు ఆముష్మిక వాదులకు యీగొడవయే కొరగాదు

ఆరోగ్యవిషయిక పత్రికలైననూ యీ విషయమై
శ్రద్ధవహించుట ముదావహము ఈ దురలవాటుకు కారణముల
విచారింతాము దైహిక, మానసిక నైతికభాగములకు సంబం
ధించని రోగమే లేదు ఈ మూడుభాగములలో యే ఒక భాగ
మునకు సంబంధించినరోగమైనా మిగిలిన రెండుభాగములను
కొద్దిగనో, గొప్పగనో చెడగొట్టును చెడకుండ మాత్రము
ఉండవు శిశువు తల్లిగర్భములో నుండగ ప్రసవముకాక
మునుపు తల్లితండ్రిల దుర్నడతలే యీ రోగమునకు ముఖ్య
మని చెప్పాలి ఎల్లాగంటే-తల్లితండ్రిలలో యే ఒకరియందు
గాని, యిద్దరియందుగాని గల అధిక కామేచ్ఛయే వంశాను
గతముగా పిల్లలకు సంక్రమించును గర్భవతిగా నున్నపుడు
సంగమము జరిగినయెడల యీ దురలవాట్లు తప్పకుండా
వెంటబడుతవి గర్భిణీకాలమందు జరుపుసంగమముకన్న ఘోర
పాతకము మరొక టుండబోదు తల్లిఆరోగ్యమునకు భంగము
కలుగుటయేగాక శిశువుజీవితమంతా చెడిపోవుచున్నది అనేక
సుందరతనువులు అకాలములో మృత్యువాతబడుచున్నవి

జంతువులు, గర్భముధరించినతరువాత సంగమమునకు
యిష్టపడవు మగజంతువును దగ్గరకు చేరనీయవు యుక్తాయుక్త
విచక్షణ కలిగిన్నీ మానవులు జంతువులకన్నా అధోగతిలో
పడిపోవుచున్నారని చెప్పుటకే సిగ్గగుచున్నది (విషయము
తెలియకపోవుటచే యింతవరకును అపచారము చేస్తే చేయ

వచ్చును విషయము తెలిసినతర్వాతనైనా యువతీయువకులు అపచారము చేయకుందురుగాక )

ఈ దురలవాట్లు పెచ్చుపెరిగిపోవుటకు విద్యావిధానము కూడా కొంతవరకు కారణమని చెప్పాలి రహస్యములుగా నుంచబడుటచేత ఈ విషయమై యెవరునూ నోరువిప్పరు వివాహసమయమునగాని గర్భాధానకాలమందునగాని పురోహితుడు తెలిసిగాని తెలియకగాని నోరెత్తడు వైద్యనాంలు ఈ జోలికేరాడు ఈ విషయములో స్త్రీలను నిందించరాదు ఎందువలననంటే ఈవిషయమంతా స్త్రీలకు తెలియదు భుక్తికి మగవారిమీద ఆధారపడుటచే స్త్రీలు మగవారి కోరికలను యెదిరించలేరు వారెక్కడ కోపముచెందుదురో అని అనుక్షణమూ భయపడుచుందురు ఈ న్యూనభావము యేర్పడుట చేత అనేకమంది ఈ దురలవాట్లకు గురిఅగుచున్నారు

మందువైద్యముకూడా ఈ పాపమును కొంతవరకు పంచుకొనక తప్పదు వైద్యవరులందరును అతి సంగమమును జరుపవలెననియు జరిపినందువలన పురుషశక్తి యెక్కువగు ననియు ప్రచారముచేయుచున్నారు యుక్తాయుక్తవిచక్షణలేని పాలపొంగుహృదయము కలిగిన యువకులు అందరును ఈ ప్రవాహములో పడి కొట్టుకొని పోవుచున్నారు

హృదయపూర్వకముగా మాటలాడినందువలననే, సంతోషము, ఉత్సాహము కలుగునను విషయమును యువకు లందరును గ్రహించవలయును పశువాంఛలను తీర్చుకొనుట తోడనే కామేచ్ఛ తృప్తిపడునని భ్రమపడరాదు సంతోష పూర్వకముగా స్పృశించినంత మాత్రమునచే సుఖము కలుగు

నని తెలుసుకొనవలయును ఈ విషయము తెలుసుకొన్నపుడు పశువాంఛలను, తృప్తిపరచుకొనుటకు యింత తాపత్రయ పడ నవసరము లేదు భార్యలు గర్భవతులుగా నున్నపుడు పురుషులు యీవిషయములను విధిగా గ్రహించవలయును గ్రహించినట్లయితే, తమ భార్యల ఆరోగ్యమునేగాక గర్భస్థ శిశువుం జీవితము నంతనూ మలినపరచరు మానసిక, నైతిక శక్తులను వృద్ధిపొందించిన వారవుతారు పదునెనిమిది సంవత్సరములు నుండి యీవైద్య సిద్ధాంతముల నమ్మి, ఆరోగ్యసదనమునకు అధ్యక్షుడనుగానుండి నాఅనుభవముల చెప్పవలెనంటే పురుషులరోగల అపరిమిత కామేచ్ఛయే స్త్రీలలో కలుగు దైహిక, మానసిక, నాడీ వ్యాధులకు కారణము సంగమమునందు స్త్రీలకు అసహ్యము కలిగినప్పటికిని ఆవిషయమును భర్తలతో చెప్పుటకు వెనుకాడుతారు భర్త పోష్యములో ఉంటారు గనుక, నిజము చెప్పుటకు భయపడతారు తమయందుగల అనురాగము తగ్గునేమోనని భిడియపడుతారు ఈ స్త్రీ, రోగుల భర్తలతో మాటలాడితే వారుకూడా యీవిషయముల ఒప్పుకుంటారు తెలియక తప్పు చేశామంటారు తమ మాదిరిగనే తమ భార్యలకును కామేచ్ఛ యెక్కువగా నున్నదని భ్రమ పడినామని చెపుతారు ఇప్పటినుండి ఆమె కొరకేగాక, తమ ఆరోగ్యముకొరకునూ, నిగ్రహమును అవలంబిస్తామని ఒప్పుకుంటారు చేసి సర్వసౌఖ్యములను పొందుతారు జీవితమునకు సంబంధించిన యీప్రధాన విషయమును యెంత అప్రధానము చేయుచున్నదీ సామాన్య ప్రజలే గాక తెలివితేటలుకలిగి నాగరికులమని భ్రమపడుపెద్దలే ఈ విషయ

ములో నెంతఅధోగతిలో నున్నదీ బుద్ధిమంతులగు మాచదు వరులు గ్రహించకపోరు సిగ్గు దీనికి మరింతగా తోడుపడు చున్నది పరస్పరముగా ఒకరి అభిప్రాయములు మరొకరికి తెలియచెప్పుకొన్నంతమాత్రముననే యెన్నిసౌఖ్యములు కరతలామలకమయ్యేదీ వేరుగా చెప్పబని లేదు

రోగపదార్థము బహిష్కార్యావయవము లదరిని చేరి బయటకు పోవ ప్రయత్నించుచుండును రోగపదార్థము చేరి మురిగినపుడు ఆ అవయవములలో ఉద్రేకము కలుగును జననేంద్రియములును బహిష్కార్యావయవములును ఒకచోటనే కలిసిఉండుట సన్నిహితదోషముచేత ఆ ఉద్రేకమే జననేంద్రియములలోకూడా కలుగును అందువలననే రోగులలో కామేచ్ఛ యెక్కువగానుండును ఆరోగ్యవంతులలోమాత్రము కామేచ్ఛ పరిమితిగానే ఉండును స్త్రీలకు విపరీతమైన కామేచ్ఛ ఉండునని అనుమానపడు మగవారంచరును స్త్రీలను యేవగించుకొంటారు ఏవగింపు పురుషులలో ఉన్నదిగనుకనే కాస్త కూస్త కూ స్త్రీలను చీదరించుకొంటారు ఈ చీదరింపు పర్యవసానమే రసాభాసము ఇద్దరిలో యే ఒకరికిని సుఖములేదు పరస్పరముగా అర్థముచేసుకొనినవారిలో యేవగింపుగాని, అసహ్యముగాని ఉండదు సుఖముగా సంసారమును గడుపుటచే తాము సుఖమును పొంది, సత్సంతానమును బడయుదురు

## మాంసాహారమువలన కలుగు ఉద్రేకము

తల్లిగర్భములో నున్నప్పుడు మాతాపితరులు చేయు అపచారములవలన శిశువు జీవితమంతా యెట్లా కలుషితమగు

నదీ వెనుకనే చదివినాము ఇదేగాక పిల్లలు చెడిపోవుటకు మరొక కారణముకూడా గలదు తల్లిపాలను వదలిపెట్టినప్పటి నుండీ పిల్లకు యుక్తవయస్సు వచ్చువరకును పిల్ల తిను ఆహారములోని దోషములవలనను, విహారములోని లోపములవలనను, పిల్లకు జీవితము పాడయి పోవుచున్నది మాంసాహారము ముఖ్యముగా కారణమగుచున్నది

జంతుమాంసములోని ఆమ్లములన్నీ ఉద్రేకమును కలిగించును ఎప్పుడును జంతుమాంసము తిననివారు ఎప్పుడో ఒకనాడు మాంసమును తినినయెడల ఉద్రేకముగా నుండుటయు ఒడలు తెలియక మాటలాడుటయు మనము యెరుగని విషయము కాదు మనకు కనబడువారందరును నిత్యమునూ మాంసాహారమును భుజించువారే నిత్యమునూ అదేపని అగుటవలన వీరి అవయవములు మొద్దుబారి యుండును అవయవములు మొద్దుబారియుండుటచే మాంసాహారము వలన కలిగిన ఉద్రేకమును వీరు గ్రహించలేరు సారాయి, బ్రాందీ, కాఫీ, టీ, కోకోలవలనను ఉద్రేకము కలుగును ఒక నిషావస్తువు మరొక నిషావస్తువును కోరుతుంది ఈ పానములు జననేంద్రియములను నాడీమండలమును మెదడులోను చేరి గందరగోళమును చేయును మాంసాహారమువలన కలుగు ఉద్రేకము కాఫీ, టీల వలన యెక్కువగునేగాని తగ్గదు కాఫీ, టీలతో చిన్నపిల్లల నాడీమండలములను ఉద్రేకపరిస్తే జననేంద్రియములలో ఉద్రేకము కలిగి చిరుతప్రాయము నందే సంగమేచ్ఛ కలుగుతుంది సంగమమునకు వీలుపడకపోవుటచే ముష్టిమైథునమునకు అవకాశము కలుగుచున్నది ఇవన్నియు

అజ్ఞానమువలననే వచ్చుచున్నవి మతప్రచారకుడు, పురోహి తులు ఈ విషయమై మూకీభావము వహించుటయే దీనికి ప్రధానకారణము ప్రధానవిషయములు తెలియకపోవుటచే ఈ సంగతులను వీరికన్న మరీ అజ్ఞానులైన దాసదాసీజనము నుండి పశుపక్ష్యాదులచూచి నేర్చుకొందురు తల్లిదండ్రులు ఈ విషయమునుగూర్చి ముచ్చటించుకొంటే వారి సందేహ ములన్నీ తీరిపోవును

## ముష్టిమైధునమువలన కలుగు దుష్ఫలితములు

ముష్టిమైధునమువలన కలుగు దుష్ఫలితములను తెలుసు కొందాము పదునెనిమిది సంవత్సరములపాటు ఆరోగ్య సదన మునకు అధ్యక్షుడనుగానుండి యీదురలవాట్లకు లోనైన కేసు లను యెక్కువగా చూచుటచేత, నా అభిప్రాయములను, యిచట పొందుపరుస్తున్నాను ఈ దురలవాట్లవలన దైహిక, మానసిక, నైతికముగాను దుష్ఫలితములు కలుగును ఈమూ డింటిలోను దైహికముగా కలుగు దుష్ఫలితములకన్నా మాన సికముగాను, నైతికముగాను కలుగు దుష్ఫలితములు మెండు గా నుండును ఈదురలవాట్లకు లోనైనవారు తమ భంగ పాటునుగూర్చి పరులకు చెప్పుటకు భిడియపడుదురు ముష్టి మైధునమువలన తాత్కాలికముగా కలిగిన ఫలితమునకు ఆశ పడి ఆదురభ్యాసమును వదలలేరు నిత్యమునూ అదే పని చేయుచుందురు నిత్యము పత్రికలలో వెలువడు ప్రకటనల చూచి మోసపోయి యీదురభ్యాసాలు చిత్రాతిచిత్రమైన స్వప్నస్కలనములను పొందుచుందురు నిరంతరమును యీవిష యమును గూర్చియే ధ్యానించుచుందురుగాన, విపరీతాలోచ

నలు తోచుచుండును ఎప్పుడును శంకించుచునే ఉందురు అసంతృప్తి, భయము, యెక్కువగును కోపము క్రోధము యెక్కువగును అకాలమరణమునూ యీదురలవాట్ల ఫలితమే

జగన్మాతయగు ప్రకృతి తనజాతికి నిర్దేశించిన నియమములను ఉల్లంఘించుటచేతనే మానవులు యీయిబ్బందులను పడవలసి వచ్చినది ఈయిబ్బందులను దాటవలెనంటే, జాతి నియమములను మీరరాదు సజ్జనులతోడి సహవాసము చేయవలెను ఏయే పదార్థముల తినినయెడల నాడీదౌర్బల్యము, ఋతిచంచలము, మొదలగు మొండిరోగములు కుదురునో, ఆపదార్థములనే తినవలెను ఆత్మవిశ్వాసము యెక్కువగానుండవలయును నిగ్రహము యిందుకు సహాయకారి యగును దైహికశక్తులను వృద్ధి చేయవచ్చును కాని, యీనమ్మకమును కలుగచేయుట మాత్రము కష్టము పశువులకును తనకును, నిగ్రహముకన్న తేడా లేదనియు, నిగ్రహము లేనియెడల తనునూ పశువులతోనే తుల్యమగుననియు మున్ముందు తెలిసికొనవలయును

ఆత్మవిశ్వాసమును మనోనిగ్రహమును, యెట్లు వృద్ధి చేసికొనేది, తరువాత పేజీలలో చదువుదాము ఆత్మ విశ్వాసమువలన యెంతపని జరిగేదీ తెలుసుకొందాము ఆత్మవిశ్వాసమును వృద్ధిపరచుకొనుటకు నిద్రింపబోవు సమయము యుక్తకాలము నమ్మకముతోనునూ, తదేక దీక్షతోను, సాధనచేసిన యెడల, సాధారణముగా అపజయమును పొందరు ఈమార్గములన్నీ పైకి చాలా చులకనగా కనబడినప్పటికినీ కష్టసాధ్యములు, నమ్మి చేసినయెడల తప్పక ఫలకారులగును

## దైహిక శక్తులను వృద్ధిపొందించుట యెట్లు ?

ముష్టిమైథునము, మొదలగు దురలవాట్లకు,లోనుగాకుండా కాపాడుకోవలెనంటే, నియమ నిగ్రహములను అలవరచుకొనుటకన్న మరొకమార్గములేదు జీవితపంథాను మార్చుకొనవలెను ఊరగాయిలను పచ్చళ్ళను తినుట మానవలయును పండ్లను, కూరలను ఎక్కువగా ఆనవలెను మందులను, సేవించుట మానవలెను కాఫీ, టీ, కోకోలను వర్జించవలెను సారాయి, బ్రాందీ, విస్కీలకు నమస్తే చెప్పవలెను ప్రకృతి సహాజమైన పండ్లు, నాడీమండలమును కంపింపచేయవు ఉద్రేకపరచవు ఉదయముననే లేచి, దేహమంతయు మర్దన చేసినయెడల రక్తప్రసరణము వృద్ధియగును నాడీమండలము ఉజ్జీవితమగును సాయంకాలముచేయు కటిస్నానము, మరింత ఉపయోగకారి యగును దిసమొలతో ఆరుబయట, స్నానము చేయుటయే మంచిది ఆరుబయట చేయుటకు వీలు లేకపోయి నప్పటికీ, గాలీ వెలుతురు ధారాళముగా వచ్చు గదులలో నైనా స్నానముచేయుట యుక్తము గాలీ వెలుతురు ధారాళముగా వచ్చు ప్రదేశములలోనే వ్యాయామము చేయవలెను సంపూర్ణ విశ్వాసముంచి, పై పద్ధతులను క్రమముగా, ఆచరించిన యెడల అజీర్ణము, మలబద్ధకము మొదలగు జబ్బులేమీరావు రక్తప్రసరణము బాగుగా నుండును స్త్రీలు, పురుషులు, దాంపత్యసౌఖ్యమును, సంపూర్ణముగా, అనుభవిస్తారు నాగులలో మంటలుగాని, చిమ, చిమలుగాని ఉండవు ముష్టిమైథునముతో తృప్తిపడు, దురభ్యాసకులు, అర్థరహిత వాదముల

తోను, కుంటిసమాధానములతోను, తాము తృప్తిపడుతారు తృప్తిపడుటయేగాక మంచిదనికూడా వాదిస్తారు

ఆరోగ్యము చెడగొట్టుకొన్న దౌర్భాగ్యులకే యిటువంటి కుంటిసమాధానములు దొరకును పరిపూర్ణ ఆరోగ్యవంతులకు దురాలోచనలుగాని, స్వప్నస్ఖలనములు గాని ఉండవు

స్త్రీ, పురుషుల దేహములలో తయారగు జాతిద్రవములు, దేహపోషణకు, కొంతవరకు అవసరము ఎక్కువగా ఊరిన జాతిద్రవములను గ్రంధులు స్వీకరించి, దేహపోషణకును, మానసిక, ఆత్మీయ శక్తులను వృద్ధిచేయుటకును, ఉపయోగపరచును ఈ గ్రంధులు రోగపదార్థముతో నిండినయెడల, ఈ ద్రవములను స్వీకరించలేవు ఈగ్రంధులు స్వీకరించక పోవుటవలన, ఆజాతిద్రవములు ఆ అవయవములలోనే, నిలిచిపోవును నిలవ ఉండుటచేత రహస్యావయవములలో ఉద్రేకము కలుగును రాత్రిపూట స్వప్నములు కలుగును అవయవములలో చేరి ఉద్రేకము కలుగుటచే కృత్రిమ మార్గములద్వారా, తృప్తిపరచుకొనుటకు, ప్రయత్నించును అట్టి సాధనయే ముష్టిమైథునము వీరు ముష్టిమైథునము జరుపనప్పటికినీ, జాతిద్రవములు, అప్రయత్నముగానే కారిపోవును ఈగ్రంధులలో, చేరిన రోగపదార్థమును ప్రకృతి సహజమైన ఆహారమును భుజించుట వలనను, విహారములోని, మార్పుల వలనను బయటకు పంపవచ్చును వ్యాయామము వలననూ తగ్గిపోవును గ్రంధులు రోగపదార్థముతో నిండనప్పుడే, జాతి

ద్రవములను స్వీకరించును ఆహార, విహారములలోని మార్పు లతోబాటు, మానసిక ఆత్మీయ శక్తులను, వృద్ధిచేసినయెడల, జాతిద్రవములు ఎక్కువగా ఊరవు ఊరునంత వఱకును, గ్రంథులే స్వీకరించి దేహపోషణకు ఉపయోగపరచును సందే హము, నాడీదౌర్బల్యము, పోయినయెడల నపుంసకత్వము కూడా, రూపుమాసిపోవును సంపూర్ణవిశ్వాసముండవలయును శాంతముగా నుండవలయును ఫలమును, పొందుదురూ, లేదా అను సంకోచము ఉండరాదు ఆందోళన పనికిరాదు

## హెచ్చరిక

బాలురకును బాలికలకును కావలసిన సంగతులనన్నిటిని తల్లిదండ్రులే చెప్పవలయును అట్లు చెప్పనియెడల, వారా విషయములను తమకన్న తక్కువవారలనుండి నేర్చుకొంటారు పశువులనుజూచిగాని, నోరులేని జంతువులనుజూచిగాని, దాస దాసీజనంబులనుండిగాని, నేర్చుకొంటారు పిల్లలకు కావలసిన, విషయములను తల్లిదండ్రులు చెప్పకపోవుటచేతనే వారికృత్రిమ మార్గముల నవలంబించవలసివస్తుంది

బాలబాలికలకు, యుక్తవయస్సువచ్చి జీవితపంథాను ఏర్పరుచుకొనుటకు, ముందుగనే మంచి చెడు మార్గముల గూర్చి బోధించుటయు తమ విద్యుక్తమార్గముగనే భావించ వలయును పిల్లల చిన్నతనములో, తల్లిదండ్రులు చేసిన బోధలే, వారికి తరువాత జీవితములో ఉపయోగపడుతవి మంచి, చెడు మార్గములు తమలోనే ఉన్నవనియు, మంచి తలంపులుకలిగి, మంచిమార్గమున ప్రవర్తించిన, పేరు, ప్రీతి

ష్ఠలు, గౌరవము ఆరోగ్యము, సౌందర్యము, మొదలగు మంచి లక్షణములు, కలుగునని నచ్చచెప్పవలెను యుక్తాయుక్త జ్ఞానమును, వృద్ధిచేసుకొనుమని, చెప్పవలెను చెడుమార్గమున పోతే నింద, అపకీర్తి, దురభ్యాసములు, ఆత్మవినాశకరము లగు మార్గములు వెంటపడునని చెప్పవలయును

కొంచెము ఆలోచించుకుంటే యేదియుక్తమార్గమో ఆత్మయే చెప్తుంది చెడుమార్గమున పోవద్దని ఆత్మయే, చెప్తుంది ఆ ప్రబోధమును మాత్రము, మనము వినగలిగి ఉండాలి ప్రతివానికిని అంతరాత్మ చెప్పుచునే ఉండును మంచి సలహాలు వినుట అలవాటుచేసుకొన్న వారికి, చెడు మార్గములు, కనుబడవు చెడుతలంపులు వినుటకు, అలవాటు పడినవారికి, మంచితలంపులు రానేరావు

దురభ్యాసములకు, అలవాటు, పడుటకు మరొక కారణముకూడా కలదు ఆత్మనింద, దురభ్యాసముల నెక్కువ చేస్తుంది ఆత్మస్తుతి యెంత హానికరమో ఆత్మనింద కూడా అంత కష్టతరమే ఆత్మనిందవలన జీవితము గడచుటకు, అవసరమైన ఉత్సాహము తగ్గిపోతుంది • నిరుత్సాహము ఎక్కువగుతుంది రోగ నిరోధక శక్తి తగ్గుతుంది రోగ పదార్థము పెరుగుతుంది దీనివలన కలుగు హానిని మాత్రము, మనము ఊహించలేము బయటకు మాత్రము ఏమియు కానరాదు వెంటపడినదా అంటే వదిలిపెట్టదు ఇదియే ఆత్మహత్య ఈ అలవాటుకు లోనైనవారు, బయటకు ఏమియు కనపడుట లేదుకదా అని, తృప్తిపడుదురు అందుకనే కాబోలు మనో

వ్యాధికి మందు లేదంటారు, పెద్దలు ఆత్మనింప యెక్కువైన కొలదీ, ముఖములోని ఉత్సాహము, కంఠములోని రాఘవము, దేహములోనిశక్తి తగ్గిపోవును ఎప్పటి కప్పుడు సంఘమునకు దూరముగాను ఏకాకిగాను ఉండగోరుతారు స్త్రీ జాతితో సంబధమునే యిచ్ఛగింపరు

కాలము గడచిన కొలదీ మనో నిగ్రహము తగ్గిపోవును ఆత్మనింద పెచ్చు పెరిగి వద్దన్నకొద్దీ వచ్చి నెత్తిన పడును అవ్యక్తముగా మాటలాడుట మొదలు పెట్టుదురు మనిషి నీరసించిపోవును నోటివెంట వచ్చే మాటకును చేసే చేతకును, ఎట్టి సంబంధము ఉండదు ధైర్యము ముందటలోనే పడలి పోవును ఇట్లు జరుగుచుండగనే పుంస్త్వము పోవును

ఆరోగ్యము చెడిపోగానే, వెనుతిరిగి చూస్తాడు కొండల కొద్ది బరువు వచ్చి నెత్తిన పడినట్లు భావిస్తాడు నాడులో మంటలు, పోట్లు కలుగుతవి పిచ్చి పుట్టుతుంది మృత్యువు కూడా సంభవించవచ్చు ఈ దురలవాట్లకు లోనయ్యే అనేక సుందర తనువులు అకాల మరణముల పొందుచున్నారు దీనికే లోనుగాకపోతే, ఎంతో మంది దేశోద్ధారకులు, కళారాధకులు, కళోపాసకులు, జాతీయ నిర్మాతలు, కవిపుంగవులు, వైద్యవరులు, తయారయ్యేవారు దేశసంపదయీవిధముగా వ్యర్థమైపోతోంది

## ౨౮

## కశేరుకా చికిత్స

చాలకాలమునుండి పాశ్చాత్య దేశములలో అస్థిసమీకరణ చికిత్సకులే వెన్నెముకలోని వంపులనుకూడా కుదుర్చుచూ ఉండేవారు సాధారణముగా, పాటకజనమే యీపని చేయుచూ ఉండేవారు వారిలో ఈ చికిత్సనుగూర్చి ప్రత్యేక పాఠశాల లేవియునులేవు తండ్రియే కుమారునకు చెప్పుచుండెడివారు ఇట్లాగనే వంశానుగతముగా వచ్చేది

కాని కాలము గడిచిన కొలదినీ యీ పాటక జనము మరొక సంగతినికూడా కనుగొనుచూ వచ్చారు తాముచేయు చికిత్సలవలన వెన్నులోని నొప్పులేగాక అంతరవయవములలో కూడా మార్పులు వచ్చుచున్నట్లు, గ్రహించారు తరువాత వచ్చినవారందరునూ, యీ మూల సూత్రమునే ఆధారము చేసుకొని తమ సిద్ధాంతముల నేర్పరుచుకొన్నారు నాడీవైద్యము, అస్థి సమీకరణము కశేరుకా సమీకరణము మొదలగున నన్నీ ఒకే మూలముయొక్క వివిధ శాఖలు ఏ సిద్ధాంతములో నమ్మకమున్నవారు, ఆ భాగమునే, విపుల పరుస్తూ వచ్చారు ఆరోగ్య శాస్త్రము అభ్యసించు వారందరును ఈ సిద్ధాంతముల తెలిసికొనుట యుక్తము (అస్టియోపతి)

డాక్టరు స్టిలు తన స్వీయ చరిత్రలో ఇట్లా వ్రాశారు 'రక్తము తిన్నగా ప్రసరించక పోవుటచేతనే అంత రవయవములలో బాధ కలుగుచున్న దను విషయము, 1874 సంవత్సరములో తెలుసుకొన్నాను రక్త ప్రసరణముసరిగా నున్న యెడల

ఈ లోపములు రానేరావు రక్తము సరిగా ప్రసరించుటచేత నరములు చర్మము ఎముకలు, కండరములు, వాటిపనిని సరిగా చేయుచుండును ధమనులలోని యెగుడు దిగుడుల వలననే ఈ లోపము లన్నియు వచ్చుచున్నవి రక్తమువలననే జీర్ణయాత్ర మంతా కదలుచున్నది నరములకు కావలసిన స్ఫూరణ, ఆహారమును స్వీకరించుకొను శక్తి, చలనము, మొదలగు లక్షణములన్నీ రక్తము వలననే కలుగుచున్నవి నరములును, రక్తమునకు, కొంత శక్తినిచ్చును రక్తమునకును నరము లకును పరస్పర సంబంధము కలదు

1805 సంవత్సరములో బయలుదేరిన లింగ్ సిస్టమ్ ఆఫ్ స్వీడిష్ మూవ్‌మెంటు చూ రక్త ప్రసరణము బాగుగా నుండిన యెడల ఆరోగ్యము బాగుగా నుండు నను సిద్ధాంతము మీదనే ఆధారపడినవి ఇప్పటి వఱకునూ దొరికిన ఆధార ములబట్టి డాక్టరు స్టిలు ఈ సిద్ధాంతములు తనంతటతానే కనుగొనె ననియు ఇతరులనుండి కాపి చేయలేదనియు, తెలి యుచున్నది వీరి సిద్ధాంతములకు మూలసూత్రము లేవన, ఎముకలలోని యెగుడు దిగుడుల వలననే, రోగము వచ్చు చున్నది ఎట్లాగంటే యీ ఎగుడు దిగుడుల వలన ధమనుల లోని రక్తప్రవాహమునకు అడ్డు తగులును రక్తపు వేగము ఎక్కువగుటయు, తగ్గుటయు కలుగును రక్తప్రసరణము సరిగా లేకపోవుటచేత అంతరవయవములు సరిగా పనిచేయవు పని చేయకపోవుటవలన, జీర్ణక్రియ, బాగుగా జరుగదు కశే రుకా సమీకరణము వలన ఈ లోపము లన్నియు సరియగును

## కీరో ప్రాక్టిక్

1885 వ సంవత్సరములో డాక్టరు పామరు రోగము నకు కారణములు తన్నివారణోపాయములను గూర్చి యీ క్రింది విధముగా, జెప్పిరి వెన్నెముక బెణుకుటవలననేసర్వరోగ ములును వచ్చుచున్నవి ఎట్లాగంటే—వెన్నెముక బెణుకుట వలన, వెన్నెముక సరియైన స్థానములో ఉండదు దానినుండి పుట్టిన నరములు యధాస్థానములో ఉండవు స్థానభ్రంశమును పొందును ఈనరములకు సంబంధించిన, అవయవములు, సరిగా పనిచేయవు వెన్నెముక బెణకి స్థానభ్రంశమును పొందుట వలన నాడిశక్తి సరిగా, ప్రవహించదు నాడీశక్తి యెక్కు వగుటయు, తక్కువగుటయు రెండునూ నష్టదాయకములే ఏ అవయవమునకు నాడీశక్తి సరిగా అందదో, ఆ అవయవ ములు సరిగా పనిచేయవు అందువలననే రోగములు వచ్చు చున్నవి వెన్నెముకలోని లోపములను సరిచేసినందువలన రోగములన్నియు నయమగును

ఆస్టియోపతీ, కీరోప్రాక్టిక్ రెండు భాగములు అభి వృద్ధి పొందినవి ఈ రెండు భాగములలోని ప్రవీణులును, తమ అభిప్రాయములను, కూడపలుకుకొని వచ్చిరి

కీరోప్రాక్టిక్ పుట్టి యేడు యేండ్లు గడచిన తరువాతనే ఆస్టియోపతీ అనుయాయులు, వారి వాఙ్మయములో, వెన్నె ముకలోని బెణుకుల వలననె, నరములలోని వంపులు కలుగు చున్నవనియును, నరములలోని వంపుల వలననే రోగములు

వచ్చుచున్నవనియును, చెప్పిరి కిరోప్రాక్టికు అనుయాయులు నూ నరములలోని బిగివిని తగ్గించిన తరువాతనే వెన్ను వంపులను సరిచేయ వలయునని తెలిసికొనిరి వెన్నెముకలోని వంపులను, సరిచేయుటయేగాక ఎముకలలోని వంపులను కూడా సరిచేయుట మొదలు పెట్టిరి కిరోప్రాక్టికు ధర్మములును, ప్రక్రియయును అన్నియు, ఆస్టియోపతీ నుండి పుట్టినవేను ఈ రెంటికినీ దగ్గర సంబంధ మున్నది

## నా ప్రి ప తీ

సంధాయక ధాతువు ఎముకకన్న మెత్తగాను, కండరముకన్న బిగువుగాను ఉండును ఇవి రెండు ఎముకలకును మధ్యను, ప్రతి జాయంటు (సంధిలోను) ఉండును రెండు ఎముకలును సంధాయక ధాతువును సంధిబంధనములతో కట్టబడియుండును రెండు ఎముకలును, రాపిడికి అరిగి పోకుండునట్లు ఈ సంధాయక ధాతువు కాపాడుచుండును సంధాయక ధాతువు బిగియుటవలననే యీరోగములన్నీ వచ్చుచున్నవని యీ భాగము చెప్పుచున్నది ఈ విషయమునే 1907 సంవత్సరములో స్మిత్తుగారు చెప్పినారు వెన్నెముక స్వాస్థ్యమును తప్పినదంటే విరిగైనా పోవాలి లేదా స్థాన భ్రంశమునైనా పొందవలయును ఆస్టియోపతీవారు చెప్పు ఎముకలలోని వంపులును, కీరోప్రాక్టరు చెప్పు సబ్లక్సేషనులును సంధాయక ధాతువులోని లోపములే కీరోప్రాక్టరు చేయు వెన్ను సవరింపులకును నాప్రిపతీవారుచేయు చికిత్సలకును ఒక తేడా కలదు నాప్రిపతీ అనుయాయులు సంధాయక ధాతువులోని

లోపములను సరిచేస్తారు ప్రతి జాయంటులోను, సంధాయక ధాతువు కలదు ఎక్కడి సంధాయక ధాతువులోని లోపముల

## స్పాండిలో థెరఫీ

నైనా సరిచేయటానికి స్మిత్తుగారు మార్గముల చెప్పారు

ఈభాగమును అల్బర్టుఅబ్రిహాము విపులపరచారు దేహముమీద పుట్టిన పుండువలన ఆభాగమునకు సంబంధించిన వెన్నుపూసలోని, నరములలో పచ్చి యేర్పడును నరములలోని పచ్చితనము వల్ల నైనా వెన్నుముకలోని లోపము రావచ్చు లేదా వెన్నెముకలోని లోపము వలననైనా నరములలో పచ్చితనము రావచ్చు

## మ్యారోపతీ

ఈభాగమును జాన్ఆర్నాల్డు హారీవాల్టర్లు కనుగొనిరి కణములనుఉదుపులోనుంచు వాసోమోటార్ నేర్వులో అరగని పదార్థమున్నూ విషములున్నూ, ఉద్రేకపదార్థములున్నూ, చేరుటచేతనే, రక్తము సరిగా ప్రవహించదు రక్త ప్రసరణము సరిగా లేకపోవుటవలన దేహములోని అన్ని అవయవములకున్నూ చేరవలసినంత పోషణ అందదు అందువలన చచ్చుపడిపోవును ఇదియే రోగము

వెన్నెముకనుండి బయలుదేరిన నరములు దేహములోని, అన్నిభాగములకును, పోవును ఈనరములద్వారానే, దేహములోని అన్నిభాగములకును నాడీశక్తి ప్రవహించును వెన్నుపూసలలో ఏ రెండుపూసల మధ్యనైనా వంపులువస్తే పైన క్రింద ఉన్న పూసలలోకూడా మార్పులు వచ్చును

అందువలన నాడీశక్తి సరిగా ప్రవహించదు వెన్నెముకకు చికిత్స చేసినందువలన దేహములో, ఎభాగములో కలిగిన లోపములనైనను, సరిచేయవచ్చును

## న్యూరో థెరపీ

పైభాగముల అభివృద్ధిలోనికి తెచ్చిన వారందరును రోగము యొక్క పుట్టుపూర్వోత్తరముల గూర్చి యెవరికి తోచిన, అభిప్రాయములను వారు చెప్పిరి రోగములు కుదుర్చుటకు వారికితోచిన చికిత్సాప్రక్రియల సెలవిచ్చిరి ఈమార్గముల ననుసరించుటచేత చాలారోగములు కుదిరినవి ఆయా భాగములకు సంబంధించినవారు వారిఅభిమానముకొద్దీ ఆయా భాగములు, ప్రధానములని చెప్పినప్పటికిని, వీటన్నింటిలోను, సత్యము లేకపోలేదు ఈభాగములన్నీ మాటలపొందికలోని తేడాలేగాని మరేమీ వైరుధ్యము లేదని యీప్రకరణములోనే మనము తెలుసుకొంటాము

ప్రకృతివైద్య ప్రధానసూత్రములకు, వ్యతిరేకము గాకుంతవరకు, వీటన్నిటి సమన్వయమే ప్రకృతి వైద్యము ఈ భాగములలోని నిర్మాణభాగములను పరిశీలించాము తరుణ వ్యాధులలోను, కాలిక వ్యాధులలోను, ఈచికిత్సాప్రక్రియల ఉపయోగించి, చూచినాము వాటివలన కలిగిన ఫలితములను, ప్రత్యక్షముగా చూచినాము

వీటిసమన్వయమే (న్యూరోథెరపీ,) ఈభాగమును చెప్పుటకు ముందు వెన్నెముక అననేమో, దానికినీ మిగిలిన అవయవములకును, గలసంబంధమేమో ముందుగా తెలుసు

కుందాము ఈవిషయము తెలిసే ముందుభాగము చాలా తేలికగా అర్థమగుతుంది

## వెన్నెముక

వెన్నెముకనుగూర్చి తెలిసికొనినకొలదినీ, సృష్టిచిత్రములలోనికెల్ల అద్భుతమైనదని గ్రహిస్తాము ఈవెన్నుపాము నకు మధ్యగా ఒక కాలువఉన్నది ఈకాలువ మెదడుతో కలిసి ఉన్నది మెదడుతో చేరిన యీకాలువగుండా, నాడీశక్తి ప్రవహించుచుండును ఈ నాడీశక్తివలన దేహములోని అన్నిభాగ ములును కదులుచున్నవి మెదడునుండి బయలుదేరిన నాడీ తంతువులు ఈ వెన్నుపూసలోనుండి ప్రవహించుచుండును ప్రతివెన్నుపూసనుండియు రెండేసి నాడీతంతువులు, శాఖలుగా చీలి దేహముయొక్క కుడి, యెడమలకు వ్యాపించును, అచ్చటనుండి, అవి కోటానకోట్లగు శాఖలుగా చీలి దేహము నందలి ప్రతిభాగమునకు వ్యాపించును వెన్నుపామును ముందు వెనుకలకును, ప్రక్కలకును, త్రిప్పునపుడును, వలయాకారి ముగా, త్రిప్పునపుడును, మెలివేయునపుడును, ఆ నాడీ సంహ తుల కెట్టిఆపదయు కలుగకుండునట్లు వెన్నుపూసలు నిర్మింప బడినవి ఇచటనె వెన్నుపూసలు తమతమ స్థానములలో సరిగ ఇమిడిఉండక పోవుటవలనను, మాలిన్యములు చేరుటవలనను, చుట్టుప్రక్కలనుండు ధాతువుల యందును, అవయవముల యందును, సరియైన సామరస్యము లేకుండుటవలనను, అనేక వ్యాధులు కలుగును వెన్నెముకయొక్క వెనుకభాకమునకు పృష్ఠభాగమనియు,ముందుభాగమునకుపురోభాగమనియుపేరు

వెన్నుపూసలయొక్క పృష్ఠభాగమును వ్రేళ్ళతో స్పృశించి, తెలిసికొనుటకు వీలుగానుండును వ్రేలికి తగులునట్లు, ఎత్తుగా నున్న భాగమున వెన్నుపూసల యెత్తైన భాగ ముండును అవి ఒకదానితో ఒకటి కలిసి వెన్నుపాముగును అందులో ఎగుడుదిగుడు కలుగుట వలన వ్యాధులు కలుగును వానిని చేతితో తడవి తెలిసికొని చక్క చేయవచ్చును

వెన్నుపూసలను, ఒకదానిపైనొకటి పేర్చినట్లును, అందులో కొన్నిటిపల్లములలో వేరొకదాని మెరకభాగములు ఇమిడి ఉండునట్లును నిర్మింపబడినవి అవి ఉపాస్థులచేత, గట్టిగా, కట్టబడిఉన్నవి వానిమధ్య సందులున్నవి ముందుకువంగినపుడు ఆ సందులు వ్యాకోచమును పొందును వెనుకకు వంగినపుడు సంకోచమును పొందును ప్రక్కలకు వంగునపుడును, వలయాకారముగా, త్రిప్పునపుడును వెన్నుపూసలకు ఒరిపిడి తగలకుండునట్లు, వసతులు గలవు

వెన్నుపూసలకు మధ్యభాగమున పైనుండె క్రిందకు ఒక రంధ్రమున్నది అది వెన్నుపాము మొత్తమునకంతటికిని, కలిసి పైనుండి, క్రిందకు వ్యాపించియుండును మెదడునుండి, ముడ్డిపూసలవఱకును, ఉన్న రంధ్రముగుండా, మజ్జానాడి వ్యాపించియుండును

ప్రతివెన్నుపూసకును ప్రక్కలకుసయితము రంధ్రములున్నవి వీనికె మజ్జాంతర్నాడులని పేరు వానిగుండా, మజ్జానాడినుండి చీలిన శాఖలు దేహమంతయు వ్యాపించియుండును ఇట్టివి 31 జతలున్నవి

ప్రతి వెన్నుపూసలోనుండియు మెదటినుండి మజ్జానాడి

వ్యాపించి ఉండుటవలనను, అందుండియే వెన్నుపూస కొకటిం టికి, రెండేసినాడులచొప్పున దేహమునకంతటికిని నాడులు వ్యాపించి ఉండుటవలనను ఈ వెన్నెముకయే మానవదేహ నిర్మాణములో ప్రధానమైనది

ప్రకృతి గృహవైద్యము—16, 17 పేజీలు,

## అ స్థి పం జ ర ము

మానవుల అస్థిపంజరములన్నియు, ఒకటిగనే ఉండును అట్లాగనే జంతువుల అస్థిపంజరములన్నియు ఒకటిగనేఉండును ఈ రెండు జీవకోటులలోను వెన్నెముకయే అస్థిపంజరమున కంతకును మూలము

జంతువులలో వెన్నెముక అడ్డముగ నుండును నాల్గు కాళ్ళు ఆ వెన్నెముకను ఎత్తిపట్టును జంతువులలో వెన్నె ముకకు ముందుభాగమున పుర్రె ఉండును వెనుకభాగమున తోక ఉండును జీవశాస్త్రము ప్రకారము, చెప్పవలెనంటే, జంతువుల కళేబరములు, కప్పి కళేబరముల తరువాతి రూపము లేను జంతువుల కళేబరములలో వెన్నెముకఅడ్డముగానుండుట చే అచ్చటనుండి బయలుదేరిన నరములన్నియు జల్లెడగా అల్లుకొనుటకు, వీలుపడుచున్నది

మానవుల అస్థిపంజరములలో వెన్నెముక నిలువుగా నుండును నిలువుగాఉండుటచేత, లోపల నరములన్నియు, అంతచిక్కగా అల్లుకొనవు ఉరము, ఉదరము, తల, వెన్నె ముకకు ముందుగానుండును ఇవి ముందుకు పడిపోకుండా ఉండ గలందులకు, వెన్నెముకకు నరములతోను కండరములతోను

గట్టిగా కట్టబడియుండును వెన్నెముక నిలువుగాఉండుటచేత ఈ బరువంతా కూపకముమీద నిలుచును ఈ కూపకపు బరువంతా, రెండు ఊర్వస్థులు (తొడయెముకలు) మోయును దేహము, ముందు వెనుకలకు పడిపోకుండా, వెన్నెముకయే కాపాడుచుండును వెన్నుపూసలు, ఉండవలసిన చోటును వదలి, ముందుకుగాని, వెనుకకుగాని పోవుట స్థానభ్రంశము

## వెన్ను వంపులు

వెన్నుపూసలు స్థానభ్రంశమును, పొందితేగాని, వెన్నెముకలో వంపురాదు అంతరవయవములలోని, లోపములవలననైనా, వెన్నులో వంపులు రావచ్చు వెన్నువంపువల్లనైనా, అంతరవయవములు రోగగ్రస్తములుకావచ్చును అస్థిపంజరమునకంతకును వెన్నెముకయే ప్రధానమగుటవలన, దేహములో ఏభాగమునకు దెబ్బతగిలినా, యీ యెముకకును, దెబ్బతగులును శిశువు పారాడుట మొదలుపెట్టినది లగాయితు, వెన్నెముకకు దెబ్బలుతగులుతునే ఉంటవి ఈదెబ్బలను, మరచిపోతాము మరచిపోతాముకాబట్టి, తరువాత వచ్చిన బాధలన్నీ యీ దెబ్బలవలన వచ్చినవంటే నమ్మరు పూర్వకర్మవలన వచ్చినవి అంటారు చిన్న దెబ్బలన్నీ పరసిపోవును ఏవైనా పెద్దదెబ్బ లైతేనేగాని వెన్ను వంపులు నిలబడవు ఈ దెబ్బలతో అంతరవయవములు పాడై పోవును నిద్రపోవునపుడు, అన్ని కండరములు సడలియుండును వేటికినీ పని ఉండదు వెన్నెముక ఏమీ బరువును మోయదు ఖాళీగానే ఉండును చిన్న దెబ్బలన్నీ నిద్రలోనే పోవును సంధాయక

ధాతువు బిగియుట వలననూ, సడలిపోవుట వలననూ, పైన క్రిందఉన్న రెండు పూసలకును,పని ఎక్కువగును కదలిక లేక పోవుటవలన ముందుకుగానీ, వెనుకకుగానీ, వంగిపోయి యుండును ఈ వంపువలన నాడీశక్తి తిన్నగా ప్రవహించదు అందువలన అంతరవయవములు రోగగ్రస్తము లగును

సంధులలో కదలిక ఉండునుగాన, రోగ పదార్థము సాధారణముగా అచ్చటచేరదు

వెన్నెముకలో పటుత్వము లేకపోవుట వలననే రోగము లన్నియు, వచ్చుచున్నవి

దెబ్బలు తగులుట, బెణుకుట మొదలగు కారణము లన్నియు నిమిత్తమాత్రములే గాని ప్రధానములు, మాత్రము గావు ఈ దెబ్బలు మామూలు ఆరోగ్యవంతు నేమిచేయ లేవు ఏదైనా మొనక యుంటే యీ దెబ్బలుచేరి అపకారము ను చేయును ఆహారము సరిగా జీర్ణముకాక పోవుట వలననూ, లోపల తియారైన మురుగు బయటకు పోక పోవుటచేతనున్నూ వ్యాయమములోని లోపముల వల్లనూ, నిలుచుండుటలోను, కూర్చుండుటలోని లోపము వలననూ, యింకా యితర దురల వాట్లవలననూ, వెన్నెముక సన్నగిలి, దానిలోని పటుత్వము తగ్గిపోవును దేహములో ఏభాగములో పుండుపుట్టినా, అచట పుట్టిన మంటలు నరములద్వారా వెన్నుపాము వఱకూ వ్యాపిం చును దురలవాట్లవలన, ఆరోగ్యవంతుని వెన్నెముకలోకూడా వంపులు వచ్చును కాన వెన్నెముకలోని వంపులు దురలవాట్ల వలన వచ్చిన ఫలితములే ఈ వెన్నులోని వంపులకును,

అంతరవయవములలోని రోగమునకును సంబంధము కలదు వెన్ను వంపుల వలన అంతరవయవములును చెడును అంతరవయవములలోని రోగము వలన వెన్నువంపులు కలుగును ఇట్లాగనే యీ రెంటికినీ పరస్పరసంబంధ మున్నది

## వెన్నులోని దోషములు

వెన్నుపూసలలోని యెగుడు దిగుడుల వలన అన్ని రోగములును వచ్చుచున్నవని కశేరుకా సమీకరణశాస్త్రజ్ఞులు చెప్పుదురు కశేరుకను జాగ్రత్తగా పరీక్ష చేసినయెడల కొన్నిరోగములకు వెన్నువంపులే మూలమనియును, కొన్ని రోగములకును వెన్నువంపులకును సంబంధము లేదనియు తెలియగలదు రెండు వెన్నుపూసలకును, మధ్యనగల సంధాయక ధాతువు తగ్గిపోవుట, పెరుగుట వలననే రోగములన్నియు వచ్చుచున్నవను మాటమాత్రము నిజము రెండు వెన్ను పూసలకును మధ్యనగల ఖాళీ పెరుగుటయు, తగ్గుటయు గలదు వెన్నుపూసల చ్యుతి వలన చాలాకేసులలో రక్తప్రసరణము నందు లోపములు కలుగును

ప్రతివెన్నుపూసకును ప్రక్కలకు సయితము రంధ్రము లున్నవి వీనిగుండా మజ్జానాడినుండి చీలిన శాఖలు దేహ మంతయు వ్యాపించును ఇట్టివి 31 జతలున్నవి

ఎముకలలోని హెచ్చుతగ్గులవలనను, సంధాయక ధాతువులోని యెగుడు దిగుడుల వలనను, మజ్జాంతర్నాడుల రూపములోను, సైజులోను మార్పులు కలుగును ఈ యెగుడు దిగుడులవలన మజ్జాంతర్నాడులు సరిగా పని చేయవు

కండరమువంటి పొర యీ మజ్జాంతర్నాడుల చుట్టునూ ఉండును మజ్జాంతర్నాడులలో మార్పు వచ్చుటవలన రస, రక్తవాహికలలో మార్పు వచ్చును వెన్నెముకకు దగ్గరగా ఉన్నంతవఱకునూ యీ మజ్జాంతర్నాడిచుట్టునూ కండరము వంటి పొర కప్పియుండును వెన్నెముకను దాటిపోయిన తరువాత సంధాయకధాతువు పొరలు ఈ మజ్జాంతర్నాడి చుట్టునూ చేరును సంధాయకధాతువు ముడుచుకొనిపోవుట వలన (ఫోరమన్) లో ఉన్న నాడులకు దెబ్బ తగలకపోయినప్పటికినీ శాఖోపశాఖలుగానున్న అంతర్నాడులలో మాత్రము తప్పక దెబ్బతగులును నరములలో మంటలు కలుగుటవలన మొదటిలో నాడీశక్తి హెచ్చి యీనాడులకు సంబంధించిన అంతరవయవములకు నాడీశక్తి యెక్కువగా చేరును అందువలన ఆ అవయవములు మామూలుకన్న ఎక్కువపని చేయును తరువాత నాడిశక్తి తగ్గిపోవును (ఇది నాడీశాస్త్ర సాంప్రదాయము) నాడీశక్తి తక్కువగా చేరుటచే అంతరవయవములు సరిగా పనిచేయవు

వెన్నుపూసలలోని దోషములవలన ఆ యా పూసలలోని కదలిక తగ్గిపోవును ఈ పూసలలోని కదలికలోని తగ్గింపు రెండు కారణముల వలన రావచ్చును సంధాయక ధాతువులోని కుదింపువల్లనైనా రావచ్చు లేదా ఆ వెన్నుపూసలను అదుపులో నుంచునట్టి కండరములోని బిగింపు తగ్గిపోవుట వల్లనైనా రావచ్చును వెన్నెముకలోని అన్నిపూసలలోని శక్తిప్రసరణము క్రమముగానుంటె, వెన్నుపూసల కదలిక

క్రమముగానుండును వెన్నుపూసలను అదుపులోనుంచునట్టి కండరములు బాగుగా పనిచేయుచుండును ఈపూసలలోని జతలలో ఏ ఒకజత చెడిపోయినా మిగిలినవికూడా కాస్తో కూస్తో చెడును

అవయవములు సరిగా పనిచేయకపోవుటవలన యాంత్రికములైన లోపములు ముందు కలుగును ఈలోపములే హెచ్చు పెరిగినపుడు దైహిక బాధలు కలుగును

## ఇతర దోషములు

మిగిలినజాయింటులలోని దోషముల వలనను, దేహములో బాధలు, మార్పులు కలుగవచ్చును స్త్రీలకు గర్భిణీ కాలములో శిశువు నిలవ ఉండు కూపకములోని జాయింట్లన్నియు, విరివిపొందును యుక్తమైన ఆహారమును తినకపోవుట వలనను విహారములోని లోపములవలనను, గర్భిణీకాలములో విరివిపొందిన యెముకలన్నియు ప్రసవానంతరము స్వస్థానమునకు చేరుటకు సామాన్య ఆరోగ్యవంతులకు, ఆరు వారములు పట్టును విరివిగా నుండి సడలింపబడక పోవుటవలన వాటిలోని బిగివి తగ్గిపోయి ఉండును అందువలననే చాలా మంది స్త్రీలకు ఒకటిరెండు కాన్పులు అయినవెంటనే పొట్ట పెరిగియు, పిరుదులు జారిపోయియు, తొంటి జారిపోయియు ఉండును గర్భిణీకాలమునందును ప్రసవానంతరమును స్త్రీలు సంచరించు వక్రనడతలవలననే యిన్ని యిబ్బందులును కలుగుచున్నవి

కూపకమునకు వెనుకఉన్న వెన్నుపూసలు కదలిక

లేకుండా బిగిసిపోవుటవలన వాటిక్రిందనున్న పూసలలో, కదలిక యెక్కువగును జంతుదేహములలో వెన్నెముక అడ్డముగానుండి దానినుండియే మిగిలిన భాగములన్నియు, వ్రేలాడుచుండును మానవదేహములలో మాత్రము అట్లు కాదు వెన్నెముక నిలబడిఉండునుగాన దేహభారము నంత నూ కూపకమే మోయవలసియుండును అందువలన వెన్ను పూసలలో ఏ జత స్థానభ్రంశమును పొందినప్పటికినీ, మిగిలినవి కూడా కాస్తోకూస్తో చెడక తప్పదు

వెన్నుపూసలలో మెతకలు ఏర్పడేటప్పటికి ఏ చిన్న దెబ్బలైనా, పెద్దవై కటి శిరోవేదన మొదలగు జబ్బు లేర్పడును

ప్రక్కయెముకలు కలియుచోట వెన్నుపూసలలో, దోషములు కలిగిననూ ముడ్డిపూసలలో క్రింది రెండుపూస లలో కలిగిన దోషములవలననూ ప్రమాదమే కలుగవచ్చును గ్రంథవిస్తరభీతిచే ఈలోపములు ఎట్లువచ్చునదియు ఎం దుకు వచ్చునన్నదియు వాటి ఫలితములను చెప్పలేదు నిలుచుండుటలోను, కూర్చుండుటలోను, పండుకొనుట లోను, నడచుటలోను కలిగిన దోషములవలన వెన్నెముకలో దోషములు, ఏర్పడుతవి వెన్నుపూసలలో, దోషములు లేక పోతే కదలిక కేమీ భంగముండదు ఆయా పూసలకు సంబం ధించిన కండరముల కదలికలో నెట్టిలోపమున్నూ ఉండదు

కశేరుకా సమీకరణలో అనుభవశాలురు మాత్రము వెన్నుపూసల సందునఉన్న ఖాళీని చేతివ్రేళ్ళతో కనుగొని,

దోషముల నిర్ధారణ చేయగలరు చికిత్సాప్రక్రియలు తెలిసి ఉండుటచే వారాలోపములను సరిచేయగలరు

కశేరుకకు యక్సురేఫోటోను తీసినచో లోపములు బయటపడును

ఒక వెన్నెముకనే పరీక్షచేసి ఫలానా రోగమని చెప్పుటకు వీలులేదు దీనితోపాటు మిగిలిన అన్నిపరీక్షలును చేయవలెను మలమును పరీక్షచేయవలెను మూత్రమును పరీక్షచేయవలెను కనీనికను పరీక్షచేయవలెను దేహమునంతనూ పరీక్షచేయవలెను ఇన్నిపరీక్షలుచేసినగాని, రోగముయొక్క పుట్టుపూర్వోత్తరములు సరిగా తెలియవు ఏకారణమువలనరోగమువచ్చినదీ, ఇప్పుడుఏరూపములోనున్నదీ కనుగొనవచ్చును

## దోషముల సరిచేయుట

వెన్నెముకలో దోషముకలిగి కొద్దికాలమే జరిగినయెడల ఆయాభాగములకు విశ్రాంతినిచ్చినయెడల దోషములు సరియగును కొద్దిదోషములు చేతితో సరిచేయ వచ్చును నాడీశ సరిగాప్రవహింపచేయవచ్చును

అవసరమెరిగి మర్దనకూడా చేయవచ్చును దోషములు లేతరికములో నున్నపుడు తీవ్రప్రక్రియ లేవిన్నీచేయరాదు

దోషములు ఏర్పడి కాలము గడచినకొలదినీ వెన్నువంపులు బిగిసిపోవును ఇట్లా బిగిసిపోయిన వంపులను ఒకేతడవగా సరిచేయుట ప్రమాదకరము క్రమేపీ సాధనచేయవలయును గాని ఒకేతడవగా రావు సరిచేయుటకు ప్రయత్నములు చేసినయెడల విరిగిపోవును

అన్ని కేసులలోను ఒకటే ప్రక్రియలు పనికిరావు. కేసునుబట్టి మారుచుండును ఈక్రిందచెప్పిన ప్రధానసూత్రములదృష్టిలోనుంచుకొని వెన్నుపూసలను సరిచేయవలయును (1) ముడుచుకొని పోయిన కండరముల లాగి సరిచేయవలెను విరివిచెందిన కండరముల కుదింపు చేయవలయును (-) రోగిని సమప్రదేశములో పడుకొనబెట్టినపుడు, దోషము ఉన్న పూసలలోన నొప్పినీన్ని కలుగును మిగిలిన పూసలలో నొప్పి కలుగదు (3) దోషములున్నపూసలలో చలనము తగ్గిపోవును. చలనము పూర్తిచేయుటకు అవసరమగు మార్పులను చేతితో చేయవలయును నాడీశక్తిని సరిగా ప్రవహింపచేయుట వలన జీర్ణక్రియ సరియగును (4) కుదించబడిన సంధాయక ధాతువును సరిచేయవలెను (5) ప్రతిప్రక్రియానంతరమునూ నాడీశక్తి సరిగా దేహమంతటను ప్రవహించునట్లు చేతితో సరిచేయవలయును

రక్తప్రవాహముకూడా యెక్కువ గాకుండా సరిచేయవలయును

ఈ చివరసూత్రమును ప్రధానముగా నుంచుకొని సమీకరణమువలన దుర్గుణములు కలుగకుండా చూడవలయును

ఇంతవఱకును సమీకరణశాస్త్రజ్ఞులు ఏమిచెప్పచూవచ్చారంటే సమీకరణమువలన దోషములుపోయి యెముకలు యథాస్థానమునకు వచ్చును సమీకరణముచేసినతరువాత ఆ యా భాగములలో కలుగు మంటలన్నియు నివారణచేయుటకే ఉపయోగించునుగాని రోగము నేమీ యెక్కువ చేయవు

ఈమంటలనే మందువైద్యులు రోగాభివృద్ధి చిహ్నములుగా భావిస్తారు

గత ఏబదిసంవత్సరములనుండీ, ప్రకృతివైద్యమువారు ఈ లక్షణములన్నియు రోగమును తీసివేయునేగాని, వృద్ధి చేయవని చెప్పుచూ వచ్చారు

(లాఆఫ్ క్రైసిస్) ప్రకారముచూస్తే, రోగపదార్థమునకును నివారణోపాయములకును జరుపు పోరాటములో నివారణోపాయములదే పైచేయి అయితే రోగము నయమగును ఈసంకటముల స్వాస్థ్యసంకటము లంటాము పై పోరాటములో రోగపదార్థమది పైచేయి అయితే రోగము నయము కాదు ఈ పోరాటములో కలుగు బాధలకు రోగసంకటము లంటాము

వెన్నువంపులను సరిచేయవలెనంటే వ్యాయామము కూడా కొంతవరకు ఉపయోగించును ఈవ్యాయామము వలన వెన్నెముకను అదుపులోనుంచునట్టి కండరములు బలకరములగును తల, రొమ్ము, ముందువెనుకలకు వంగక సరిగా మధ్యనే ఉండును వెన్నెముకకు పుష్టినిచ్చు వ్యాయామమునే యెక్కువగా చేయవలెను

వ్యాయామవేత్తలు సాధారణముగా ఊర్ధ్వఅధోకాయములు బాగుగాపెరుగుటకే వ్యాయామముల చేయిస్తారు వెన్నెముకసంగతి వారు తలచనేతలచరు ఏమైనా శ్రద్ధవహించి ఉంటే, యీభాగముకూడా, పెరుగుటకు వారు వ్యాయామమును చేయించెడివారే

## న్యూరో థెరపీకిని, మిగిలినభాగములకును గల సంబంధము

స్టిలు, పామర్, స్మిత్తులసిద్ధాంతము ప్రకారము ప్రకృతియే రోగముల సరిచేయును రోగమువచ్చిన తరువాత, ఏ విధమైన సరుకు లోనికి చేర్చనియెడల ఉన్నసరుకే ఖర్చగుట వలన, ఆరోగ్యము కలుగును ఆరోగ్యము సరిగాలేకపోవుటయే రోగము ఏవో అభ్యంతరములు ఏర్పడినవని వెంటనే తెలుసుకొనవలెను ఈఅభ్యంతరముల తీసివేస్తే ఆరోగ్యము కలుగుతుంది ఈ క్రింది ఉదాహరణమువలన ఈవిషయము బాగుగా విశదముకాగలదు

ఒక యింటికప్పు ఊడిపోవుటవలన, బెజ్జముపడి యింటిలో నీళ్ళుపడినవనుకొనుడు ఇంటిలోని నీళ్ళు ఎత్తిపోసినందువలన ఉపయోగమేమీలేదు బెజమునుపూడ్చక నీరు ఎత్తిపోస్తే ఉపయోగమేమిటి ?

(నాప్రపతీ) వారు మాత్రము బెజ్జమును పూడ్చమంటారు ప్రకృతివైద్యప్రకారము కప్పులోని మెతకను తీసివేసి సరిచేయవలయును మెతకను తీసివేయనియెడల మరొకచోట బెజ్జముపడును కశేరుకాసమీకరణ శాస్త్రజ్ఞులు కప్పులోని బెజ్జమును, మాత్రమే సరిచేయుదురుగాని కప్పుజోలికిపోరు వానజల్లులు పడకుండా కాపాడుకోవలెనంటే, మెతకపడిన భాగమును శుద్ధిచేయవలెను గట్టిపరుచుకొనవలెను సూక్ష్మజీవిని కనుగొని నాశనముచేసినయెడల రోగము నయమగునని మందువైద్యులు చెపుతారు అట్లనే కశేరుకాశాస్త్రజ్ఞులును వెన్నువంపులు సరిచేస్తే రోగము నయమగుతుం దంటారు

ఆరోగ్యసూత్రములను విధిగా ఆచరించుటవలననే రోగపదార్థ మునకు ప్రాపు లేక పోవుటవలన తగ్గిపోయి ఆరోగ్యము కలుగు నను మాటనే వీరుభయులును విస్మరించారు మందువైద్యము నకును, ప్రకృతివైద్యమునకును, ఎట్టిసంబంధమును లేదు కశేరుకాశాస్త్రజ్ఞులును కాస్తాకూస్తా తేడాలతో మందువైద్యుల త్రోవనే నడుస్తున్నారు రస, విష, పాషాణాదుల వాడమని వీరును చెప్పతారు శస్త్రచికిత్సకూడా వారిశాస్త్రములో ఒక భాగమే మందుల నన్నిటినీ నిరాఘాటముగా వాడుచునే ఉన్నారు

నాడీశక్తి తిన్నగా ప్రవహించినంతమాత్రముననే ఆరోగ్యము కలుగదు తినుతిండిలో మార్పు రావలయునేగాని, అనవసరపదార్థముల తిని, నాడీశక్తిని సరిగా ప్రవహింపచేసి నంతమాత్రమున ఆరోగ్యమేమీ కలుగదు లోపల తయారగు మలినములు ఎప్పటికప్పుడు బైటకు పోవుచుండ వలయును.

---

## ౨౯

# ఆస్టియోపతీ, కీరోప్రాక్టిక్, నాప్రపతీ

న్యూరోథెరపీ, స్పాండిలోథెరపీ మొదలగునవన్నీ సమీకరణమునకు సంబంధించిన భాగములే ఇవన్నీ యెముకలలోని లోపములనే సరిచేయును రెండుఎముకల మధ్యనున్న సంధాయక ధాతువులోని లోపముల సరిచేయు శాస్త్రభాగములును గలవు

పై భాగముల తత్వములను, వాటి ఉపయోగములను, గూర్చి డాక్టరు, ప్లెసిన్ చెప్పిన అభిప్రాయముల మీరు గత అధ్యాయములో చదివియే ఉన్నారు ప్రకృతివైద్య దృష్టితో పై అభిప్రాయము సమన్వయ పరుద్దాము

పైన చెప్పిన భాగములన్నీ తరుణ కాలికరోగముల నన్నిటినీ కుదుర్చునను మాట మాత్రము నిజమే ఇవే సంపూర్ణ మయిన ప్రక్రియలు మాత్రముకావని చెప్పక తప్పదు ఎందు వల్లనంటే-ఇవన్నీ రోగముల వెలుపలివలె కే పోవును

ఆంతరంగిక కారణముల జోలికిపోవు బయటకుతోచు, నొప్పులను మాత్రమే సరి చేయునుగాని రక్తము లోని దోషములను, జీర్ణావయవములోని, లోపములను సరిచేయవు మానసిక, నైతిక, శక్తులనుగూర్చి యీ భాగములు విచారిం చవు అందువలన ఇవి ప్రకృతిచికిత్సా ప్రక్రియలలో ఒక భాగమైతే కావచ్చును గాని సంపూర్ణచికిత్సలు మాత్రము కావు సేంద్రియ లోహములును, సేంద్రియ లోహ లవణ ములును, లేనివస్తువులను తినుట వలన వచ్చిన రోగములును పప్పుపదార్థములును, చక్కెర పదార్థములు తినుటవలన వచ్చిన రోగములును, కశేరుకా సమీకరణ శాస్త్ర ప్రక్రియ లలో ఏ ఒక్క దాని వల్లనున్నూ కుదరవు బైటనుండి ఆగంతు కముగా వచ్చిన దెబ్బలను మానసిక చికిత్సా శాస్త్రప్రక్రియ లును, సహజాహారములును కుదర్చలేవు అట్లనే కశేరుకా సమీకరణము ఏకాకిగా నుండు రోగమును మానోమాని యూను రక్తములో తక్కువైన యినుము, సున్నము, సోడి

యము మొదలగు లోహములను పూర్తి చేయలేవు

ఈ సమీకరణ శాస్త్రజ్ఞులును, వారి యనుయాయులును అభిమానముకొద్దీ, తమ శాస్త్రమే గొప్పదంటారు వీటితోనే సర్వరోగములును కుదురు నంటారు పాత మందు వైద్య పద్ధతులను, శస్త్ర చికిత్సను ఆమోదిస్తారు గాని, మిగిలిన వాటిని ఒప్పుకోరు

కశేరుకా సమీకరణము వలననే అన్ని రోగములు కుదరక పోవుటవలన, ఈ శాస్త్రజ్ఞు లందరును, వేరొక మార్గమును త్రొక్కక తప్పినది కాదు

ఇన్ని కబుర్లు చెప్పుచున్నారుగదా! మీరుమాత్రము ఏమి చేస్తున్నారని మీరడుగవచ్చును మేముకూడా అన్ని స్వాభావిక చికిత్సలలోని గొప్పతనమును స్వీకరించ వలసినదే అట్లా స్వీకరించిననే గాని, ప్రకృతి వైద్యము సంపూర్ణమైన వైద్య శాస్త్రముగాదు,

అన్ని రోగములను పూర్తిగా నయము చేయజాలము ఈ విషయమే ఈ క్రింది ఉదాహరణముతో ఇంకా బాగా విశదము కాగలదు

ఒక బండీని, ఆరు గుఱ్ఱములు తేలికగా లాగగల వనుకోండి, ఈ ఆరు గుఱ్ఱములను, అందికలో నున్నపుడుఎవరైనా బండీకి మూడు గుఱ్ఱములకట్టి లాగిస్తారా? ఇట్లాగే నాల్గింటినీ, అయిదింటినీ, ఇట్లా ప్రయత్నము చేసేవారి, తెలివి తేటలను, మనమెంత మెచ్చుకుంటాము ప్రకృతివైద్యశాస్త్రములో ఈ చికిత్సా భాగముల కన్నిటికినీ అవినాభావ సంబంధ మున్నది

వెన్నుపాము లోని లోపములకును, దేహములోని రోగ పదార్థమే కారణము వెన్నులోని వంపులు, బాధలు, రోగ పదార్థముయొక్క చిహ్నములే లోపల చేరిన రోగపదార్థము వలన నరములలో మంటలు పుట్టును కండరములలో కలుగు సంకోచ వ్యాకోచములకును ఈ మంటలే కారణము కండ రములలోని సంకోచము వలననే, వెన్నువంపులును కలుగు చున్నవి వెన్నుపూస మధ్యనుండు సంధాయక ధాతువు లోని సంకోచవ్యాకోచములకు ఈ రోగ పదార్థమే కారణము

న్యాప్రపతీ అనుయాయులు, సంధాయక ధాతువుల లోని సంకోచవ్యాకోచముల వలననే రోగములు వచ్చుచున్న వని, చెప్పుదురు సంధాయకధాతువు సంకోచము పొందినా, నాడీశక్తి సరిగా ప్రవహించదు సంధాయక ధాతువు వ్యాకోచ మును పొందినా నాడిశక్తి సరిగా ప్రవహించదు సంధాయక ధాతువులోని సంకోచవ్యాకోచములును, నడుము బిగదీసికొని పోవుట మొదలగు లక్షణములన్ని దేహములో ఆమ్లములు ఎక్కువగా చేరుట వలన వచ్చుచున్నవి ఆహారములోని లోపములవలనను, బయటకు పోవలసిన మురుగు బయటకు పోవుట వలననూ ఈ ఆమ్లములును, లోపలనే నిలవ ఉండును బయటకు పోని ఆమ్లములే కండరములలోను, నరములలోను చేరి అనేక వ్యాధులకు కారణ మగుచున్నవి

కశేరుకకు సంబంధించిన మిగిలిన భాగములకన్న న్యూరోథెరఫీ మాత్రము ఒకడుగు ముందుకు వేయును రోగము వచ్చినపుడు, దేహములోని కండరములు

నరములును, వాటి స్వస్థానములో ఉండవు వాటిలోని బిగివి తగ్గి పోవుటయు, ఎక్కువగుటయు గలదు తగ్గుటయు హెచ్చుటయు రెండునూ దుర్గుణములే తరుణరోగములలో దేహములోని అంతరవయవములలో విపరీతమైన చలనము కలుగును కాలికరోగములలో దేహములోని అన్ని అవయవములును చచ్చుబడపోవును తరుణ కాలిక రోగములలో కలుగు ఈ యెక్కువ తక్కువలు రెండునూ సమీకరణము వలనను, ఆహార విహారములలోని మార్పుల వలనను కుదురును ప్రత్యక్ష ప్రమాణములతో ఈ విషయము బాగా విశదము కాగలదు

జీర్ణాశయములో వ్రణముపుట్టిన దనుకోండి న్యూరోథెరపీవారు జీర్ణాశయములో జరుగు రక్త ప్రసరణమును తగ్గింప జేతురు నాడీశక్తిని తక్కువగా ప్రవహింప జేతురు ఈ తగ్గింపులచేత జీర్ణాశయములోని మంటలు తగ్గిపోవును నాడీశక్తిని రక్త ప్రసరణములను, తగ్గించుటచేత జీర్ణాశయము లోని మంటలు నొప్పి ఉపశమింపచేయునే గాని మందుల మాదిరిగా అణచిపెట్టవు దేహములోని యే భాగమైనా బిగదీసుకొనిపోతే, సంకోచము పొందిన భాగములు లాగి సరిచేయబడును న్యాప్రపతీ ప్రక్రియలును ఇట్లనే ఉండును దేహములోని అంతరవయవములు చచ్చుపడిపోయి వాటి ధర్మములను నిర్వర్తించకపోతే వెన్నెముకలోచేసిన, సమీకరణము వలన, ఆయా అవయవములోని, రక్త ప్రసరణము బాగుపడును నాడీశక్తి తిన్నగా ప్రవహించును

చాలామంది రోగులు ఇది గారడీ అనుకొను చున్నారు దీనిలోని అంతరార్థమును గ్రహింపలేకున్నారు విద్యుచ్ఛక్తి రాగితీగలకుండా ప్రవహించినట్లు, మెదడునుండి బయలు దేరిన, నాడీశక్తి, వెన్నుపాము ద్వారా వచ్చి శాఖోప శాఖ లుగా నీలి దేహమంతటా ప్రవహిస్తుంది ఈ స్వల్ప విష యమునుకూడా తెలిసికొన లేనివారు ఇవి గారడీ అను చున్నారు ఈ శాఖ ద్వారానే, నాడీశక్తి దేహములోని మారుమూల అవయవములకును, సూక్ష్మాతి సూక్ష్మమైన కణములకును మైక్రోజివూలకును చేరుతుంది మర్దనవలన ఇన్ని లాభములును కలుగును మర్దన చికిత్స వలన కండర ములలోను, కణములలోను నిలచిపోయిన మలినములన్ని బయటకు గెంటి వేయబడును

ఆస్టియోపతీ, కీరోప్రాక్టిక్, న్యాప్రపతీ అనుయాయు లందరును, తరుణ రోగములను స్వాస్థ్య సంకటములను గూర్చియు, ప్రకృతి వైద్యమువారి అభిప్రాయములను, తమ అభిప్రాయములను ఒకటేనని చెప్పవచ్చును

మూలసూత్రములలో ప్రకృతివైద్యమువారితో మా కెట్టిభేదాభిప్రాయమును లేదని చెప్పవచ్చును కాని నిజము చెప్పవలెనంటే ప్రకృతివైద్యము వారి సిద్ధాంతములకును, ఆస్టి యోపతి వగైరాల వారిసిద్ధాంతములకును, ఎట్టిసంబంధమును లేదు తరుణరోగములు దేహమునకు అపకారమును చేయు ననియు, అందువలన నెట్లాగైనా వాటిని అణచివేయవలెననే ఆస్టియోపతీ మొదలగు కశేరుకా సమీకరణ శాస్త్రజ్ఞులు

అభిప్రాయపడుతారు కాబట్టి వాటిని అణచివేయుటకే ప్రయత్నిస్తారు తరుణరోగములను, స్వాస్థ్యసంకటము లనుగూర్చి మందువైద్యులును ఇట్లాగే భావిస్తారు

ప్రకృతివైద్యము వారికిని, ఆస్టియోపతీ వారికినిగల మూలసిద్ధాంతములలోని భేదములను డా॥లోబాన్‌గారి వ్యాసములవలన విశదముకాగలదు

ప్రకృతివైద్యమునకును, కశేరుకా పమీకరణవైద్యము నకును గల అభిప్రాయభేదమును ప్రత్యక్షప్రమాణములతో చూద్దాము జ్వరమునకు ఈ రెండు వైద్యములవారును చేయు ప్రక్రియలను విచారిద్దాము ముందుగా కశేరుకాసమీ కరణశాస్త్రజ్ఞులు చేయు వైద్యప్రక్రియలను విచారిద్దాము వారివాదన- వెన్నులోని దోషములవలననే జ్వరమువచ్చు చున్నది ఈదోషములవలననే నాడీశక్తి అన్నిఅవయవము లకును సరిగా ప్రసరించదు

వెన్నులోని దోషములకు రోగపదార్థముతోడై తేనూ జ్వరమువస్తుంది ఈరెంటిలోనూ, వెన్నువంపులే ప్రధాన కారణము జ్వరమును అణచివేయకపోతే ప్రమాదము సంభ విస్తుంది జ్వరమును అణచివేయుటకే ప్రకృతికూడా ప్రయ త్నముచేస్తుంది ఇకను జ్వరమునుగూర్చి ప్రకృతివైద్యము వారిఅభిప్రాయములను తెలుసుకొందాము జ్వరమువలన దేహములోని మలినములన్నీ బయటకుపోవును దేహము నకు ఉపకారము చేయుటకు వచ్చిన తరుణరోగములను అణచి వేయరాదు అణచివేసినయెడల లోపలచేరిన రోగపదా

ర్థము ప్రధానఅవయవములను పాడుచేయును ఆహారములోని లోపములవలనను యుక్తమయిన వ్యాయామముచేయక పోవుట వలననే జ్వరమువచ్చుచున్నది

ఈ రెండు సిద్ధాంతములలోని భేదమును గమనిద్దాము దేశములోని ఆరు ప్రఖ్యాత విశ్వవిద్యాలయములనుండి వచ్చిన పండ్రెండుమంది కశేరుకాసమీకరణ శాస్త్రజ్ఞులు, తమ అభిప్రాయముల తెలిపినారు వెన్నువంపులు సరిచేయుట వలన జ్వరము తగ్గిపోయినట్లును, జ్వరము తగ్గిపోవుటవలన దేహమునకు ఏమీ హానికలుగలేదని వారు కనుగొన్నారు.

జ్వరమును అణచిపెట్టినందువలన దేహమునకు హాని కలుగునని మనము సిద్ధాంతీకరించినయెడల పై శాస్త్రజ్ఞులందరును పొరపడినారనియే చెప్పవలయును ప్రకృతివైద్యము వారి అభిప్రాయముప్రకారము చెప్పితే పైవాదన అంతయు తల్లక్రిందులగును రోగపదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతికి సహాయముచేయవలయును రోగపదార్థము బయటకు పోవుటచేత దేహముశుద్ధి అగును

ఇంకొక ప్రత్యక్షప్రమాణమును తీసికొందాము న్యూమోనియాజ్వరపురోగికి, వెన్నువంపులు సరిచేసిన 5–10 నిమిషములలోనే రెండుడిగ్రీల జ్వరము తగ్గుతుంది సమీకరణము మొదలుపెట్టిన రెండురోజులలోపలనే అన్నితరుణజ్వరములును, తగ్గిపోవలసిందే

డా లోబాన్ ప్రశ్నలకు మనమేమీ సమాధానము చెప్పనవసరములేదు ఈపుస్తకమంతటిలోను వారిప్రశ్నలకు

సమాధానము చెప్పబడే ఉన్నది ఈసందర్భములో ఒకవిషయ మమాత్రము చెప్పకతప్పదు సర్పి, టైఫాయిడ్ జ్వరము, న్యూమోనియా, మేదోమజ్జాగతజ్వరము, మొదలగుతీవ్రమైన తరుణరోగములన్నీ క్రమముగా వృద్ధియై పైకి వచ్చిన తరువాత, ఆస్టియోపతీవారి ప్రక్రియలతో రెండుమూడు రోజులలో పోవుట విచిత్రముగానే కనబడుతుంది

ఇట్లా అణచి పెట్టుట సబబుకాదు

ఒకవేళ సాధ్యమయినయెడల, లోపలకు అణచివేయ బడిన తరుణరోగములు, కాలికరోగములుగా ప్రత్యక్షమగును దేహమునకు ఉపయోగకారులగు స్వాస్థ్యసంకటముల అణచి వేసిన యెడల దేహమునకు యెంతహానికలుగునో, పైరోగ ముల అణచివేసినను అంత అపకారము జరుగును ఇవన్నీ వట్టికబుర్లుమాత్రముకావు మాచికిత్సాలయములో, అనేక మంది, కశేరుకా సమీకరణశాస్త్రజ్ఞు లున్నారు వీరంద రును, పెద్దపెద్ద పరీక్షలు ప్యాసైనవారే

ఒకపెద్దమనిషికి అతిసారము, రక్తాభిష్యందము బొబ్బ లు, చర్మవ్యాధులు, జ్వరముద్వారా రోగపదార్థము బయటకు వస్తున్నది ఇవన్నీ స్వాస్థ్యసంకటములు ఈస్వాస్థ్యసంకట ముల అణచిపెట్టితే యేమిజరుగుతుంది ? వీటికి డా లోబాన్ చేయు ప్రక్రియ లేమిటి ? వెన్నులోనిదోషములను సరిచేసి రోగములను అణచిపెట్టుటయేగా ? రోగము చాలా త్వరగా నయమగుతుంది ? తరువాత గతేమిటి ? కాలికరోగములు ప్రత్యక్షమగుతవి ఈపద్ధతి కశేరుకాసమీకరణ శాస్త్రము

నకు అనుకూలమేగాని ప్రకృతివైద్యశాస్త్రమునకు వ్యతిరేకము మూలసిద్ధాంతమునకే వ్యాఘాతము కలుగుతుంది శాస్త్రసమ్మతముగా చేసిన కశేరుకాసమీకరణమువలన ఉపయోగములేదని మేము చెప్పుటలేదు తరుణరోగములలో యిది ఉపయోగమునే చేయును స్వాస్థ్యసంకటములు బయలుదేరితే పూర్తిగా బయటకు రాకమునుపె, పైప్రక్రియలతో వాటిని అణచిపెట్టినందువలన, ఉపయోగము ఆవంతయు లేదు

అటువంటిపరిస్థితులలో ఉపవాసముంచుటయు, జల చికిత్సాప్రక్రియలను మాత్రమే చేయవలెను ప్రకృతివైద్యములోని యేచికిత్సా ప్రక్రియలును యింతత్వరగా రోగపదార్థమును బయటకు పంపలేవు దేహతత్త్వమును సమరసపరుచుటకు ముందు రోగకారణములను తొలగించవలయును ఆహారశాస్త్రముతో కశేరుకా సమీకరణశాస్త్రజ్ఞులకు అంత ప్రసక్తి లేదు వారి రోగులకు ఫలానా ఆహారమును, తినమని చెప్పరు అందువలన రోగులకు ఆహారనియమము లేదు జీవనపంథాలో మార్పురాదుగాన రోగపదార్థము అట్లనే పెరిగిపోవును ఆవంతయు తగ్గదు ఎక్కువకాలము గడవకమునుపే రోగము తీవ్రరూపముతో మరల ప్రత్యక్షమగును ధనము నే ప్రధానముగా పెట్టుకొన్న వైద్యునకు యిది ఉపయోగమగునే గాని రోగిమాత్రము అధోగతిలో పడిపోవుచున్నాడు ఇవియే కాలికరోగములు.

# మ ర్ద న

చన్నిటిప్రక్రియలవలన దేహమునకు యెంతఉపకారము కలుగునో, అంతఉపకారము మర్దనచికిత్సవలనను జరుగును రక్తప్రసరణ వృద్ధిఅగును చర్మతలమునకు రక్తము చేరును చర్మరంధ్రములను వికసింపచేయును పనికిమాలిన పదార్థము నంతను ప్రకృతి బయటకు పంపివేయును

రోగపదార్థము బయటకుపోక లోపలనే నిలిచిపోయిన యెడల కణములలోని మురుగు, శోషరసవాహికలలోనికి రాదు కణములకు కావలసిన ఆహారము రక్తమునుండి లోనికిపోదు రోగపదార్థము కణములలో పేర్కొనుటచేతనే, కణములలో తయారగు మురుగు బయటకుపోదు బయట నుండి రావలసిన ఆహారము లోనికిరాదు రోగపదార్థము దేహమంతటా నిండియుండుటచేత కాలికరోగములు వచ్చు చున్నట్లు లోగడనే చదువుకొన్నాము దేహక్రియలో తయారగు మురికియు, అరగని ఆహారపదార్థములును రెండును దేహములో నిలువఉండుటచేత, దుర్భరమయిన కాలిక రోగ ములు వచ్చుచున్నవి కాలికరోగములలో ముఖ్యముగా చర్మముచెడిపోవును ఉత్పాదనము, పీడనము, ప్రహరణము ఘర్షణము, మర్దనము, స్పందనము లేక హార్షకము మొదలగు ఆరుమర్దనప్రక్రియలలోను, రక్తములోను, కండరములలోను నరములలోను యెముకలలోను నిలిచిపోయిన మురికి అంతయూ బయటకు పంపివేయబడును

ఇవ్వాపిండబడిన సరుకంతా, శోషరసవాహికలద్వారా, శ్వాసాశయములలోచేరి, నాసికారంధ్రములద్వారా బయటకు వచ్చివేయును మరికొంత చర్మతలమునచేరి స్వేదముగా బయటకు వచ్చును రోగపదార్థము బయటకు వెళ్ళిపోవుటచేత, శుద్ధ రక్తములోని ప్రాణవాయువును, ఆహారపదార్థమును కణములు త్వరగా స్వీకరించును

మర్దన చికిత్స వలన దైహికశక్తులేగాక, అంతరంగిక శక్తులును వృద్ధిఅగును

అయస్కాంతముతో ఒకయినుపముక్కను రాచిన యెడల యినుపముక్కకుకూడా అయస్కాంతశక్తి వచ్చునట్లు మనము చూచుచున్నాము అట్లనే మర్దనచేయువారి శక్తి ఉత్సాహములనుబట్టి రోగుల శక్తి ఉత్సాహములు యెక్కువగును

---

# 30

## కాంతశక్తి

కాంతశక్తితో చికిత్సచేయుటయుప్రకృతివైద్యచికిత్సల లోనిదే దీనివలనను రోగములు కుదురును కాంతశక్తిని ఉపయోగించినందువలన, రోగములెట్లు కుదురునదియు, యీ అధ్యాయములో తెలుసుకొందాము

మాచికిత్సాలయములో మొదటలో యీకాంతశక్తిని ప్రయోగించి, రోగములను కుదుర్చుచుండెడివారము మిగిలిన

అన్ని చికిత్సాభాగముల మాదిరిగనే యీచికిత్సాభాగమున
కును ప్రకృతివైద్యములో స్థానముగలదు రోగము కుదరగల
దను గట్టినమ్మకముతోను, సంపూర్ణప్రేమతోను, నొప్పిగా
నున్న ప్రదేశముమీద చేతినుంచి రాచినయెడల నొప్పులు
తగ్గిపోయెడివి వైద్యునకు యెంతనమ్మకముండునో, రోగికినీ
అంతనమ్మకముండవలయును రోగికి నమ్మకము లేకపోతే
యిదంతయు వ్యర్థప్రయత్నమె రోజులు గడచినకొలదియు,
రోగులు యీచికిత్సలోని మాహాత్మ్యమును గ్రహించలేక
దురభిప్రాయపడ ముదలిడినారు

గారడీయని భ్రమపడినారు కాంతశక్తిప్రయోగమున
కును, గారడీకిని యేమియును సంబంధము లేదు రెండును
వేరు వేరు పద్ధతులే

గారడీవాడు తన్ను చూచు జనులను విస్మయపరుస్తా
డు ఈ విస్మయము వలన ప్రేక్షకులలోని, యుక్తాయుక్త
విచక్షణ జ్ఞానము పోవును గారడీవాడు చెప్పు ప్రతిపనికినీ
ప్రేక్షక జనమంతయు తల ఊపవలసినదే కాంత శక్తి యం
దన్ననో అట్లుగాక రోగి తనయొక్క విచక్షణాజ్ఞానమును
ఉపయోగించుకొనును రోగి తన విచక్షణాజ్ఞానమును, ఉప
గించక యిదంతా గారడీ అని నమ్మితే కాంతశక్తిని ఉపయో
గించక ఊరకుండుటయే యుక్తము

నమ్మకములేని కాంతశక్తి చికిత్సాప్రక్రియలవలన
రోగికిని, వైద్యునకును నష్టమే సంభవిస్తుంది ఇది ఆత్మహత్యా
మార్గమనియే చెప్పవచ్చును కాంతశక్తిని ఉపయోగించ

వారు మాత్రము, ఆత్మశక్తులను, మానసికశక్తులను వృద్ధి
చేయుటకే ప్రయత్నము చేయుదురు గాని, వాటినాశనమునకై
ప్రయత్నము చేయరు కాంతశక్తి, ఆత్మశక్తి యందు నమ్మక
మును వృద్ధిచేయును నమ్మకము పెరుగును ధాతుశక్తి

యును వృద్ధియగును తగ్గిపోయిన ధాతుశక్తికి ఉజ్జీ
వనము కలుగును ధాతుశక్తి తగ్గిపోవుటయే
రోగమనియు, ధాతుశక్తిని వృద్ధిపరచిన యెడల ఆరోగ్యము
కలుగుననియు లోగడనే చదువుకొన్నాము ఆరోగ్యము
దేహములోని నిర్మాణశక్తులను వృద్ధిచేయుననియు,
రోగమే విభిన్నశక్తులను వృద్ధిచేయుననియు లోగడనే
చదువుకొన్నాము ఒకగాజుపాత్రలో యెక్కువనీళ్ళుకలిసిన
గంధకధృతినిపోయుము అందులో చిన్నరాగిపలకను, చిన్న
తుత్తునాగపలకను వేయుము గంధకద్రావకము లోపలను
పైనను యీరెండుపలకలను రాగితీగెతో కలుపుము విద్యు
చ్ఛక్తి గంధకద్రావకములో తుత్తునాగము పలకనుండి, రాగి
రేకకును ద్రావకము వెలుపల రాగిపలకనుండి, తుత్తునాగము
పలక వైపునకును ప్రవహించుచున్నది అందువలన రాగిపలక
చివర ధనాగ్రమనియు తుత్తునాగము పలకచివర ఋణాగ్ర
మనియు మనము తెలుసుకొనవచ్చును

విద్యుచ్ఛక్తి ద్రావకములో ప్రవహించు రీతినిబట్టి
చూచినయెడల రాగిపలక చివరఋణాగ్రమగును ఇదియుక్త
ముగా నుండును వెనుకటి శాస్త్రజ్ఞులందరు, రాగిపలకను
ధనాగ్రమనియు, తుత్తునాగము చివరను ఋణాగ్రమనియు

వాడుటచేత, మనమును సులభముగా అర్థముకాగలందులకు వెనుకటి శాస్త్రజ్ఞులు వాడినట్లుగనే వాడునము గాజుపాత్రలో జరుగు రాసాయనిక మార్పులవలననే విద్యుచ్ఛక్తికలుగుచున్నది రాగిపలకయు తుతునాగము పలకయు ధనాగ్రము, ఋణాగ్రములగుటవలన యీరెండింటినీ రాగితీగెలతో కలుపకపోయినప్పటికినీ, విద్యుచ్ఛక్తి ప్రవహించుచునే ఉండును విద్యుచ్ఛక్తి ప్రవహించుటనుమాత్రము, భౌతికనేత్రములతో ప్రత్యక్షముగా చూడలేము దేహములోని ప్రతికణములోను విద్యుచ్ఛక్తి ఉండును ప్రతిఅవయవములోను, ఎముక లోనునూ, విద్యుచ్ఛక్తి ప్రవహించుచునే ఉండును

కణముయొక్క లోపలిఆమత్వచము ధనాగ్రమనియు, బయటి ఆమత్వచము ఋణాగ్రమనియు చెప్పవచ్చును కొన్ని అవయవముల లోపలిఆమత్వచము ధనాగ్రము కొన్నిఅవయవముల బయటి ఆమత్వచము ఋణాగ్రము అందువలననే ప్రతిఅవయవములోకూడా ధాతుశక్తి వ్యక్తమగును

ప్రాణముపోయినతరువాత, దేహములోని ఆమ్లక్షార ములు రెండునూ కొద్దిసేపటివరకును నిలవఉన్నప్పటికినీ, విద్యుచ్ఛక్తిమాత్రము రాదు అందువలన దేహములో విద్యుచ్ఛక్తి పుట్టుననుటకన్న దేహమునందు విద్యుచ్ఛక్తి వ్యక్తమగుననుట సవ్యముగానుండును

ఆర్యఋషుల వచనప్రకారము ధాతుశక్తి మెదడులోను పోషకగ్రంథులద్వారా దేహములోనికి ప్రవేశించును ఆల కంపిక మజ్జాతంతువులద్వారాను, ప్రధాననాడీ కేంద్రముని

ద్వారాను దేహమంతటనూ వ్యాపించును ఇప్పుడు వెలువడు శరీరశాస్త్ర పరిశోధనలన్నియు, అనిచ్ఛానాడుల గమనము, అనుకంపిక మజ్జాతంతువులమీదనే ఆధారపడునని తెలియ చెప్పుచున్నవి

దేహములోని బ్యాటరీలలో మెదడు అతిచురుకుగా పనిచేయును మెదడును, నాడీమండలము రెండును ప్రధానమైన భాగములు ఇచటనుండియే ప్రతిఅవయవమునకును, శక్తి వచ్చును ఈనరము నుండిపుట్టు కోటానుకోట్ల శాఖలే దేహములోని ప్రతిమారుమూలకును, నాడీశక్తిని గొనిపోవుచుండును కేంద్రములో పుట్టినదేగాని యవేమియు పనిచేయవు అట్లనుటవలన యీశాఖలు అప్రధానము లనుటలేదు

దేహములోని అవయవములు వేటిపనిని అవిచేయుచున్నట్లయితే దేహమంతా ఆరోగ్యముగా నుండును అవయవములను వాటిపనులను చేయుటకు సమర్థముగా నుంచుటకు ఆహారము, అవసరము ఈఆహారమే వాటికి శక్తినిచ్చును ఈఆహారములో దేహమునకు అవసరమగు పోషకశక్తులు ఉండవలయును ఎక్కువ, తక్కువలు యేమీఉండరాదు బ్యాటరీలనుండి తయారగు విద్యుచ్ఛక్తియు, యంత్రముల నుండి వచ్చు కాంతిశక్తియు, లోహములనుండి పుట్టినవేను సృష్టిసిద్ధాంతము ప్రకారము ముందుగా లోహములు పుట్టినవి వృక్షసంపద, జంతువులు మానవలోకము తరువాత వచ్చినవి మానవులు తమలోపుట్టు విద్యుచ్ఛక్తిని ఉపయోగించునపుడు తమ్ము వదలుకొని దూరముగా పోవుచున్నారు లోహముల

లోని మైక్రోజీవుల గమనమునకును, మానవదేహములోని మైక్రోజీవుల గమనమునకును, యెట్టిసంబంధమును లేదు పుట్టుకలోనున్నా యీ రెండింటికినీ యెట్టిసంబంధమును లేదు గాన రోగముల కుదుర్చుటలోకూడా, లోహములను వాడరాదు లోహసంబంధమయిన విద్యుచ్ఛక్తినిగాని, జంతు కాంతశక్తినిగాని ఉపయోగించరాదు

మానవదేహము పృథివి, నీరు, వెలుతురు, గాలి, ఆకాశములను యీ అయిదుభూతములతోను చేయబడినది దేహములోనిపదార్థము, శక్తి అనునవి రెండునూ యెప్పటికప్పుడు నున్నితమగుచుండును మాచికిత్సాలయములోకూడా మొదటలో లోహసంబంధమైన విద్యుచ్ఛక్తిని ఉపయోగించెడివారము కాని రానురాను రోగముల కుదుర్చుటలో యీ విద్యుచ్ఛక్తిని ఉపయోగించినందువలన ఉపకారముకన్న అపకారమే యెక్కువ కలుగుచున్నదని గ్రహించి విరమించాము దానికి బదులుగా దేహములోని స్వతస్సిద్ధమైన కాంతశక్తినే ఉపయోగించెడివారము సమీకరణము వలన ధాతుశక్తిని వృద్ధిచేసి రోగికి ఉత్సాహము కలిగించెడివారము నిత్యకృత్యములకు యీధాతుశక్తి వ్యయమగును నాడిశక్తి కూడా యీ ధాతుశక్తినుండి పుట్టినదేను మానసిక నైతికశక్తులలో కూడా, యీధాతుశక్తియే వ్యక్తమగుచున్నది ఇదే మనకు తేజశ్చక్రముగా కనపడుతుంది మానవుడు మేలుకొనినపుడే తేజశ్చక్రము కనపడును నిద్రపోవునపుడు యీ తేజశ్చక్రము కనబడదు నిద్రమేలుకొనగానె యీచక్రము

కనబడును ఆరోగ్యవంతులకు చుట్టూనుండు యీ తేజశ్చక్రము విశదముగా కానవగును దుర్బలశరీరుల చుట్టూనుండు తేజశ్చక్రము అంత విశదముగా నుండదు ఆరోగ్యముగానుండి మానసిక నైతిక శక్తుల వృద్ధి చేసుకొనిన వారి చుట్టూనుండు చక్రము లేత రంగుగా నుండును ఈ చక్రపు లేత, ముదురు రంగులనుబట్టి వారి వారి మానసిక నైతిక వికాసముం మనము గ్రహించ వచ్చును

తేజశ్చక్రపురంగు ముదురుగా నున్నప్పుడు జంతు సంబంధమైన కాంతశక్తి ఎక్కువగా నున్నదని గ్రహించవలెను లేత ఎరుపురంగు సంగమక్రియ యందుండు ఉత్సాహమును తెలియు చేయును లేత నీలపు వర్ణము మత సంబంధమైన ఉత్సాహమును తెలియచేయును లేత పసుపు విజ్ఞానాభివృద్ధిని తెలియచేయును ఊదా నారింజ రంగులు మానసికాభివృద్ధిని తెలియచేయును అందువలననే దేవునిచుట్టూనుండు చక్రములు బంగారువర్ణము గలవిగా చిత్రకారులు చిత్రిస్తారు లేత ముదురు రంగులను బట్టియే మనకు తృప్తి కలుగు చుండును

వైద్యవరులలో ఈ లేత రంగు చక్రముం కలిగిన వారికి నివారణశక్తులు కూడా ఎక్కువగా నుండును అందు కేఅన ఈ రకమైన వైద్యవరులు సాన్నిధ్యమునే రోగులు ఎక్కువగా కోరుతారు పిల్లలును రోగులును ఈ రకమైన వారిపక్కనే ఉండకోరుతారు దయ ప్రేమ, ఉత్సాహము మొదలగు గుణగణములు గలవారినే చికిత్సకులుగా గోరుకొంటారు

ఆత్మీయశక్తులను వృద్ధి చేసుకొని రోగముల కుదుర్చు టలో గారడీ ఏమిన్నీ లేదు తీగెలు లేకుండానే వార్తలు ప్రవహించు చున్నప్పుడు ఆత్మీయ శక్తులను వృద్ధి చేసుకొని అతీంద్రియ దృష్టితో భౌతికనేత్రములకు కనబడని వస్తువులు చూచుటలో విచిత్ర మేమి లేదు సాధ్యమాయని సందేహ పడ నక్కర లేదు యూరపులోని వైద్యముచేయు పామరజన మంతా చికిత్సకులకు దయను ప్రధానముగా చెప్పుతారు

వీటితోబాటు రోగులకు దృఢమైన విశ్వాసము పూర్తి నమ్మకమును ఉండవలెను బాధిత మానవలోకమును చూచి విపరీతమైన దయ ప్రేమలను చూపుటచేతనే క్రీస్తు గొప్పవాడైనాడు కాంతశక్తితో రోగమును కుదుర్చువారును విధిగా ఎక్కువ జవాబుదారీని వహించుచున్నారు మర్దన చేయువారి దైహిక మానసిక నైతికశక్తులమీదనే చికిత్సా ఫలితములు ఆధారపడును అయితే మరొక సందేహము కలుగవచ్చును కాంతశక్తినీ మర్దనచికిత్సను రోగులకు చేసినందువలన వైద్యుని శక్తికి లోపమురాదా అని మీరడుగ వచ్చును మిగిలిన శక్తులు క్రమముగా ఉపయోగించనందువలన దుర్వ్యయమైపోయినట్లే ఈ శక్తులును దుర్వ్యయమగుట కలదు క్రమప్రకారము ఉపయోగించనందువలన చేసినవారికిని రోగికిని ఇద్దరికిని అపకారమునే చేయును క్రమప్రకారము చేసిన యెడల మర్దన కాంతశక్తుల ప్రయోగము వలన ఉపయోగమే కలుగును మర్దనచేయువాడు మాత్రము విధిగా ఆరోగ్యవంతుడు కావలెను అంతేగాక తన చికిత్సవలన

రోగము నయమగునను సంపూర్ణ విశ్వాసము రోగికి ఉండవల యును దయ ప్రేమనే ప్రధానముగా భావించవలయును గాని ధనమును మాత్రము అపేక్షింపరాదు నిష్కామముగా ఏమైనా ఉపకారము పరులకు చేసిననే క్రొత్తగా శక్తి వచ్చును ఏమియును తగ్గిపోదు స్వరశాస్త్ర పండితుడు తన వీణె తీగెలను ఎట్లు సరిచేసి వాయించునో అట్లనే మర్దన చికిత్సకుడు కూడా రోగి లోపములను సరిచేసి లాభముల పొందింపచేయును నిష్కామముగా చేయువారికే కాంతశక్తి ఉపయోగిస్తుందిగాని ప్రతిఫలము కోరిన వారికి మాత్రము ఉపయోగించదు ఇవన్నియు గారడీకాదు శాస్త్రసమ్మతములు ప్రమాణపూర్వకములు ఈ మానవలోకమంతా ఒక విషయమునే నేర్చుకొన్నారు ఎంతవరకునూ తీసుకొనుటయే ప్రతిఫల రహితముగా ఇచ్చివేయుట వీరు తెలుసుకొనలేదు ఏనాడైతే వీరు ప్రతిఫలరహితముగా ఇచ్చివేతురో ఆనాడే ఈశ్వరుని కోర్కెను నెరవేర్చిన వారగుదురు ప్రతిఫలములను ధనరూపముతోగాని, వస్తురూపముతోగాని వీరు స్వీకరించుటయే నేర్చుకొన్నారు

నేడు మానవలోకమును బాధించు సాంఘిక కల్లోలములన్నియు, దీనినుండి పుట్టినవేను స్వార్థపరత్వమున్నచోటనే, నరకమున్నది స్వార్థపరత్వమునకును, స్వార్థరాహిత్యమునకును యెట్టి సంబంధము లేదు రెండునూ వేరేవేరే, స్వార్థము ధనాపేక్షచేతనే, నేటి యుద్ధములును, కల్లోలములును వచ్చినవి. ఆర్థిక, పారిశ్రామిక, సాంఘిక, రాజకీయ కల్లోలమున

కంతకును స్వార్థపరత్వమే పునాది తాగుటకు గంజికూడా లేకుండ, సోదరమానవులు మాడిపోతూ ఉంటే లక్ష్మీపుత్రులు తూగుటుయ్యాలలమీద ఊగుతున్నారు ధనవంతులకును, పారిశ్రామికులకును, హస్తిమశకాంతరము తేడాఉంటే సామరస్యము యెట్లా ఉంటుంది ? ఈ విషయములన్నియు మర్మశాస్త్రము అనే పుస్తకములో వ్రాయబడనవి పారిశ్రామిక దృష్టితో మాటలాడితే వస్తువును ఉత్పత్తి చేయువానికిని ఉపయోగించు వానికిని, సామరస్యముండవలెను ఒకరు నష్టపడుచుండగా మరొకరు లాభమును పొందరాదు ప్రపంచములో జరుగుచున్న విచిత్రమేమంటే వస్తువులను ఉత్పత్తి చేయువారును, తయారుచేయువారును ఆ వస్తువునుండి సంపూర్ణఫలమును పొందుటలేదు దళారులు యీ లాభమునంతనూ కాజేయుచున్నారు

యజమాని సేవకుల మధ్య సుహృద్భావమున్ననే గాని ప్రేమ పరస్పరము అభివృద్ధి పొందదు అనుక్షణము ఒకరినొకరు ప్రేమించుచుండిననే గాని వ్యాపారము వృద్ధిపొందదు ఇది యెట్లు సాధ్యమగునంటే, యజమాని అవుసరములను సేవకుడును, సేవకుని అవసరములను యజమానియు తీర్చిననేగాని, సామరస్యము వృద్ధిపొందదు ధనమునే ప్రధానముగా చూచుకొంటే వారికి వీరునూ, వీరికి వారునూ శత్రువులే అందువలననే గుమాస్తాలు, యజమానుల నెప్పుడనూ ద్వేషిస్తూనే ఉంటారు

రోగియు వైద్యుడును పరస్పరముగా ప్రేమించుకొనవలెను అసహనము, కోపము యెప్పుడనూ ఉండరాదు.

ఈ రెండు లక్షణములును ఉన్న యెడల పవిత్ర భావములు నశించిపోవును ఒక ఆసుపత్రిలో పనిచేయు వైద్యుల నర్సుల మధ్య అనురాగ ముండవలయును వీరిద్దరను రోగిని బహు జాగ్రత్తగా చూడవలయును అప్పుడే సేవలోని పరమార్థము గోచరమగును ప్రేమదయలే ప్రధానముగా ఉండవలయును ధనమున కెట్టి సావకాశము లేదు నమ్మకము విశ్వాసము ఉన్ననేగాని, రోగము నయముకాదు వైద్యునకు తృప్తియు కలుగదు సేవకన్నా పరమార్థము మరియొకటి లేదు సేవ లోనే భగవంతుడున్నాడు సేవలోనే సర్వమునూ ఉన్నది

ఆరోగ్య సదనము లన్నియు ఆత్మశక్తి ప్రబోధకములు గానే ఉండవలయును ఏ చికిత్సాలయములోని వైద్యులు నర్సులు, విద్యార్థులు, రోగులు ఏకాభిప్రాయులై సేవనే ప్రధానముగా భావించి తమ శక్తినంతనూ సేవకే వినియో గిస్తున్నారో అచ్చటే స్వర్గమూ, మోక్షమూ ఉన్నది అప్పుడే వైద్యులును ఆసదనమును బాధిత మానవలోకము నకు సహా యము చేయగలరు ఈ విషయమును ప్రధానముగా భావిం చని ఆరోగ్యసదనము ఉన్ననూ లేకపోయిననూ ఒకటే ప్రతి దినమును, నివారణ శక్తుల మహాత్మ్యమును గూర్చి వాటి ఉపయోగములను గూర్చిన్నీ ఉపన్యసించుచుండవలసినదే వాటిలోని ప్రధాన సూత్రములను అందరకునూ యెరుకపరచ వలెను మిగిలిన కార్యక్రమ మంతటిలోను, ఉపన్యాసములు ప్రధానభాగముగా ఉండవలయును ఈ ప్రధాన సూత్రము లను సునిశిత శక్తులను వ్యాపింప చేయుటవలననే యెక్కడనూ

కుదరని మొండి రోగములు మా ఆసుపత్రిలో కుదురుచున్న
వనుటలో నా కెట్టి సందేహమును లేదు

మా ఆసుపత్రికి వచ్చిన రోగులు, రోగము తిరుగు
ముఖము పట్టగానే రోగము పూర్తిగా పోయినదనియు తా
మింటికి పోయి యథాప్రకారము చేసి నయము చేసుకొనగల
మని యేమేమో చెప్పి వెళ్లిపోతారు ఆసుపత్రిలో ఉండగా
వారికి లభించిన సునిశితశక్తులు యింటికి పోయినతరువాత వారికి
లభించవు గాన రోగమట్లే నిలబడిపోవును పూర్తిగా నయము
కాదు

మానసిక వ్యాధులతో బాధపడువారును, నాడీ వ్యా
ధులతో బాధ పడువారును యీ సునిశితశక్తుల ప్రయోగము
వలన సుఖముల పొందుతారు ఆత్మవంచన రోగములతో
బాధపడువారికి యీ సునిశిత శక్తులు బాగుగా ఉపయో
గించును కేవలముగా దైహిక శక్తిని ఉపయోగించినంత
మాత్రమున కుదరని కొన్ని రోగములు గలవు మా ఆసుపత్రి
లో ఆ రోగములుకూడా కుదురుచున్నవంటే యింతకంటె
మరొక కారణము లేదు ఈ సునిశిత శక్తులచేతనే, యింటి
దగ్గర రోగములతో తీసుకొనువారు మా ఆసుపత్రికి వచ్చి రోగ
విముక్తులగుచున్నారు

దైహిక రోగములకు యెట్లు చికిత్స చేయవలసినదీ వేరు
పుస్తకములలో చదువుకొందాము కాలిక రోగములలో రోగ
పదార్థము యెక్కువగా పేరుకొనును ధాతుశక్తి తగ్గిపోవును
తరుణ రోగములలో మాదిరిగా ప్రకృతి రోగపదార్థమును,

త్వరగా బయటకు పంపివేయలేదు కాంతశక్తిని ఉపయోగించి రోగముల నయము చేయువారు రోగికి తాము ప్రసాదించు శక్తి తక్కువ కొద్దోగొప్పో ఉన్నప్పటికి నీ రోగులలోని శక్తులను సమన్వయము చేయుదురు ఆత్మ విశ్వాసమును వృద్ధి చేతురు దేహములోని ధనాగ్రమును ఋణాగ్రమును సరిచేతురు చికిత్స కుడు సంపూర్ణ విశ్వాసముతో రోగి దేహమును ముట్టుకొనుట తో దేహములో కదలిక లేకుండా చచ్చుపడిన కణములలో చలనము పుట్టును కణములలో చలనము కలుగుట వలన చైతన్యము కలుగును మానవదేహము వివిధ కణముల సమూహ మగుటవలననూ కణములలో చైతన్యము కలుగుట వలనను దేహములోనూ చైతన్యము కలుగును అయస్కాంతముతో ఇనుపముక్కను రుద్దితే ఇనుపముక్క లోని అణువుల లో చైతన్యము కలిగి ఉద్రేకము కలుగును ఇనుప కణముల లోని మైక్రోజిమాల కదలికనే అయస్కాంతము ఎక్కువ చేయునేగాని అయస్కాంత మేమియు తన శక్తి నీయదు క్రొత్త అయస్కాంతముకూడా సవ్యముగా నుపయోగింప బడినంతవరకును తన శక్తిని పోగొట్టుకొనదు నిలుపుకొనును వక్ర మార్గములలో ఉపయోగింపబడినయెడల పోవును

సేవయే ప్రధానముగా పెట్టుకొని రోగముల కుదుర్చు వారు సునిశితశక్తులను అందరకును వ్యాప్త ము చేయుచున్నారు ఈ శక్తులు వారికి తెలిసియు తెలియకుండా కూడా బయటకు వ్యాపించుచున్నవి రోగుల రోగములు కుదిర్చినందు వలన శక్తి లేమియు తగ్గక నిష్కామముగా పరులకు పంచివేసిన

కొలదినీ ఆ శక్తులను ఈ వైద్యుడు ఎక్కువగా పొందుతూ ఉంటాడు విశ్వశక్తినుండియే ఈయనకు ఈ శక్తులు లభించు చుండును కొరతపడుట ఎప్పుడునూ తటస్థపడదు ఏకాగ్రత వలన ఈ శక్తి ఎక్కువగునేగాని తగ్గదు

ఏకాగ్రతచేత దేహ వ్యాపారము నంతనూ ఆపుచేసిన వారుగలరు

ఒక భాగములో మాత్రమే కదలికను గలిగించినవారును గలరు దేహములోని అన్ని భాగములలోను రక్తము ప్రవహించకుండా ఒక భాగములో మాత్రమే రక్తమును ప్రవహింపచేయువారును గలరు ఒక గారడివాడు ఒక మనిషిచేతి నుండి రక్తమును ప్రవహింపచేయుట నేను ప్రత్యక్షముగా చూచినాను ఈ విధముగా దేహవ్యాపారమును స్తంభింపచేసి, రక్తమును ఒక భాగముద్వారా ప్రవహింపచేయుట, దేహములోని నిర్మాణశక్తికి వ్యతిరేకము కాన ఆచరణీయముకాదు రోగము కుదరవలెనను గట్టి సంకల్పముతో కాంతశక్తిని ప్రయోగించినయెడల త్వరగా రోగములు కుదురుట నేను ప్రత్యక్షముగా చూచినాను ఇంతచేసినను నొప్పులు తగ్గక పోయినయెడల నొప్పులుగానున్న భాగములమీద నాచేతి నుంచెడివాడను నొప్పులన్నియు పోయెడివి, అక్కడ నిలచి పోయిన కణములలో చలనము కలిగెడిది

ఎప్పుడైనా బాధకలిగినపుడు మీరుకూడా ప్రయత్నము చేసి బాధను పోగొట్టుకొనగలరు తలలోనికి రక్తము పోకుండా చేసినయెడల బాధ త్వరలోనే తగ్గిపోవును

ఆగంతుకముగా వచ్చిన దెబ్బలవలనగాని, ఉద్రేక పదార్థముల తినినందువలనగాని గలుగు తలనొప్పులు ఈ కాంతశక్తిప్రయోగమున తగ్గవు రోగపదార్థము పేరుకొంటే వచ్చు నొప్పులు ఆహారము లోని మార్పులవలననేగాని కుదరవు.

## కాంతశక్తి ఉపయోగము

ఫ్రెంచి దేశస్థుడగు మెస్మరు మొదటగా, కాంతశక్తిని ఉపయోగించి, రోగముల కుదర్చెను అతను ఉపయోగించినాడు కనుకనే యీ శాస్త్రమును మెస్మరిజం అన్నారు కాలానుగుణ్యముగా గారడవాడు చేయు ప్రక్రియలకును మెస్మరిజంఅనే పేరే వచ్చినది కాంతశక్తితో రోగములు కుదుర్చుటకును, గారడీవాళ్లు చేయు గారడీలకును, ఎట్టి సంబంధమునులేదు మెస్మరు తన పరిశోధనలను పదునెనిమిదవ శతాబ్దము చివరభాగములో చేసెను పందొమ్మిదవ శతాబ్దములో వచ్చిన బారేన్ వాన్‌రీచెన్‌బాక్, మెస్మరు సిద్ధాంతముల విపులపరిచెను వ్యాప్తిలోనికి తెచ్చెను

రేచిన్‌బాక్ తన పరిశోధనల నన్నిటిని చీకటిగదిలో చేసెను బయటినుండి వెలుతురులోనికి వచ్చెడిదికాదు తదేక దృష్టితో ఒక వస్తువువంక చూచినయెడల, ఆ వస్తువునుండి, నీలివర్ణముగల తేజశ్చక్రములు కనపడెడివి అతీంద్రియ దృష్టి గలవారు, అనేక వస్తువులను చూచెడివారు

ఆ శతాబ్దములో రెచిన్‌బా ప్రసిద్ధుడు, మొదటలో [illegible]నుండియే సుగంధ ద్రవ్యముల నన్నిటినీ తయారుచేసెడి

వాడు, గానురాను మానవులలోని విచిత్రశక్తుల కనుగొన మొదలిడినాడు ఈ శాస్త్రమునుగూర్చి చాలా పరిశోధనల చేసినాడు దైహికశక్తులలోని, అతిసున్నితమైన స్పర్శజ్ఞానము గలవారికే యిది సాధ్యమగును ఆత్మీయ శక్తులను వృద్ధి చేసు కొన్నవారికినీ, మెస్మరిజం సాధ్యమగును పదార్ధమును మనము ఇంద్రియ జ్ఞానముచేత తెలుసుకొం'గాము ఆధ్యాత్మికశక్తుల నన్నిటినీ ఆధ్యాత్మిక జ్ఞానమువలననే తెలుసుకొంగాము

అతీంద్రియ దృష్టి ఉన్నవారికే యీ నీలవర్ణపు తేజ శ్చక్రములోని కాంతులు విశదముగా కనబడును

మిగిలినపరిస్థితులు అనుకూలముగా నున్నపుడు మా మూలు ఆరోగ్యవంతులు పదిమందిలో ఎన్మిది తొమ్మిది మందిలో ఈ తేజశ్చక్రము కనబడుతుంది చూచువారికి అతీంద్రియ దృష్టి ఉన్నయెడల, తేజశ్చక్రము ఎరుపువర్ణముగా కనబడును

నిద్రబోవునపుడు ఈ తేజశ్చక్రము కనబడదు అదృశ్య మగును మేలుకోగానే తిరిగి వచ్చును దైహిక, మానసిక శక్తులు పనిచేయుట మొదలుపెట్టినతోడనే, మరల ప్రత్యక్ష మగును నిద్రపోవునపుడు ధాతుశక్తి వృద్ధిఅవును నిత్యకృత్య ములలో ఖర్చుఅయిన ధాతుశక్తి నిద్రలో పూర్తిఅగును కాన నిద్ర దేహమునకు అవసరమైనది ధాతుశక్తిని వృద్ధిచేసుకొను టకు, విశ్రాంతి తీసుకొనుటకన్న మరొకమార్గము లేదు

## కాంతశక్తితో కుదుర్చుట

వైద్యుని చేతులను రోగి దేహముమీద పైనుండి క్రిందకు రాచినంతమాత్రముననే కాంతశక్తి ప్రయోగింపబడునని తలపరాదు

కాంతశక్తిని ప్రయోగించుటకు, మరికొన్ని మార్గములు కూడా కలవు సిద్ధహస్తులు అనగా ఆ శాస్త్రములో ప్రాంశిత్యమును పొందినవారు కంటితో చూచినంతమాత్రముననే రోగములు నయమగును మాటలాడినంత మాత్రమున రోగములు నయమగుటయు మనము చూచుచునే ఉన్నాము ఊదినను రోగములు, నయమవును అందువలననే కాబోలు నొప్పులకు మంత్రములు పెట్టువారు, మధ్యమధ్య (ఊదుచుందురు) కాంతశక్తిని ప్రయోగించువారు ఒక ప్రధానసూత్రమును దృష్టిలో నుంచుకొనవలెను రోగి యెడమభాగమునకు వైద్యము చేయవలసివచ్చినపుడు, వైద్యుని కుడిప్రక్క అతని యెడమభాగమునకు ఆని ఉండవలెను వైద్యుడు కుడిచేతితో రోగి యెడమభాగమును సరిచేయవలెను రోగి కుడిభాగమును సరిచేయవలసివచ్చినపుడు, వైద్యుడు ఎడమచేతిని ఉపయోగింపవలయును కాంతశక్తిని ప్రయోగించినపుడు, తలనుండి దిగువకు చేయవలయును ఎగువకు మాత్రము ఎన్నడును చేయరాదు తలనుండి దిగువకు చేయునప్పటికిని చేతిని గుండ్రముగా త్రిప్పికొనవలెను. సూటిగా వెన్నడును చేతిని తీసికొనరాదు. దిగువకుకూడా శక్తులు ప్రవహించుచుండును

గాన పైకి క్రిందకుపోవు రెండుశక్తులకును ప్రతిరోధము కలుగ కుండా చూడవలయును వెనుకనుండి ప్రయోగించవలసినపుడు గాని, వెల్లకిల పడుకొన్నవారికి, కాంతశక్తిని ప్రయోగించ వలసి వచ్చినపుడుగాని ధనాగ్రమును, ఋణాగ్రమును కలుపు నట్లు మూలవాటముగా తోమవలయును

## చివరలో రక్తప్రవాహము తక్కువగానున్నపుడు చేయవలసిన పద్ధతి

కాళ్లకు చెప్పులు, మేజోళ్లు, బూట్సులు ఏమీ లేకుండా చేసి శుభ్రమైన పరుపుమీద పడుకొన బెట్టవలయును రోగి చీలమండలను గట్టిగా పట్టుకొనవలెను ఒత్తిడిమాత్రము కలుగ చేయరాదు ధాతుశక్తి రక్తమును చివరలదాకా ప్రవహించు నట్లు ముందు నీవు ఇచ్ఛచేయుము ఇట్లు ప్రయోగించి చాలా కాలమునుండి చలికాళ్లు చలిచేతులతో బాధపడువారిని కుదిర్చినాను ఈ పరిస్థితులలో వేడినీటిని ఎప్పుడును ఉపయో గించరాదు ఎందువల్లనంటే ప్రతిక్రియలో రక్తప్రసరణము తగ్గిపోవును రోగి కూర్చొన్నపుడు కాంతశక్తిని ప్రయోగించవలసి యున్నది ఏ అవయవమునకు ఆ అవ యవము సంబంధము లేకుండా విడిగా ఉండమనవలయును రోగిశ్రమను తట్టుకొనలేక సున్నితమైనకాలదినీ, సున్నితమైన శక్తులను గ్రహించగలడుగాన, వారికి మోటుప్రక్రియలను చేయరాదు ఈక్రింద నిదర్శనము వలన రోగి యెంతసున్నిత శక్తులను భరించ గలుగునదీ తెలుకొనగలము రోగిని చేయి

చాపుమనుము వైద్యుడు తనచేతి వ్రేళ్ళను పైకిచూపుచూ అతనిచేతిదగ్గరకు తీసికొనిరావలెను రోగి తనలోనినున్నితత్వమునను సరించి గాలితగిలినట్లుగా కాంతశక్తి ప్రయోగములను, గ్రహించును సున్నితమైతే మరీయెక్కువగా తగులును వ్యతిరేకశక్తి యెక్కువైనకొలదినీ రోగి దానిని గ్రహించలేడు

కాంతశక్తి నీటిలోనికి చొప్పించుటయుగలదు రోగి బాధననుసరించి కాంతశక్తియొక్క సవ్యాపసవ్య అగ్రములను ఉపయోగింపవచ్చును పాజిటివుమాగ్నటిజము చొప్పింపచేసిన నీటివలన, అతిసారము తగ్గును

నెగటివు మాగ్నటిజమును చొప్పింపచేసిన నీటివలన మలబద్ధకము తగ్గిపోవును

కాంతశక్తిని ఎట్లుప్రయోగింప చేయునది తెలుసుకొందాము ఒకగ్లాసులో నీరుపోయుము పాజిటివు మాగ్నటిజమును చొప్పింపచేయువలసి నపుడు నీయెడమచేతిని గ్లాసు అడుగున ఉంచుము కుడిచేతిని వలయాకారముగా త్రిప్పి వేళ్ళను, నీటికి తగిలీతగలనట్లుగా ఉంచుము నెగటివుమాగ్నటిజమ్ చొప్పించి చేయవలసివచ్చినపుడు, కుడిచేతిని పాత్ర క్రిందఉంచి, యెడమచేతినివలయాకారముగా, త్రిప్పి వ్రేళ్ళను క్రిందకుచూపి నీటికి త లీ తగలనట్లుగా ఉంచవలయును. [illegible]పానుములలో కాంతశక్తిని చొప్పించవలసి నప్పుడును, ఇదే

ప్రతికుటుంబములోను ఆరోగ్యవంతులు ఈవిధముగా కాంతశక్తిని ఉపయోగించి రోగముల కుదుర్చుట నేర్చుకొనవలెను తరుణరోగములనేగాక, కాలికరోగములను ఈ శక్తిని ప్రయోగించి నయముచేయవచ్చును

కాంతశక్తిని ఉపయోగించుటవలన వ్యాధిసంకటము అణచిపెట్ట లేదా అనిఅడుగవచ్చును అదియెన్నటికిని కాదు, ఎందువల్లననగా కాంతశక్తిని శాస్త్రసమ్మతముగా ఉపయోగించినయెడల ధాతుశక్తి వృద్ధియై రోగనిరోధకశక్తులు వృద్ధియగును

ధాతుశక్తి వృద్ధియగుటతోడనే వ్యాధిసంకటములు వృద్ధియై, రోగపదార్థముపోయి రోగమునయమగును

## ప్రేమ పూర్వకముగా నయముచేయుట

ఉత్తరయూరపులోని ప్రజలంతా యీశాస్త్రమును వృద్ధిచేసినారు ఇది వంశానుగతముగా, తండ్రినుండి కుమారునకును, తల్లినుండి కుమార్తెకును, వచ్చుచున్నది

ప్రేమ దయ ప్రధానముగా, పెట్టుకొన్న అమాయక ప్రజలలోనే యిది వ్యాప్తిలో నున్నది నేను యూరపులో నున్నంత వఱకునూ, ప్రత్యేకముగా శ్రద్ధతీసికొని వీరిని చూచుచుండెడి వాడను విషయము తెలుసుకొనవలెనని నేనుప్రయత్నము చేసెడివాడను నా ఆతురతను వారుగ్రహించి నాకాశాస్త్రమును, తెలియపరచినారు

నివారణకాలమున ప్రార్థనలనే యెక్కువగా చేసెడి వారు అవసరమైనపుడు మాత్రము రోగలక్షణములకు సరి పోయిన ఆకును ఇచ్చెడివారు సాదృశ్యముగా అనేక రోగము లను క్రీస్తు కుదిర్చినట్లు బైబిలులో ఉదాహరణలు గలవు.

సునిశిత శక్తులతో రోగమును కుదర్చగల నను నమ్మ కము వైద్యునకును, రోగము నయమగుననుపూర్తి విశ్వాసము రోగికిని ఉన్ననేగాని రోగము నయముకాదు

నిష్కామముగా మాత్రమే చేయవలయును వచ్చి పోవునపుడేమియు ప్రగల్భముల పలుకరాదు తాను కుదిర్చిన రోగముల నెవరితోను ఏకరుపెట్టరాదు ఈ నియమములకు వ్యతిరేకముగా ప్రవర్తించిన యెడల ఈ శక్తు లేమియన్ని ఉప యోగ కరములు కావు

కొన్ని కేసులలో ఈ చికిత్స ఉపయోగించకపోవుటయు గలదు

ఉత్తర యూరపులోని సామాన్య జనమంతా అమా యకులుగానుండి ప్రజలనుండియే వైద్య సహాయమును పొందెడి వారు మందువైద్యమును చాలా కొద్దిమందే ఉపయోగిం చెడివారు అనాదినుండియు ఈ పద్ధతే అమలులో ఉన్నట్లు తెలుస్తుంది ఇప్పటి మందువైద్య పద్ధతులకును వెనుకటి నివారణోపాయములకును ఎట్టి సంబంధమును లేదు.

## ౩౧

# మనస్సునకును మంత్రశాస్త్రమునకును గల సంబంధము

గతశతాబ్దములో సామాన్య ప్రజలు సహితము పాత మందు వైద్యముతో విసిగి వేసారిపోయినారు మందులలోని అపభ్రంశములను తెలుసుకొన్నారు ఉపయోగము లేదని గ్రహించినారు శస్త్రచికిత్సవలనకూడా ఆవంతయు ఉపయోగముకలుగుట లేదని ముమ్మాటికిని తెలుసుకొన్నారు మందు వైద్యమునందు అపనమ్మకము పెరిగిపోయినది శాస్త్రకూ, కూస్తకూ, మందులతో విసిగి వేసారిపోయిన వారు దేనికైనాకూడా మందుల సోకుకూడదని అనుకొనుట లో విచిత్ర మేమియు లేదు అప్పుడు మంత్ర శాస్త్రముతో రోగముల కుదుర్చుకొనుట మొదలు పెట్టినారు

ఈమంత్రశాస్త్రము ప్రయోగమున కొన్ని రోగములు కుదురుచు వచ్చినవి నియమ నిగ్రహములతో పని లేకుండా, కష్టపడకుండానే కేవలు మంత్రోచ్చారణము వలననే రోగములు నయముగుటవలన వేలము వెర్రిగా ప్రజలందరును ఈ త్రోవకు మరలినారు

ప్రజలు మూగుటచూచి ఆ శాస్త్ర అనుయాయులు ఇవే సత్యములనియు మిగిలినవన్నీ అసత్యములనియు వాదింపజొచ్చిరి రోగనివారణ శాస్త్రమును ఇంతవరకు చదివిన మా చదువరులు మంత్రశాస్త్రము యొక్క మూలసూత్రములకును ప్రకృతి

వైద్యశాస్త్ర మూలసూత్రములకును గల తేడాను గ్రహించి ఉందురు ఈ రెండుశాస్త్రములకును గలసంబంధమును పరిశీలి ద్దాము మందులను వాడని యెడలనూ, శస్త్రముల నుపయో గింపకపోతేనున్నూ తరుణరోగముల వలన ప్రజలు చనిపోవుదు రని చాలా కాలమునుండియు జనము భయపడుచుండెడివారు చిన్నపిల్లలకు వచ్చుపొంగులునూ, పెద్దలకువచ్చు సన్నిపాత ములునూ, మందులకన్నా ప్రార్థనలతో, త్వరగా కుదురుట చూచి ఆశ్చర్యచకితులయినారు ఆమంత్రశాస్త్ర ప్రవీణులకు, జోహారు లొనర్చుట మొదలిడినారు

మందువైద్యమును ఎంత గుడ్డిగా నమ్మినారో మంత్ర శాస్త్రమునుకూడా అట్లాగే నమ్మ మొదలిడిరి కార్యకారణ సంబంధమును తెలుసుకొనలేక పోయినారు ఆరోగ్యమును సరిచేయుటకు ప్రకృతిచేయు ప్రయత్నమే తరుణరోగమనే మూలసూత్రమునే గ్రహించలేక పోయినారు మిగిలిన పరి స్థితులు అనుకూలముగా నున్న యెడల నోరులేని జంతువుల రోగ విముక్తులచేయు ప్రకృతియే మానవకోటినికూడా కాపాడునను చిన్న సూత్రమునే గ్రహించలేక పోయినారు

పైమాట అనగానే మంత్రవేత్తలతో తగాదా వస్తుంది ప్రకృతివైద్యశాస్త్రము చెప్పునదియు తాము చెప్పునదియు ఒకటేననియు వాదింతురు.

ఈ విషయములో మాత్రము ఒక పెద్దచిక్కు ఉన్నది ఏమనగా ఆధ్యాత్మిక వాదములు ఆరోగ్య సూత్రములుకూడా

విస్మరించి, భగవంతునకే ప్రాధాన్య మిచ్చుచున్నారు ప్రకృతివైద్యముగాని మరి యే వైద్యముగాని ప్రాణశక్తిని ప్రవేశ పెట్టలేక పోయినప్పటికినీ ఆరోగ్య సూత్రముల విధిగా ఆచరించినందువలన దేహములోని ప్రకృతికి మాత్రముసహా యము చేయవచ్చును అభ్యంతరములు తగ్గిపోవును బుడ్డిలో చమురు ( ధాతుశక్తి లేక ప్రాణశక్తి )ఉన్నంతవఱకును దీపము నిరాటంకముగా వెలుగును

బైబిలులో ఏసుక్రీస్తుకూడా ఇదే అభిప్రాయము చెప్పినాడు పాపముల వలన రోగములు వచ్చుచున్న వనియు, ప్రకృతి సూత్రముల ఉల్లంఘించుటచేత పాపము కలుగుచున్నదనియు బోధించినాడు

ప్రకృతి సూత్రముల ఆచరించుటచేత ఆరోగ్యము కలుగునని తెలియచెప్పినాడు ఏ చిన్న తప్పు చేసినప్పటికినీ పెద్ద శిక్ష అనుభవించక తప్పదని చెప్పినాడు

చిన్నతప్పుకు చిన్నశిక్షయే కలుగ వలెననియు ఆహారము ఎక్కువగా తినినందువలన శీలములో మార్పురాదనియు మామితులు వాదించ వచ్చు ఈ విషయం పైకి మాత్రము విచిత్రముగానే తోస్తుందిగాని ఆలోచించిన కొలదినీ అందులోని నిజానిజములు తెలియగలవు

## మ నో ని గ్ర హ ము

భౌతిక ఆధ్యాత్మిక వాంఛలను తృప్తిపరుచు కొనుటకు ముందు మనోనిగ్రహ ముండవలయును మానవుడు మిగిలిన

నియమముల అతిక్రమించుటకు ముందుగా ఈ ముఖ్యసూత్రి మును విస్మరించును దారుణ కృత్యములలోని దారుణము మనల ఆశ్చర్యము కొలుపదుగాని స్వల్పమైనను మనో నిగ్రహములేక ఈ దారుణమును చేసినాడే యని మనకు అత్యాశ్చర్యము కలుగుతుంది నిగ్రహము వరుసన పోగొట్టుకుంటూ పోతే కాస్తకు కూస్తకు కల్లు త్రాగినవాడ మాదిరిగా గంతులు వేయవలసినదే ఒకప్పుడు కాఫీని త్రాగుట నిరోధించలేనివారును, సిగరట్టయినను కాల్చుటమాననివారును పెద్ద పెద్ద కోర్కెలను ఎట్లు నిరోధించ గలరు? నిరోధించగలమని తలచుట వెర్రి మనోనిగ్రహము లేకపోవుట ఆత్మహత్యయే అని చెప్పవచ్చును మనోనిగ్రహము లేకపోవుటచే మితిమీరి తినుచున్నారు. మదమాంసములను వదలివేయలేరు పొగను మానలేకున్నారు బ్రాందీ విస్కీలను నిరంతరము సేవించ వలసినదే కాస్తకూకూస్తకూమందులనుసేవించుచున్నాము వీటిని వదలలేక పోవులచేత ఈ దురభ్యాసములకు వీలగునట్లు వైద్యులను మందులు ఇవ్వమని అడుగుచున్నారు ఈ దురలవాట్లకు అలవడి రోగము వచ్చువఱకును మనము ప్రకృతి సూత్రములను అతిక్రమించుచున్నామను మాటనే మరచిపోవుచున్నాము ప్రకృతి సూత్రములను అతిక్రమించి సుఖముల పొందుచున్నామని భ్రమపడువారలు కష్టములుగూడా పొందుటకు ఇష్టపడవలెను

నపుడే శిక్ష ననుభవిస్తారు పట్టుపడనప్పుడల్లా తప్పుకుపోతారు ప్రకృతి సూత్రముల నతిక్రమించినవారు మాత్రము ప్రతి చిన్నపనికి విధిగా శిక్ష ననుభవించ వలసినదే తప్పుకు పోగల మనుకొనుట భ్రమ

నివారణ

మందులైతే యేమి రోగములు నయమవుచున్నవిగదా గుణము కనబడుచున్నదిగదా అంటారు ఈగుణమునకు మూలకారణముల మాత్రము గ్రహించరు ప్రకృతిసూత్రములును వాటినుపయోగించుటయు శాస్త్రప్రకారముబాగానే ఉన్నవిఅంటారు కాని ఆచరణలో మాత్రము సాధ్యము కాదంటారు ఏమందు వేసినను గుణముమాత్రము కనబడు చున్నదిగదా అంటారు ప్రత్యక్షములో గుణములు కనబడు టచేత, వాటినెవరునూ కాదనలేరు అయినప్పటికినీ యీ గుణములలో ఏమైనా విచిత్రమున్నదేమో విచారిద్దాము మామూలుసూత్రములతో ఎట్లా నయమయ్యేది తెలుసు కుందాము రాబోవు అధ్యాయములో వివిధరోగాలకు గల భేదాలను తెలుసుకుందాము

రోగములు రెండురకములుగా నుండును అవయవ ములు మాత్రము బాగానే ఉండును వాటిధర్మమును మాత్ర ము నిర్వర్తించవు వీటిని ఫన్క్షనల్ డిసిజస్ అంటారు ఇవి సులభసాధ్యములు అవయవములు శిధిలమగుటచే కలుగురోగ ములు ఈశైథిల్యము కొంతకావచ్చును అంతాకావచ్చును

వీటినిఆర్గానిక్ డిసీజస్ అంటారు ఇవి కష్టసాధ్యములు

ధాతుశక్తి పరసహాయమేమీ లేకయే స్వాధ్యసంకటముల ద్వారా రోగపదార్థమును ఎట్లుబయటకు పంపివేయునదియు తెలుసుకొన్నాము అటువంటి రోగములలో ప్రకృతియే సులభముగా నివారణచేయునుగాన ఆధ్యాత్మిక వాదులు నూటికి నూరుపాళ్ళునూ ఫలితముల పొందుతారు

అవయవములలోని లోపములవలన వచ్చురోగములలో ధాతుశక్తి మరీతగ్గిపోయి, అంతరవయవములు బాగుపడుటకు వీలు గానంతగాచెడిపోతే ప్రకృతియేమినీ చేయలేదు ప్రకృతి తనంతటతానే రోగమును నయముచేయలేదు అటువంటి పరిస్థితులలో ఒక్కనమ్మకముతోనే రోగము కుదరదు ప్రకృతివైద్యములోని అన్నిచికిత్సా భాగములనుండియు ఉత్తమచికిత్సా ప్రక్రియల నేరుకొనవలసినదే అన్ని ప్రక్రియలనూ వాడవలసినదే

తరుణరోగముల అణచిపెట్టినందువలన కాలికరోగములు ఎట్లువచ్చునదీ యింతవఱకూ చదివిన యీగ్రంథమును మాచదువరులు గ్రహించియే యుంటారు శాస్త్రకూ, శూస్త్రకూ మందులనువాడి, కత్తులనుపయోగించుటచేతనే పెద్దపెద్ద బాధలువచ్చుచున్నవి కాని విచిత్రిషేమ్మంటే వెనుకటి వాటికిని ముందువాటికినీ సంబంధము లేదంటారు ప్రతి చిన్నలోపమునకునూ మందులను శస్త్రిములను ఉపయోగించి గుణముల పొందుచున్నామనుటలో ఆశ్చర్యమేమినీ లేదు

మందులులేకుండా నయమగుతవికాబట్టి ఆధ్యాత్మిక వాదులవలన, ఒకఉపయోగము మాత్రము కలుగుచున్నది. మందువైద్యులమాదిరి, వీరు తరుణరోగములను మందులతో అణచిపెట్టరు శస్త్రములనేమిన్నీ ఉపయోగించరు అణచిపెట్ట నందువలన తరుణరోగములు ఎట్టిఅభ్యంతరములునూ లేక రోగముయొక్క పుట్టుక, చావులు యథాప్రకారముగా జరిగి పోవును దేహము ఆరోగ్యవంతముగా నుండును

ప్రధాన ప్రకృతిసూత్రములకూడా తెలుసుకోనకుండా రోగములు వచ్చుటయు, నివారణఅగుటయు, ఆరోగ్యము కలుగుటయు ఆగంతుకముగా వచ్చునంటారు

రోగముల అణచిపెట్టనందువలన ఆధ్యాత్మిక వాదులు కూడా ప్రకృతికి పరోక్షముగా సహాయము చేయుచున్నారని యే చెప్పవలయును నమ్మకము ఉత్సాహము కలుగచేసి భయము, క్రోధములను తగ్గించివేయుటచే ప్రత్యక్షముగా ప్రకృతికి సహాయము చేయుచున్నారనియే చెప్పవలయును. ఉద్రేకమును కలిగించు సారాయి పొగాకు మొదలగు పదార్థ ముల సేవించవలదని ప్రచారము చేయుటచే ప్రకృతికే సహాయము చేయుచున్నారని చెప్పవలయును మరొకసంగతి విచారిద్దాము సామాన్య ఆరోగ్యవంతునికి, జీవితకాలములో పన్నెండు తడవలు జబ్బుచేసినదనుకొందాము ఏవైద్యము చేసినప్పటికినీ పదకొండు తడవలు వచ్చినజబ్బుల నుండీ బయటపడతాడు పన్నెండవ తడవవచ్చిన జబ్బుతో చసాడు. పదకొండు తడవలు వచ్చిన 'జబ్బులను నయముచేసినవారు

రోగముల రూపుమాపేమంటారు మా వైద్యము ప్రకారము చెప్పవలెనంటే, ధాతుశక్తి ఎక్కువగానుండుటచేత, వైద్యము చేయకపోయినప్పటికినీ బ్రతికెడివాడే వైద్యముచేసినందు వలననే బ్రతికినాడని తలంచుట శుద్ధవెర్రి నిజముచెప్పవలె నంటే, పదకొండుతడవలు మందులతో అణచిపెట్టినప్పటికినీ బ్రతకగలుగుటయే విచిత్రము ఇటువంటి స్వల్పవిషయములనే తీసికొని మంత్రవేత్తలు తమ వైద్యముయొక్క గొప్పతన మును వేనోళ్ళపొగడుతారు కార్యకారణాలతో తమవైద్యము లోని నివారణాలను చెప్పినట్లయితే వాటిలోకూడా వింతలూ విశేషములునూ యేమియూ ఉండవు

## కార్యకారణములు చెప్పకుండా వింతలు చూపించుట వెర్రితనము

మనము తెలిసియు తెలియకయు చేయు అపచారము లకు శిక్షల ననుభవించుమనియు-భగవంతుడును ప్రకృతియు ఆగంతుకముగావచ్చి మనల శిక్షలనుండి కాపాడునని తలచుట వెర్రితనమును మూర్ఖత్వమును తెలియచేయును

ఈ ప్రపంచమంతా కార్య కారణముల సంబంధముల తోనే ఉన్నదని గట్టిగా నమ్మువారిలో నేను మొదటి వాడిని మిగిలిన-అన్ని సిద్ధాంతములతోబాటు ఈశాస్త్రములోకూడా అతివాదములు లేకపోలేదు. ఈ అతివాదము వలన సత్యము మరుగుపడుచున్నది పాత సిద్ధాంతముల వదలుకొని క్రొత్త సిద్ధాంతములకొరకు తహ్చులాడు ఈ అతివాదులు ప్రత్యక్ష ప్రమా

ణములకూడా స్వీకరించుటలేదు ఆకాశములో సౌధముల కట్టుటలోనే వీరి ప్రజ్ఞ ఉపయోగపడుచున్నదిగాని కార్యమున కేమియు ప్రధానము ఇచ్చుటలేదు అంతా మంచికేవచ్చినది ఏమియును చెరుపుచేయలేదు అని భావించుటలోనూ హాని కలదు ఈ మంత్రమునే మననము చేసినందువలన ఆత్మశక్తి చచ్చిపోయి మనోబలము నశించిపోవును తదేక ధ్యానముతో ఉండుటవలన హృదయ వ్యాపారమంతా స్తంభించి పోవును విచిత్ర ఆధ్యాత్మిక సిద్ధాంతములవలన వారి ప్రవర్తనలలో ఎంత లోపమువచ్చినదీ నిష్పాక్షికులగు విమర్శకులు గ్రహించకపోరు

ఈ సందర్భములో ఒక చిన్న విషయము చెపుతాను అనేక సంవత్సరములనుండి ఒకామె కాలిక రోగముతో బాధ పడుచున్నది ఒక ఆధ్యాత్మికవాది ఆమెకు చికిత్స చేయుచు న్నాడు ఎంతకాలము చికిత్సచేసినప్పటికి ఏమియూ గుణము కనపడలేదు గత్యా గత్యా ఒకరోజున ఆమెకు ఆహారమును గూర్చియు, స్నానమునుగూర్చియు, వ్యాయామమునుగూర్చియు కొన్ని సలహాలు చెప్పినాను ఈ సలహాలతో ఆమె చాలా తృప్తి పడినది ఇంతకాలమునుండీకూడా (ఆధ్యాత్మికవాది) తమ వైద్యుడు అగుటచే భగవంతుని చిద్విలాసములగూర్చియే చెప్పుచూ వచ్చినాడుగాని కార్యకారణముల సంబంధమును చెప్పలేకపోయినాడు అందువలన ఆమెకు ఎన్నిసంవత్సరములు చేసినను రోగము కుదురలేదు విసుగెత్తినది ప్రతిక్రృతిచేయు నివారణోపాయములకు ఆమెకూడా ఆహార విహారములలోని మార్పులతో సహాయపడుటచే రోగము నయమగుచున్న

దనియు ఆరోగ్యము కలుగుచున్నదనియు ఆమెయే తరువాత ఒప్పుకొన్నది బుద్ధికిని దేహమునకును చాలా దగ్గర సంబంధమున్నది మనస్సులో ఒక భావము కలిగిన వెంటనే దేహము మీద ద్యోతక మగును దైహిక చేష్టలవలన మనస్సుకూడా చెడిపోవును యోగనిద్రతో వారిలో మనోవికాసము లేకుండా చేయుటకు బదులు రోగుల యుక్తాయుక్త విచక్షణ జ్ఞానమునే ఎక్కువ చేయుటకు తోడ్పడిన యెడలనూ, ఆరోగ్యవిధులను వారికిబోధించిన యెడలనూ రోగములు త్వరగాకుదురును రోగుల బుద్ధిసూక్ష్మము ఎక్కువైన కొలదినీ ప్రకృతి శాస్త్ర సమ్మతమైన ప్రక్రియలను సుంభముగా గ్రహించి రోగ నివారణకు తోడ్పడుదురు రోగము వచ్చిన వెంటనే ఆధ్యాత్మిక వాదులుచేయు ప్రక్రియ లేమంటే భగవంతుని ప్రార్థించమంటారు మందువైద్యము వారన్ననో మందులతో అణచిపెడతారు మొదటి వైద్యపద్ధతి ప్రకృతికి అవరోధముల కల్పించదుగాన మందువైద్యమువారిపద్ధతికన్నా ఉత్తమమైనదే

రోగమును దైహికముగా కుదర్చవలెనంటే ఈ పద్ధతి చాలదు రోగ పదార్థము బయటకు పంపుటకు ప్రకృతి చేయు ప్రయత్నములకు ప్రకృతిశాస్త్రమునకు వ్యతిరేకముగాని శీతలోపచారములతో మనముకూడా తోడ్పడవలయును. రోగికూడా బుద్ధిపూర్వకముగా తోడ్పడిన యెడల రోగము చాలా త్వరగా కుదురును

చీటికీ మాటికీ మందులుపోసి మందువైద్యులు అపచారమును చేయుచున్నారు శీతలోపచారములుకూడా అవసర

ము లేదను ఆధ్యాత్మికవాదులుకూడా పై విధముగానే అపచారములు చేయుచున్నారు కార్యకారణ సంబంధమును తెలిసికొనకుండా గుడ్డిగానమ్మటచే అనేకమంది రోగులు చనిపోవుచున్నారు

వీరలకు ఈ క్రింది ప్రక్రియలలో ఒకటిగాని అన్నిగాని చేసిన యెడల వీరందరును తప్పక బ్రతికెడివారే తడికట్లు వేయుట, తుషార స్నానము చేయించుట, పదేపదే మంచినీటిని త్రాగించుట, యుక్తాహారమును ఇచ్చుట, రసవంతములగు పండ్లను ఇచ్చి ఉపవాసముంచుట, వెన్నెముకలోని దోషములను సరిచేయుట వలననూ రోగము తప్పకుండా నయమయ్యెడిదే మంటలజ్వరముతో బాధపడు రోగిని భగవంతుని ప్రార్థన చేయుమనియు, నియమ నిగ్రహములతో ఉండుమనియు బోధిస్తే ఉపయోగ మేమియున్నిలేదు తడికట్టుతోగాని, చన్నీటి స్నానముతోగాని, కొన్ని నిమిషములలోనే యీ మంటలన్నీ తగ్గిపోతవి ప్రమాదముండదు మతముపేరిట జరుగు ఈ హత్యలనూ, హంతకులనూ యేమనవలెయునో అర్థమగుట లేదు

నా అనుభవములోనున్న ఒక కథచెప్పెదను మాచికెత్సాలయమునకు దగ్గరగానున్న ఒకామెకూతురికి సర్పి వచ్చినది ఆ పిల్లతల్లికి మతమంటే చాలా పెద్ద అభిమానమున్నది ఈ రోగము నయముచేయుటకు చాలామంది, మతబోధకుల పిలచినది వారిచేత నైనన్ని పాట్లుపడ్డారు కాని రోగమేమి వెనుకడుగు వేయలేదు రోజురోజుకీ ముదిరి పోతు

న్నది గొంతులోని, ఆమత్వాచ మంతా తూట్లుపడిపోయి, మొదటికే మోసము వచ్చేటందుకు సిద్ధమైనది

ఆ యింటిలోని పిల్లవాడు ఈ పిల్లకు వైద్యము చేయ లేదని ఆరోగ్య శాఖవారికి తెలియచేస్తానని తల్లిని భయపెట్టి నాడు ఆమె బెదరి సరేనని తలఊపినది ఆ పిల్లవానికి ప్రకృతి వైద్యమందు నమ్మకముండుటచే మాకు తెలియచేసినాడు మేము వెళ్లి తడికట్లు చన్నీటి ప్రయోగము చేసిన ఒక గంట సేపటి కల్లా రక్తము దేహమంతటా వ్యాపించినది గొంతులో మంటలు తగ్గిపోయినవి రోగము వెనుకడుగు వేసినది ఘురాకసంగతి, పదిహేను సంవత్సరములనుండి ఒక పెద్దమనిషి కటిశిరావేదన తో బాధపడుతున్నాడు అంతులేనిమందుల సేవించినాడు కానీ యేమిఉపయోగములేదు మంత్రిశాస్త్ర ప్రయోగము లను స్వీకరించాడుగాని యేమీన్ని ఉపయోగములేదు మాకు తెలిపిన వెంటనే మేము వెళ్లినాము

కుడి తొంటిఎముక స్వస్థానములో లేకపోవుట చూచి, అస్థి సమీకరణమువలన ఆయెముకను సరిచేసినాము రోగము పోయినది ఎన్నిమంత్ర శాస్త్రప్రయోగములు చెసి నప్పటికినీ స్వస్థానమును వదిలిన ఆయెముక పాటుకు వచ్చె డిదికాదు అస్థి సమీకరణము వలననే అది కుదురుతుంది ఆధ్యాత్మిక శాస్త్రవేత్తలు నూరుపౌన్ల బరువును తమ మాన సిక బలముచేత ఒక చోటినుండి మరియొక చోటికి జరుపగలు గుదురుగాక. కాని తొలగిపోయిన ఎముకలను మాత్రము సరి

చేయ లేరు ఎముకలలోని లోపములు అస్థి సమీకరణము వలననే కుదరాలి

కాని ఒక పెద్ద చిక్కు వచ్చింది ఏమీ ప్రయత్నం లేకుండానే ఆరోగ్యము ఆగంతుకముగా వచ్చిపడవలెనని దుర్బుద్ధి ఎక్కువైనది ఆధ్యాత్మికవాదు లేమిచెపుతున్నా రంటె జీవిత పంథాలో ఏమార్పు రాకపోయి నప్పటికీ రోగము రాగానే మంత్రము జపిస్తే రోగము మాయమగును అందు వలన నియమ నిగ్రహముంతో పనిలేని మంత్రశాస్త్రమునకై జనులు తండోప తండములుగా వచ్చుచున్నారు ఈశాస్త్రము కూడా మందువైద్యము మాదిరిగనే ఉన్నదని చెప్పాలి మందు వైద్యములో కూడా నియమ నిగ్రహములు అవసరము లేదు ఇచ్ఛాపథ్యముతోనే మందులు ఇస్తారు ఈ మందులైనను సర్వకాలమునూ పనిచేయవు కొంతవరకే పనిచేయును వీరం దరును మందులు పనిచేయనినాటికయినా మన త్రోవకు రావ లసినదే మన తాతలు మందులతో విసిగి వేసారిపోయినారు ఇప్పటి వారన్ననో పాపములేదు పుణ్యములేదు సుఖములేదు కష్టమూలేదు సర్వంఖల్విదం బ్రహ్మ అనే మెట్టు వేదాం తానికి వచ్చినారు ఇద్దరూ అతివాదులనే చెప్పాలి వీరిమాటలే నిజములైతే మందుల క్రియా ప్రతిక్రియలే లేకుండాపోవాలి కార్య కారణముల సంబంధ మెరుగక పోవుటచే ఆధ్యాత్మిక వాదులందరూ గుడ్డి నమ్మకములోపడి కొట్టుకు పోవుచున్నారు.

జంతువులకు మూఢ విశ్వాసము ఎట్లున్నదో అట్లనే వీరి అనుయాయులకును గుడ్డి నమ్మకమున్నది జంతువులకు

మంచి చెడులనువిడతీయు విచక్షణ ఉండదుగాన సహజస్ఫురణ వలననే తమ వాంఛలను తృప్తి పరచు కొంటున్నవి పదివేల సంవత్సరముల క్రితము జంతువు లేవిధముగా ప్రవర్తించిన వో నేడునూ అట్లనే చేయుచున్నవి ( ఈ నియమము పెంపుడు కుక్కలకును సావిళ్ళలో ఉండే జంతువులకును వర్తించదు )

మానవులకు యుక్తాయుక్త విచక్షణ కలదు ఎవరికి వారు ఆలోచించుకుని తమ పనులను నిర్వర్తించుకొన వలెను

మన జీవితములోని మంచి చెడులకును రోగారోగ్యములకును మనమే బాధ్యులము భగవంతుడు మనకు ప్రసాదించిన వివేచన నుపయోగించి మానవజాతి నియమముల విచారించి సాధ్యమైనంతవఱకు వారలకు సహాయముచేసి పశువులకన్న మిన్న యనిపించుకొని దైహిక మానసిక నైతిక సుఖముల పొందుదురుగాక

---

## 32

# కాలిక రోగములు

కాలిక రోగములలో కూడా కొన్ని కష్టముమీద గాని కుదరని రోగములు కలవు కాలిక రోగములలో రెండు రకములు గలవు (1)సులభ సాధ్యములు (2)కష్టసాధ్యములు ఈ రెంటికినీ గల తేడా, కనుగొనక పోవుటచే రోగము త్వరగా కుదరలేదని, ఆదుర్దాపడుచున్నాము ఈ రెంటికినీ గల తేడాను కనుగొన్నట్లయితే ఇంత ఆదుర్దా ఉండదు

పరిస్థితుల ప్రమాణములను తీసికొందాము దేహమంతా

శాశ్వతముగా చచ్చుపడి పోవుటయు, తాత్కాలికముగా చచ్చుపడి పోయినట్లుకనుపడుటయునూ, రెండూఒకటిగనే ఉండును పెద్ద తేడాలేనట్లుండును ఊపిరితిత్తులు తాత్కాలికముగా చెడిపోయినదియు, శాశ్వతముగా చెడిపోయినదియు, తెలిసికొనుట కష్టమే మా అనుభవములోని ఒకవిషయమును చెప్పెదను తాత్కాలికముగా కలిగిన మతిభ్రమణమును మందువైద్యులు పూర్తిగా మతిపోయినదని నిర్ధారణ చేసిరి అటువంటివారికి మతిభ్రమణము తాత్కాలికముగానే కలుగుటచే త్వరగానే కుదిరినవి

తాత్కాలికముగా కలిగినవి పైకి మాత్రము కష్టముగానే కనబడును విటినే మందువైద్యులు అర్థముకాని భాషలలో పిలుస్తారు ఇంతకష్టమైన రోగములైనప్పటికినీ ప్రకృతి సూత్రములకు అనుగుణముగా నడుచుట మొదలుపెట్టిన వెంటనే మాయమగును

రెండవరకపు కాలికరోగములు ఇంతత్వరగా కుదరవు జీవన పద్ధతులలో మార్పువచ్చినంత మాత్రముననే రోగములు కుదరవు రోగముపూర్తిగా నయము కావలెనని కోరిన యెడల, మిగిలిన ప్రక్రియలను కూడా చేయవలెను ఇంత చేసినప్పటికినీ, కుదరని రోగములునూ కలవు

మనము తిను ఆహారములో అరగక మిగిలి పోయిన పదార్థము రసము గంధకము పాషాణము సౌవీరము మొదలగు మందులలోని లోహములును ఆరోగ్య వంతమైన దేహములో పేరుకొనుటచేత రక్తప్రసరణము సరిగా జరుగదు

నాడీశక్తి సరిగా ప్రవహించదు ఈ రెండునూ సరిగా ప్రవహించక పోవుట వలన కణములకు కావలసిన ఆహారము అందదు కణములలోని మురిక వాటిలోనే నిలబడి పోవును ఎక్కడి వక్కడ నిలబడి పోవుటచే నరములు కండరములు అవయవములును సరిగా పనిచేయవు ఈ అభిప్రాయము ఈ క్రింది ఉదాహరణము వలన బాగుగా విశదము కాగలదు గడియారములోని మరలలో మన్ను చిక్కు కొనుటచే సరియైన టైము తెలుపదు అవయవములలో పేరుకొన్న మన్ను తీసివేసిన ఎడల గడయారము బాగుగా పనిచేయును ఈరోగములలో ప్రకృతి సిద్ధమయిన ఆహారము ఉపవాసము, శాస్త్ర సమ్మతమయిన వ్యాయామము, స్వచ్ఛమయిన గాలి పీల్చుట, చన్నీటి స్నానము, మనస్సు నిశ్చలముగా ఉంచుకొనుట మొదలగు పద్ధతుల వలన ఆరోగ్యము గలుగును

సులభ సాధ్యములైన కాలిక రోగములు ఆధ్యాత్మిక వైద్య పద్ధతుల వలన చాలా తేలికగా కుదురును ఆరోగులకు మందులు పోయరాదు శస్త్ర చికిత్సల వలన ఏమియు ఉపయోగము లేదు అతని మనస్సులో నుండు భయమును దిగులును తొలగించి వాటికి బదులుగా నమ్మకము ఉత్సాహమును కలుగ చేసిన యెడల రోగము దానంతటదియే అంతరించును. ఇట్లు సులభ పద్ధతులతో రోగము నయమగుట చూచి జీవన పద్ధతులలోను ఆహారములోను మార్పు వచ్చినంతనే పైన

చెప్పిన రోగములు నయమగునని చెప్పగా విని ఎరుగనివారు దిగ్భ్రాంతు లగుదురు

కష్టసాధ్యములయిన కాలిక రోగములు ఇంత తేలికగా కుదరవు ఈ రెండవ రకమయిన వ్యాధులు వచ్చునప్పటికి అంతరవయవములు పూర్తిగా శిథిలమై ఉండును మన్నుపడి తుప్పుపట్టి పాడైన గడియారము ఎట్లుండునో, అట్లనే అంతరవయవములును చెడి ఉండును ఈ పరిస్థితులలో గడియారపు చక్రములలోని మన్ను తీసివేసినంత మాత్రముననే గడియారము బాగు పడదు చెడిపోయిన భాగముల తీసివేసి వాటి స్థానములో క్రొత్తవి వేయవలెను గడియారములలో చెడిన అవయవముల తీసివేసి క్రొత్తవి వేయుట సాధ్యము కావచ్చును మానవుల దేహ యంత్రములలో క్రొత్తవి వేయుట మాత్రము సాధ్యము కాదు గడియారపు చక్రములలో ఒత్తిడి లేకుండ నడుచుటకు చమురు వేయుచున్నారు ద్రావకములతో మానవ రోగముల కుదుర్చుచున్నారు ఈ మందులే ప్రత్యక్షముగాను పరోక్షముగాను శస్త్ర చికిత్సలకు దోహదములగుచున్నవి శస్త్రచికిత్సకుడు అంతరవయవములతొలగించగలడే కాని, వాటికిప్రత్యామ్నాయముగా, క్రొత్తవాటిని వేయలేడు గడియారపు మరలలో ఒక చిన్నముక్కపోతే మిగిలిన యంత్రమున కంతకును, ఎట్టిలోపము కలుగునో, అట్లనే మానవదేహములోనున్న ఒకతుంపు తీసివేసినప్పటికినీ, మిగిలిన భాగమునకంతకును, ఇబ్బంది జరుగును ఎప్పటికప్పుడు

బయటకు పోవలసిన మురుగు, సవ్యముగా బయటకుపోదు. స్వాస్థ్య సంకటములద్వారా రోగపదార్థమున్ను, బయిటకురాదు

## ఆధ్యాత్మిక నివారణోపాయముల పరిమితి

సులభసాధ్యములైన కాలికరోగములు మాదిరగనే కష్టసాధ్యములయిన కాలికరోగములనుకూడా తేలికగానేఆధ్యాత్మిక వైద్యులు కుదురుస్తామంటారు ఈ రెండురకములయిన రోగముల లోని తేడాలను, తెలుసుకొన్నట్లయితే యింత తేలికగా, రోగము నయము చేస్తామనరు ఆధ్యాత్మిక వైద్య ప్రక్రియ వలన ఎంతవరకు రోగముల కుదర్చ వీలుకలుగునది తెలుసుకొనుటకు వారికి వీలుపడును ఆహారములోని లోపములవలన క్రొత్త సరుకు జీర్ణముకాక నిలబడిపోవును దీనినుండే ఆమ్లములు పుట్టును ఈ ఆమ్లములవలన, అంతరవయవములు చెడిపోవును వెన్నెముకలోని దోషములవలననూ, ఎముకలు అవిఉండవలసిన స్థానములో ఉండకపోవుటవలననూ, దేహములో కాయలూ, కంతులూ, గ్రింథులూ పుట్టును శిలామేహము, సికతామేహము కలుగవచ్చును వీటివలన రక్తప్రసరణమునకు, అభ్యంతరములు కలుగుటచే సరిగా ప్రవహించదు నాడీశక్తి కూడా సరిగా వ్యాపించదు ధాతువులు వాటి పాళ్లలో ఉండవు వీటి అన్నింటికితోడు మందులుపోస్తే మరీచెడిపోతవి శస్త్రముల నుపయోగించి అవయవములు తీసివేస్తే చెప్పవలసినదేమున్నది

ఇంత చెడిపోయిన అవయవములు బాగుపడుట నిజముగా కష్టమే. ఇంత చెడిపోయిన దేహమును బాగుచేయ వలెనంటే

రోగపదార్థము పేరుకొనకుండా చూడాలి చెడిన అవయవ
ముల బాగుపడునట్లు హానిలేని ప్రకృతి వైద్యచికిత్సా ప్రక్రి
యలద్వారా సహాయముచేయాలి కాయలుగాను, కంతులు
గాను, తయారైన రోగపదార్థమును, ద్రవరూపమును పొందింప
చేసి బయటకు పోవునట్లు చేయవలెను వెన్నెముకలోని దోష
ములను అస్థి సమీకరణమువలన సరిచేయవలెను

కష్టసాధ్యములగు కాలిక రోగములలో అంతరవయవ
ములు పూర్తిగా చెడిపోయి ఉండును ధాతుశక్తి తగ్గిపోవు
టచే ప్రకృతి తనంతట తానే చెడిపోయిన అంతరవయవముల
బాగుచేయలేదు ఈ రోగులకు ఉద్రేకమును కలిగించు
మందులును ఆధ్యాత్మిక వైద్య ప్రక్రియలును ఏమియు సహా
యము చేయలేవు జీవన పద్ధతులలోని మార్పు ప్రకృతి వైద్య
ములోని ఉత్తమ చికిత్సా పద్ధతుల వలననూ ఉపయోగము
కలుగును ఈ వైద్య పద్ధతులు ఉపయోగించినప్పటికిని అంత
రవయవములు పూర్తిగా చెడిపోయి ధాతుశక్తి తగ్గిపోయిన
యెడల రోగములు కుదరవు కుదరవని నిస్పృహ చెందుటకు
వీలులేదు ప్రకృతి వైద్యములోని ఉత్తమమైనట్టివన్ని ఉపయో
గమైనట్టివన్ని వైద్య పద్ధతుల నుపయోగించిన తరువాతనే రోగ
ము కుదరదని వదలివేయవలెను జగన్మాతయగు ప్రకృతి
కాస్త సావకాశము దొరికిననూ అంతరవయవముల బాగు
చేయుటకే సదా ప్రయత్నించుచుండును ఇటువంటి రోగముల
లో కేవలము మానసిక కల్లోలములను సరిచేసినంతమాత్ర
ముననే రోగము కుదురుననుకొనుట భ్రమ ప్రకృతి వైద్యము

నకు వచ్చునప్పటికే అన్ని మందులును సేవించియే ఉంటారు ఏమీ ఉపయోగముండదు రోగము కుదరక పోవుటకు నమ్మకము లేక పోవుట, మానసిక కల్లోల ముండుట రోగి చుట్టు ప్రక్కలనుండు వాతావరణము సరిగా లేకపోవుట కారణముగా నున్నవి

మా ఆసుపత్రికి వచ్చి నయమైన కేసులలో రోగులు చాలామంది ఇదివఱకుకూడా ఈ పద్ధతులనే అవలంబించినామని కాని గుణముకనపడ లేదనియు చెప్పేవారు కాని మాకు తోచిన సమాధాన మేమంటే ఇంతవరదాకా భగవంతుడు వచ్చి వీరి రోగముల కుదురుస్తాడని వీరు నమ్మేవారు తమ జీవన పద్ధతులలోమార్పురానిది తమరోగములు కుదరవని నమ్మకములేక పోయెడిది అందువలననే వీరి రోగము కుదుర లేదు ఆహారమువలనరోగము కుదురునను స్వల్పజ్ఞానమ యినా లేకపోవుటచే ఆధ్యాత్మికవాదులు తేలికగా రోగములుకుదుర్చుచున్నారని ప్రజలు భ్రమపడుచున్నారు ఆధ్యాత్మికవాదులు కాలికరోగముల కుదుర్చుటనుగూర్చి "ప్రొఫెసర్ మర్ట్టర్ బర్గమెక్లూర్ పత్రికలో ఇట్లా వ్రాశాడు" "కష్టసాధ్యములగు కాలికరోగములనూటిని ఆధ్యాత్మిక వాదులు నయము చేసినామని చెప్పుచున్నారు వీరందరను నేను స్వయముగా పరీక్ష చేసినాను ఈ నూటిలోనూ 92 సులభ సాధ్యములు 8 మాత్రమే కష్టసాధ్యములు ఈ మాటలలో అపనమ్మకమేమియులేదని సత్యములని''గట్టిగా చెప్పుచున్నాను

# 33

# వివేచన

ప్రకృతి-పత్రికలో నేను వ్రాసిన వ్యాసములచూచి మా మిత్రుడు సమాధానము వ్రాశాడు ఆ ఉత్తరములోని భాగమునే వ్రాయుచున్నాను మీరు ఒకప్పుడు స్వశక్తి మీదనే ఆధార పడవలె నంటారు మరొకప్పుడు విశ్వశక్తి మీద ఆధార పడమంటారు ఈ అభిప్రాయములు రెండునూ విరుద్ధములుగా కనపడుచున్నవి ఈ రెంటిలో యుక్తమేది? మనము స్వశక్తి మీదనే ఆధార పడవలెనా? విశ్వశక్తిమీద ఆధార పడవలెనా? ఈ రెండిటిలోను నాకేమీ విరుద్ధము కనపడుట లేదు భౌతిక ఆధ్యాత్మిక పద్ధతులతో బాధల నివారణ చేయవలెనంటే ప్రకృతి వైద్యతత్వ దృష్టిలో విరుద్ధమేమియు లేదు ఒకేతడవ ఈ రెండింటిని నమ్మవచ్చును ఆ రెంటిమీదనూ ఆధార పడవచ్చును యుక్తా యుక్తముల విచారణ చేయుటకు స్వశక్తిని బుద్ధి సూక్ష్మమునే ప్రధానముగా తీసుకొనవలయును ఇట్లాగని సర్వభూతకోటిలో గర్భితముగా నున్నట్టిన్ని విశ్వమంతటా వ్యాపించిన విశ్వశక్తిలో నమ్మకము పోగొట్టుకొనమని కాదు ప్రార్థన చేయవద్దని కాదు ఇవన్నీ పుక్కిటి పురాణ కబుర్లు కాదు శాస్త్ర సమ్మతముగా కనబడుచున్నవి శరీర నిర్మాణ శాస్త్రము ననుసరించిగాని శరీర ధర్మశాస్త్రము ననుసరించిగాని చూస్తే పైవిషయములు నిజములుగానే కనబడును ఇవన్నీ హేతువాదము సహజ స్ఫురణముమీదనే ఆధార పడుట లేదు దేహములో జరుగు

ఆంతర బహిర క్రియలన్నియు రెండు నాడీ మండలములమీద ఆధార పడును అందులో (మెదడు మజ్జామండలము) మొదటిది స్వతంత్ర నాడీమండలము రెండవది దేహములోని ఏ మారుమూల అవయవమునకుగాని కణమునకుగాని కావలసిన ధాతుశక్తి మొదటి నాడీమండలము ద్వారానే వచ్చును ఈ ధాతుశక్తి ఎక్కడ పుట్టినదీ ఎట్లా పుట్టినదీ ఏ రూపములో నుండేది మనము చెప్పలేము. దీనినే ప్రాణశక్తి అనియు భగవంతుడనియు ప్రకృతి అనియు వేరు వేరు నామములతో పిలుస్తారు

హృదయ స్పందనమునకును, రక్త ప్రవాహమునకును, చెమట పోయుటకును, జీర్ణక్రియ జరుగుటకును, తినిన ఆహారము జీర్ణ మగుటకును బహిష్కరణక్రియలు జరుగుటకును, దేహములో జరుగు అనిచ్ఛా క్రియల కన్నిటికిని మొదటి నాడీమండలమే కారణము ఈ క్రియలను అదుపులో ఉంచునట్టి ప్రాణశక్తి ఏరూపములో నుండునదీ చెప్పలేము అన్ని శక్తుల కన్ననూ ఈ శక్తి గొప్పదని మాత్రము చెప్పవచ్చును

శరీర నిర్మాణ శాస్త్రము శరీర ధర్మశాస్త్రమును, సమస్త త్వ శాస్త్రమును చదివిన కొలదినీ సృష్టిలోని మహత్తర శక్తులు మనకు సుబోధకమౌళగును ప్రతి క్షణమునూ మన దేహములో యాంత్రిక మైనట్టేన్ని రసాయనిక మైనట్టిన్ని మనస్తత్వ శాస్త్రమునకు సంబంధించినట్టిన్ని వింతలు జరుగుచునే యుండును ఈ వింతలు

ఎవరు ఒయపునదీ ఎట్లు జరుపునది మనకు తెలియదు మన బ్రతుకునకు ఈ ప్రాణశక్తియే మూలము

సర్వశక్తి సంపన్నమైన ఈప్రాణశక్తిని నమ్ముకొనుటలో ఆశ్చర్యమేమిన్ని లేదు ఈప్రాణశక్తి చేయలేనిపని ఏమున్నది?

నిగ్రహము మీదనే సర్వ శక్తులును ఆధార పడును దీని పనులన్నీ అనిచ్ఛా పూర్వకములుకావు మానవునిలో వివేచనశక్తియుండి మంచి చెడులను నిర్ణయించు చుండును తన బుద్ధిసూక్ష్మము నుపయోగించి మంచి చెడులను తెలిసి కొన గలడు మెదడులో కొన్ని నాడీకేంద్రములు కలవు ఇచ్ఛాపూర్వకములైన క్రియల నన్నిటినీ ఈ నాడీ కేంద్రములే అదుపులోనుంచను దేహములోని ప్రకృతి తన ఆజ్ఞలను నాడీకేంద్రముల నుండి సన్నని కేశనాళికల ద్వారా ఇచ్ఛా కండరములకు అందచేయును ఆ ఆజ్ఞ ననుసరించియే కొన్ని కండరములు నడచుట కుపయోగించును నవ్వుటకు కొన్ని ఉపయోగించును వినుటకు మాట్లాడుటకు వేరు వేరు కండర ములుగలవు

స్వశక్తినే వృద్ధిచేసుకొన్నట్లయితే మానవుడు చేయలేని పనియే లేదు

ఈ ఒక్క విషయములోనే జంతువునకును మానవు నకును, భేదా ఉన్నది జంతువుపుట్టిన కొద్దిసేపైన తర్వాతనే, తననుగూర్చి శ్రద్ధ తీసికొన గలుగుచున్నది జంతువు తన సహజ పరిజ్ఞానమును, ఏండ్లుగడచిన కొలదినీ వృద్ధిచేసుకొను

చున్నది, కొన్ని సంవత్సరములు జరిగిన తరువాతగాని, దేహ క్రియలను అదుపులో నుంచుకొనలేదు

అప్పుడేపుట్టిన శిశువునకు గ్రహణశక్తి, ఆహారము స్వీకరించుశక్తియు, ఈ రెండుమాత్రమే ఉండును జన్మించిన తరువాత మిగిలిన పనులుచేయుటకు ముందు తనమనస్సును విశాలపరచుకొనును దీనితరువాతనే మిగిలిన యిచ్ఛాశక్తులు వృద్ధియగును

ఈ స్వశక్తిలోను వివేచన, బుద్ధిసూక్ష్మము, పనిచేయును కాలము గడచినకొలదినీ బుద్ధి సునిశితమగును తనకు కావలసిన పనులుచక్కబెట్టుకొనువఱకే, జంతువు తనశక్తిని వృద్ధిపరచు కొనగలదు అంతకుమించి దానిబుద్ధిపోదు మిగిలిన సంగతులన్నీ యేమైపోయినప్పటికీనీ దానికేమియూ చీకూ చింతాలేదు

జంతువునకునూ, మానవునకునూ, వివేచన లోనే తేడాగలదు జంతువుల బుద్ధిసూక్ష్మము పెరుగుటకు అవకాశములేదు వ్యాప్తిపొందుటకు సావకాశములేదు మానవుని బుద్ధి అంతము లేకుండా పెరిగిపోవుటకు సావకాశములు గలవు. దైహిక, మానసిక, నైతిక, ఆత్మీయ శక్తులను వృద్ధిపరచుకొనుటకు సావకాశములుగలవు

ఉత్తమజీవన పద్ధతుల వలననూ, బుద్ధిసూక్ష్మమును వృద్ధి చేసుకొనుట వలననూ, తాను అనుభవింపబోవు ఫలములకు తానే కర్తయగుచున్నాడు

పైనచెప్పబడినదానినిబట్టి చూస్తే మానవునిలోనే స్వశక్తి విశ్వశక్తి అను రెండుశక్తులునూ, ఉన్నట్లు మనకు ద్యోతకమగుచున్నది ఈ రెండుశక్తులునూ మనకు అవసరమే ఒక విషయమునుగూర్చి ఊహించుటయు,ఆలోచించుటయు, (ఆత్మ) స్వశక్తివంతు ఈ పనుల నిర్వహించుట మాత్రము, విశ్వశక్తివంతు విశ్వశక్తి నుండి శక్తివచ్చుటచేతనే మన మా పనుల నిర్వహించు చున్నాము

---

## ౩౪

# జీ వి త ము

మానవ జీవితమనే నాటకరంగములో ప్రత్యేకవ్యక్తులగు మనమందరమును పాత్రధారులము మానవులందరిలో నున్నా ఒక సామాన్య సూత్రమున్నది వీరందరిలో నున్నా, ఏకత్వమున్నది ప్రకృతిసూత్రముల చదువుకొని విశ్వప్రకృతిలో లీనమగునట్లు మన జీవితములను కూడా నడుపుకొనవలెను దేహమునుసరియైనస్థితిలో ఉంచవలెనంటే, యేరోజునకారోజు, శుద్ధిచేసుకొనుచుండవలెను మలినములు బైటకు పోవునట్లు చేయవలయును యుక్తమగు ఆహారము, దేహమునకును,కరణములకును, అందచేయవలయును స్వరశాస్త్రములో ఎంత ప్రవీణుడైనప్పటికినీ వీణ సరిగా లేక పోతే శ్రావ్యమైన కీర్తనల పాడ

లేదు మంచిసంగీతము రావలెనంటే, వీణెనుకూడా సరియైన పరిస్థితిలో నుంచవలెను దుమ్ము పేరుకో నీయరాదు

వీణెకు సంబంధించిన అన్ని అవయవములను వాటి ఉపయోగమును, వాటినెట్లు శుభ్రముగానుంచవలసినదియు తెలిసికొనవలెను

ఈఖగోళములోని పదార్థమంతా, అణువుల సమూహామే అణువుల స్పందనమువలననే మనకు భౌతిక పదార్థమంతాగోచరించుచుండును

ఈ అణువుల స్పందనమునకు అనుకూలముగానుండునది, నిర్మాణశక్తి అనబడును ఈ అణువుల స్పందనమునకు, వ్యతిరేకముగానుండునది విచ్ఛిన్నశక్తి మానవ దేహములో ప్రాణమున్నంతవఱకునూ, అణువులస్పందనము కూడ, విశ్వములోని అణువుల స్పందనమునకు అనుకూలముగా నుండును అనుకూలముగా లేనప్పుడు ప్రాణముపోయినట్లే భావించవలెను మానవ దేహములోని అణువుల స్పందనము విశ్వములోని అణువుల స్పందనముతో అనుకూలముగా నున్నప్పటికీ, మార్పు లేక పోవుటవలన విసుగెత్తును అందువలన మృత్యువుకూడా, వాంఛనీయముఅగుచున్నది సంగీతవిద్వాంసుడు స్వరశాస్త్రమునకు అనుకూలముగా తనవీణెనెట్లు సరిచేయునో, అట్లనే ప్రకృతి చికిత్సకుడు, పాంచభౌతికమైన, శరీరములోని లోపములను ప్రకృతిశాస్త్రమునకు అనుకూలముగా సరిచేయును కొయ్యలోని అణువులకును, తీగెలోని అణువులకును, ప్రత్యేక స్పందనములుగలవు వీణెనుండిపుట్టుధ్వనులును, అణువుల సమూహా

ములే ఈఅణువుల స్పందనముమాత్రము వేరు ఈఅణువులన్నీ, రసాయనికముగాను, యాంత్రికముగాను, సరి అయినపాళ్లలో ఉండవలెను దేహమును అతిసున్నితముగా నుంచవలెను దేహము ఆరోగ్యముగానూ అందముగాను ఉండవలెనంటే పై లక్షణములు పూర్తి అయినప్పుడే సంపూర్ణ ఫలములపొందగలము

ప్రకృతి సూత్రముల తెలిసిగాని, తెలియకగాని నిర్లక్ష్యము చేసినయెడల ఆ పాపఫలితములను, మనమేగాక, రాబోవు తరముల వారు కూడా అనుభవించవలెను

రోగము, పాపము, బాధ, మొదలగునవన్నీ కూడా, మనము తెలిసియు, తెలియకయు, చేసిన వక్రమార్గముల ఫలితములే పాపములకు భగవంతుని, దూషించుట తెలివిహీనము ప్రకృతి సూత్రములకు వ్యతిరేకముగా నడచినంత వఱకూ, యీ పాపఫలితముల ననుభవింప వలసినదే ఈ పాపములు తొలగిపోవాలంటే ప్రకృతి సూత్రములకు అనుగుణముగా నడచుటకన్న మరొక మార్గము లేదు

---

# త్రివిధ రంగములు

మానవుడు ఆరోగ్యముగా ఉండాలంటే యీ మూడు రకములలోను సామరస్యముండాలి ఒద్దికఉండాలి వీటి సామరస్యమే ఆరోగ్యము

| త్రివిధ రంగములు | మానవునిలోని మూడు రంగములు | సామ్యము |
|---|---|---|
| ఆధ్యాత్మిక | ఆత్మ | స్వరశాస్త్రము |
| మానసిక | మనస్సు | పాటకుడు |
| శారీరక | దేహము | వస్తువు (వీణె) |

ఈ పయి పట్టికవలన మానవునిలోని వివిధ రంగములును, ఆయా రంగములలో మార్పు వచ్చుటవలన మానవునిలో కలుగు లోపాలునూ, వాటి సాదృశ్యములును కనబడును

మానవునకు ఈ మూడు విభాగములలో ఏ ఒకటి చెడిపోయిననూ జబ్బుచేయవచ్చును

మూడు విభాగములునూ చెడిపోవచ్చు సరియైన వైద్యుడు ఏ విభాగములో లోపమున్నదో గ్రహించి ప్రధా

నముగా ఆ భాగమునకును, కొద్దిగనో గొప్పగనో, మిగిలిన భాగములకునూ, వైద్యముచేయును కేవలము భౌతికశాస్త్రమునే నమ్మిన వైద్యవరేణ్యులు భౌతికదేహములోని లోపములనే కనుగొని, వాటిని, సరిచేయుటకే ప్రయత్నించును వారికి మిగిలిన భాగములలో వచ్చిన లోపములు అంత ప్రధానములుగావు మిగిలిన రెండుభాగములలోను వచ్చుమార్పులు ఏదో వచ్చిపోవునవేగాని, అంత ప్రధానములు గావంటారు ఆత్మీయ నైతికశక్తులను నమ్మినవారిని, భౌతికవాదులు హేళన చేస్తారు సంగీతము పాడుటకే వీణ ఉపయోగించాలి అందువలన వీణెలోని అన్నిభాగములును, బాగుగా నుండుటకు, శ్రద్ధతీసుకోవాలి శాస్త్రము, స్వరసూత్రములు రెండునూ ఊహా కల్పితములు గుడ్డినమ్మకములే, అను సంగీత శాస్త్రజ్ఞునెంత గౌరవిస్తామో భౌతికశాస్త్రవేత్తను కూడా అంతే గౌరవిస్తాము।

మంత్రశాస్త్రవేత్తలూ, ఆధ్యాత్మికవాదులూ, అమాయకులునూ, కేవలము మానసిక ఆత్మీయశక్తులను, సమానముగానే భావిస్తున్నారుగాని, దైహిక వాంఛలతో వీరికి ప్రసక్తియే లేదు మరికొందరు, భౌతికదేహము ఉన్నదను మాటనే మరచిపోతారు

ఆధ్యాత్మికవాదు లెటువంటివారంటే వీణెలోని సంగీతములో మాధుర్యమునే ప్రధానముగా భావించి వీణెను నిర్లక్ష్యముచేయువారు వీణెలో మనస్సు దుమ్ము పేరుకొంటే వీరి కేమియు అవసరములేదు ఆ దుమ్మును తీసివేయ వలెనను

అభిప్రాయమే వారికి కలుగదు వీణెలో దుమ్ము పేరుకొనుట వలన స్వరములన్నియు, వివరముగా పలుకవు శాస్త్రము వీరికి బాగుగా తెలిసి ఉండవచ్చునుగాని, అనుభవము లేనిది మాత్రము ఏమినీ ఉపయోగములేదు

బుద్ధిఅనే పాటకుడు, ఆత్మ అనే స్వరశాస్త్రమును, దేహమనే వీణెద్వారా యెప్పుడుపాడునో, అప్పుడే, జీవితము లోని పరమార్థమును, గ్రహించగలడు పై లక్షణముల సము న్వాయము చేసికొనినపుడే పాటకుడు, దోషరహితుడగును పాట స్వచ్ఛముగా నుండును

పైన చెప్పినవిధముగనే ప్రకృతి చికిత్సకుడును, రోగ కారణమును, తెలుసుకొని దైహిక, మానసిక, నైతిక శక్తుల మూడింటికిని, వైద్యము చేయవలెను

ఈ అభిప్రాయమునే మనస్సులో ఉంచుకునే మన పెద్దలు, వైద్యునకు, మతబోధయు, మతబోధకునకు వైద్యమును తప్పక తెలిసిఉండవలె నన్నారు ఈ లక్ష్యముల సాధించునదే విజ్ఞానము, నాగరికత యగునుగాని యీ ప్రధాన సూత్రము లనే మృగ్యము చేసినది విజ్ఞానముకాదు నాగరికతయు కాదు దేహము ఆరోగ్యముగా లేనియెడల మిగిలిన శక్తు లున్నూ, కొద్దిగనో గొప్పగనో కుంటుపడి పోవును ఈ పునాది సరిగా లేనిది, మిగిలిన భవనము నిలవదు పడిపోవును పునాది పైననే అంతస్థుల వేయవలెనుగాని, అంతస్థులు వేసినతర్వాత పునాది కట్టుట, యెక్కడనూ చూడలేదు, విననూలేదు. పైఅంతస్థులు సర్వకాలమూ నిలబడవలెనంటె, పునాది గట్టిగా

నుండవలెను దైహికవాంఛలను, నిర్లక్ష్యముచేసి మానసిక ఆధ్యాత్మిక బలములను వృద్ధిపరచినవారు, శల్యావశిష్టులుగా నుండుట మనము నిరంతరమూ చూచుచునే ఉన్నాము, దైహిక వాంఛలను, తృప్తిపరచకపోవుట చేతనే వీరి దేహారోగ్యము పూర్తిగా నశించిపోయి అకాల మృత్యువు వాతబడు చున్నారు ఎటువంటి రోగములనైననూ, నయముచేయ గలిగి చనిపోయినవారినైననూ, బ్రతికించ గలిగినవారే శాస్త్రజ్ఞులని చాలామంది భ్రమపడుచున్నారు ఈ పనికి ఉపయోగించు శాస్త్రమును చదువుకొనినంత మాత్రముననే ప్రకృతి సూత్రములన్నియు వారికి, కరతలామలకము లగునని, వారనుకొను చున్నారు తమ తెలివి తేటల నన్నిటినీ అందులకే ఉపయోగించుచున్నారు

అరహస్య శాస్త్రమును చదువుకొని, ప్రకృతి సూత్రముల తెలిసికొనవలసిన పని లేకుండా, చనిపోయిన వారి నందఱనూ బ్రతికించుటయే, సాధ్యమైనయెడల కార్య కారణముల ప్రసక్తియే లేదు తప్పుచేసినందుకు శిక్ష ననుభవించ వలసినపని లేదు వీరివాదనే నిజమైతే సృష్టియొక్క మూలసూత్రములకే మోసము వచ్చుచున్నది ఒకరినైననూ, చనిపోయినవారిని బ్రతికించుట సాధ్యమయిన యెడల చావులేకుండానే చేయవచ్చును అట్లాగయితే మనమందరమూ యిష్టమువచ్చినట్లు తినవచ్చును కుడువ వచ్చును స్వైర విహారముల చేయవచ్చును బాధలు కలిగినప్పుడు ఆ శాస్త్రజ్ఞుల దగ్గరకుపోయి నియమ నిగ్రహముతో పని లేకుండా, రోగముల కుదుర్చు

కొనవచ్చును నొప్పిపుట్టు పన్నును దంతవైద్యుడు ఎంత తేలికగా తీసివేయునో, ఆశాస్త్రజ్ఞుడును మన బాధల అంత సునాయాసముగా తీసివేయును

పైఅభిప్రాయముల చెప్పుటచేత మాకు ప్రార్థనలలో నమ్మకము లేదని, మాచదువరులు తలంచకుందురుగాక నమ్మకము వలననే రోగములు కుదురుననుటలోనూ మాకు గట్టినమ్మకముగలదు భగవంతుడుగాని, ప్రకృతిగాని, మతోద్ధారకుడుగాని,ఆధ్యాత్మికతత్త్వవేత్తగాని,గారడీతో రోగముల కుదుర్చుననుటలో మాకెట్టినమ్మకమును లేదు మానవులు జాతి నియమముల అతిక్రమించుటవలన కలిగిన శిక్షల అనుభవించకుండా పైమంత్రివేత్తలు,చేయుదురనుటలో మాకెట్టి విశ్వాసమును లేదు

గారడీతోనే రోగములు కుదిరితే యీవిద్య అందరకును అందుబాటులోనే ఉన్న యెడల నియమ నిగ్రహాములతో పనియేలేదు ఆత్మశక్తితో అవసరములేదు నిర్మాణశక్తిజోలికి పోవ పనిలేదు

మానవునకు గల దైహిక, మానసిక, ఆత్మీయ వాంఛలను తృప్తిపరుచుకొనవలసినయెడల ప్రకృతిసూత్రముల విధిగా అనుసరించవలెను

దైహికారోగ్యము, మానసికారోగ్యము రెండునూ స్వయంకృతములేగాని, ఆగంతుకముగా వచ్చునవిగావు మన దైహిక మానసిక ఆరోగ్యముల రెంటికినీ మనమే జవాబుదారులము మనసంతతికి వంశానుగతముగా కలుగు ఆరోగ్యము

నకును, రోగములకును, భౌతికముగాను, నైతికముగాను, మనమే జవాబుదారులము మనము ఆరోగ్యముగా నున్న యెడల, మన సంతతికూడా, ఆరోగ్యముగానే ఉందురు మనము రోగిష్టి బొమ్మలమైతే మనసంతానమునూ విధిగా ఆరోగ్యహీను లగుదురు

మానసిక ఔన్నత్యముకొఱకునూ, నైతిక ఔన్నత్యము కొఱకునూ, మనము విధిగా ప్రయత్నము చేయవలెను అట్లనే ప్రకృతిసూత్రముల ననుసరించి, దైహిక ఆరోగ్యముకొఱకునూ విధిగా ప్రయత్నము చేయవలెను విశ్వమంతా, విశ్వశక్తి వ్యాపించిఉన్నది దీనినే భగవంతుడు, ప్రకృతి యని అనేక పేర్లతో పిలుస్తారు సూర్యచంద్రుంనుండియు నక్షత్రముంనుండియు వెలుతురు ప్రవహించుచున్నట్లు విశ్వవ్యాప్తమైన విశ్వశక్తి నుండ సకల చరాచర జీవకోటికిని ప్రాణశక్తి లభించుచున్నది

## ౩౮
## మనోచికిత్స

మనోశాస్త్రము ననుసరించిన్ని మానసిక ఆత్మీయశక్తులతో రోగము నయముచేయవలెనను శాస్త్రము ననుసరించిన్ని చెప్పవలెనంటే, దైహికవాంఛలన్ని మనస్సునకులోబడియే ఉండవలెను భౌతిక దేహమున కంతకును మనస్సే ఆధారము

అనగా ఒక భావము భౌతికముగా ద్యోతక మగుటకుముందు మానసికముగా, అనుభూతినిపొందవలెను ఆలోచన మనస్సులో కలుగుటకుముందు ఆత్మయందు కలుగును ఆత్మ ప్రేరేపితమైన తెలివితేటలద్వారా మనస్సు ఆపనిని చేయుచుండును ఈఆత్మకు ప్రేరేపణ, విశ్వవ్యాప్తమైన విశ్వశక్తినుండి వచ్చును విశ్వములోని సకల చరాచర జీవకోటిలోని చైతన్యమునకును ఆత్మకును సంబంధమున్నది

ఈ క్రమము తప్పినయెడల రోగమువచ్చును చాలా మంది, భౌతిక దేహమే ప్రధానమైనదనియు, మిగిలినవాటితో సంబంధములేదనియు తలతురు ఈ భౌతిక దేహమునకు అంతు లేని ప్రాముఖ్యము నిచ్చిదాసులై పోతున్నారు

మానవుడు సంపూర్ణత్వమును పొందవలెనంటే మిగిలిన ధర్మముల కన్నిటికిని తగు గౌరవము నీయవలెను మిగిలిన రెండు శక్తుల సామర్థ్యమును తెలిసికొనినయెడల, భౌతిక దేహము వాటితో సమానమైన తెలివితేటలుగలది కాదు కాని నేటి మానవులందరును, భౌతిక దేహమునే ప్రధానముగా భావించి దీనిఅదుపు ఆజ్ఞలలోనే మనస్సును ఆత్మను బంధించుచున్నారు ఇంటిలోని సేవకులందరును యజమానిమీాదనే పెత్తనము చేసినయెడల, ఇంటివ్యవహారములు ఎంతచక్కగానుండునో, అట్లనే భౌతిక దేహము, మనస్సును, ఆత్మను అదుపులో నుంచిన యెడల శృతి మించి పోవును

దేహము అనారోగ్యముగా నున్నపుడు బుద్ధిసూక్ష్మ ముకూడా కుంటుపడిపోవును విచక్షణపోవును నిగ్రహ

ముండదు మనస్సులో కలిగిన ప్రతిభావము, ప్రళ యును, దైహికముగా ప్రత్యక్షమవును మనస్సులో కలిగిన కలత వల్లనే భౌతికముగా రోగము వచ్చుచున్నది నమ్మకము, విశ్వాసము, ఉత్సాహము, సంతోషము, మొదలగు గుణముల వలన ఆరోగ్యము కలుగును వీణెలోని తీగెలన్నియు సరిగా నున్న యెడల స్వరములు స్వచ్ఛముగా నుండును పాటయు శ్రావ్యముగా నుండును అట్లనే సంతోషకరమైన తలంపులు కలుగగనే దేహములోని అణువులును, కణములును అనుకూలముగా స్పందించుటచేత, ఆరోగ్యముగా ఉండును వీటి వైరుధ్యమే రోగము ఈ క్రింది ఉదాహరణము వలన పై విషయము బాగుగా విశదము కాగలదు ఒకే రకమైన రెండు వీణెలను, ఇద్దరు కొనుక్కొని వెళ్ళిరి అప్పుడు రెండువీణెలును, శ్రావ్యముగా పాడుచవేను ఒకదానిని స్వరశాస్త్రి పండితుడు వాడినాడు ఈ పండితుడు దాని పుట్టుపూర్వోత్తరములు తెలిసిన వాడగుటచే వీణెను శుభ్రపరచి శ్రావ్యమైన సంగీతమును పాడుకొనుచుండెను రెండవది ప్రారంభకుడు ఉపయోగించుటచే వానికి దాని పుట్టు పూర్వోత్తరములే తెలియక పోవుటచే ఎడా పెడా వాడుటచే దానిలోని తీగెలన్నియు, తెగిపోయినవి ఉన్న తీగెలయినను అపస్వరముల వినిపించుచున్నవి కొద్దికాలము జరిగిన తర్వాత ఈ రెండు వీణెలను పరిక్ష చేసినయెడల ప్రారంభకుడు ఉపయోగించిన వీణె చెడపోయినట్లును మొదటిది బాగుగా ఉన్నట్లును, మనమే, తెలుసుకొంటాము ఒకేమనిషి ఒకేవస్తువుతో రెండు పని

అనగా ఒక మాత్ర తయారుచేసినప్పటికినీ, వాడుకొనువారి యోగ్యతను బట్టి చెడిపోయినవి ఆవస్తువులోని అణువులన్నియు అపకృతికి అనుకూలముగా కలిసిపోయినవి ప్రాణరహితమైన కొయ్యలోనే అణువులు ఇట్లు ఏర్పడుట సాధ్యమైనపుడు, సజీవమైన మానవదేహములోని అణువులు, ఆరోగ్యవంతముగాను, అనారోగ్యముగాను, ఉండునంటే మనకేమీ ఆశ్చర్యము రాదు శాస్త్రీయత్వము స్వరశాస్త్రమునకు ఎంత అవసరమో అట్లనే నమ్మకము, విశ్వాసము, సంతోషము, ప్రేమ మొదలగునవన్నియు మానవునకు అవసరమైనవి ఈ ఉద్రేకములన్నియు ప్రకృతిలోని నిర్మాణశక్తికి అనుకూలముగా నున్న వేను పై లక్షణములన్నియు నరములలోని బిరుసుతనమును తగ్గించి ప్రాణశక్తి దేహమంతటా ప్రవహించుటకు అనుకూలపడును సంతోషముతో నున్నవారి దేహమంతటా ప్రాణశక్తులు ప్రవహించుచుండును స్వార్థపరునిలో ప్రాణశక్తులు దేహమంతటా సరిగా ప్రవహించవు

మనసులో కలిగిన భావములవలన దేహములో రసాయనికముగా ఏమిమార్పులువచ్చునదియు, ఎన్నికణములు నాశనమగునదియు, నరములలో మంటలెట్లు కలుగునదియు, లోగడనే చెప్పినాము భయము, కోపము, దిగులు, అసూయలవలన రక్తమెంత కలుషితమగునదియు లోగడనే చదివినాము పిచ్చికుక్క కరచినప్పుడు ఎంతబాధకలుగునో కోపమువచ్చిన మనిషికరచినను అంతబాధ కలుగును తల్లికికోపమువచ్చినప్పుడు ఇచ్చినపాలవలన పిల్లలకు ఎంతేని హానికలుగును ప్రాణమునకుకూడా మోసము రావచ్చును

విచ్ఛిన్నకరములగు ఉద్రేకములవలన ఊరురసములలోనున్నూ, దేహామునుండి వెలువడు క్షణములు త్రాదులలోనున్నూ రోగపదార్థము ఎక్కువగానుండును పైత్రిజ్ఞ పాశ్రియములన్నియు ప్రయోగశాలలో మనస్తత్వమునుగూర్చి శాస్త్రసమ్మతముగా చేసిన పరిశోధనల ఫలితములేగాని, పుక్కిటి పురాణములుగావు భయము, కోపము, దిగులు, వలన కణములు ముణగతీసుకొనిపోవును కొన్ని విచ్ఛిన్నమగును నరములు సరిగాఉండకపోవుటచే నాడీశక్తి సరిగా ప్రవహించదు. కేశనాళికలలోనుండి రక్తమును, సరిగా ప్రవహించదు రక్త ప్రవాహము, నాడీప్రవాహమున్నూ హెచ్చుతక్కువలుగానే ఉండును కోపముఎక్కువగా నున్నవారున్నూ, చలిచే బిగదీసు కుని పోవువారున్నూ, పైశిమాత్రము ఒకేరీతిగా నుంటారు ఉభయత్రాకూడా నరములు బిగదీసుకొని పోవుటవలననే మృత్యువుసంభవించును దిగులుతో బాధపడుదురేగాని పెంద లకడ చనిపోరు భయమెక్కువగా నున్నవారు పెందలకడనే చనిపోదురు దిగులుఅలవాటైనప్పుడు ప్రాణశక్తి దేహమంతటా సరిగాప్రవహించదు రోగనిరోధకశక్తి తగ్గిపోవును అందువలన ఆరోగ్యముచెడిపోయి రోగమువచ్చును

మనస్సునుండి కణములకు నిరంతరము ఆదేశములు వచ్చుచుండును ఈ ఆదేశములలోని యుక్తాయుక్తములనుగాని, సత్యాసత్యములనుగాని, కణములేమియు విచారణచేయవు ఈ ఆదేశముల నెరవేర్చుటయే వాటిపని జీర్ణకోశము తనపనిని సరిగాచేయుటలేదని, నిరంతరము ఆలోచించుచున్నయెడల,

అనగా ఒక
మానస్థా తన సరిగా లేనప్పుడు వచ్చువ్యాధులన్ని మనోవీధిని బట్టి కొచును ఆ వ్యాధులుకలుగునని తోచినప్పుడే భయము ంలుగును భయమునకు సంబంధించిన తరంగములు జీర్ణకోశ ములోని కణములకు తగులును ఆ తలంపులే నిరంతరము వచ్చు చుండుటచే కణములు స్వధర్మమును నిర్వహించలేవు అందు వలననే రోగులు, ఆ రోగ్యవంతుల జీర్ణావయవములలోని క్రిమి చలనము మొదలగు ధర్మముల తెలిసికొన వాటినిగూర్చియే నిరంతరమును, మననము చేయుచుండుటచే చెడ్డతలంపు లేమియురావు తమ జీర్ణయంత్రములునూ బాగుపడును

ఈక్రింద చెప్పబోవుదానివలన రోగము భౌతికముగా నయమగుటకుముందు, మనస్సులో నెట్లుమార్పు కలుగునదీ తెలియును కణములు ఆరోగ్యవంతములగుటకుముందు మన స్సులో మార్పు రావలయును ఆతలంపులకు సంబంధించిన తరంగములు కణములకు చేరుటచే కణములు ఆరోగ్యవంతము లగును

మానవదేహము అనేకకోట్ల కణముల సమూహము అగుటవలన కణములు ఆరోగ్యముగాలేనిది దేహము ఆరోగ్య ముగా నుండదు ఈకణములను భౌతికనేత్రములతో మనము చూడలేము సూక్ష్మదర్శినీ యంత్రము ఈకణమును అనేక వందల రెట్లుపెంచితేనే గాని మనముచూడలేము ఇంతచిన్న వైనప్పటికినీ, మానవదేహమునకు ఏ లక్షణములు గలవో కణమునకును ఆలక్షణములు గలవు ఈకణములునూ వృద్ధి పొందును ఆహారము జీర్ణించుకొనును పునర్ నిర్మాణము

జేయుటయు, నాశనమగుటయు వీటిధర్మములే కొన్నికణములు కలిసి అవయవముంగును ఒక నగరములోని వివిధ ప్రజలు వివిధపనుల చేయునట్లు కణములును, వివిధపనుల చేయుచుం డును కొన్నికణములు ఆహారపదార్థముల అందచేయును మరికొన్ని కణములు ఎప్పటికప్పుడు దేహములో తయారగు మురుగును బహిష్కార్యావయవముల దరిని చేర్చుచుండును ఇంకాకొన్నికణములు దేహమునకు కావలసిన రసాయినిక పదార్థములను అందుకై నిర్మించిన యంత్రాగారములలో తయారుచేయును

ఈకణములు చేయుపనినిబట్టి వీటిలో కొంతప్రత్యేక వ్యక్తిత్వమున్నదని చెప్పవలెను మనసహాయము లేకుండానే మనకు తెలియకుండానూ యీకణములు వాటిపనులు అవిచేసు కొని పోవుచుండును ఇంతేపని జరుపునప్పటికినీ యీకణము లన్నియు మనస్సుయొక్క అదుపు ఆజ్ఞలలోనే ఉండును ఈపనికంతకునూ స్వతంత్రనాడీమండలముతో సంబంధమున్నట్లు కనబడినప్పటికినీ ప్రధాన కేంద్రములతోనూ మనస్సుతోనూ యీ కణములన్నిటికినీ ప్రత్యక్ష సంబంధముండును మన స్సులో కలిగిన ప్రతి చిన్నమార్పు, కణములకు తెలియుచునే యుండును మనస్సు కల్లోలముగానున్న యెడల, కణములన్నీ స్వస్థతచెడియే ఉండును స్వస్థతచెడుటవలన స్వధర్మము నిర్వహించలేవు కణములన్నిటినీ సైన్యములోనియుద్ధవీరులకు పోల్పవచ్చును మనస్సుమాత్రము సేనాధిపతి సైన్యములోని పటాలములట్లుకణములును, మానవదేహములోని అవయవము

లుగా తయారగును వివిధపటాలములు వివిధపనులు చేయునట్లు, దేహములోని వివిధ అవయవములు వాటిపనులు చేయు చుండును ఏపటాలమునకు ఆపటాలము సంబంధము లేకుండా ఉన్నట్లు, పైకికనపడినప్పటికినీ, వీటి అన్నింటికినీ సంబంధ మున్నది ఇవన్నియు సేనాపతి ఆజ్ఞలోనే ఉండును మనము మేలు కొన్నప్పటికినీ, నిద్రపోవునప్పటికినీ మనకు ఏమి తెలియ కుండానే రక్త ప్రసరణము, జీర్ణక్రియబహిష్కరణ క్రియలునూ జరిగి పోవుచుండును ఈ క్రియలనన్నిటినీ స్వతంత్రనాడీ మండలము ప్రేరేపించుచుండును ఇచ్ఛాపూర్వకముగా జరుగు క్రియలనన్నిటినీ, మెదడు మజ్జామండలము అదుపులో నుంచును స్వతంత్రనాడీ మండలము, మెదడు మజ్జామండలము, ఈ రెండునూ సంబంధము లేకుండా ఉండవు రెంటికినీ సంబం ధమున్నది సేనాధిపతి యెట్లు సైన్యమొత్తమునకు కావలసిన పనుల సరిచేయునో అట్లనే స్వతంత్రనాడీ మండలమునూ దేహ మొత్తమునకు కావలసిన పనుల సరిచేయును మెదడు మజ్జా మండలము యొక్క ప్రధాన కేంద్రము లన్నియు, మెదడులో నుండును వీటిని సేనాపతియొక్క కార్యనిర్వాహకవర్గ మన వచ్చును దేహములోనూ వెన్నెముకలోనూగల నాడీ కేంద్రము లన్నియు, సేనాపతి అదుపులో నుండు ఉద్యోగస్థు లనవచ్చును సైన్యము ఆర్డరులో ఉండవలెనంటె, ప్రతిపటాలమునూ తన పనిని, నిర్వర్తించుకొనుచుండవలయును ఈపటాలములన్నియు సేనాపతి అదుపు ఆజ్ఞలలో ఉండవలెను అట్లనే మానవ శరీరములోని జీర్ణ, రక్త, ప్రసరణ నాడీమండలము లన్నియు

బుద్ధి, ఆత్మ స్వాధీనము లో నుండవలయును సేనాపతి సరి యగు పరిస్థితిలో ఉంటే 'యథారాజాతథాప్రజ' అన్నటు సైన్య మంతా అగ్దరులో ఉండును సేనాపతికి నియమ నిగ్రహములు లేకపోతే, సైన్యమంతా నియమ నిగ్రహములు లేకుండును అతుకులు బొంతవలె, దేనికది విడిపోవునట్లుండును సేనాధి పతికి పట్టుదల, ఆత్మ విశ్వాసము, ఉన్నయెడల సైన్యమున కంతకూ విశ్వాసము, పట్టుదలయుండును లేకపోతే నిరుత్సాహము, అపజయమును వెంటవచ్చును సేనాధిపతికి తనయందు తనకే విశ్వాసముండి సైనికులకందరకును ఎవరిలో వారికినీ సేనాధిపతి తోచునన్నా, నమ్మకమున్నప్పుడె అనుకొనిన పనిని సాధించగలరు అపజయము దరికన్నారాదు క్లిష్టపరిస్థితులలో నున్నా, పట్టుదలను మాత్రము వీడరు ఈపట్టుదల ఉన్నప్పుడే సేనాపతి తనలోని కాంతశక్తిని అందరకునూ ప్రసరింపచేసి తమ జీవితముల ధారపోయ సైనికులను సంసిద్ధపరచును

సైనికులు నిరుత్సాహపడినపుడు పరాసువీరుడగు నెపోలియన్ వారల ప్రేమతో తట్టి ఉత్సాహపరుచు చుండెడి వాడు ఆసుపత్రులకు పోయి రోగములతో బాధపడువారల చేతితో నిమిరి బాధల ఉపశమింప చేసెడివాడు ప్లేగుతో బాధపడువారల దగ్గరకు పోయి జీవితములోని లోభ మోహములను జయించగలవారిని ప్లేగు ఏమియుచేయదు, దరికన్నిరాదని చెప్పుచుండెడివాడు సునిశితశక్తులు గలవని అప్పటికి తెలియక పోయినప్పటికినీ పరాసువీరుడు వాటిస్వభావమును గ్రహించి, వాటి సహాయముతో తన పనుల సాధించు కొనేవాడు.

అత్యద్భుతమైన తనశక్తుల నన్నిటినీ స్వల్ప ప్రయోజనముల కొఱకే ఉపయోగించుకొన్నాడు సైనికులు నిరుత్సాహపడి అపజయము పొందుటకు సిద్ధముగానున్నపుడు తానుకన పడనంతమాత్రముననే ఉద్రేకమును పొంది, విజయలక్ష్మిని స్వీకరించేవారు

ఈపట్టుదల విశ్వాసము నెపోలియన్‌లో ఉన్నంతవఱకూ అతను పట్టినదంతా బంగారమయ్యేడిది అప్పటివఱకూ ఆ వీరునకు ఎదురెవ్వరునూ నిలవలేక పోయినారు రష్యనులు చేసిన మోసముతో నెపోలియన్ జీవితములో పతనము, మొదలు పెట్టినది అప్పటివఱకునూ ఆవీరుని పొగడిన స్నేహితులు విరోధులు అందరును, అతడునూ మామూలు మానవుడేననియు, భ్రమప్రమాదములకు లోనగుననియు అనుకొనుచుండెడివారు తరువాత అపజయములు వెంటపడినవి

అనిచ్ఛా నాడులను వాటి పనులను, స్వతంత్ర నాడీ మండలము అదుపులో నుంచును అనిచ్ఛా నాడుల మీదనూ దేహము మొత్తము మీదనూ మనస్సునకు ఎంత అదుపు గలదీ యీ క్రిందివిషయములవలన విశదము కాగలదు గారడీ చేయువాడు తన యిచ్ఛాశక్తి బలముతో తాను ప్రయోగింప దలచిన మనిషిని బుద్ధి సూక్ష్మమును స్తంభింప చేయును గారడీ చేయబడు మనిషియొక్క బుద్ధి సూక్ష్మము తగ్గిపోవుటవలన దేహము కూడా స్వాధీనము తప్పును స్పర్శ జ్ఞాననాడులు పనిచేయవు. హృదయ స్పందనములు తెలిసి

కొనలేనంత తగ్గిపోవుటయు గలదు చెమటపోయదు చేయి చూచినప్పటికిని నాడులు కొట్టుకొనుచున్నట్లు తెలియదు

ఇచ్ఛాశక్తి సహాయముతో ఇతరుల దేహములలో ప్రాణధాతువులు ప్రవహించకుండా ఆపగలిగినపుడు స్వ దేహములలోని ప్రాణధాతువులు గూడా ప్రవహించకుండా ఆపగలము హిందూదేశపు యోగులు చాలామంది, మనో శక్తుల వృద్ధిపరచిరి

మనోశక్తులను ఇట్లు వృద్ధిచేసినయెడల మనము చేయలేని పనిలేదు ఇబ్బందిలో నున్నప్పుడును జబ్బుగా నున్నప్పటికిని మిగిలిన పనుల నన్నిటినీ నిరాటంకముగా చేయగలము దేహములోని యే భాగములకు ప్రాణ ధాతువులు ఎక్కువ అవసరమో, యిచ్ఛాశక్తివలన ఆ ధాతు వుల అచ్చటికి ప్రవహింపచేసి బాధను ఉపశమింప చేయ గలము రక్తప్రసరణమునుసరిచేయగలము రక్తము పేరుకొన కుండాచేయగలము నాడీశక్తిని సరిగాప్రవహింప చేయగలము

ప్రకృతి సూత్రములకు అనుగుణముగానే యీ సుని శిత శక్తుల నన్నిటినీ ఉపయోగించ వలయును స్వార్థ సంకటములను మాత్రము అణచి వేయరాదు ఇచ్ఛాశక్తి చాలా పనిచేయగలదు

మానసికము గానూ, నైతికముగానూ ప్రకృతి సూత్రములకు అనుగుణముగానే పని చేయవలెగాని, వ్యతిరేక ముగా పనిచేయరాదు రోగము ఎట్లు ఎందుకు కలు

గునో తెలిసికొనిన యెడల, ఏ పద్ధతులవలన నివారణ జరుగునదీ తెలిసికొనిన యెడల, ప్రకృతి సూత్రములకు వ్యతిరేకముగా ఏ చేయలేము

---

## ౩౨

# ప్రార్థన

ఇంతవఱకు చదివిన గ్రంథమునుబట్టి ప్రార్థనలలో మాకు నమ్మకము లేదని మా చదువరులు భావించకుందురుగాక శాస్త్ర సమ్మతమైన ప్రార్థనలో మాకునూ నమ్మకమున్నది అయితే ఈ ప్రార్థన ఏ రూపములో నుండవలెను? భగవంతుని మనము ప్రార్థింపవలసినదేమిటి ?

ఇప్పటివఱకు ఆచరణలో ఉన్న మార్గములనుబట్టి భగవంతుని మూడువిధములుగా ప్రార్థించుచున్నాము. 1 సంపద నివ్వమని భగవంతుని ప్రార్థించుచున్నాము 2 ఫలానిపని పూర్తి చేయమని కోరుచున్నాము 3 మరికొందరు "నేను (ఆత్మ) మాత్రము చాలామంచివాడని, అసంతృప్తి, పాపము, బాధ, మొదలగునవన్నీ మానవలోపములు ప్రకృతిసూత్రములను అనుసరించుట చేతనే సర్వ సౌఖ్యములును కలుగును ఆసూత్రములకు అనుకూలముగా నడచు శక్తిని మాత్రము నాకు ప్రసాదించు" మని కొందరు ప్రార్థింతురు ఇది మూడవ పద్ధతి

మొదటి పద్ధతితో మనము భగవంతుని బ్రతిమాలుకొను చున్నాము రెండవ విధానముతో భగవంతునిలో గొప్పతన మును దొంగిలించుటకు ప్రయత్నము చేయుచున్నాము మూడవ పద్ధతే సబబుగా తోస్తున్నది

ఓ తండ్రీ! నాకు ఫలాని వస్తువునిమ్ము ఆ పనిని పూర్తి చేసిపెట్టుము అని ప్రార్థించుటతో ఇచ్చి పుచ్చుకొనుటలు రెండు ఉన్నవనుమాటనే మరచిపోయినాము ఇవ్వకుండా తీసు కొనుటకే ప్రాధేయ పడుట, మోటుగా చెప్పవలెనంటే అడు క్కొని తినుటవంటిది

సృష్టిలోని ప్రతివస్తువూ ఇచ్చిపుచ్చుకొనుటను అలవ రుచుకొన్నది పొదలలో పుట్టుపూవులు భూమినుండి పుట్టుచు న్నవి సూర్యునినుండి ప్రాణశక్తిని స్వీకరించుచున్నవి దానికి బదులుగా అందమునూ సౌరభమునూ విరజిమ్ముచున్నవి మాన వులకునూ చెట్లకునూ బాధాకరములగు చీడ పురుగులను తిని వేయు పక్షులుచు శ్రావ్యమైన గీతములను ఈ కెలలోని సౌంద ర్యమును విశ్వమునకు పంచిపెట్టు చున్నవి ప్రతి వస్తువును కొద్దిగనో గొప్పగనో తీసుకొన్నదానికి ప్రతిఫలమును ఇచ్చి వేయుచున్నవి మానవుడుమాత్రము తన ఇష్టమువచ్చినయెడలనే ఇచ్చుచున్నాడు, తానుమాత్రము వడిగా తీసుకొనుచున్నాడు ఇచ్చుట లోపముగా భావించుచున్నాడు

ఇక రెండవ రకమైన ప్రార్థనను గురించి విచారిద్దాము ఆత్మకు చాలా సుగుణములు కలవు అసంతృప్తి, పాపము, బాధ

మానవ సంకల్పితములని ఆధ్యాత్మిక వాదులు వ్రాస్తారు. మనమే సంపూర్ణులమైతే భగవంతుని కోరవలసిన దేమున్నది?

వృద్ధి చేసుకొనుటకు ప్రయత్నము చేయక బద్ధకించి భగవంతుని శక్తిని దొంగిలించుటకు ప్రయత్నము చేయుచున్నాము సంపూర్ణులమని భ్రాంతిపడుట వలన సాధించుటకు కావలసిన పట్టుదల అవసరమూ తగ్గిపోయినది అందువలన కార్యములు సాధించలేక పోతున్నాము ఆధ్యాత్మిక వాదము, భయము, కోపములను తగ్గించుటకు సహాయపడినప్పటికిని ఆత్మ విశ్వాసము లేకుండా చేయుచున్నది ప్రతి పనికినీ భగవంతుని మీదనే ఆధారపడి ఉండుట వలన బద్ధకము ఎక్కువై పోవుచున్నది స్వప్రయత్నముతో సాధించగల మను నమ్మకమే పోయినది

ఆధ్యాత్మిక వాదమునకును, పశువుల కోర్కెలకును ఆవంతయు తేడా లేదు ఒక వస్తువుయొక్క గుణావగుణములతో, ఒక కార్యముయొక్క మంచీ చెడుల విచక్షణతో జంతువున కేమియు సంబంధము లేదు మరుపూటకు కావలసిన తినుబండారముల వరకే ప్రయత్నము చేస్తుందిగాని అంతకుమించి అదేమియు పనిచేయదు దాని బుద్ధి సూక్ష్మము అంతవరకే పోయినది ప్రకృతిలో జంతువునకుగల మూఢవిశ్వాసమే దానిబుద్ధి సూక్ష్మముల పెరిగిపోకుండా ఆపుచేయుచున్నది అందువలననే యెన్నివందల సంవత్సరములు గడచినప్పటికీ జంతువుల స్వభావ మేమియును మారలేదు.

మానవునిలోగల గర్భిత శక్తులన్నియు, ఉపయోగించిననేగాని, బాగుపడవు వాడని వస్తువు నిరుపయోగ మగునట్లు ఈ శక్తులుగూడా ఉపయోగించనియెడల పనికిరావు అరణ్యావాసు లందరును తమబుద్ధి సూక్ష్మమును వాడకపోవుటచేత నెన్నివందల సంవత్సరములు గడచినప్పటికినీ, పెంపు లేక అదే రూపములో నిలిచిపోయినారు

ప్రకృతి శాస్త్రము ప్రకారము గర్భిత శక్తులను అభివృద్ధి పరచనియెడల అనుపయోగమగును ఉన్న సునిశిత శక్తులును, సవ్యముగా ఉపయోగించని యెడల, నిరుపయోగ మగును ఇంతవఱకు చదివిన దానినిబట్టి తెలిసికొనిన దేమంటే ఆత్మోపలబ్ధిని పొందుటకు, సునిశితశక్తులను, ఉపయోగించి, తదేకదీక్షతో పనిచేసినవారు తప్పకుండా సంపూర్ణ ఫలమును పొందుతారు ఆత్మవిశ్వాసము లేనివారు, మార్గములనన్నిటినీ పోగొట్టుకొనుచున్నారు సునిశిత శక్తులను సవ్యముగా ఉపయోగించిన కొలదినీ సునిశితము లగును మన ఆచరణను బట్టియే, వాటి సునిశితత్వము ఉండును కృత్రిమ మార్గములలో సునిశిత శక్తులను సాధించినందుకు మరొకప్పుడైనను నష్టము ననుభవించియే తీరవలెను

ఆత్మ విశ్వాసముకన్న మరొక ప్రార్థన విధానము లేదు ఈ సంగతి చెప్పినామని సునిశితశక్తులలోనూ, ప్రకృతి, భగవంతుడు, విశ్వశక్తిలో మాకు నమ్మకము లేదని, మా చదువరులు తలంచకుందురుగాక మనపనులు నెరవేర్చుటకు, అవసరమగు శక్తిని ప్రసాదించమని, భగవంతుని ప్రార్థించవలెను మనపనిని మనకుగాను భగవంతుని ప్రార్థి

చేయ మనరాదు ఇంటివద్ద చేయవలసిన లెఖ్ఖలను, కొడుకునకు గాను తండ్రిచేయడు కుమారునిచేతనే చేయించును అట్లనే, భగవంతుడు పనిని పూర్తిచేయునని నమ్ముట శుద్ధ వెర్రి స్వశక్తిని వృద్ధి చేసుకొనుటయే జీవితపుటుద్దేశ్యము లేనియెడల జీవితముతో పనియే లేదు పుట్టినది మొదలుకొని, మరణము వఱకునూ స్వశక్తితో కష్టముల నెదుర్కొన వలసినదే అట్లు ఘునపుడే గర్భిత శక్తులను వృద్ధిచేయగలము మనకంతా తెలిసిన దనుకొనుటగాని, మనకొఱకు భగవంతుని చేయమని కోరుటగాని నష్టమే మల్లయుద్ధ నిపుణుడు తన దేహబలమును లాఘవమును వృద్ధి పొందించుకొనవలెనేగాని, మరొకడు వృద్ధి చేసినందువలన, ఇతని బలసంపద వృద్ధిపొందదు తోడిమల్లుడు శక్తిహీనుడని తలచినంత మాత్రమున ఇతని బలసంపద పెరుగదు తన్ను తానే మోసము చేసుకొను చున్నాడు బలసంపద, లాఘవము వృద్ధిపొంది కుస్తీలో విజయ లక్ష్మిని చేపట్టవలెనంటే నమ్మకము, పట్టుదల, ధైర్యము అవ సరము సాధికకూడా అవసరమే ఆత్మస్తుతి చేసుకొనినందు వలన ఏమినీన్ని ప్రయోజనము లేదు

అట్లనే జీవితములో గూడా భగవంతుని గట్టిగా నమ్మ వలెను ఆత్మ విశ్వాసమును పోగొట్టుకొనరాదు విజ్ఞాన మును వృద్ధి చేసుకొనవలెను దయాప్రేమలను పంచిపెట్టుట, అలవరచుకొని, విశ్వశక్తితో, దగ్గిర సంబంధమును అలవరచు కొనవలెను అప్పుడే ప్రకృతి మనకు ప్రసాదించిన శక్తులను, సరిగా ఉపయోగించినవారల మగుదుము

మంచీ చెడూ విచక్షణగల నిర్మాణమునకు అనుకూల

మైన యిచ్ఛాశక్తి యెటువంటి పరిస్థితులలోనైనను, ఫలవంత మగును పాపమును తగ్గించుటకును, బాధల తగ్గించుటకును, మన మేమియు చేయరాదనియు, మంత్రవేత్తలు బోధిస్తారు ఆధ్యాత్మిక వాదమునే గట్టిగా నమ్మవలెనని వాదిస్తారు బాధల తగ్గించుటకు, మన మేమైనా ప్రయత్నము చేసిన యెడల, దేవతలకు కోపము వచ్చునని భయపెడుతారు వారి ఆదరాభిమానముల పొందవలె నంటే స్వప్రయత్నము లేమియు లేక వారినే పూర్తిగా నమ్మవలెనని హెచ్చరిస్తారు భగవంతుడు మనకు ప్రసాదించిన శక్తులను ఉపయోగించిన యెడల కినుక వహిస్తా డనుటకన్న వెర్రి మరొకటి లేదు మంత్రశాస్త్రవేత్త లెవరునూ యింత తెలివితక్కువగా మాట లాడుతారా? అని అనుమానపడతాము పేరు ప్రఖ్యాతులు వహించిన మంత్రవేత్తలే పై మాటల చెప్పుచున్నారు మంచి నీరు త్రాగుటయు, ఎనిమా చేసుకొనుటయు తప్పిదములుగా భావించి ఈ పనులు చేసినందుకు ఆ యా సంఘములనుండి వారల తరిమివేయుచున్నారు మంత్రశాస్త్ర మర్మము పోవు నేమోనని భయపడుచున్నారు

మా అనుభవములోని ఒక చిన్న విషయమును తెలియ చేయుదును ఒకరోగికి మంత్రశాస్త్రవేత్త కొన్ని సంవత్సర ములపాటు వైద్యము చేసినాడు వారము రోజులకు మల విస ర్జనము జరిగెడిది వైద్యునితో ఈ సంగతి చెపితే నీవేమియు ఆదుర్దా పడవద్దు భగవంతుడే ఆపనిని పూర్తిచేయును అని నచ్చచెప్పేవాడు ఈ శాస్త్రవేత్త ప్రఖ్యాత మందువైద్యుడు మామూలు ప్రకృతి సూత్రములుకూడా తెలియని మిధ్యా

వాని అయినాడు మందులను ఎక్కువగా ఎట్లు వాడినాడో ఏమి యు చేయవద్దనికూడా అంత తీవ్రముగా వాదించేవాడు ఈ రోగికి ఆమాశయములోను ఆంత్రవేష్టనములోను పుండు పుట్టు నంతవఱకూ భగవంతుడు శ్రద్ధ తీసుకొనుచునే యున్నాడు అలోపతీమందు వైద్యము చీటికీ మాటికీ మందులపోస్తుంది ఆధ్యాత్మిక వాదు లన్ననో మన దేహామునకుమన మేమియుచేయ రాదు అంతా భగవంతుడే చేయునని వాదింతురు ఈ రెండును అతివాదములే ఈ రెంటికినీ మధ్యేమార్గమున పోవునదే ప్రకృతి వైద్యము ఆరోగ్యము, రోగము నివారణ మననేమో తెలిసికొనిన యెడల తరుణ రోగములను మందులతో అణచి వేయము శస్త్రముల నుపయోగించము ప్రకృతి సూత్రముల ఉల్లంఘించి ఈ శిక్షల రద్దుచేయమని భగవంతుని మంత్ర శాస్త్రవేత్తను మందులను ప్రార్థించము ప్రకృతి సూత్రముల గ్రహించి ఉపశమన ప్రక్రియల చేసిన యెడల నివారణోపా యములందు ప్రకృతికి సహాయము చేసినవార మగుదుము స్వశక్తిమీద ఆధార పడువారినిచూచి భగవంతుడు కోపగించ డనియు మీదుమిక్కిలి సంతోషించుననియు మనకు తెలుస్తుంది

ప్రకృతి శాస్త్రమే ప్రార్థనయని చెప్పవచ్చును ఈ శాస్త్రము మానవుని దైహిక మానసిక నైతిక ఆత్మీయ శక్తులను సమన్వయము చేయును సాధ్యమైనంతవఱకును ప్రకృతిసూత్ర ములను అనుసరించినందు వలననే దేహము సరియైన పరిస్థితి లో నుండును ఇట్లా చేసినపుడే నిర్మాణశక్తికి అనుకూలముగా పోయినవార మగుదుము ప్రకృతి సూత్రముల ననుసరించు శక్తిని నాకు ప్రసాదించమని భగవంతుని ప్రార్థించ వలయును

## ౩౮

# విశ్రాంతి

నిత్యనైమిత్తికములకు జరుగు దేహక్రియలలో దేహములోని ప్రతి అణువునకును నరమునకును పనికలుగును ప్రతి నరమునకును పనికలుగుట వలననూ అదే పనిని విశ్రాంతి లేకుండా చేసినయెడల వాటిలోని సున్నితత్వముపోయి చచ్చు పడిపోవును ఈ క్రింది ఉదాహరణము వలన ఈ విషయము బాగుగా విశదము కాగలదు రోడ్డున ఒక గుఱ్ఱపుబండి పరుగెత్తుచున్నదనుకొందాము దోవలో ఒక వస్తువునుచూచి బెదరి గుఱ్ఱము క్రమము లేకుండా పరుగిడినది అప్పుడు బండీ వాడు ప్రయత్నముచేసిగానీ గుఱ్ఱమును స్వాధీన పరుచుకొన లేడు అట్లనే అంతూ పొంతూ లేకుండా పనిచేసిన నాడీమండలము ప్రయత్నము చేసినగాని స్వాధీనమునకురాదు కంపించిన నాడీమండలము స్వాధీనమునకు రావలెనంటే విశ్రాంతి అవసరము శాస్త్ర సమ్మతముగానే దేహములోని అవయవములకు విశ్రాంతిని కలుగచేసిన యెడల నరములన్నియు పునర్జీవితములగును నరములకు పనియెక్కువగుటవలన కోపమెక్కువగును ప్రతి చిన్న పనికినీ చిర్రు బుస్సు లాడును నరములన్నియు సున్నితము లగుటవలన సూక్ష్మదృష్టి ఎక్కువగును మానసిక, నైతిక శక్తులు వృద్ధియగును మందబుద్ధిగలవానికి నరములును నాడీమండల మున్నట్లే తెలియదు నాడీశక్తి వ్యయమగుట వలన త్వరగా ఉద్రేకము కలుగును

నాడీవ్యాధితో బాధపడువారు చేయు ప్రతిపనిలోనూ ఉద్రేకము కనపడుచునేయుండును కోపము వ్యక్తమగుచునే యుండును ప్రతి చిన్నపనికినీ కోపపడుచునే యుందురు అతని లోని దిగులు కోపము పనిని త్వరగా పూర్తిచేయవు చేసిన పనినే పదితడవలు చేయును విసుగు ఎక్కువగును యుక్తాయుక్తములను విచారించుటకు అవసరమగు ఓపికకూడా వారికి ఉండదు

కండరములను నరములను ముణగతీసుకొని వీరు నిద్రింతురు నిద్రపోవునప్పుడుకూడా వీరి నరములలోని బిగివి తగ్గిపోదు చాలా వికృతాకారములలో విశ్రమింతురు నిద్రపోవునపుడు ఎక్కడపడుదుమోయని కుర్చీలను మంచములను గట్టిగా పట్టుకొందురు వీరికి గాఢనిద్ర పట్టదు కలుగవలసిన విశ్రాంతి రాకపోవుటచే నిద్ర లేచినప్పటికినీ నరములు బలహీనములు గానేఉండును ఇటువంటివారిలో జాగ్రదవస్థలో నూదిరిగనే స్వప్నావస్థలోనునూ్నా ధాతుశక్తి వ్యయమగును నిద్రలేచినప్పటికినీ ఏమియూ సుఖముగా నుండరు చలనములో విశ్రాంతి తీసుకొనవచ్చును ఈ వాక్యము అసందర్భముగా కనపడును గాని దీర్ఘముగా విచారించినచో దానిలోని సత్యము బయల్పడును క్రమప్రకారము పనిచేసిన యెడల విశ్రాంతి వెంటనే వచ్చును చాల వ్యవధి కలుగును ధాతుశక్తి వ్యయముకాదు కోపము, దిగులు, అసూయ తగ్గిపోవును క్రమ ప్రకారము చేయకపోవుటచేతనే నాడులలో పోట్లు మంటలూ పుట్టుచున్నవి శ్రమ ఎక్కువై మంటలు పోట్లు కలుగుటలేదు ప్రతిపని చేయుటకు ముందు విచారించి క్రమముగాచేసిన యెడల అంటో

శన తగ్గిపోవును రోజువారీగా చేయవలసిన పనులను విచారించుకొని సరియైన కాలములోనే పూర్తిచేసినయెడల ధాతుశక్తి వ్యయము తగ్గిపోవును ఇట్లు అలవర్చుకొన్న యెడల చాలా కాలము మిగులును ప్రతిపని చేయుటకును మనస్సును ఉత్సాహముగా నుంచుకొనుము జరుగబోవు సంగతులను గూర్చి విచారపడకు దిగులుపడకు ఫలాని పని చేయలేక పోతినని నిరుత్సాహ పడకుము

## కూర్చొన్నప్పుడును విశ్రాంతి తీసుకొనుము

నడుము మెడ వంచక కుర్చీలో నిలువుగా కూర్చొనుము దిగులు భయము ఉద్రేకమును తొలంగించుము ఈ క్రింది విధముగా తలపోయుము నా అవయవములన్నియు సరిఅయిన పరిస్థితులలో ఉన్నవి దిగులు కోపము భయములకు నాలో తావులేదు విశ్వవ్యాప్తమై ప్రాణదాయకమైన వాయువునుండి అనుక్షణమును ప్రాణవాయువును పీల్చుకొనుచున్నాను ఈ వాక్యములే పదేపదే తలపుము వీలైన యెడల బైటకుచెప్పుము ఈ పని జరిగిన తరువాత క్రమ ప్రకారముగా గాలి పీల్చుము ఏపనిచేయుటకు ముందును ఉత్సాహముగానుండుము ఆందోళన పడకుము దిగులు కోపము అసూయ ఇదివఱకే నీలో ప్రవేశించిన యెడల ఈ క్రిందివిధముగా తలపోయుము ప్రతి అవయవమును యథాస్థానములో విశ్రాంతిగా నున్నది నాలోని భావములే బైటిలోకములో ప్రతిబింబించును నేను కోపముగా నున్నయెడల ఈ లోకమంతా కోపిష్టిగానే కన పడును. నాలోని భావములే వ్యక్తమగుచుండును అందువలన

నేటినుండియే ఆ భావముల వదలివేయుదును భగవంతుడు దయామయుడు ప్రేమస్వరూపుడు ప్రకృతికి అనుగుణముగా నడుచుటయే స్వర్గమునకు ప్రథమ సోపానము సకల చరాచర కోటినీ ప్రేమతో చూచినయెడల భగవంతుని సాన్నిధ్యమును త్వరగా పొందుతాను నాలోని ప్రేమ స్వభావము ఎక్కువగును అదే నిజమైన స్వర్గము మోక్షము సత్యము

## నిద్రపోవుటకు ముందు ఎట్లు విశ్రమించాలి ?

నిద్రపోవుటకు ముందు ప్రక్కమీద వెల్లికిల పడుకొనుము వెన్నులోని ప్రతి భాగమూ ప్రక్కకు తగల వలెను చేతులను, దేహముప్రక్కన ఉంచుము అరచేతులను, ఆకాశము వంకకు ఉంచుము ప్రతి కండరములోని బిగివిని వదలివేయుము ఆందోళన పడకుము ఈ క్రింది విధముగా, తలపోయుము నేను గాఢనిద్ర పోవుచున్నాను దైహిక, మానసిక, ఆత్మీయ శక్తులన్నీ నా చెప్పుచేతలలోనే ఉండవలెను చెడు తలంపు లేమియు రాకూడదు పెందలకడనే లేవవలెను లేచునప్పటికి ఉత్సాహ పూరితుడను కావలెను రేపు చేయవలసిన పనులను త్వరగా పూర్తిచేయవలెను

పైన చెప్పిన వాక్యములు చాలా తేలికగా కనపడినప్పటికినీ ఆ వాక్యములనే మనస్ఫూర్తిగా మననము చేయుట వలన, నిద్రరామి రోగము మొదలగు, నానావ్యాధు లన్నియు, అంతరించినవి ఇది మాచికిత్సాలయములో ప్రత్యక్షముగా జరిగినదే గాని, అభూత కల్పనకాదు దీనికి నిదర్శనములు ఇంకా కొన్నిచెప్పెదము. ఉదయము 5 గంటలకే లేవవలెనని

గట్టిగా సంకల్పించుకొని పడుకొనిన యెడల 5గంటలకే తప్పకుండా లేచెదము ఈ నిదర్శనమే, మనస్సునకు దేహము మీద ఎంత శక్తి గలదో తెలియ జేయును మనస్సులో ఒడిదుడుకులు లేని యెడల చెడుతలంపు లేమియు రావు చెడు తలంపులు రావుగాన గాఢనిద్ర కలుగును పడుకొన బోవుటకు ముందు, మనస్సు అల్లకల్లోలముగానుండి, యీ కల్లోలముతోనే నిద్రపోవునెడల, చెడుతలంపులే అనుభూతమగును అట్లగుటవలన,కలతనిద్రయే కలుగునుగాని గాఢనిద్రకలగదు దిగులు అసూయ, అసహనము, భయములను గూర్చియే నిరంతరము ఆలోచించు చున్న యెడల ఆ తలంపులే నిద్రపోవునపుడును కలుగును అందువలన కలత నిద్రయే కలుగును గాని గాఢ నిద్ర రాదు నిద్రలేచునప్పటికి బలహీనముగాను, నిస్సత్తువగాను, ఉండును పైన చెప్పిన వాక్యములనే, మననము చేయుచూ పడుకొనిన యెడల నిద్రలో కూడా ఆ తలంపులే వచ్చును తెల్లవారునప్పటికి దేహమంతా ఉత్సాహముగా ఉండును ఏ అవయవమునకు ఆ అవయవము విడగొట్టినట్లు ఉన్నతరువాత వెల్లికిలగా పడుకొనవలసిన అవసరము లేదు. ఏ వైపున పండుకొనిన సుఖముగా నుండునో ఆవైపుననే పండుకొనవచ్చును ఒకే ప్రక్కన పండుకొనవలె నను నియామకము లేదు

ఒకే ప్రక్కన పడుకొనినయెడల దేహములోని అనురూ

ష్యము చెడిపోవును అవయవము లన్నియు యథాప్రకారముగా పెరుగవు యథాప్రకారముగా పెరుగక పోవుట వలన, నాడీశక్తి సరిగా వ్యాపించదు రక్తప్రసరణము బాగుగా నుండదు ఏ ప్రక్కన పడుకొన్న యెడల దేహమునకు హాయిగానుండి సుఖనిద్ర కలుగునో ఆప్రక్కనే పరుండుట మంచిది

చాలా మంది త్వరగా నిద్ర బట్టదని, దిగులు ఆందోళన పొందుతారు ఈ తలంపులే వారికి నిరంతరమూ బాంధిచు చుండుటచే బద్ధకముగాను, నిస్సత్తువుగా నుండెదరు. ఇటువంటివారికి గాఢనిద్ర కలుగదు నిద్రపట్టదను ఆందోళన కలకొలదినీ, నిద్రలేని రోగము వెంటపడును ఇదియే కాలిక మగుటయు గలదు

నిద్ర పట్టదని దిగులు పడుటకన్నా ఈ క్రింది వాక్యముల తలపోయుట మంచిది నిద్రపట్టినా సరే పట్టకపోయినా సరే, దేహములోని ప్రతి అవయవమూ విశ్రాంతి తీసుకొనుచున్నది ఏ కండరములోను బిగివిలేదు ఇట్లు విశ్రాంతి తీసికొనుటచేతనే నాకు సంపూర్ణముగా సౌఖ్యము చేకూరును పై మాటల అనుకొనుటయే గాక, క్రియారూపములో కూడా చేయవలెను నిద్రపట్టినా సరే పట్టకపోయినా సరే అని నిర్లక్ష్యముచేసి క్రియారూపములో అనుభవించినపుడు గాఢనిద్ర తప్పక కలుగును

౩౯

# భగవంతుని ఆదేశములు

ఈ గ్రంథమంతా చెప్పిన తరువాత మా విమర్శకులకు ఒక సందేహము, తోచవచ్చును ప్రకృతివైద్యమునుగూర్చి మీరుచెప్పిన మాటలు నిజమయితే, మందువైద్యము నకునూ, సామాన్య మానవ లోకమునకున్నూ ప్రకృతి వైద్యమునందు, ఆదరణ యెందుకులేదు ? ఈ ప్రశ్న నిజమే, ఎక్కడకు పోయినా ఇదే ప్రశ్న చాలామంది వేయు చున్నారు ప్రకృతివైద్యమును ఆచరించక పోవుటకు,ఒక పెద్ద చిక్కువస్తున్నది ఈ వైద్యములోని ప్రధాన సూత్రమును ముఖ్యముగా నమ్మవలెను నమ్ముటయే గాక ఆచరించ వలెను నిగ్రహము కలిగిఉండుట, ప్రకృతి వైద్యములో ప్రధానము నిగ్రహము లేనిది ఆ వైద్యము ఆచరించి ఉపయోగ మేమీలేదు జీవన పద్ధతుల మార్చుకుండా, మన దగ్గరకు వచ్చిన మొండిరోగుల మార్పుగలిగినట్లయితే, ప్రకృతి చికిత్సాలయములు చాలా బయలుదేరిడివే

సహజమైన పద్ధతులతో చాలా విచిత్రముగా రోగ ముల కుదర్చవచ్చును ప్రకృతి శాస్త్రమును, పరిశోధించిన వారు ఆహార విహారములలో మార్పు వచ్చినయెడల రోగ ములు నయమగునని గ్రహింతురు వీరికినీ కొన్ని సందేహ ములు కలుగ వచ్చును ప్రకృతి వైద్యము సిద్ధాంత భాగము బాగుగనే ఉన్నది ఆచరణలో మాత్రము సాధ్యము కాదు

పై వాక్యములు అసమంజసములు ప్రకృతి పద్ధతుల అనుస రించుటకు ఎప్పటి కప్పుడు మానవ దేహము, తయారుగానే యుండును చాలా సులభ సాధ్యములున్నూ అట్లనేకాని యెడల ఈ శాస్త్రమంతా మోసమే కావలయును మానవుని దైహిక, మానసిక, నైతిక ఆరోగ్యములు సరిగా లేనిది నిజ మైన సౌఖ్యమునూ, ఆనందమునూ, పొందలేము ప్రకృతి సహజమైన వస్తువులనే తిని, ప్రకృతి సహజముగా జీవించుటకు మొదలిడనిది, ఆరోగ్యము, కలుగదు

## ఇచ్ఛాశక్తిని వృద్ధిచేయుట

ప్రకృతి వైద్యము ననుసరించినందువలన మనము అనేక ఫలములను పొందుదుము అందులో ఇచ్ఛాశక్తిని వృద్ధిచేయుట ముఖ్యమైనది జీవితములో సాధించవలసిన వాటిలో ఇదే ముఖ్యమైనది మిగిలిన వన్నియు ఈ సాధన మీదనే ఉండును మానవుడు ఆధ్యాత్మిక శక్తులను వృద్ధి చేసు కొనవలె ననినయెడల, ముమ్ముందుగా నిగ్రహమును సంపా దించ వలయును ఈ నిగ్రహముతో పై కోర్కెలను సాధిం చుటకు ముందు దైహిక వాంఛలను నిగ్రహించ గలిగి ఉండ వలెను అలవాట్లను మార్చగలిగి ఉండవలెను ఆకలిని అదు పులో ఉంచవలెను దైహిక వాంఛలను అదుపులో నుంచ గలిగినవారు పై ఆధ్యాత్మిక చింతలను త్వరగా సాధిస్తారు నిగ్రహమును వృద్ధి చేసికొనుటకు, రోజులోని ఇరువది నాలుగు గంటలలోను, నిద్రించుటకు ముందుండు కాలము, ముఖ్యమైనది ఉపయోగ మమునది ఏ ఆందోళనలును లేక,

మనస్సు చాలా నిర్మలముగా నుండును ఈ సమయములో కలిగిన భావములు చాలా కాలము వఱకునూ, నిలవఉండును

ఈ సమయములో ఈ క్రిందివిధముగా తలపోయుము నేను చేయవలసిన పనులను వెనువెంటనే పూర్తి చేయుదును ఎట్టిఆలస్యమునూ చేయను మనస్పూర్తిగా నమ్మిన పనులనే చేయుదునుగాని అలవాటు పరికారము చేయను ఈ అభిప్రాయములనే ప్రత్యక్ష మార్గములలో చెప్పెదను నీలోని దురలవాట్లు పోవలెనంటే, ఒక దురలవాటును గూర్చి, క్రిందటి రోజును పడుకొనుటకుముందు అనుకొనుము మరునాడు ఆదురలవాటును పారద్రోలుము

ప్రొద్దెక్కిననేగాని లేచుటఅలవాటు లేదనుకొందాము దీనిని తప్పుకొనుటకు, క్రిందటి రోజున పడుకొనుటకు పూర్వము, దానినిగూర్చి తలపోయుము తెల్లవారు జాముననే లేచి కాలకృత్యముల తీర్చుకొందునని గట్టిగా నమ్ముము అట్లనే లేచి నిత్యకృత్యముల పూర్తిచేసికొందువు

కాస్తకు కూస్తకు భయపడుట, దిగులుపడుట ఒక మనిషికి అలవాటు అనుకొందాము మరునాడు అలవాటుగా వచ్చు భావములు కలిగినపుడు ఆత్మవిశ్వాసము కలిగి దానిని ఎటువంటి భావములును కలవఱపెట్టలేవని గట్టిగా నమ్మిన యెడల, ఆభావములు అతనిని కలవఱ పెట్టలేవు ఆందోళన కలిగినపుడు విశ్వశక్తిని గూర్చి, ప్రార్థించవలయును అన్ని బాధలు ఉపశమించును ఇదే నిజమైన ప్రార్థన

స మా ప్త ము